# తెలుగువెలుగు చలం

( మొదటి భాగం )



## పురాణం సుబ్రహ్మణ్య శర్మ




న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్

ఏలూరురోడ్ / విజయవాడ-2

ఫోన్స్: 74677 * 62222

# మా మాట!

తెలుగు వెలుగు చలం (పేజీ 260 వరకు) అనే విభాగంలో చలం అస్తమయం, ఆయనపోయాక ఆయన గురించి పత్రికలలో వచ్చిన అపూర్వ సంచలనం, ఆయన వ్యక్తిత్వం,ఆయన రచనల గురించిన తర్జన భర్జనలు అన్నీ ఈ మొదటి భాగంలో వున్నాయి.

అరుణాచలంలో చలం (పేజీ 261 నుంచి 592 వరకు) అరుణాచలం ఎందుకు వచ్చాడు? అక్కడ ఎలా జీవించాడు? ఆయన వ్యక్తిత్వంలో వచ్చిన మార్పేమిటి? రమణస్థాన్‌లో ఆయన జీవితం ఎలా గడిపాడు? సుమారు ముప్ఫైఏళ్ళ కాలంలో ఆయన ఏం సాధించాడు? రమణ భగవాన్ ఎవరు? కావ్యకంఠ గణపతి ముని ఎవరు? ఈ వివరణలతో చలం రమణాశ్రమ జీవితం ఈ రెండవ భాగంలో విపులంగా వస్తుంది.

ఆంధ్రలో చలం. (పేజీ 593 నుంచి)యిది చలం పూర్వాశ్రమ జీవితానికి సంబంధించినది.ఆయన బాల్యం,వివాహం,చదువు, తిరుగుబాట్లు, రచనలు, సంఘంతో పేచీలు, విరోధాలు, డాక్టరు రంగనాయకమ్మగారి మరణంతో పాత చలం కథ ఆగుతుంది. ఆంధ్రలో చలం అనే విభాగంలో 'చలం పిక్టోరియల్' రెండు ఫారాలలో చలం జీవితాన్ని ఫొటోలతో ఆఫ్‌సెట్‌లో సమర్పిస్తున్నాము.

పాఠకుల సౌకర్యాన్ని దృష్టిలో వుంచుకుని ఈ మొత్తం గ్రంథాన్ని మూడు విడి సంపుటాలుగానూ, కావలసినవారికి అంతా ఒకే వాల్యూముగానూ ప్రచురించామని మనవి చేస్తున్నాము. ఈ మా కృషిని మన్నించి, ఆదరించి, ఆశీర్వదించండి.

న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్,

విజయవాడ-2

తెలుగు వెలుగు చలం

# విషయసూచిక


| | | |
|---|---|---|
| ఓ నిమిషం ఓ మెరుపు | — | 9 |
| 1. స్వప్నశాఖ | — | 21 |
| 2. సాత్త్విక పర్వం | — | 24 |
| 3. ఉత్తరక్రియ | — | 28 |
| 4. మహాప్రస్థానం | — | 32 |
| 5. ఆనందహారతి | — | 44 |
| 6. అరుణా'చలం' పై అరుణతార | — | 170 |
| 7. అక్షరాభిషేకం | — | 244 |
| 8. జాతకకథ | — | 252 |

# చలం జీవితోత్సవం

నా చిన్నప్పుడు చార్లీ చాప్లిన్ సినిమా ఒకటి చూశాను. దాని పేరు 'ది ఐడిల్ క్లాస్ !" నిరుపేదా, దేశద్రిమ్మరీ ఐన చాప్లిన్‌ని ఓదార్చటానికి ధనవంతు డొకడు సమీపిస్తాడు. చాప్లిన్ నేలకేసి చూపిస్తాడు. అక్కడేదో ఉందనుకుని ఆ మనిషి వంగుని చూడబోతాడు. ఆ అవకాశాన్ని సద్వినియోగపరచుకుని, చాప్లిన్ అతని ముడ్డిమీదలాగి తన్ని సోమరి ధనవంతుల యెడ తన అమూల్య అభిప్రాయాన్ని ప్రకటిస్తాడు.

ంచుమించు అదే కాలంలో ఇటువంటి చికిత్సనే చలం తెలుగుదేశానికి చేయబూనుకున్నాడు. జీవితాన్ని నరకప్రాయం చేసే అన్ని రకాల అవగుణాల్నీ - అంటే, హిపోక్రిసీ, స్వార్థం, పురుషఅహంకారం, కాపట్యం, ద్వంద్వనీతి,— వీటి సమష్టి పృష్ఠాన్ని గట్టిగా తాడించాడు.

ఐతే ఈ రూపకాలంకారాన్ని ఇక్కడితో ఆపుదాం. రైలుబళ్ళకి లాగే రూపకాలకి కూడా టెర్మినస్ వుంటుంది. అవి అక్కడితో ఆగాలి.

అంటే, సమాజంలోని అవలక్షణాల్ని ఈసడించటం వల్ల చలం గొప్ప రచయిత అయాడని చెప్పటం నా ఉద్దేశ్యం కాదని ఇక్కడ స్పష్టం చెయ్యదలచుకున్నాను. సాంఘిక దౌర్జన్యాలని చలంగారి కన్నా ధైర్యంగా ఎదిరించి, ఇంతకన్నా ఎక్కువ కష్టాలు పడ్డవారున్నారు. ఈయన కన్నా నిజాయితీపరుల్ని ఎరుగుదును. వాళ్ళు జనాన్ని ఉద్బోధిస్తూ వ్యాసాలూ గట్రా రాశారు. అంతమాత్రాన రచయితలుగా వాళ్ళకి గుర్తింపు రాలేదు. ఎవరి సంగతో ఎందుకు ? చలం మిత్రుడు తారకంగారినే తీసుకోండి. నమ్ముకున్న సిద్ధాంతాలకోసం బంధుమిత్రుల్నే కాదు, తనకు దైవ సమానులైన గురువుగారు నాయుడుగార్నే ఎదిరించాడీయన. నానా అవస్థలూ పడ్డాడు. పండు ముసలై తను చనిపోయేవరకు బ్రాహ్మదీక్ష వదల్లేదు. కితం పాతికేళ్ళల్లో ఆంధ్రదేశంలో ఏకైక బ్రాహ్మో ఈయనొక్కడే అనుకుంటాను. గురువుగారు పోతూ తన కప్పగించిన 'ధర్మసాధని' పత్రికని తను బతికున్నంత

కాలమూ నడిపాడు. పత్రిక మొదట్నించి చివరివరకు తనే రాసి అచ్చు వేయించి తనే చదువుకుని మడిచిపెట్టేస్తాడనిపిస్తుంది, అని చలం ఈయన గురించి అన్నాడు.

మన భారతీయులకి వేలకొద్దీ ఏళ్ళనించి వారసత్వంగా సంక్రమిస్తున్న రోగమొకటుంది. దేన్నీ దానికి సహజమైన, ఆంతరికమైన ప్రయోజనాలతో కాకండా, దానికి సంబంధించని బాహిరమైన ప్రయోజనాలతో విలవకట్టటం. భారతీయ తత్త్వ శాస్త్రం మొదలుకొని భారతీయ కళలవరకు అన్నీ ఈ జబ్బుతో తీసుకొంటున్నవే. జ్ఞానానికి విలవ జ్ఞానమే. జ్ఞానం జ్ఞానం కోసమే నన్న సత్యం మనవాళ్ళకెప్పుడూ స్ఫురించలేదు. జ్ఞానం మోక్షం కోసం, లేదా మనకు నచ్చిన సిద్ధాంతాన్ని సమర్థించటం కోసం, లేదా మరో దాని కోసం. జ్ఞానం కోసమే జ్ఞానాన్ని అన్వేషించక పోవటంవల్ల కలిగిన ఫలితమేమిటంటే మన దేశంలో విజ్ఞానశాస్త్రం వేళ్ళూనుకో లేదు. దాని పరిణామమైన భౌతికాభివృద్ధిని పాశ్చాత్యులు వచ్చేవరకు మనం యెరగం. పోనీ, తాత్త్వికాలోచనలోనైనా అభ్యుదయం సాధించామా అంటే అదీ లేదు పన్నెండు శతాబ్దాల కాలం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుంది. కొన్ని శతాబ్దాల తరబడి నవద్వీపంలో తర్కశాస్త్ర అధ్యయనం జరిగినా అరిస్టాటిల్ తన జీవిత కాలంలో వేసిన ఒక్క అడుగూ వాళ్ళు వెయ్యిసంవత్సరాల్లో కూడా వెయ్యలేక పోయారు. సూటిగా స్పష్టంగా దేన్నీ చూడలేకపోవటం, దేని స్వత స్సిద్ధమైన విలవ దానికి ఉంటుందని తెలుసుకోకపోవడం దీనికి కారణం. సాహిత్యం లోనూ అంతే. సాహిత్యం ధర్మప్రచారం కోసం, విశ్వశ్రేయం కోసం, రాజుల్ని కీర్తించి పొట్టగడుపుకోటం కోసం, పాండిత్య ప్రకర్ష కోసం, మరోదాని కోసం. సాహిత్యాన్ని సాహిత్యంగా గౌరవించిన వాళ్ళు, సాహిత్యపు విలవల్ని విస్మరించని వాళ్ళు, ఏ కాళిదాసు లాంటివారో నూటికీ కోటికీ ఒక్కరు. మిగతా అంతా వట్టి బీడు. జీవితానందంలోంచి జీవచైతన్యంలోంచి పెల్లుబికిన చీనా, అరబ్బీ కవిత్వా ల్లాంటివి ఎక్కడేనా మందులోకి దొరుకుతాయేమో. మామూలుగా కనిపించవు.

ఇది భారతీయులకు మాత్రం పరిమితమైన విలక్షణ రోగం. పాశ్చాత్యుల్లో కానీ, పురాతనుల్లో కానీ కనిపించదు. ఒకప్పుడు సంక్రమించినా వాళ్ళు తొందర గానే కుదుర్చుకున్నారు. దీని లక్షణమేమిటంటే ప్రపంచాన్ని objective గా చూడలేక పోవటం, మతం మోక్షం వంటి తెరలు జ్ఞాననేత్రాన్ని కప్ప కండా జాగ్రత్త పడకపోవటం అందుకనే మనకు తత్త్వశాస్త్రంలో ఒక అరి

స్టాటిల్ కానీ, చరిత్ర రచనలో హిరాడోటస్ కానీ కనిపించరు. మన శంకరా చార్యులు ఎప్పుడు పుట్టాడో, ఎక్కడ బతికాడో ఏ చారిత్రకాధారాలూ లేవు. ప్రపంచాన్ని చూడం. కళ్ళు మూసుకుంటాం. యథార్థాల యెడ ఆసక్తి లేదు. జీవిత చరిత్ర నిండా ఉత్ప్రేక్షలు, అబద్ధాలు. ఈ ప్రపంచం పైని దృష్టే లేదు. బతుకంటే వైరాగ్యం. ఇటువంటి మనుషులు సత్యాన్వేషణకు పనికొస్తారా? జీవిత సంరంభంతో స్పందించే కవిత్వం రాయగలరా? జీవితానందాన్ని ఆవిష్కరించ గలరా?

అందుకే ఇంగ్లీషు వాళ్ళొచ్చి మన చూపుల్ని పరలోకాల్నించి ఇహలోకానికి మరల్చి జీవితాన్నీ, యథార్థాల్నీ సూటిగా చూసి ఎదుర్కోగలగటం నేర్పినప్పుడు మనలో చాలా గొప్ప మార్పూ, మలుపూ వచ్చాయి. దృష్టి బొడ్డుమీదికి సారించి నత్తలా ముడుచుకున్న వాళ్ళం ఒక్కసారిగా విప్పారి అనంత ఆకాశానికీ, హాయినిచ్చే గాలికీ, విస్తరించే నలుదిక్కులకీ విప్పారుకున్నాం. జీవితానందానికి కళ్ళు తెరిచాం.

మన పూర్వకావ్యాలూ, ప్రబంధాలూ చదవండి. అందులో వాళ్ళు మనుషులేనా? అందులో వర్ణించింది మనుషుల జీవితమేనా? ఆ కవులు నిజంగా జీవించలేదు కనకనే, వారి పాత్రలూ జీవించలేదు. వాళ్ళు మనుషుల్లా ప్రేమించుకోరే! మరబొమ్మల్లా ప్రేమించుకుంటారు కాని. (మరబొమ్మలు ప్రేమించుకుంటాయా?)

ఇంతకీ నే ననేదేమిటంటే, ఇంగ్లీషు వాళ్ళొచ్చి మనకు నేర్పేవరకు, మనం ప్రపంచాన్ని కళ్ళుతెరిచి చూడలేదనీ, జీవితాన్ని ఆనందించటం మనకు తెలీదనీ. ఇంగ్లీషు చదువులొచ్చాక, ఏ గురజాడ అప్పారావో, గుడిపాటి వెంకటచలమో వచ్చి కథల్లో, నాటకాల్లో ప్రపంచపు వైవిధ్యానికీ, జీవితపు ఇంద్రధనుఃరోచులకీ నిత్యం అనుభూతమయ్యే ఇంద్రియసుఖాలకీ మన మనోనేత్రాలని తెరిచేటప్పటికి, కళ్ళు జిగాలుమని, కలవరపడి, కంగారుపడి అలవాటు కొద్దీ ఈ కొత్త అనుభవాలకి సంజాయిషీలని వీటితో సంబంధంలేని బాహిర కారణాల్లో వెతకటం మొదలెట్టాం. కన్యాశుల్క దురాచారాన్ని ఖండించాడు కనక 'కన్యాశుల్కం' గొప్ప నాటకమనీ, స్త్రీల హక్కులకోసం కలంపట్టాడు కనక చలం గొప్ప రచయితనీ సంజాయిషీలు చెప్పటం మొదలెట్టాం. ఏ వస్తువు విలవని ఆ వస్తువులోనే చూట్టం తెలీని మన తరతరాల వాసనలు ఎక్కడికి పోతాయి? నరనరాల జీర్ణించుకుపోయాయి.

కాస్త చదవనేర్చిన కుర్రవాళ్ళలో మార్క్సిజం ప్రాచుర్యం కావటానికి ఈ మన జాతిరోగం అనుకూల వాతావరణం సిద్ధంచేసి పెట్టింది. మన భారతీయ సంప్రదాయ వైఖరికీ మార్క్సిస్టు మనోవైఖరికీ దగ్గిర సామ్యం ఉందని నా కని పిస్తుంది. వ్యక్తికన్నా వ్యవస్థకి అధిక ప్రాధాన్యం ఇవ్వటం, జీవిత వాస్తవికాల కన్నా సిద్ధాంతాలకు ప్రాముఖ్య మివ్వటం, అనుభవానికన్నా హేతువు లేదా ఆధి కారిక వాక్యం గొప్పదనటం- ఇటువంటి పోలికలు చాలా ఉన్నాయి. అందువల్లనే నేమో, మన మేధావులకి మార్క్సిజం చాలా సులువుగా సోకింది.

జీవితాన్ని జీవితంగా మొట్టమొదట తెలుగువాళ్ళకి చూపించిన తెలుగు కథ కుడు చలం. జీవితమంటే సిద్ధాంతంకాదు. పోరాటమూ కాదు. దీన్లో అన్నీ వున్నాయి. ముఖ్యంగా దైనందిన జీవితాన్ని వెలిగించే చిన్న చిన్న సుఖాలూ, అప్పు డప్పుడూ కన్నీళ్ళు, పరిచయాలూ, సరదాలూ, ప్రేమలూ, ఎడబాట్లూ, దిగుళ్ళూ, కోరికలూ, తృప్తీ, అసంతృప్తీ, ఆలోచనలూ, ఊహలూ- వీటన్నిటినీ ఆవరించి మనచేత జీవితాన్ని జీవింపచేసే ఒక ఉత్సాహమూ, ఆనందమూ. ఇది లేంది జీవి తమే లేదు. జీవితం ఏ ఒక్క మనుష్యప్రక్రియకో పరిమితం కాదు. వీటన్నిటి సమాహారమే జీవితం. దీన్లో బుద్ధికి ఎంత తావుందో అనుభూతికి కూడా అంతే. వీటన్నిటితో సంపూర్ణంగా బతకటంలోనే ఆనందముంది. ఇటువంటి జీవితాన్ని తన రచనలద్వారా పరిపూర్ణంగా అనుభూతమయేటట్లు చేశాడు చలం. పాఠకుల అనుభూతి ద్వారాలు తెరిచాడు. జీవితపు సుఖాలనీ, కన్నీళ్ళనీ మరింత గాఢంగా, తీవ్రంగా చలం రచనల్లో అనుభవించారు తెలుగుజనం. వారి చైతన్యవలయం విస్తరించింది. ప్రపంచం గురించీ, జీవితం గురించీ అవగాహన పెరిగింది. Emotional గా ప్రపంచంతో సామరస్యం కుదిరింది. ఏ మహా కావ్యమైనా ఇంత కన్నా సాధించగలిగేది లేదు. సాహిత్య ప్రక్రియ తాలూకు చరమ ప్రయోజనాలను చలం రచనలు సాధించగలిగాయి. అందుకనే జనం ఆయన రచనలపై మూగారు. ఆయన అభిప్రాయాలని అంగీకరించనివాళ్ళు కూడా ఆయన కథలని ఆబగా చది వారు చలాన్ని తిట్టుకుంటూనే చదివారు. ఎందుకంటే, చలం అభిప్రాయాలకన్నా, సిద్ధాంతాలకన్నా చలం రచనలు గొప్పవి. ఆయన అభిప్రాయాలు పాక్షికాలు. జీవితపు ఒక మామూలు కోణానికి సంబంధించినవి. ఆయన రచనలు అట్లా కాదు, అవి జీవితమంత విస్తృతమైనవి. ఆయన పాక్షిక, తాత్కాలిక అభిప్రాయా

లకు మించిపోయిన జీవిత వైశాల్యముంది వాటిలో. ఏ రచయితైనా తన నమ్మకాల కన్నా, prejudices కన్నా గొప్పవాడు. ద్రష్ట కనక తన అవగాహనని మించి చూడగలడు. ఈ సత్యం కార్ల్‌మార్క్స్ స్వయంగా చెప్పినా మార్క్సిస్టు బుర్రలకి ఎక్కలేదు. మార్క్సని మార్క్సిస్టుగా వీళ్ళు ఒప్పుకోకపోయినా ఆశ్చర్యం లేదు.

చలాన్ని చివరకంటా నడిపించిన సూత్రం జీవితానందం. 'మ్యూజింగ్స్'లో ఒకచోట అంటాడు. "ఇన్ని తీరని యిబ్బందుల్నీ, ఇవి యెందుకు వుండాలని పోట్లాడుతానుగాని, జీవితమనేది చాలా గొప్ప సంగతి. చివరికి తూనికలకి వొస్తే సుఖం దుఃఖంకన్న యెన్నో రెట్లు. పక్క సినిమాలో యెన్ని అరుపులు అరిపించినా యెప్పుడో ఒకప్పుడు నాయుడుగారి ఫిడేలో, సుబ్బలక్ష్మి 'యింగు మిరల దాయో' అనే రికార్డు పెడుతూనే వుంటారు పాపం. నిన్న రాత్రి తిన్న చేపల పులుసు. దాన్ని తినేందుకే ఈ జన్మ ఎత్తితే నే మనిపించింది. ఎప్పుడూ కను మరుగు కాని ఆకాశం, ఎక్కడ చూసినా గడ్డినించి ములగచెట్టు వరకు విరగపూసే పువ్వులు, ఒకప్పుడు ఉక్కపెట్టినా, ప్రియురాలి హస్తాలమల్లే తాకి ముద్దుచేసే గాలి, ఉచితమై ముంచే ఈ ఎండ, అప్పుడప్పుడు ఏ పుంతల్లోనో కనిపించే అందమైన వృక్షపు తీరూ, పక్షుల రెక్కల వూపు, పురుగులమీద నత్తగుల్లల వర్ణాలు, లీలగారి కళ్ళనించి దయగల చూపు, ఏ దూరాన్నించో హృదయింతో పలకరించే ఓ ఉత్తరం, కారణం లేకుండా నన్ను చూసి సంతోషించే పాపాయి చిరునవ్వు.... యెంత అందం జీవితం!"

ఈ ఆనందం ఎక్కడ దొరుకుతుంది? చలం అంటాడు: "నిజమైన ఆధ్యాత్మికానుభవమంటే తనని, తన ఆత్మో, ఏదో, తను అనే దాన్ని ఈ విశ్వ చైతన్యంతో ఏకం చెయ్యగలగడం- లోకంలోని ఆనందాన్నంతా తనదిగా అనుభవించడం. అది అందనప్పుడు అట్లా తనని మరచి ఐక్యమయ్యే ఆనంగం ఈ ప్రేమలోనూ, కొంతవరకు శృంగారంలోనూ గాక ఎక్కడా దొరకదు."

మామూలు మనుషులు సాధించగలిగే ఆనందమంతా శృంగారంలో వుంది. ప్రేమ అంటావా? "ప్రేమ దొరకడం చాలా కష్టం. దొరికినా అది ఒక అగ్ని. అది వొక తపస్సు. అది కలిగిన నిమిషాన, ఏ కవులూ, ఏ కలలూ దాని ఔన్నత్యాన్ని అందుకోనంత వెలుగులు కనపరుస్తుంది; కాలుస్తుంది. కాని ఎంత గొప్ప

ఆనందానికి, అతి మహిమలకి, ఐశ్వర్యాలకి, వెలుగులకి కళ్ళు తెరుస్తుంది!....
ప్రేమలో, మోహంలో, శృంగారంలో విశ్వాసం లేకపోయినా అవి అందుకోవడం మీ చేతకాకపోయినా సంభోగం చేతనవుతుందిగా? దాంటో, దాని గొప్పలో, అది ఇవ్వగల శాంతిలో విశ్వసించండి . బతకడం అందుకోసమే.ఆశాంతినీ,ఆనందాన్నీ పొందడమే ననుకోండి. ఈ ప్రపంచంలో తక్కిన సుఖాలు చెత్త దాని ముందు."

జీవించటంలో గొప్ప ఆనందముంది. దీన్ని జనం ఎందుకు పాడుచేసుకుంటారు? ఇంత కౌటిల్యం, క్రౌర్యం, నిర్దయా తమ చుట్టూ ఎందుకు సృష్టించుకుంటారు? ఒకరి స్వేచ్ఛ నొకరు అడ్డుకుని, ఒకరిమీద ఒకరు అధికారం చెలాయించి జీవితాలెందుకు దుఃఖ భాజనాలు చేసుకుంటారు? "తెల్లారిలేస్తే పప్పు, పిడకలు, మళ్ళు, చీకరలు, అలుకులు, అధికారాలు, మూలుగులు, మురుకులు—ఇవన్నీ వొదిలి సూర్యోదయాన్ని చూసి నవ్వే మనోవ్యవధి, సంతోషం,ఉత్సాహం ఎప్పుడు కలుగుతుంది మానవులకి!"

ప్రేమా, సెక్సూ, ప్రకృతీ, సౌందర్యం ఈ జీవితానందంలోని వివిధ అంశలు మాత్రమే. ఈ ఆనందం సంపూర్ణంగా అనుభవించటానికి మనిషికి స్వేచ్ఛ అవసరం. స్వేచ్ఛని ఆటంకపరిచేవన్నీ లాగి పారేయి. స్వార్థం,క్రౌర్యం కౌటిల్యం, నిర్దయా, ద్వంద్వనీతీ, పురుష అహంకారం మొదలైన కాలుష్యాల మీద యుద్ధం ప్రకటించు.

చలం బ్రాహ్మసమాజం రోజుల్లో కాకినాడలో రత్నమ్మతో ప్రేమలో పడ్డప్పుడు మొట్టమొదటిసారిగా అతనికి ఈ జిజ్ఞాస కలిగింది ఈ ప్రేమ పాపమా? ఇంత ఆనందకరమైంది పాపమెలాగైంది? ఈ శృంగారం పాపమని నిజంగా ఈశ్వరుడు చెప్పాడా? ఇటువంటి సందేహాలు రేగటంతో చలం బ్రాహ్మసమాజానికి ఎదురు తిరిగాడు.

చలం ఒకచోట అంటాడు "ఉన్న సుఖాలలోంచి అంతకన్నా ఎక్కువ సుఖాలకోసం ప్రయత్నించాలి. ఆధ్యాత్మిక విద్యే అన్నిటికన్నా గొప్ప సుఖమిస్తే అది చాలా వాంఛనీయం." చలం దృష్టిలో అధ్యాత్మికానందం శృంగారానందం కన్నా ఒక్క మెట్టు మాత్రమే ఎక్కువ. "ఈ ప్రేమకన్నా గొప్పది ఆధ్యాత్మికానుభవం అంటారు. ఆధ్యాత్మికానుభవం అంటే మతం, పూజలు, వేదాంతం ఇవేమీ

కావు. ఈ సన్యాసులూ, వేదాంతులూ, బైరాగులూ ఎవరూ ఎరగని అమృతం అది ప్రేమానుభవంకన్న గొప్పదనిపిస్తుంది.... ఆ నిజమైన ఆధ్యాత్మికానుభవమంటే తనని, తన ఆత్మ, ఏదో, తను అనేదాన్ని ఈ విశ్వచైతన్యంతో ఏకం చెయ్యగలగడం- విశ్వగానంలో తన కంఠాన్ని మేళవించడం- తను తానని మరిచిపోయే చివరి ఐక్యాన్ని పొందడం- లోకంలోని ఆనందాన్నంతా తనదిగా అనుభవించడం...." శృంగారంలో స్త్రీ పురుషులు ఐక్యమైతే, ఆధ్యాత్మికానుభవంలో ఆత్మ విశ్వచైతన్యంతో ఐక్యమౌతుంది. కనక, చలం ప్రపంచాన్ని విసర్జించి, అరుణాచలాభిముఖుడైనాడేమని మనమెవరం విస్తుపోనక్కర్లేదు.

ఏ ప్రాచీన విశ్వాసాలకీ, అధికారాలకీ, భయాలకీ లొంగని స్వతంత్ర ఆలోచనా, జ్ఞానాన్వేషణా చలానికి మొదట్నించీ ఊపిరిలా అంటిపెట్టుకుని వున్నాయి. చలం జీవితమంతా ఒక అన్వేషణ. మొదట్లోనే గ్రహించాడు. "స్వతంత్రదేవత కలకత్తా కాళికన్నా భయంకరమైనది. నిరంతరమూ సుఖనైవేద్యాన్నీ, అశ్రు అభిషేకాన్నీ కోరుతుంది. ఆమెను చివరిదాకా ఆరాధించగల జవసత్వాలున్నవాళ్ళు అరుదు." 1940లో అన్నాడు, "ఈ పదిహేనేళ్ళల్లో చాలా దూరం ప్రయాణం చేశాను. [లోపల. బైటకాదు.] ఏళ్ళలోకాక మనసుల్లో ఎదిగేవాళ్ళకి యీ అయాన ప్రయాణాలు తప్పవు." ఇంకా అన్నాడు "....ఎప్పుడూ రాస్తున్నాను. ఏనాటికేది సత్యమని తోస్తే అది నమ్మడానికి ఎదురు చూస్తోండాలని, ఆ విధమైన open-mindedness ఉండాలని."

వడ్డించిన మార్క్సిస్టు విస్తరి కాదు చలం ఆలోచనా జీవితం. ఏ ఇజాన్నో సిద్ధాంతాన్నో నమ్ముకుని బుర్రని switch off చెయ్యలేదు. ఆలోచనా లోకంలో సాహస యాత్రికుడు చలం. మనస్సు ద్వారాల్ని అన్ని గాలులకీ తెరిచిపెట్టాడు. ఎప్పుడు ఏది సత్యమని తోస్తే, అది నిష్కర్షగా చెప్పాడు. ఇతనికి జీవితమూ, రచనా వేరువేరు కాదు. జీవితాన్ని గన్నుగీసి విభజించలేదు. హేతుబుద్ధీ, ఇంద్రియానుభవమూ, అంతరాత్మ, సౌందర్యచేతనా ఇతనికి విభిన్నాంశాలు కావు. ఇవన్నీ కలిపితేనే జీవితం. కనక, సంపూర్ణ వ్యక్తిత్వంతో అన్వేషించిన సాహసిక అన్వేషకుడు చలం.

చలంలో వైరుధ్యాలున్నాయని గోలపెట్టే వాళ్ళు బహుశా జడులై ఉంటారు. సత్యాన్వేషణ అంటే వారికి తెలీదు. తాత్త్వికులకి సమాధానాలు ముఖ్యం కాదు. ప్రశ్నలు ముఖ్యం. ఈ నాటికి ఈ సమాధానం సత్యమనిపించవచ్చు. రేపటికి

కాదు. ఈ ప్రయాణంలో నిత్యమూ కొత్త మజిలీలు తగులుతుంటాయి. శాశ్వత సత్యాలంటూ లేవు. ఎప్పటికి ఏది సత్యమో అప్పటికి అది అంగీకరించటమే మనం చెయ్యగలిగింది. దీన్నే open-mindedness అన్నాడు చలం.

'కన్యాశుల్కం'లో కరటక శాస్త్రులు శిష్యుడు సంస్కృత శ్లోకం చదివి, "ముద్దెట్టుకున్నాడటోయి ముండాకొడుకు. ముక్కెట్టుకున్నాడు కాడూ?" అంటాడు. ముద్దెట్టుకోడానికీ ముక్కెట్టుకోడానికీ భేదం తెలీదు కుర్రసన్నాసికి. వీణ్ణి క్షమించవచ్చు. కాని, బొత్తిగా రాసిక్యం మెరగని మన మధ్యతరగతి మర్యాదస్తుల్ని క్షమించడానికి వీల్లేదంటాడు చలం. ఈ మర్యాదస్తుల బతుకనే చీదరలోంచి, చీకాకులోంచి వీళ్ళని తట్టి, కొట్టి లేపటానికి దాదాపు ముప్పై ఏళ్ళగా తెలుగుదేశం మీ్మద కొరడా ఝళిపించాడు చలం. చలం చేసిన యుద్ధం ముఖ్యంగా ఈ అరాసిక్యం (philistinism) మీదనూ, ఇటీవల జనాన్ని ఎక్కువగా లోభపరుస్తున్న భౌతిక విలువల మీదనూ (materialistic values). "సౌఖ్యమివ్వడానికి ధనమూ, ఆస్తీ ముఖ్యమనుకున్నంత కాలమూ యింక ఏ విలువలకి స్థలముండదు. మనుషుల మనసుల్లో, తనను సృష్టించిన మన్నుతోటీ, తన కన్ను తెరిచిన కాంతి తోటీ సంబంధానికి క్రమంగా దూరమౌతున్నాడు మానవుడు". "సొంత యిల్లూ, అణగారిన భార్యా, ప్రతి సంవత్సరం పై క్లాసులోనికెళ్ళే కొడుకూ, bank-account, వాట్టి పోని ఆవుతో తృప్తిపడే సంసారుల" మనస్తత్వం మీద చలం మంటదాడి చేశాడు. "పిల్లలకి కూడా ఎట్లాగైనా ధనం సంపాయించే మార్గమే ధర్మమార్గమని ఆదర్శంగా చూపుతున్నారు" అన్నాడు పాతికేళ్ళ కితం. అప్పటికీ ఇప్పటికీ ప్రపంచమేమీ మారలేదని నేను వేరే చెప్పఖర్లేదనుకుంటాను. ప్రస్తుత ప్రపంచానికి చలం అవసరం ఇక్కడే ఉందనుకుంటున్నాను. అంటే అరాసిక్యాన్ని, హిపోక్రిసీని, భౌతిక విలువల్ని పరిత్యజించి తన జీవితంలోనూ, తనలోనూ స్వేచ్ఛా ఆనందం వెతుక్కుంటేనే కాని మనిషికి శాంతి దొరకదనే పాఠాన్ని మన ఆధునిక లోకం చలం దగ్గిర కొత్తగా నేర్చుకుంటే తప్పించి దీనికి మోక్షం లేదు.

చలం ఎటువంటి మహత్తరమైన శక్తో విస్మరించి చలం పలాయనవాదనీ, సామాజిక చైతన్యం లేని వాడనీ, అతనికి ఆర్థిక శాస్త్రం తెలీదనీ కుంటి ఆరోపణలు చెయ్యటం ఎలా వుందంటే టోర్నాడోకి ట్రాఫిక్ రూల్స్ తెలీవని మొత్తుకున్నట్లు వుంది.

డబ్బూ, దస్కమూ పుష్కలంగా వున్న ఏ యూనివర్సిటీ వారో పూనుకుని, ప్రోత్సహించి చేయించవలసిన క్లిష్ట కార్యాన్ని పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు ఒక్క చేతిమీద సాధించారు. చలం మరణంతో ఆరంభించి సంతాప ప్రకటనలూ, దూషణ భూషణలూ అయాక, తిరిగి ఆయన జన్మించిన దేశకాలాల నేపథ్యమూ, జీవితయాత్రా, మిత్రులూ, సహచరులూ, పుస్తక పరిచయాలూ—ఇలాగ సాగింది. చాలా వివరాలూ, వార్తలూ పోగుచేశారు శర్మగారు. ఇకముందు చలం గురించి రీసెర్చి చేసేవాళ్ళకు ప్రాతిపదికగా పనికొస్తుందీ పుస్తకం. ఐతే వివిధ ఆధారాల నించి విషయాలను రాబట్టటంవల్ల రెండుమూడు భిన్నశ్రుతులు వినిపించిరసభంగం కలగచేస్తున్నాయి. వీటిని ఒకే శ్రుతికి మార్చితే బాగుణ్ణు.

రమణమహర్షి, గణపతి మునుల గురించి వందపేజీల వివరాలుఅవసరమా?

మన వాళ్ళకి కాలజ్ఞానం తక్కువనే సత్యాన్ని మరోమారు రుజువు పరిచారు శర్మగారు. ఏ సంఘటన ఏ సంవత్సరంలో జరిగిందో తెలీటంలేదు. ఘటనాక్రమం కూడా చాలామార్లు తారుమారైంది.

ఏదైనా జీవితకథనమూ, విమర్శా కలబోసి నేసిన ఇటువంటి జీవిత చరిత్రలు తెలుగు సాహిత్యంలో అరుదు. చలం గురించి ఎవరు రాసినా ఆసక్తికరంగా ఉండకతప్పదు. ఈ పనికి శర్మగారే పూనుకోవటం వల్ల ఈ పుస్తకం మరింత ఉజ్జ్వలంగా తయారైంది.

— ఇస్మాయిల్

కాకినాడ

# చలాచల చెలం

ఈ శతాబ్దపు యిరవయ్యో శతాబ్దం రూపొందటానికి సంబంధించి; డార్విన్, మార్క్స్, ఐన్‌స్టీన్, ఫ్రాయిడ్‌ల పేర్లు యేరకంగా పేర్కొంటారో ఆ రకంగా; తెలుగు సాహిత్యం *1 రూపొందటానికి చెప్పతగిన నాలుగైదు పేర్లలో చలం పేరు వుండటం అనివార్యం.

కేవలం చారిత్రక ప్రాముఖ్యతే కాదు. చలం వాక్యం, రసాత్మకం. తెలుగు నడ్డికారాలూ, నత్తికారాలూ పిలకబడులూ లేని తెలుగు, చలం వాక్యం. చలం చేతులో తెలుగుభాషకి; నశ్యం కంపూ గ్రాంధికపు జిగటా యింగువ వాసనా వొదలగొట్టుకున్న సార్వజనీనమైన తెలుగుతనం అబ్బింది. "మహాప్రస్థానా"నికి చలం రాసిచ్చిన యోగతాపత్రం కంటే శక్తివంతమైన చక్కని తెలుగు నాకింత వరకు కనిపించలేదు.

కానీ —

చలానికి; వ్యాకరణం తెలియదు, వాక్య నిర్మాణం తెలియదు, భాష తెలియదు, సాహిత్య శిల్పం తెలియదు *2.

సాహిత్య పండిత సూత్రకారులు; నియమావళిలోకీ, విశ్లేషణలోకీ, శిల్ప లక్షణ పరిధిలోకీ గుంజి నిలదీస్తే చలం రచన నిలవదు. సాహిత్య పండిత సూత్రకారుల్నీ; చలం సాహిత్యంలోకి దించి, అనుభూతింపించితే, సాహిత్య శిల్ప లాక్షిణ్యత నిలవదు,

చలం రచనకి; స్టీమింజను శక్తి లేదు, రాకెట్‌లా దూసుకుపోవటం లేదు, పుద్యానవనాల రంగురంగుల పొంకేన్న చెమ్కీ జిలుగు తళుకులు లేవు. అవన్నీ మేధలోంచి వో క్రమపద్ధతిలో వో పరిమితిలో వెలువడతాయి.

వెన్నెల జల్లులా, పుడమి గర్భం చీల్చుకుని పెల్లుబికే లావాలా, వుప్పెనలా ప్రజ్వరిల్లుతున్న అగ్నిపర్వతంలా, జలపాతంలా, భూగర్భం లోంచి చిప్పిన

1. గ్రాంధిక భాష గురించీ అనువాద సాహిత్యం గురించీ కాదు.

2. తెలుసా తెలియదా-అని కాదు. ఆ ధ్యాసా ఆ గమనింపూ అసలుకే లేవని

పైకెగిసే నీటి బుగ్గలా; హృదయంలోంచి ఆవేదనగానో ఆహ్లాదంగానో, పెల్లుబుకుతుంది, చలం రచన (యేదో అంతర్గత ప్రకృతి ధర్మాన్ననుసరించి).

యే వొక్కరూ అన్నిటిని గురించీ రాయలేరు. రకరకాల సమస్యల విషయాల్లో కొందరు కొన్నిటిని గురించే లోలోతులకి వెళ్ళి రాయగలరు. సమకాలీన వ్యవస్థధర్మానికి భిన్నంగా భవిష్యత్తును అందరికంటే ముందుగా దర్శించగలిగే వాళ్ళు; నిజాయితీ పరులైతే సామాజికంగా గొడవపడక తప్పదు *3.

శరీరంలోని కుళ్ళు, మనసులోని కుళ్ళు, మనలోని (సమాజంలోని) కుళ్ళు—వుందని కూడా అనకండా; ఆ కుళ్ళును మన బలహీనతలకు అనుకూలంగా వాడుకుంటూ కుళ్ళుకుళ్ళుగా బతకాల్సిన సామాజిక వ్యవస్థలో; మనిషి అంతర్యాన్ని బట్టబయలు చెయ్యటం, మహాపరాధం. (అప్పట్లో మరీనూ.) చలం; అలాంటి అపరాధాలు, వకటి కాదు యెన్నో చేశాడు.

ఆడది; పురుషుడి ఆస్తిలో వో భాగం లాంటి ప్రాణమున్న యంత్రమూ, వో పరికరమూ, వో విలాసవస్తువూ కాదనీ; స్త్రీ కూడా (పురుషుడిలాగానే!) స్పందించే ప్రాణి- అనే 'పాలపంకిల' భావంతో కారుకూతలు కూసి, మహాపరాధాల్లో కల్లా మహాపరాధం చేసిన మహానేరస్తుడు, చలం!

అలాంటి నేరాలు చేసినందుకు, మరింకెవరూ రాయలేనట్లుగా రాసినందుకు: తెలుగు దేశమంతటా (నాటి నుంచి నేటిదాకా!) కోకొల్లలుగా చలం ద్వేషులూ చలం భక్తులూ వున్నారు. భక్తకోటీ ద్వేషకోటీ వున్నవాడి జోలికి పోవటం, వెనక నుయ్యీ ముందు గొయ్యీ లాగా వుంటుంది *4. అన్నీ తెలిసీ, పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు చలం జోలికి పోయారు!

రుతుక్రమం తప్పకండా వారానికొకసారి తెలుగు వాళ్ళందర్నీ కలుసుకునే పురాణం గారి చలం సంగతి కొద్దాం.

*    *    *    *

ఐదుపదేళ్ళ నుంచనుకుంటాను—విశ్వవిద్యాలయాల ప్రాధికపొవ్విడుంకాయ శాఖలు; యెందుకన్నాగానీ తెలుగు సాహిత్యాన్నాశ్రయించాయి. పాఠ్యభాగంలో

---

3. మానవ మూల ప్రాథమిక సమస్యలకి కూడా సామాజిక ఆచరణ వుంటుంది.
4. పక్కదారులు తొక్కగలిగితే పర్లేదనుకోండి!

వుండీలేనంతే ఐనా, పి.హెచ్.డీ.లూ యెం.ఫిల్.లూ లాంటి డిగ్రీల కోసం యిటు మళ్ళారు. వుపాధికోసం డిగ్రీలంటే వర్లేదుగానీ సాహిత్యాగ్రస్థాయిని ఆపాదించి తేనే పేచీ. ఐతే యిందులో సంతోషించతగ్గ అంశం లేకపోలేదు. వొకటి రెండు (పరిశోధన చట్రపు హంగులతోపాటు) నిజంగా విలువైనవీ వొస్తున్నాయి.

యిది చలం గురించిన పుస్తకం. అంటే, పరోక్షంగా చలం సాహిత్యం గురించిన పుస్తకం అని నేను భావిస్తాను. చలం జీవితం జోలికి వెళ్ళకండా చలం సాహిత్యంలో పరిశోధన గ్రంధాలు రాయటం హాస్యాస్పదంగానూ భావిస్తాను. యీ పుస్తకంలో చలం గురించి చలం రచనలలో కొరకని భోగట్టా చాలా లభ్య మవుతుంది. అదంతా చలం సాహిత్య వివేచనకి యెంతో అవసరం. యీ పుస్తకం పరిశోధన గ్రంధమేగానీ, దీని వాలకం వేరు. సుబ్రహ్మణ్యశర్మగారు అదృష్ట వంతులు; మూడు దశాబ్దాలుముందుగా (సాహిత్యంలో) పుట్టటం వల్లనో మరెందుకో విశ్వవిద్యాలయాలకెక్కి పరిశోధన వూబిలో దిగబడనందున యేంరాసినా కులా సాగా వుంటుంది. విశ్వవిద్యాలయాల పరిశోధన గ్రంధాల్లా రంగూ రుచీ వాసనా లేని పుస్తకం *5 కాదిది. జీవమున్న పుస్తకం. యేవేవో అవసరాలకి కాకుండా, యేదీ 'ఆశించ'కండానే యిష్టంగా చదువుకునే పుస్తకం.

యీ పుస్తకాన్ని మెచ్చుకుంటున్నానంటే దీన్లో లోపాలు లేవని కాదు. యే లోపమూ లేకండా రాయగలిగితే అసలు రాయటమే జరగదు (అలాంటి వ్యక్తులు జీవన జగన్నాటక వలయానికి చెందరు). పురుషుల్లో పుణ్యపురుషులు వేరన్నట్లుగా లోపాల్లో మన్నించ తగిన మెచ్చుకోతగిన లోపాలు వేరు.

*   *   *   *

చలం స్త్రీ పాత్రలలో తిరుగుబాటు తనమూ, పురుష పాత్రలలో యధాతధ తనమూ కనిపిస్తాయి; విప్లవం కనిపించదు- అని కొందరంటుంటారు. ("అరుణ" లోని) అరుణలో, రవంతగా అన్వేషణ అలికిడి వున్నట్లనిపిస్తుంది. ("జీవితా దర్శం"లోని) దేశికాచారిలో వకసారి దిగిచూసి వొడ్డుకొచ్చినిగ్రహంగా వుండటం కనిపిస్తుంది. సంయమనం లోంచి అధిగమించినతనం మాత్రం కాదు.

---

5. కొన్ని సాధారణీకరణలకి మినహాయింపులు వుంటాయి సుమీ !

తిరగబడి విప్లవించి అన్వేషించలేనిదే *6 యే మూలతత్వమూ అంతు చిక్కదు. యీ మూడూ పరస్పరానువర్తితాలు. తిరగబడి విప్లవించి అన్వేషించిన చలం స్థాయి యేదో నిర్ణయించాల్సి వుంది.

నిరంతర విశ్వమహాయానంలోని అసంఖ్యాక గతితార్కిక త్రయ చంక్ర మణాలలో నువ్వూ నేనూ యేపాటి ! కానీ ఆ నువ్వూ నేనూల యేకత్వఘర్షణ లేనిదే విశ్వమంటూ యేముంది !

ప్రతి దృష్టకీ సామాజిక చారిత్రక *7 అవగాహన వుంటుంది. లేనిదే భవిష్యత్తులోకి చూడలేడు. దృష్టకి కూడా దేశకాల వ్యక్తిక పరిస్థితులను బట్టి వక ఆలంబనావరణ వుంటుంది 8*

1925 నాటికే చలానికి "Herstory Manifesto" వొకటుందని యీ పుస్త కంలో అందించిన చలంగారి "Man and Woman" చూసి తెలుసుకున్నాను.

క్రితం శతాబ్దాంతంలో కొమ్మూరి వెంకటచలమో, గుడిపాటి వెంకట చలమో పుట్టివుండకపోతే; అందుగురించి తెలుగుదేశం, 1980లో కాక 1925లో వుండి వుండును. ఆ వెంకటచలమో యింకో సంకటచలమో యిప్పుడు పుట్టకు రావాల్సొచ్చేది. అప్పుడా పాపిష్టి గుంటడు పుట్టబట్టి, *9 యిప్పుడు మనమంతా 'పుణ్యాత్ములు'మయ్యాం.

* * * *

యిందులో, చలం ప్రారంభించాడనే విశృంఖల ప్రణయంప్రసక్తీ వుంది. ప్రణయానురాగాలకి; యేకాగ్రతాదాత్మ్య ఐక్యత, వూపిరి. ఆ రకం స్వేచ్ఛా

---

6. తిరుగుబాటు, విప్లవం, అన్వేషణలకి; నిజాయితీ అవసరం. అది లేనప్పుడు; తడికచాటు బేరం మేధావులు.

7. చారిత్రక తత్వజ్ఞుడు, మానవ గతం గురించి చిట్టా రాసేవాడో గతాన్ని తవ్వేవాడో కాదు. గతంలోని భిన్న క్రమానుబంధాన్ని పరిశీలిస్తూ భవిష్యద్రీతులను దర్శించగలవాడు.

8. అదేదీ వుండకపోవటం, జీవన జగన్నాటక పరిధిని అధిగమించిన మహాద్రష్టత్వం. కాదంటే, భ్రష్టత్వం.

9. పుట్టక చస్తాడా మరి; చారిత్రకావశ్యక బద్ధం !

ప్రణయాన్ని తిరుగుబోత్తనంగా అనొచ్చు, అలాంటి తిరుగుబోత్తనం కేవలం శరీరాల రాపిడితనం. కాదంటే, డొల్లతనం.

చలం రచనలలో వక స్త్రీ చుట్టూ కొందరు పురుషుల పరిభ్రమణ రగడ వుంటుంది. వుదాహరణకి- "మైదానం" "అరుణ" పుస్తకాలు. కానీ ఆ స్థితిని తిరగేస్తే- వక పురుషుణ్ని కొందరు స్త్రీలు యిష్టపడినప్పుడు ఆ స్త్రీల కీచులాటనీ గమనించవచ్చు. అలాంటి స్వేచ్ఛా ప్రణయం సాధ్యపడాలంటే మానవ పరిమితులను అధిగమించి అతీతమానుష స్థితికి చేరుకోవాలి.

"జీవితాదర్శం"లో వొకలాంటి పెడపరిసరాలను యేర్పరచుకుని వొకలాంటి పళ్ళబిగువున వొకలాంటి అనాసక్తాసక్తత లోంచి విశృంఖల ప్రణయాన్ని నిలుపుకోవటానికి ప్రయత్నించటం మాత్రమే కనిపిస్తుంది. అంచేత చివరికి చలం తన స్త్రీని దేవతను చేసి పురూరవుడి దగ్గిరికి దించుకొచ్చాడు. మానవపరిధిలోనే వున్న అసాధారణ పురూరవుణ్ని కొన్ని జన్మలు తపసుచేసి యే పరిమితులూ వుండని ఆ లోకాలకి చేరుకోమని చెప్పి సెలవుపుచ్చుకుంటుంది, అంతటి వూర్వశి- అతనంటే అంత అనురాగం వున్నాకూడా యెన్నో రాజ్యాలు జయించిన యెందరో స్త్రీలను మోహవశ్యులను చేసుకున్న పురూరవుడిలో-యెందరు స్త్రీలు అని కాదు,కలిసి యేం పొందారు- అని తెలియజేస్తూ మానవ పరిమితులకు మించిన అపరిమిత విశృంఖల మహోస్వేచ్ఛని గ్రహింపుకి తెస్తూ అంతర్థానమవుతుంది. అంచేత చలం కలలుగనే విశృంఖల ప్రణయం కేవలం తిరుగుబోతుతనంగానో డొల్లతనంగానో శరీరాల రాపిడితనంగానో భావించటానికి వీల్లేదనీ అనిపిస్తుంది. శారీరక మానసిక మానవ పరిమితులకు అతీతమైందిగా భావించుకోవాలనుకుంటాను.

రమణాశ్రమం నుంచి 1950లో, "డబ్బు కోర్కె వున్న వాళ్ళని చిత్రించాలన్నా చాతకాదు నాకు, ఆ మనస్తత్వం తెలీక. అట్లాగే స్త్రీని కోరని మనుషులు వుంటారని తెలుసు-పరస్త్రీని కోరని వాళ్ళు కూడా అర్థం కారు నాకు. అవేవో వికృతమైన జంతువుల్లా కనిపిస్తాయి" అనీ, 1954లో "శ్రీవిద్య వుపాసించేవారు, పరస్త్రీని పరమేశ్వరిగా చూడాలి. చూడకపోతే ఆపద జరుగుతుందని ఈశ్వరుడు రాయమన్నారు. ఈ మాటలు చలం చేత రాయిస్తున్నారు. ఇంక లోకవ్యవహారం. ఈ సంగతి పుస్తకాలలో రాశాను. మళ్ళీ జ్ఞాపకం చేస్తున్నాను. స్త్రీ ఆనంద రూపమే కాని వ్యసనమైనప్పుడు అది మనిషి స్వభావాన్ని మాలిన్యం చేస్తుంది.

నన్ను చేసింది. వుత్త వెధవని చేసింది. నిర్మలమైన ఆనందం కాక- ఇంక యే మిచ్చినా- ఆ సందర్భంలో ఆ యత్నంలో మాలిన్యమున్నదన్నమాట". అనీ చలం వుత్తరాలు రాసినట్లు యీ పుస్తకంలో చదివాను. మరి చివరికి తన (జీవి తంలోని, రచనలలోని) విశృంఖల ప్రణయత్వం యేమైనట్లు?

విశృంఖల ప్రణయం గురించీ వైవాహికత్వం గురించీ, లేదూ, వైవా హిక విశృంఖల ప్రణయం గురించీ విశృంఖల ప్రణయ వైవాహికత్వం గురించీ చలం దృక్పథం యెలాంటిదో- చలం రచనలన్నీ అనుశీలనగా చదివిన వాళ్ళూ విశ్లేషణ వివరణలు చాతయిన వాళ్ళూ నిర్ధారించాలి.

ఆదిమ అవ్యవస్థలోనూ, అనాగరిక వ్యవస్థలోనూ, నాగరిక వ్యవస్థలోనూ, నాగరిక అవ్యవస్థలోనూ, రకరకాల ఆర్థిక విధాన స్థితులలోనూ మనిషిలో వైవా హికత్వమే కనిపిస్తుంది. తనకు మరీమరీ యిష్టమైనదాన్ని; అది వస్తువైనా, జంతు వైనా,మనిషైనా;మరొకరితో పంచుకోదలచని రీతిలో'సొంత'పరుచుకోవాలనీ, ఐక్య మవ్వాలనీ వో బలీయమైన ప్రగాఢమైన లాలస మానవ స్వభావంలో సహజ సిద్ధంగా వుంది. అందుమీదట, యిరువురు వ్యక్తుల మధ్య యేర్పడిన పరస్పర ఆంతర్య అనురాగబంధమే, వివాహం, (ఆ మీదట తమ విడి బలహీనతల వల్లా, ప్రత్యేక అనుకూలతల వల్లా; ద్వంద్వ ప్రమాణాలు యేర్పరుచుకోవటమూ జరుగుతూ వుంటుంది. అటువంటి పరస్పర అనురాగ ఆంతర్య బంధం లేనప్పుడు, యెన్నో భిన్న కారణాలవల్ల బాహ్య బంధనాలతో బిగించుకోవాల్సి వొస్తుంది. అలాంటి పతనాధమ వైవాహిక స్థితిని చలమే కాదు, అధమత్వం కోరని నిజాయితీపరులెవరైనా తిరస్కరిస్తారు.

వ్యక్తి స్వేచ్ఛను మన్నించని సమాజం, చెదపురుగు. సమాజావశ్యకతను గుర్తించని వ్యక్తి, చీడపురుగు. వ్యష్టి సమష్టి, పరస్పరాధారాశ్రితాలు. వ్యక్తి లోంచి సమాజాన్ని, సమాజంలోంచి వ్యక్తినీ దర్శించని సాహిత్యం, అసమగ్రం. మహాస్వేచ్ఛ, అనేదొక, కల. వివిధ వర్గాల వ్యష్టి సమష్టి వ్యవస్థను అధిగమించిన మహా అవ్యవస్థలో సాధ్యపడవొచ్చునేమో మరి.

బాహ్య భౌతికావశ్యకబద్ధమైన వుత్పత్తి పరిధిని దాటి (గతి తార్కిక వలయ చారిత్రకతను అధిగమించిన) తుది స్థాయిలో (మాత్రమే) 'స్వేచ్ఛా పాలన' సాధ్యం-అని కార్ల్‌మార్క్స్ నిర్ధారించాడు. అంతటి మహోద్భృతోత్పత్తి

సంపద (సాధ్యమై) సాధించాలంటే, మనిషి, మానసికంగా కూడా చాలా యెదగాలి. (దాదాపు అందరూ!) అప్పుడదొకలాంటి స్థితప్రజ్ఞస్థితి. యెందుగురించి ఐనా మూలతత్వం లోపలికి ప్రగాఢంగా తరచిచూసిన వారెవరూ, నిరంతర మధుర స్వప్నం (The Eternal Sweet Dream) నుంచి తప్పించుకోలేరేమో ననిపిస్తుంది!

చలం సరేసరి; పరమ స్వేచ్ఛాకామి. వో తాత్వికాలంబనైనా యేర్పరుచుకోలేదేమోననిపించేటంతగా; తను "మ్యూజింగ్స్" అనే పేరున వెలువరించిన అలవోక ఆలోచనలతో, నానా రకాల చిక్కురొక్కురు విసంబద్ధ స్వప్నాలలో మునిగితేలాడు. ఐతే "మ్యూజింగ్స్", తాత్విక సైద్ధాంతిక రచన కానందున, ఆ రకం రచన యెంతో సహజంగానూ అభిలషణీయంగానూ అనిపిస్తుంది యిందు గురించి యీ పుస్తకంలో యెంతో చక్కగా రాశారు, సుబ్రహ్మణ్యశర్మగారు.

*   *   *   *

చలం జీవితాన్ని రెండుగా విశ్లేషించి ప్రథమభాగాన్ని గురించి ప్రశంసించి యెప్పటికైనా లోకం మొదటి చలాన్నే జ్ఞాపకం వుంచుకుంటుందిగానీ రెండవ చలాన్ని కాదు - అనే అభిప్రాయాన్ని కాదంటూ— "వీరందరి దృష్టిలో రెండవ చలం లోకానికి అక్కరలేని చలం, ఆయన జీవితంలో అది వ్యర్థమైన భాగమన్న మాట!" అని శర్మగారు అనటం గురించి నేనేమంటానంటే—

చలం జీవితాన్ని రెండుగా విశ్లేషించి విడదీసి అలా అన్నంత మాత్రాన, రెండవ చలం లోకానికి అక్కరలేని చలం, ఆయన జీవితంలో అది వ్యర్థమైన భాగం అని అనుకోనక్కరలేదు. తెలుగుదేశాన్ని 'కదిలిచిన' చలం 'పూర్వారుణ చలం'. లోకానికి సంబంధించినంతవరకు 'వుత్తరారుణ చలం' వునికి (వున్న మేరకి ప్రాముఖ్యతా) పూర్వారుణ చలం మీద పూర్తిగా ఆధారపడి వుంది. పూర్వారుణ చలం నుంచి విడిగా చూస్తే, వుత్తరారుణ చలం, సాహిత్యకంగానే కాదు, ఆ ఆధ్యాత్మికంగా కూడా సోదిలోకైనా రాడు. కానీ పూర్వారుణ చలం, వుత్తరారుణ చలం నుంచి విడదీసినా చెక్కుచెదరకండా నిలుస్తాడు.

ఐతే వుత్తరారుణ చలత్వాన్ని పతనంగా వాదించే వాళ్ళలో నాకు నిజాయితీ లేని తనమో తెలియని తనమో కనిపిస్తుంది. చలం తన చిన్ననాటి నుంచి— యెంతటి ఆస్తికుడో అంతటి నాస్తికుడు; యెంతటి నాస్తికుడో అంతటి ఆస్తికుడు.

"అతని జీవితమంతా దశలవారీగా పరిణామం చెందినదని గ్రహిస్తే చాలు" అని శర్మగారు యెంతో సమంజసంగా వివరించారు ఐతే ఆ పరిణామ క్రమంలో చాలా యెగుడుదిగుడులూ యెత్తుపల్లాలూ వంకరటింకరలూ వున్నాయి. అదీ సహజమే.

చలం సాహిత్యం, తన రచన కంటే ముందు తన జీవితంలో ప్రారంభమైంది. తన సొంత చెల్లెలి జీవితమో యితర స్త్రీల జీవితమో చూసి దురన్యాయ వివక్షదైన్యతకి చలించి స్పందించి రగిలి— అందుగురించి జీవన పరిష్కార మార్గం కోసం అన్వేషిస్తూ-ఆ అన్వేషణకి తన జీవితాన్ని అర్పించినవాడు, చలం. యే ప్రలోభాలకీ లొంగకండా తాను నమ్మినదాని కోసం, వో బాటకోసం యత్నిస్తూ వెదుకులాడుతూ బ్రతుకంతా గడిపి; సామాజికంగా యెన్నో యిబ్బందులకు నిరసనలకు అవహేళనలకు అసౌకర్యాలకు కష్టాలకు నష్టాలకు గురయ్యాడు. అందరిలా తనూ వుండిపోతే, చలం బోలెడంత ఆస్తికి వారసుడవును. అంట్లుతోము కోవాల్సి రాకపోను. అగచాట్లు పడాల్సి రాకపోను.

చలాన్ని చలం సాహిత్యం నుంచిగానీ, చలం సాహిత్యాన్ని చలం నుంచిగానీ విడదీయటానికి వీల్లేదు వృత్తి రచయితలో వుబుసుపోక రచయితలో ఐతే తప్ప, సృష్టినీ సృష్టనీ విడదీయటానికి వీలవదు. 10* నిజాయితీ లేనివాడు ద్రష్టా కాదు, సృష్టాకాదు (నికృష్ట మహానేర్పరి కావొచ్చు!)

తను రాసేవానికీ జీవించేదానికీ పొంతనలేనివాళ్ళు, రచయితలు— అని అనుకోవాల్సి వొస్తున్న కాలం, యిది. తాము మాత్రం సమాజం ఆమోదించిన వేసిన బాటలో పదిలంగా సాగిపోతూ; నలుగుర్నీ యింకా యేర్పడని తెలియని బాటలో యెదురు దెబ్బలు తింటూ ముందుకు పదమని నెట్టుతూ గొప్పగా రాసి గొప్పగా

---

10. అలా అని రచనలు స్వీయజీవన కథనంగా (autobiographical) అన్వయించుకోవాలని కాదు. తన సృష్టి తన నెత్తుట్లోంచి,తన వూపిరిలోంచి, తన స్పందనలోంచి,తన మనుగడయత్నంలోంచి వొస్తుంది- తనని గురించి రాసినా, లోకంగురించి రాసినా.

పోజుపెట్టే మార్గదర్శక రచయితల కాలం, యిది. యిలాంటి కాలంలో— [ఆత్మ వంచనా లోహచర్మపు సాహిత్యకులు కాని వాళ్ళకు] చలం జీవితం గురించిన పుస్తకం; వో మందలింపు, వో కనువిప్పు.

అందుకే చలం గురించి రాసిన యీ పుస్తకం యెంతో విలువైంది. సుబ్రహ్మణ్యశర్మగారు రాసిన తన విలక్షణ రీతివల్ల మరింత విలువ.

తను నమ్ముతూ వొచ్చిన వాటి కోసం అంతటి ఆస్తీ వొదులుకున్నవాడు. నాలికాడితేనో రెక్కాడితేనో డొక్కాడే స్థితి చలానిది. కానీ యెన్నడూ యెవరినీ యాచించలేదు. కక్కుర్తి పడలేదు. ఆఖరికి 'ఘరానా ముష్టి'కి కూడా సిద్ధపడలేదు' చలం. కడదాకా పతనమవకండా జీవించాడు. కళావంతులత్వాన్ని చట్టం శిధిలపరచిన లోపం లేకండా కాబోలు; మన సాహిత్య కళాకారుల్లో యెందరో 'కళావంతులు'గా జీవిస్తున్నారు. కనీసం చచ్చిపోయేలోగా ఐనా తమ జీవితాల గురించి వున్నదున్నట్లు చెప్పగల వాళ్ళెందరున్నారు !

* * * * *

యీ సందర్భంలో వైఫల్యాలా విజయాలా అనేది అంత ముఖ్యం కాదు. నిజాయితీగా నిలబడి యత్నించాడా లేదా అనేది ముఖ్యం.

అంతరంగలో నిరంతరం దహిస్తున్న తపన వెలితి: స్త్రీ, ఆ వెలితిని పూరించుతుందనీ, ఆ తపనని తీర్చుతుందనీ ఆశించాడు. "నా ప్రేమాదర్శం నన్ను కాలుస్తోంది. యెవరో స్త్రీయే నాకు స్వర్గం ద్వారం తెరుస్తుందని నమ్మకం మాత్రం నాలోంచి పోలేదు. కానీ యే స్త్రీ నాకు తృప్తినివ్వలేదు. ఏది అనుభవించినా బయటినించేగాని, surface నించేగాని నన్ను లోపల ఏదీ కదల్చలేదు" అని రాసుకున్నాడు, చలం.

"ఆ విధంగా కొంతకాలం వుంటే నేనేమయ్యే వాణ్నో తెలియదు" అంటూ వక సంక్లిష్టమైన ఘోరమైన మానసిక స్థితి గురించి చెప్పుకుంటూ, "అటువంటి

స్థితిలో లీలగారు వొచ్చారు" అని, ఆ స్థితి నుంచి బయటపడినట్లు ధ్వని వొచ్చేలా సూచించాడు. కానీ అతనిలోని అశాంతి అలాగే వుండిపోయింది. ఆ తరవాత ఆ 'లీల'ద్వారా, స్త్రీ పట్ల తనకున్న భ్రమలు విడిపోయాయని రాశాడు.

చలాన్ని యే స్త్రీ విముక్తం చెయ్యజాలదు. అది, స్త్రీ లోపంకాదు. అది చలంలోని లోపం. యే స్త్రీతోనూ పరస్పరం అద్వైత తాదాత్మ్య సిద్ధి పొందలేక పోయాడు. యే స్త్రీలోనూ తననితాను పరస్పరార్పణ చేసుకోలేదు, చలం. అందుకే అసంతృప్తితో వొకరినుంచి మరొకరివైపు మళ్ళాల్సిన అవసరం కలుగుతూండేది [ఐతే తాను అన్వేషిస్తున్నది మానవ పరిమితులకి అతీతమైనదేదో కావొచ్చు].

"చలం వొక్క లీలగారికి మాత్రమే పరిమితం కాదని తెలుసుకుంది" అని ఆ 'లీల' గురించి రాస్తాడు. [చలం, ఏ వొక్క 'లీల'కీ చెందకూడదని చలం స్త్రీలలో వకరైన 'వొయ్యి' [డాక్టరు రంగనాయకమ్మ]అభిలషించి అందుకు యత్నించటం యీ పుస్తకం లోంచి గ్రహించవొచ్చు] యిలాంటి చలాన్ని;తన అస్తిత్వం అంతటా చలాన్నే నించుకున్న ఆ 'లీల' మాత్రం యేం చెయ్యగలదు! అంచేత ఆ తపన ఆ వెలితి అలా వుండిపోక తప్పదు. అలా కొనసాగిన చలం, తన నలభయ్యోయిదో యేట, [తను సృష్టించిన అరుణ] "జీవితంలోయీ దేహానికి, నా శృంగారభావాలకి యెట్లా స్వర్గద్వారాలు తెరిచిందో, అట్లానే నా ఆత్మకీ నా ఆధ్యాత్మిక సందేహాలకీ ఎప్పుడో ఏ ఆశ్రమం నించో స్వర్గద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం" అంటూ ఆగిపోయాడు. నేననుకోవటం- యీ అరుణ, చలంగారి స్త్రీ-తొలినుంచీ కడదాకా- వివిధ రూపాలలో రీతులలో స్థాయిలలో ఆ దేహానికి, ఆ శృంగారభావాలకి మాత్రమే తనలోంచి స్వర్గద్వారాలు తెరిచిన అరుణ; తనలోంచి 'ఆ' ఆత్మకీ ఆధ్యాత్మిక సందేహాలకీ స్వర్గద్వారాలు తెరవలేకపోయిన తెరవలేని అరుణ, "పురూరవ"లో దేవతైన అరుణ— వెంకట 'చలాన్ని' అరుణాచలం చేసి యాభయ్యోయిదో యేట, అరుణాచల రమణమహర్షి వైపుకి పంపి, 'రమణ స్థాన్'ని యేర్పరుచుకుని వుండిపోయేలా చేసింది. చిన్నప్పుడు ప్రారంభించిన తను రాసే వకలాంటి రచన యీ "అరుణ" నవలలోని ఆ చివరి వాక్యాలతో ముగింపు స్థాయికి వొచ్చినట్లు భావిస్తాను.

చివరికి రమణ జగల్లీలలో ప్రవర్తించటం లాగా ఐనప్పుడు ఆ అశాంతి నుంచి విముక్తమయ్యాడు. యీ పని పరస్పరం అద్వైతించగల యే లీలతో జరిగినా విముక్తమవొచ్చు.

యీ జీవన జగన్నాటక పరిధిని అతిక్రమించే— లేదూ, అధిగమించే సాధనమార్గాన్వేషైనా కాక; వకరి [రమణమహర్షి] *11 [లో] సాధనమార్గంలో గురికుదిరి, ఆ మార్గంలో వో భక్తుడిగానో సాధకుడిగానో సాగించిన చలం జీవితం కంటే- యీ సమాజంలో కొన్ని మూల జీవనసమస్యల గురించి వో బాటకోసం అన్వేషిస్తూ కిందా మీదావడిన చలం జీవితానికి యెంతోయెక్కువ విలువ వుంటుంది.

'హిందూ' దేశంలో పుట్టిపెరుగుతూన్న తెలుగు వాళ్ళకి;ఆత్మకి తగిలించిన యీ పంచభూతాల కల్మేత చొక్కా విప్పేసి జన్మరాహిత్యంలో ముగిసిపోవటం గురించి; యిప్పుడు వో చలమో గిలమో చెప్పకపోతే మునిగిపోయేదేం లేదు. జీవించటంలోంచి 'విముక్తమవుతూండటం' గురించి; రమణాశ్రమ రమణస్థాన్ వాసిగా యేదైనా దార్శనికాన్వేషణ వుందేమో పరిశీలించటం అవసరం.

యాభయ్యేళ్ళ పూర్వాశ్రమంగానూ,ఆ తరవాతి ముప్ఫయ్యేళ్ళరమణాశ్రమంగానూ చలం ప్రాముఖ్యతను విశ్లేషించాలా లేదా అనే అంశాన్ని యింకెన్నో అంశాలను పరస్పరం సంధానించి నిశిత సమగ్రపరిశీలనలో తేల్చాల్సిన విషయం. యిందు గురించి—

నా "desire and liberation" కి సంబంధించిన కాగితాల్లోంచి వొక పట్టిక యిస్తున్నానిక్కడ. యీ సందర్భంలో దీన్ని తెలుగులో యిచ్చే వీలుగానీ వివరించే అవకాశంగానీ లేదు. అవగతమైతే; నేనేమీ వివరించకుండానే గ్రహించగలగటం మీ సామర్థ్యం అంటాను. అయోమయంగా అనిపిస్తే; అంతుపట్టటానికి కావాల్సినట్లుగా వివరించని నా లోపంగా భావిస్తాను. చలం గురించిన యీ పుస్తకం చదివేశాక, యీ అంశానికి సంబంధించి చలం గురించి ఆలోచించండి. లేదంటే, పట్టించుకోకుండా యెంచక్కా యీ పేజీ తిప్పేసెయ్యండి.

---

11. దార్శనికంగా; రమణమహర్షికి, వో సాధకుడిగానూ సాధనమార్గాన్వేషిగానూ వున్న ప్రాముఖ్యత, వో తత్వవేత్తగా లేదు




యిందులోని ఆరో వాహిక అనేదంటూ వొకటున్నదనే వూహ కూడా చలా
నికి లేదని నా నిశ్చితాభిప్రాయం. వొకటోదీ రెండోదీ కాదని నమ్మకం. ఐదోది
కాదేమోనని అనుమానం. మూడోదీ నాలుగోదీ అవునేమోనని అనుమానం.

ఆసక్తి వున్న నిపుణులు; చలం గురించిన యీ పుస్తకమూ, మరికొన్ని పుస్తకాలూ, మరోసారి చలం పుస్తకాలూ జీవితమూ పరిశీలించి నింపాదిగా నిర్ధారించాల్సిన విషయం.

*　　　*　　　*　　　*

కళ; విజ్ఞాన శాస్త్రమూ కాదు, జ్ఞాన శాస్త్రమూ కాదు. సాహిత్యం, శాస్త్రీయం కాదు; సాహిత్యం, సాహిత్యకం. (రచయిత, మనిషి గురించి వ్యష్టిగా సమష్టిగా శాస్త్రీయావగాహన వుండాలి. అదివేరే సంగతి). సాహిత్యం పరిష్కారం చూపెట్టాలనేం లేదు. యెవరికివారు ప్రత్యనుభూతించి ఆలోచించుకుని, వ్యక్తికంగానూ సామాజికంగానూ పరిష్కారాలు వెదుక్కునే స్థాయికి యెదిగేందుకు దోహదించాలి. (కాగా, దేనికీ తుది పరిష్కారం అంటూ వుండదు.)

యెవరిదీ 'వేదవాక్కు' కాదు. (వేదమే 'వేదవాక్కు' కాదు. అని వేదమే చెబుతుంది! )వక స్థాయికి యెదిగి తమకి తాముగా నిర్ణయించుకోవాలి.

రచనల ప్రాచుర్యం దేశకాల పరిస్థితులను బట్టి వుంటుంది. వుదాహరణకి-దేశంలో పేదరికమూ నిరుద్యోగమూ యెక్కువగా వున్నప్పుడు వకలాంటి రచనలకు ఆదరణ యెక్కువగా వుంటుంది.

యే రచనైనా సార్వజనీనమూ సార్వకాలికమూ కాగలిగితే, అందులో మనిషి మూల ప్రాథమిక స్వభావ లక్షణాలలో కొన్నిటనైనా కదల్చగలిగే శక్తి వుండి వుంటుంది.

యే దేశంలో ఐనా యే భాషలో ఐనా రచనలలో యెక్కువ మేరకి పాఠకులను 'కదిలించనివే' అనుకుంటాను. వాటిని నేను చెత్త రచనలు అనను. కాలక్షేపం పుస్తకాలుఅంటాను. సాధారణంగా, మనుషులకు బతుకులో కాలక్షేపావసరం వుంటూంటుంది. అలాంటి పుస్తకాలూ అవసరమే. పరమ దండగ పుస్తకాలు-అవి దేనిని గురించి ఐనా సరే,యెవరితోనూ చదివిపించలేని జిగటశైలి అనర్ఘరత్నాలు. (పుస్తకాల జోలికి పోనివాళ్ళైతే మరింకేదో వొక కాలక్షేప వ్యాపకం).

తదను గుణంగా గానీ వ్యతిరేకంగా గానీ 'కదిలించగలిగే' రచనలు చాలా అరుదు. వాటినీ వర్గీకరించితే, అందులో కొన్ని రకాలు యిలా వుంటాయి:

1. వకలాంటి అభిరుచిగల వక వయసు వాళ్ళని కదల్చగలిగేవి.

2. వకలాంటి అభిరుచిగల అన్ని వయసుల వాళ్ళనీ కదల్చగలిగేవి.

3. అన్ని అభిరుచుల వక వయసు వాళ్ళని కదల్చగలిగేవి.

4. పై మూడిటిలో దేనికో వొకదానికి దగ్గిరిగా వుండి కూడా భిన్న అభిరుచుల భిన్న వయసువాళ్ళని కదల్చగలిగేవి.

చలం కథలు నవలలు నాటకాలు— ప్రత్యేకించి యీ రెండో కోవకీ మూడో కోవకీ చెందుతాయనుకుంటాను. చలం కథలు నవలలు నాటకాలు— స్త్రీ పురుష సంబంధమైన సామాజిక సమస్యల గురించి వక అగాహన ధోరణి వున్న అన్నివయసుల వాళ్ళనీ, తొలి యవ్వనంలోని వాళ్ళనీ కదల్చకపోవటం చాలా అరుదు. నా లాగా కాక; విశ్లేషణ వివరణ అనుశీలన చాతయినవాళ్ళూ మేథావులూ పరిశీలించతగిన అంశం, యిది.

మనిషి జీవితంలో, తొలి యవ్వన దశ చాలా ముఖ్యమైంది. సాధారణంగా యీ వయసులోనే తన జీవితానికి సంబంధించి తొలీ వ్యక్త ప్రాతిపదిక లాంటిది యేర్పడుతుంది.

చలం పాత్రలందరూ,చలానికి ప్రతిధ్వనిలా;వొకేలాగా చలం భాషేమాటాడ తారని కొందరు పరిశీలకులు అంటూ వుంటారు. చలం సాహిత్యంలో, సాహిత్య సాంకేతిక లోపాలు చాలా వున్నాయనీ అంటూ వుంటారు. యిందులో కొంత నిజం లేకపోలేదు. చలం సాహిత్య శిల్పికాదు. ఆవతల కొంపలం కుంటున్నా యనే తొందరలాంటి రకరకాల మంటల వొత్తిడుల స్థితిలో వున్నవాడు, చలం. చలం, అవన్నీ పట్టించుకుని వుంటే; చలం చలం లాగా రాయకపోయీ వుండును. అప్పుడు, చలం మాత్రమే చలం లాగా కాక; యెందరో చలం లాగా రాయగలిగీ వుండును.

తన ప్రగాఢ భావనా దృక్పథాల సంగీతాన్ని అనుభూతించకండా గేలి చేయటంతో, (పాపం, 'స్వర'జ్ఞానం లేని వాళ్ళని జాలిపడకండా) సంయమనం కోల్పోయి యెడాపెడా వాయిస్తూ అపస్వరాలూ పలికించాడు *12.

---

12. "నన్నెప్పుడూ రెడ్ హాట్‌గా వుంచి యింకా బలమైనవి షాకింగ్‌గా రాయాలని ప్రోత్సహించినవి నాపై విమర్శలే" అని రాసుకున్నాడు, చలం, వకచోట. అప్పట్లో వక స్థాయి మనుషులు 'షాక్' చేస్తే తప్ప చలించకపోయీ వుండాలి.

"కల్పనా సాహిత్యం పాఠకులను నేరుగా వుద్రేకించేదిగా వుండకూడదు. వుద్దీప్తి కలిగించేదిగా వుండాలి. అది మేధా సంబంధిగా వుండక, సంస్పంద సంబంధిగా వుండాలి. నేరుగా ఆలోచనని రేకెత్తించేదిగా కాక, అస్తిత్వం అంతటినీ అనుభూతితో వుద్దీప్తంచేసి,అందులోంచి ఆలోచనను రేకెత్తించేదిగా వుండాలి.వ్యాసం నేరుగా ఆలోచనని రేకెత్తించటం సమంజసం." *13 వుద్రేకం (emotional feeling), క్షరింపులోకి దిగజారుతుంది. వుద్దీప్తి (Intense feeling) పరిపుష్టిలోకి యెదుగుతుంది.

చలం సాహిత్యం హృదయ సంస్పంద సంబంధి అనేది నిర్వివాదాంశం అనుకుంటాను. ఐతే అది యే మేరకి వుద్రేకించేదో, యే మేరకి వుద్దీప్తించేదో పరిశీలకులు తేల్చాల్సిన అవసరం వుంది.

* * * *

1980 చివర్లో యీ పుస్తకం మొదటి మూడొందల పేజీలు చదివి; చివరికి శర్మగారు చలం పట్ల మూఢభక్తి భావంలో కూరుకుపోతారేమోననుకున్నాను. యిప్పుడు పుస్తకం మిగతా 550 పేజీలూ చదివేసరికి శర్మగారు అన్నిట్లోనూ దిగుతూ తానుగా తేలుతూంటారని నిర్ధారణకొచ్చాను.

1962 ఆరంభంలో అష్టగ్రహకూటమి వల్ల ప్రళయం వొస్తుందంటూ నానా గొడవా చేసి చలం అపహాస్యం పాలయ్యాడు, పాపం. అదంతా సౌరీస్ బుర్రలోని సైకికల్ గలభా. ఆయనకేం తెలుసు సొంతగా! యిట్లాగూ అని యీశ్వరుడు అన్నారు— అని సౌరిస్ కాలజ్ఞానం వెల్లడించింది. తీరా అది జరగక పోయే సరికి చలానికి చాలాకోపం వొచ్చింది— "నేను Fanatical dupeగా కనబడుతున్నానని తెలుసు. కాని ఈశ్వరుడివాక్కులో నమ్మి అన్నినెలలూ పనిచేశాను. కాని యేప్రళయమూ రాలేదు,ఈశ్వరుడు తను ప్రళయంరాకుండాఆపానుఅన్నారు. నాకు ఈశ్వరుడి మాటల్లో నమ్మకం పూర్తిగా పోయింది."అని చలం చెప్పేశాడు. యీశ్వరుడి మాటలంటే, సౌరిస్‌లోంచి తనకు చెప్పే మాటలనిఅర్థం. "ప్రళయం వొచ్చింది ఈశ్వరుడు ఆపేశారు." అంది, సౌరిస్. చిన్నపిల్లల కబుర్లాటలలాగా వుంది. ప్రళయం వొస్తుంది గానీ ఆపేస్తాను— అనే చెప్పొచ్చుగా!

---

13. యీ వాక్యాలు, "నేనెలా రాస్తానంటే—" అనే నా వ్యాసం నుంచి.

యీ ప్రహసనం గురించి శర్మగారు రాసిన మాటలు యెంతో ప్రశంసనీయంగా వున్నాయి:

"అయితే ఆమె చెప్పిన మాటలన్నిటినీ, ఆమెకు వచ్చిన విజన్స్ అధారంగా నమ్మింది. ఈ క్రాసులూ, త్రిశూలాలూ చలం అనే తెల్లలాంచి కనబడటం యిదంతా ఆమె ఫాంటసీ— చలం చుట్టూ చేరిన వారంతా యెంత చదువుకుంటేనేమి సబ్ స్టాండర్డ్ మనుషులని యీ సంగతితో మనకు తెలిసిపోతోంది. ఆ నాటికే చలం శిథిలమవుతున్న జీనియస్. ఇటువంటి కంపెనీని ఎలా భరించాడా అని ఆశ్చర్యం వేస్తుంది. "మీరు వెధవలు, రోగ్స్" అని ముక్కు మీద గుద్ది వున్నది వున్నట్లు సొసైటీకి చెప్పిన చలం యిలా వూడల్ని దించేసి సౌరిస్ నేనే ప్రళయాన్ని ఆపు చేశాను అని అంటే విని ఎలా వూరుకున్నాడు? భగవాన్ యిలాంటి పని గాని ఎన్నడైనా చేశారా? యీ వుదంతాన్ని పెద్ద hoax అనవచ్చు. కాని వకసారి తను నమ్మాక చలం యెంత సిన్సియరో (to the point of ridicule) ఈ వ్యవహారం వక వుదాహరణ."

యిలాంటి హేల్యూసినేషన్స్‌తో, చలాన్ని (1965లో) సన్యసించమని యీశ్వరుడు చెప్పటం గురించి శర్మగారు రాసిన మాటలు మరింత ప్రశంసనీయంగా వున్నాయి:

"ఈ సన్యాసాశ్రమ దీక్ష చలం మీద రుద్దినట్లు కనిపిస్తోంది. ఇందులో మళ్ళీ యీయనకు ప్రత్యేకమైన మినహాయింపులు కొన్ని వేషధారణ ఆహారం విషయంలో యిచ్చారు. భగవాన్ వుంగరం గుర్తుచేసి యిమ్మని అడగటమేమిటి? గురుదక్షిణకోసం ఆయన తపించి సమాధిలోంచి లేచి సౌరిస్‌గారి విజన్స్ లోకి రావడమేమిటి? చలం సన్యాసాశ్రమం స్వీకరించినట్లయితే ఆయన పేరులో కూడ మార్పు రాలేదు. అంతేకాదు ఆయన పోయినప్పుడు ఖననం చేయించక దహనం చేయించారు. జీవితపంథాలో యే విధమైన మార్పు లేనప్పుడు చలానికి ఈ సన్యాస దీక్ష యివ్వడం ఏ పరమ ప్రయోజనం కోసం? చలం యే భయాలకు యెందుకు ఇలా లొంగిపోయాడు? భగవాన్ ఎవరికీ సన్యాసం యిచ్చినట్లు దాఖలాలు లేవు. చలానికి వక్కరికే ఎందుకు పిలిచి మరీ యివ్వడం? అది పొందాలని ఆయనకేమీ తహ తహ లేదే? ఇందులో ఈశ్వరుని వుత్సాహం యెక్కువగా

వుంది పర్యవసానంగా వక వెండి పళ్ళెం వక రవ్వల వుంగరం ఏమీ అక్కర లేని భగవాన్ పేరిట కాళ్ళొచ్చి యింట్లోంచి నడిచి వెళ్ళిపోయాయి."

యిలాంటిదే మరొక వుదాహరణ. ఆమె తల్లి మరణించగానే మళ్ళీ తాను (సౌరిస్) బతికించుకున్నట్లు చెప్పటం. వో కుర్ర డాక్టరమ్మ— వాళ్ళలో కలిసిపోయిన మనిషి-కి చచ్చిపోయిందనిపించిందిట. యిలాంటి డాక్టరు పొరపడటానికి అన్ని విధాలా అవకాశం వుంది. యీ మిరకిల్ గురించిన శర్మగారి మాటలు మరింకెంతో ప్రశంసనీయంగా వున్నాయి.

"రమణస్థాన్ షిప్‌కి కెప్టెన్‌గా గురువుగా 'షా' తన తల్లి చచ్చిబతకడానికి ఈశ్వర విలాసమే కారణమని ఆ అద్భుతాన్ని క్లెయిమ్ చేస్తున్నారు. యిది సైన్స్ హేతువాదం, శాస్త్రీయ దృక్పథంతో పరిశీలిస్తే నిలబడదు. 'షా' గురువు భగవాన్. ఆయన యిటువంటి మిరకిల్స్‌ని ఎన్నడూ క్లెయిమ్ చెయ్యలేదు."

ఆ యీ సందర్భాలలో శర్మగారి మాటలు ప్రశంసనీయంగా వున్నాయని ప్రత్యేకం యెందుకు అంటున్నానంటే—రమణమహర్షి ఆధ్యాత్మిక సాధననిగానీ ఆ మార్గంలో మరొకరి సాధననిగానీ శర్మగారు కొట్టిపారెయ్యలేదు. ఐనా వీటన్నిటినీ కాదన్నారు. ఆధ్యాత్మిక సాధన అస్తిత్వానుభూతిలోంచి జరుగుతుంది. సౌరిస్ చెప్పిన అవన్నీ హేల్యూసినేటరీ, అనస్తికమూ.

రచనలో సౌరిస్‌కి సొంత గొంతు లేనట్లే *14 'హొయ్యి' (డాక్టరు రంగ నాయకమ్మ) చనిపోయిన తరవాత నుంచి చలానికి సొంత అస్తిత్వం వున్నట్లనిపించదు.(కానీ అతను కడదాకా నిజాయితీగానే వున్నాడు). అతని జీవితపు ముప్ఫయ్యేళ్ళ ఆధ్యాత్మిక అధ్యాయం పెద్దకూతురు సౌరిస్ ఛాయగా భావిస్తాను నేను. చలం చనిపోయేనాటికి— షుమారుగా అతనికి యెనభయ్యేళ్ళు సౌరిస్‌కి అరవయ్యేళ్ళు).

---

14. శ్రీ వజీర్ రహమాన్ రాసిన "ఎచటికి పోతావీ రాత్రి" కావ్యం గొంతు కూడా చలానిదే. ఆ కావ్యకర్తకి చలమంటే వ్యక్తికంగానూ రచయితగానూ అపారమైన ఆరాధన వుండి వుండాలి.(అసలు కావ్యం పేరు,ఆ కావ్యంలోని భాషతో కలవదు. అది, మహాప్రస్థానంలో చరణం)

యీ ఆమెకి వొచ్చే యెప్పారిషన్స్, సైకికల్. పెరా సైకాలజీలో చెప్పే ESP లాంటి వనుకుంటాను. యోగులకీ ఋషులకీ అలవడే దృష్టత్వం కాదు. ఆమెవి హేల్యూషినేటరీ. వుత్త యెప్పారిషన్స్ విజన్స్ అనస్తికమూ—అని నాకు అనిపిస్తాయి. యిలా అని అదంతా వుత్త బూటకం (hoax) అనీ అనుకోను. అవి, వకలాంటి schizophrenic facts.

నేననుకోవటం, ఆమె వొకలాంటి యెలక్ట్రా కాంప్లెక్స్ మనిషనీ *15 వక లాంటి బిట్టర్‌నెస్ అంతరాంతరాలలో పనిచేసి, వొకలాంటి స్కిజోఫ్రెనిక్ సైకికల్‌గా తయారైందనీ, అలాంటి స్థితిలో సహజంగా అలవడే కొన్ని వైపరీత్య మానసిక సామర్థ్యాలతో వాళ్ళందరి పట్ల నిర్నాయక విధాతగా వ్యవహరించిం దనీ. చలం సౌరిస్‌లకు సంబంధించి యీ అంశాన్ని—తెలుగు సాహిత్య అను శీలకుల్లో మనోవైజ్ఞానిక రీతులన్నీ బాగా తెలిసిన వాళ్ళుంటే, పరిశోధించి పరిశీలిం చటం యెంతైనా అవసరం.

*        *        *        *        *

యీ పుస్తకంలో వున్న చలం ఫొటోలు చూస్తే—వివిధ సందర్భాలలోని బెర్‌ట్రెన్ట్ రసెల్ ఫొటోలు గుర్తొచ్చాయి, నాకు. కొన్ని ముఖ్య విషయాలలో స్వభావాంశాలలో వీళ్ళిద్దరికీ చాలా పోలికలున్నాయి. చాలా మంది భావించేలాగా చలానికీ డి. హెచ్. లారెన్స్‌కీ చాలా పోలికలున్నాయని నేననుకోను. లారెన్స్‌ది పత్నీత్వ జీవితం.

దీన్లో చలానికి జరిగిన తొలి సన్మానం (1967) అని వక ఫొటో వుంది. తొలి సన్మానం అంటే మరొక సన్మానమో కొన్ని సన్మానాలో వున్నట్లు అని

---

15. కాంప్లెక్స్ అంటే ప్రగాఢానురాగ బంధం అనికాదు. ఆ సందర్భా లలో ప్రవర్తన మామూలుగా వుండాల్సిన రీతిలో వుండలేకపోవ టం. తల్లిపట్ల కొడుకుకిగానీ తండ్రి పట్ల కూతురికి గానీ ప్రగఢాను రాగబంధం వుండటం యెలక్ట్రా కాంప్లెక్స్/ యీడిపస్ కాంప్లెక్స్ కావు. ఆ సందర్భాలలో ఆ కారణంగా కూతురుకి యే పురుషుడితోనూ కొడుకుకి యే స్త్రీతోనూ మామూలుగా వుండాల్సిన సెక్సు సంబం ధాలు పెట్టుకోలేకపోవటం ఐతేనే కాంప్లెక్స్ అవుతుంది.

పిస్తుంది. (ఐతే, తొలివలపు అని అనేప్పుడు మాత్రం తొలి అనే పదంలో సాధారణంగా యీ అర్థం వుండదనుకుంటాను). యిందులో చలానికి జరిగిన ఆ సన్మానం గురించీ వేరే సన్మానాల గురించీ యేమీ చెప్పలేదు. చలం వేదిక లెక్క సన్మానాలు చేయించుకున్నాడా? రమణస్థాన్‌కి అభిమానులు దండా శాలువా గట్రా పుచ్చుకుని అంత దూరం వెడితే (బహుశా వేయించుకోమని సౌరిస్‌కి యీశ్వరుడు చెప్పగా కావచ్చు) పోన్లే అని వేయించుకున్నాడా?

చింతాదీక్షితుల పుస్తకానికీ మహాప్రస్థానానికీ చలం పీఠికలు రమణస్థాన్‌లో రాసినట్లుగా వుంది దీన్లో. మహాప్రస్థానం పీఠిక వ్రాసే నాటికి 'రమణస్థాన్' యెక్కడిది? అప్పటికింకా చలం బెజవాడలోనే కదా వున్నది?

దీన్లో యీ పుస్తకం శర్మగారు 22-9-1982న ముగించినట్లు అచ్చుపడటానికి బదులు 22-9-1992 అని పడింది.

*　　　*　　　*　　　*　　　*

పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి వరస వేరు. సుబ్రహ్మణ్యశర్మలాగానూ, పురాణం సీతలాగానూ, పి. యస్. లాగానూ, 'పి' లాగానూ, పురాణం లాగానూ; కాస్త శ్రద్ధగా, కాస్త కొంటెగా, కాస్త తీపిగా, కాస్త కారంగా, కాస్త ఆదరంగా కాస్త అదిగా కాస్త యిదిగా-వాస్తవాన్నీ నిజాన్నీ విస్మరించకుండా—సుహృదయంగా సహృదయంగా రాస్తారు. చదివి; ఆనందించకుండానూ నిందించకుండానూ అభినందించకుండానూ వుండిపోతే; ఆ పాపం మనది!

ప్రగాఢమైన లోలోతుల ఆంతర్యపు అతి సూక్ష్మ మహా ప్రకంపనలనో మహా విస్తార కల్లోలాలనో గురించి చెప్పేప్పుడు; పాఠకులను ఆ లోతులకు తీసుకెళ్ళి ప్రత్యనుభూతించేలా అందరూ రాయ (ు) నూ లేరు; అందరూ వెళ్ళ(ు)నూ లేరు.

వుపరితలం (మీద వున్న) పాఠకులను లోలోతులకు దిగమని యిబ్బంది పెట్టకుండా, ఆ లోలోతుల ఆంతర్యపు సాంద్రత ఛాయను వుపరితలానికి లాగి ఆ పాఠకుల చుట్టూ ఆ గాఢత్వపు లోలోతుల వునికిని కల్పించటం; చలం ప్రత్యేకతా అసాధారణ ప్రతిభా.

అనుభూతి సాంద్రత లోంచి యింకించుకోవటం కాక; 'విషయం తెలుసుకునే' అభిరుచి పాఠకులకు బాగా వుపకరించేలాగా అలాంటి వాటిని కూడా వుపరితలానికి గుంజుకొచ్చి యిట్టే 'తెలిసే'లా రాయటం సుబ్రహ్మణ్య శర్మగారి ప్రత్యేక పద్ధతి, యీ రకం పుస్తకానికి, ఆ రీతి చాలా అనుకూలంగా వుంటుంది. శర్మగారి శైలి గాఢంగానూ లలితంగానూ ఆహ్లాదంగానూ వుంటుంది.

మచ్చుకి వో పది వంక్తులు—

చలం "యెవరని తెలిపేది" అని ప్రశ్నిస్తూ—

"చలం ఎవరు అనేది నేనెవరు అనే ప్రశ్న అంత జటిలం. బాల్యంలో చలం వేరు. బ్రహ్మసమాజంలో తిరిగిన చలం వేరు. చిత్రాంగి, పురూరవ, జయదేవ, హరిశ్చంద్ర రాసిన చలం వేరు. మైదానం, బ్రాహ్మణీకం, హంపీకన్యలు-యిత్యాది నవలలూ కథలూ రాసి ఆంధ్రదేశాన్ని మంచికో, చెడుకో, అటూ యిటూ తీవ్రంగా వూపించి సంచలనం రేపిన చలం వేరు. అయినప్పటికీ అతని జీవితం అతని సాహిత్యం, అతని ఆలోచనలు, అతని ప్రణయతత్త్వం, అతని స్త్రీ వ్యామోహం, అతని ఆదర్శాలు, అతని విసుగు, అతని కోపం, అతని నిరాశ అతనినిస్పృహ, అతనిఆనందం, అతనివిషాదం అన్నీకూడా నలుగురితో పంచుకుని జీవించాడు. చలం నైతికంలోనూ ఆధ్యాత్మికంలోనూ కూడా తీవ్రవాదే. మహాప్రస్థానానికి పీఠిక రాసిన చలానికీ, భగవద్గీతకు వ్యాఖ్యానం రాసిన చలానికీ తేడా లేదనుకోవటం వెర్రితనం. కొన్ని నియమాలకీ కొన్ని సూత్రాలకీ, కొన్ని పడికట్టు రాళ్ళకీ, కొన్ని ప్రమాణాలకీ నిలవలేకపోయినంత మాత్రాన అతను అనార్కిస్ట్ కాడు. వున్నతమైన స్వేచ్ఛకోసం కలలుగని తపించి బాధపడినవాడు..................యిప్పుడు చలం యెవరంటే.... ........ "వెలుగు నీడల వైపు వేలు చూపింతు."

చలాన్ని చలం సాహిత్యంతో కలిపి వొకే అంశంగా భావన చేసి అనుశీలనంగా రూపొందించి, సహృదయ సుహృదయ సాహిత్యాభిలాషులకు అందించటానికి సుబ్రహ్మణ్యశర్మగారు తన సహజ రాగద్వేష సమతూకంతోనే ప్రయత్నించారు.

యీ పుస్తకంలో శర్మగారి రైటరుతనం కంటే యెడిటరుతనం యెక్కువగానూ శ్రేష్టంగానూ వుందేమో అనిపించింది. యీ పని, కావాలని అనుకుని చేసినట్లుగా అనిపిస్తుంది. తను తక్కువగా రాసి, పాఠకులకు భిన్న దృక్కోణాల నుంచి చూసే అవకాశం కల్పించదలచినట్లు అనిపిస్తుంది. యెంతో సమాచారాన్ని యెన్నో విషయాలను సేకరించి తవ్వి జమచేసి—చలం జీవితానికీ సాహిత్యానికీ అనుగుణ్యంగా యెడిట్ చేశారు. పాఠకులకు- ఆలోచనలను రేకెత్తించేలాగా, తను అంతర్లీనంగా బిగించిన సూత్రం ద్వారా పరిశోధనలకూ అన్వేషణలకూ అవకాశం కల్పించేలాగా సోర్స్‌బుక్ లాగానూ కూర్చిన శర్మగారి నేర్పు శర్మగారికి మాత్రమే సాధ్యమేమోననిపిస్తుంది యిలా రాస్తూ కూడా— అవగాహన, దృష్టి, పరిశీలన, విమర్శ, సమన్వయం, విశ్లేషణలతో తానుగా వక నిబద్ధవైఖరినీ అందించారు.

చలం చనిపోయిన సందర్భాన్ని కేంద్ర బిందువుగా చేసి, ముఖ్యంగా ఆ సందర్భంలో పెల్లుబికిన అపూర్వ సంచలనాన్నీ, వొచ్చిన వార్తలనూ రచనలనూ ఆవరణగా యేర్పరిచి చలంలోకి దృష్టి సారించారు

తిరగాబోర్లా వేస్తూ పునరుక్తిగా రాసినట్లుగానూ, సర్వజ్ఞతగా శాశించినట్లుగానూ, అంతా తన లోంచే పిండినట్లుగానూ, కాకండా; సాహితీపరుల భిన్నాభిప్రాయాలను అనుసంధానిస్తూ తన సొంత అవగాహన సారాన్ని అందించటం శర్మగారి విలక్షణత.

దీన్లో జర్నలిస్టిక్ మసాలా కూడా వుంది రవంత. ఐతే అది, సాహిత్య ప్రమాణాన్ని దిగజార్చని పాత్రికేయధోరణిలో వుండటం, ప్రశంసనీయం.

చలం సాహిత్యం గురించీ జీవితం గురించీ యెంఫిలులూ పిహెచ్. డి.లకి టాపిక్స్ యెంచుకోటానికి పనికొచ్చే మేత దీన్లో కొంత వుంది. థీసిస్‌లు రాసుకోటానికి వుపకరించే సమాచారం కూడా వుంది. ఐతే అన్నంకంటే ఆవకాయ యెక్కువ అన్నట్లుగా, పుస్తకం మూడొంతుల మేరకి అధోజ్ఞాపికలు చిట్టాలు జాబితాలతో నింపి అసలు విషయం అసమగ్రఅస్పష్ట ముకుళితావస్థలో వుంచకపోవటం ముదావహం.

యిది "తెలుగు వెలుగు చలం" అనే పేరున; [వో ద్రష్టగా స్రష్టగా] చలం గురించి రాసిన పుస్తకమే ఐనా అతని సృష్టిని మరికాస్త అనుసంధానించి రాస్తే మరికాస్త బావుండేది 16*.

మంచి పుస్తకం గురంచి మరీ మంచిగా రాయటం యేమంత మంచి కాదు. ఆ మాట పాఠకులు తమకి తాముగా అనుకునే అవకాశం లేకండా చేసినట్లవుతుంది. అంచేత వో వీడ్కోలు వాక్యంతో ముగిస్తాను: విశ్వవిద్యాలయాల పరిశోధన గ్రంధాల్లాగా; 17* యిది కేవలం కోకడాబుది కాదు. నామాట అవునో కాదో నిర్ధారించుకోటానికి, మరి మీరూ లోపల చూడాలి.

హి.మో.హ.స.ద.నం.
17-1-81; 5-11-82. }

వడ్డెర చండీదాస్

16. జర్నలిస్ట్ని కదా అంత స్తిమిత వ్యవధానం చిక్కటం కష్టం- అని గానీ అంటున్నారా శర్మగారూ! అవును, యిక్కడికే తొమ్మిది వందల పేజీలు ఐంది యీ పుస్తకం. పోన్లెండి; విశ్వవిద్యాలయాలకో ప్రభుత్వ అకాడెమీలకో కొంత నిధి వెచ్చించి కొండను తవ్వి యెలకను పట్టే అవకాశం దక్కింది.

17. కొన్ని సాధారణీకరణలకి మినహాయింపులు వుండనూ వొచ్చునని యింతకు ముందే మనవి చేశాను.

# ఓ నిమిషం ఓ మెరుపు

చలంగారి గురించి ఆలోచిస్తూ వుంటే "ఎప్పుడు ఆయన్ని చూశానా? ఎప్పుడు ఆయన్ని గురించి తెలుసుకున్నానా" అంటే లీలగా 1940-41లో నేను ఫోర్త్‌ఫారం చదవడానికి ఏలూరు ర్యాలి శేషగిరిరావుగారింట్లో అగ్రహారంలో వున్న రోజులు గుర్తుకొస్తాయి.

ఆ రోజుల్లో చలంగారు గవర్నమెంటు ట్రెయినింగ్ స్కూలు టీచర్‌గా ఏలూరు వచ్చారు. మా పెదనాన్నగారు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ చేసి

నెల్లూరు నుంచి కాబోలు ఏలూరు ట్రెయినింగ్ స్కూలుకి టీచర్‌గా ట్రాన్స్‌ఫరై వచ్చారు. మా పెదనాన్నగారికి అనీబిసెంట్ థియోసాఫికల్ సొసైటీలో సభ్యత్వం. ఏలూరు వై. యం. హెచ్. ఎలో మెంబర్‌షిప్ ఉన్నది. ఆయన ఇంట్లో ఎర్ర పంచెలు కట్టుకుని, ఉదయం "మార్నింగ్‌వాక్"కి వెళ్ళి సుందరకాండ పారాయణం చేసి కాఫీ తాగేవారు. హిందూ పత్రిక చదివేవారు, సంసారంలో ఉంటూ ఆ సంసారానికి అతీతంగా ఉండేమనిషి ఆయన. మాబోటి చిన్న పిల్లల్ని తప్ప మా దొడ్డమ్మనితప్ప ఇతరులెవ్వర్నీ ఆయన పలకరించి ఉండరు.

ముఖమల్ టోపీ, మంచి ఖరీదైన కోటు, ట్విల్ షర్ట్‌లు, గ్లాస్కో పంచలు. ఆఫ్ బూట్లు; వాకింగ్ స్టిక్ ఇదీ ఆయన రూపం. ఆయన కోసం మా ఇంటికి గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు, భమిడిపాటి కామేశ్వరరావుగారు, చింతా దీక్షితులు గారు వచ్చేవారు. అలాగే చలంగారిని కూడా అప్పుడప్పుడు మా ఇంటికి తీసుకు వస్తుండేవారు. దీక్షితులుగారే మా పెదనాన్నగారిని తిరువణ్ణామలై తీసుకు వెళ్ళారు అనుకొంటాను.

## రమణ మహర్షి

చలంగారితో మా పెదనాన్నగారికి గల కామన్ సబ్జక్ట్ "రమణమహర్షి—తిరువణ్ణామలై". నెల్లూరులో వుండగా 1935-36 ప్రాంతాల్లో చలంగారిలాగే మా పెదనాన్నగారు తిరువణ్ణామలై వెళ్ళి వస్తూండడం, అలాగే మా నాన్నగారు, మరో పెదనాన్నగారు కూడా అన్నగారి అడుగుజాడల్లో నడుస్తూ పది రూపాయల బైరాగి టిక్కెట్టుకొని తిరువణ్ణామలై వరకు వెళ్ళి వచ్చేవారు.

1941లో కాబోలు టాగోర్ పోయారు. మా యింట్లో దీక్షితులుగారి సాహిత్యం, కామేశ్వరరావుగారి పుస్తకాలు, చలంగారి పుస్తకాలు ఎక్కడ పడితే అక్కడ దొర్లుతుండేవి. ఆ రోజుల్లో పాపులర్ రీడర్ షిప్‌ని సృష్టించినవారు ఇద్దరే ఇద్దరు చలం, కొవ్వలి. చలంగారు మా ఇంటికి ప్రక్క వీధిలో మేడమీద చిన్న వాటాలో ఉండేవారు. భగవాన్లు అని మా ఇంట్లో ఒక వారాల అబ్బాయి వుండేవాడు. అతనికి టైపు వచ్చు. ఆ రోజుల్లో భగవాన్లు చలంగారు ఇంగ్లీషులో వ్రాసిన ఒక నవలను టైపు చేస్తూ వుండడం నేను ఆసక్తిగా గమనిస్తూ ఉండేవాణ్ణి. బహూశా ఆ నవల అరుణకు ఇంగ్లీషు వెర్షన్ కావచ్చు. అటువంటి రోజుల్లో ఒకసారి ఏదో లైబ్రరీ

పుస్తకం ఇవ్వడానికి నేను చలంగారింటికి వెళ్ళాను. ఆయన మేడమీద లోపల ఏదో రాసుకుంటున్నారు. వరండాలో చిత్రగుప్త పక్ష పత్రిక పడి వుంది. అందులో ఆయన వ్రాసిన "దొంగలున్నారు జాగ్రత్త" అన్న కథను నేను చదివి చాపమీద పడి దొర్లుతూ పకపకా నవ్వాను. మరొకసారి చలంగారిని మా పెదనాన్నగారు మా ఇంటికి భోజనానికి పిలిచారు. అప్పుడు మా అమ్మ ఆయనకు వంటింట్లో భోజనం పెట్టనని మా పెదనాన్నగారితో అంది. ఆయనతో అంత మాట అనగలిగినవారు మా ఇంట్లో ఎవరూ లేరు. ఆయనకు ఎక్కడ పెడితే నాకూ అక్కడే పెట్టు అని వంటింట్లో కాకుండా దేవుని గదిలో పీటలమీద కూర్చుని వారిద్దరూ భోంచేశారు. ఆవేళ నేను చలంగారిని మా యింట్లో నా ఎదురుగుండా పడక్కుర్చీలో కూర్చున్నప్పుడు చూశాను. గుండ్రటి పచ్చటి మొహం, క్రాఫింగ్, గోటు వేసిన కాలర్ చొక్కా—ఎర్రగోటు కాబోలు—ఒక గ్లాస్కో వాయిల్ చీరను లుంగీగా కట్టుకొని కూర్చున్నారు. చేతికి మల్లెపూలదండ చుట్టుకొని ఉన్నట్లు జ్ఞాపకం. మాఅమ్మా వాళ్ళూ చాటుగా చూసి వంటింట్లో పడి పదేపదే నవ్వడం నాకింకా గుర్తుంది. ఆయన్ని ఒక తిరుగుబాటుదారుగా కాక ఒక ఎక్సెంట్రిక్‌గా చూసేవారు. ఆ రాత్రి ఆయన మా మేడమీద గదిలో పడుకున్నారు. నేను ఆయనకి సాయంపడుకున్నాను తెల్లారగట్ల లేచి ప్రాణాయామం చేసి ఆయన కొంతసేపు మౌనంగా ఏదో ప్రార్థన చేసుకొన్నట్లు గుర్తు. అప్పుడు ఆయన, నేను, మా పెదనాన్నగారు పంపుల చెరువు గట్టుకి మార్నింగ్ వాక్‌కి వెళ్ళి అక్కడే కాలవలో స్నానాలు చేసి తిరిగివచ్చాము. ఆ తరువాత నాకు చలంగారు మళ్ళీ బెజవాడ వచ్చేదాకా కనపడలేదు.

బెజవాడలో 1945-46 సంవత్సరంలో నేను ఇంటర్మీడియట్ ఫస్టియర్‌లో కాలేజికి వెళ్ళడానికి బల్లకట్టు లేనప్పుడు చుట్టు తిరిగి రైవీస్ కాలవ వంతెన దాటి వెళ్ళేపుడు రోజూ ఉదయమో, సాయంత్రమో ఆయన నాకు వంతెన మీద క్రాసు అయే వారు.

## అట్లు తినే అర్హత

తెల్లచొక్కా, పంచె, గుండ్రటి మొహం, గ్రూచోమార్క్స్ మీసకట్టు కొంచెం పొట్టిగా ఆయన ప్రపంచంలో ఆయన వుండేవారు. మితభాషి. ఎప్పుడూ ఎవ

రితో ఎక్కువగా మాట్లాడే వారుకాదు. సొసైటీతో చెప్పుకోదగ్గ రాజకీయ అనుభవాలు కాని, అనవసరమైన బిజీ ఇన్‌వాల్వ్‌మెంట్స్‌గాని ఆయనకు లేవు.

చలంగారి క్లాసులో చదువుకున్న భగవాన్లు ఒకమారు నాకో సంగతిచెప్పాడు. ఆ రోజుల్లో అట్లతద్దికి, ఉండ్రాళ్ళతద్దికి నోములు నోచుకున్న కొంతమంది బ్రాహ్మణ స్త్రీలు, స్కూళ్ళనించి ఉండ్రాళ్ళు తినేందుకు బ్రాహ్మణపిల్లలని తీసుకు రమ్మని వాళ్ళ వాళ్ళని తెగపోరేవారు. భగవాన్లుతో ఉండే ఎర్రటబ్బాయి అలాఅట్లు తినడానికి వెళ్ళి క్లాసుకి లేటుగా వచ్చాడు. అది చలంగారి క్లాసు. "ఆయన ఎందుకు లేటుగా వచ్చావు" అని అడిగారు. ఫలానా వారింటికి వెళ్ళి అట్లనోము అట్లు తిని వచ్చానని చెప్పాడు. చలంగారికి కోపం వచ్చింది. ఆ క్లాసులో ఎంతమందివున్నారో అంతమందికి అన్ని అట్లు చేయించి పట్టుకొచ్చిందాకా నిన్ను క్లాసులోనికి రానివ్వనని అన్నారు. అంటే క్లాసులో అంతమంది పిల్లలకు అట్లు తినాలనే కోరిక వుంటే బ్రాహ్మణపిల్లలకే అట్లు తినే అర్హత వుండడం ఏమిటని?

అందరికంటే చలంగారితో మా పెదనాన్నగారివంటి కన్సర్వేటివ్ పెద్ద మనిషికి అంత స్నేహం ఉండడం నాకిప్పటికీ ఆశ్చర్యకరమైన విషయం. భోజనం అంటే ఆయనకి వంటింట్లో పెట్టలేదుకాని, చలంగారి పుస్తకాలన్నీ మా ఇంట్లో మా పెద్దమ్మ చదివేది. చదివిన తరువాత పుస్తకాలన్నీ ఒక అలమారలో పెట్టి మా వదినగారు— అప్పటికి ఆమెకు 16-17 ఏళ్ళ వయస్సు—తాళం వేసేది. ఆమె మధ్యాహ్నం నిద్రపోయినపుడు తాళం ఎలాగోలా సంగ్రహించి, పుస్తకాలు మేడమీదకు పట్టుకుపోయి చదివి, తిరిగి లోపల పెట్టి తాళం వేసేవాడిని.

ఒక చెంపన కౌవ్వలి వారి సాహిత్యం, మరో పక్క చలంగారి సమ్మోహనకరమైన కథలూ గట్రా ఆ వయస్సులో చదివేవాణ్ని. కర్మమిట్లా కాలింది, రెడ్డి రంగమ్మ, ప్రేమ లేఖలు, అరుణ ఇట్లాంటివన్నీ ఆ రోజుల్లో చదివాక నాకూడా కథలు రాయలనే సరదా పుట్టి ఏవేవో రాసి మా పెద్దమ్మకి చూపిస్తూ ఉండేవాణ్ని. ఆ రోజుల్లోనే అలా ఒక కథ రాసి పూర్తి చేసినపుడు ఆ కథను నన్నే చదవమని చెప్పి, మా పెద్దనాన్నగారి ముందు కూర్చో పెట్టి వినిపించింది. ఆయన ఎదురుగా కూర్చుని నేను వ్రాసిన ప్రేమకథను చదివి వినిపించాను. అపుడు ఆయన నా

ఎడ్వంచర్‌కి తుళ్ళి తుళ్ళి నవ్వారు. నేనంటే ఆయనకు ఎంతో ఇష్టం. బహుశా ఆ ముహూర్తానే నేను కథకుణ్ణయి వుంటాను.

## చలం ముందు

చలంగారి కథల ప్రభావం నాలాటి ఫోర్త్ ఫారం చదువుకునే కుర్రాళ్ళ మీద ఎలా పనిచేసిందంటే—మనం కూడా లవ్ స్టోరీస్ వ్రాయాలనే తపన, రాయడం చాలా తేలిక అనేటువంటి భావన కలిగించాయి. ముఖ్యంగా చలం కొవ్వలి వంటి పాప్యులర్ రచయితలు సాహిత్యాన్ని జీవితానికి దగ్గరగా తీసుకు వచ్చారు. చలం తెలుగు దేశానికి ముందుగా పుడితే విశ్వనాథవారు చాలా లేటుగా పుట్టారు. 1920లు, 1940 మధ్య కాలంలో ఇపుడు చలం సాహిత్యం అంటున్న యావత్తు సాహిత్య సృష్టి జరిగింది. చలంగారు ఎందుకు ముందుగా పుట్టారన్నా నంటే చలం సాహిత్యం ద్వారా, జీవితం ద్వారా తీసుకు వచ్చిన విప్లవానికి ఆంధ్ర దేశం అప్పుడు పరిపక్వమయి రెడీగాలేదు. వీరేశలింగం పంతులు గారు, రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు మొదలైన సంస్కర్తలు ప్రారంభించిన ఉద్యమానికి క్లైమాక్స్, ఏంటీక్లైమాక్స్ చలంగారే. చలం విజృంభించి ఆంధ్రదేశంలో కథలు వ్రాసి జనం మొహం మీద విసిరేస్తున్న కాలంలోనే శరత్‌చంద్ర ఛటర్జీ బెంగాలీలో పుంఖాను పుంఖంగా కన్సర్వేటివ్ దృక్పథంలో నవలలు రాస్తున్నాడు.

## బెటర్‌దేన్ శరత్

శరత్ సాహిత్యం చదివాక, చలం సాహిత్యం చదివితే 'చలం బెటర్ దాన్ శరత్' అని తప్పక ఏ మాత్రం ఇంగితజ్ఞానం ఉన్న సాహిత్యకారుడైనా ఒప్పుకు తీరాలి. చలం తీసుకు వచ్చిన ఉప్పెన ఈ మాత్రం ఆ మాత్రం కాదు. మొత్తం ఆంధ్రదేశపు మధ్యతరగతి ఆరాధించే విలువలన్నింటిని తూర్పార పట్టాడు. చలం కవుల్నీ కవుల నడవడినీ అన్నింటినీ వెక్కిరించాడు. అయితే చలంగారి సాహిత్య విప్లవం కూడా ఒక అసంపూర్ణ విప్లవమే.

## భావవిప్లవానికి ఆహ్వానం

చలం అంతర్ముఖుడని ఇదివరకు చెప్పుకున్నాము. ఆయన బాల్యంలో పెరిగిన వాతావరణం, ఆయన తల్లిదండ్రుల ప్రభావం, ఆయన కుటుంబజీవితం

ఆయన్ను పోరాడే వ్యక్తిగా మలచినవి. ఆయన ఆత్మకథ పూర్వ భాగాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే చాలా చిన్నప్పట్నుంచి ఎక్కువ ఆరోగ్యవంతుడైన పిల్లవాడు కాదని, ముఖ్యంగా తండ్రి చేత హింసలు పడిన బాలుడని తెలుస్తుంది. చిన్నతనంలో ఆయన ఎక్కువగా ఆడపిల్లల కంపెనీలో గడిపాడు. వారితోనే ఆడుకున్నాడు. తనూ ఒక ఆడపిల్లలా వారి మనస్తత్వాలని ఆకళింపు చేసుకున్నాడు. అయితే బాల్య దశలో తనతో ఆడుకున్న ఆడపిల్లల దుస్థితి, బాల్యవివాహాల ప్రభావం వలన వారు పడే అగచాట్లు ఆయనకు చాలా పెద్ద షాక్ కలిగించాయి. అవిద్య, అజ్ఞానం, మూర్ఖత్వం, బ్రాహ్మణకొంపల్లోని మడులు, ఆచారాలు, పూజలు, పాతుకు పోయిన మూఢనమ్మకాలు అన్నీ ఆయనను స్త్రీల పక్షాన నిలిచి వకాల్తా తీసుకొని పోరాడమని ప్రేరేపించాయి. ఇది సామాన్యమైన ప్రేరణ కాదు. ఆ ప్రేరణ వెనుక తెలుగు దేశంలో ఆనాటి మధ్యతరగతి మేధావి వర్గం, ముఖ్యంగా కాకినాడలో, రాజమండ్రిలో సంఘసంస్కరణ పతాకాన్ని ఎగురవేస్తోంది. అటు విజయనగరంలో గురజాడ ప్రారంభించిన సాహిత్య విప్లవం క్రమంగా వచ్చి చలంలో కలిసింది. చలం వెనుక ఇంత ప్రిపరేషన్ ఉంది. ఆయన భావవిప్లవంపై పురథాన్ని తోలుతున్నాడు.

## ఎగ్నాస్టికుడు

ప్రారంభంనుంచి చలం ఆస్తికుడే. అయితే ఆయన అనేక సందర్భాల్లో ఆవేశంతో, కోపంతో తర్కం వచ్చినపుడల్లా ఈ లోకంలోని దుర్మార్గాలకీ, దౌష్ట్యానికీ భగవంతుడిని శపిస్తూ, ప్రశ్నిస్తూ వచ్చాడు. ఆయన భగవద్భక్తి ఆయన విశ్వాసం మతపరమైనది కాదు. భగవంతుడిని ఆయన కులమతాలకు, ఆచారాలకు, కర్మకాండలకు అతీతంగా భావించాడు. అందులోనూ పరమ స్వేచ్ఛావాది.

చలం అప్పట్లో ఎగ్నాస్టికుడేకాని నాస్తికుడు కాదు. ఆయనకు ముఖ్యంగా బ్రాహ్మణకుటుంబాల అజ్ఞానంపై తగని ద్వేషం. వారి అజ్ఞానాన్ని, వారి మూర్ఖత్వాన్ని ఆయన సహించ లేక వారి మీద కోపం తెచ్చుకొని, కసితో ఆ సంఘానికి షాక్ ఇచ్చేలా కొన్ని రచనలు చేశాడు. కేవలం బ్రాహ్మణకుటుంబాలేకాక మొత్తం తెలుగు వారు, తెలుగు సంఘం అంటే ఆయనకు చివరివరకు ద్వేషం, అసహ్యం, కోపం. సంఘాన్నీ పరిస్థితుల్నీ మార్చడానికి కావలసినంత కోపం సంఘం మీద రావల్సిందే

కాని, అట్లా సంఘాన్ని ద్వేషిస్తూ దానితో సెన్సాఫ్ బిలాంగింగ్‌నెస్ లేకుండా దాన్ని మార్చడం, మార్చడానికి ప్రయత్నించడం సాధ్యంకాదు. చలంగారికి ప్రకృతి వ్యామోహం కూడా హెచ్చు. ఆయన తన రచనల్లోనూ, జీవితంలోనూ ప్రకృతిని చూసి ఉద్వేగాన్ని పొందేవాడు. అందులో లీనమై పోయి 'ఆకులో ఆకునై' అన్నట్లు ఉండేవాడు. ఐహిక విషయాల మీద నిరాసక్తత, ఒక విధమైన కేర్‌లెస్‌నెస్ ఆయనకు ఉండేవి. ఆయన స్త్రీలను, పిల్లలను, కళలను ప్రేమించి ఆరాధించినట్లుగా దేశాన్ని, దేశభక్తుల్నీ ఆరాధించలేదు.

చాలా చిత్రమైన విషయం ఏమిటంటే. విద్యా విధానాల్ని, పాఠ్యపుస్తకాల్ని, స్కూళ్ళని, చదువులనీ చిన్నప్పట్నుంచీ ద్వేషించే చలం వృత్తి రీత్యా రిటైరయ్యే వరకు ఉపాధ్యాయుడుగా జీవించవలసి రావడం.

ఆయన నేచర్‌లో పైకి కనపడే విశృంఖలత్వాన్ని ప్రేమించాడు. కాని నేచర్‌లోనిలాస్‌ని, బ్యాలెన్స్‌ని ఆయన అప్పట్లో గుర్తించినట్లు కనపడదు. నేపథ్యం ఎటువంటిదైనా చలం నిర్వహించినది "వన్‌మాన్‌షో" ఆయన ఒక రెస్ట్‌లెస్‌మాన్. అన్నిటిని తరచి ప్రశ్నించే ఒక శక్తి ఆయన.

## మారే చలం

చలం గారిది చాలా సబ్జెక్టివ్ మూడ్. ఆయన తనకి ఆ నిమిషంలో ఏ అనుభవం కలిగితే దాన్ని గురించి విశ్లేషిస్తాడు. అంటే ఆయన భావాలుగాని, అభిప్రాయాలుగాని అక్కడక్కడా పరస్పర విరుద్ధంగా ఉండడానికి ఈ సబ్జెక్టివ్ మూడ్ కారణం. ఆయన తాను ఎదుగుతూ, ఒక కాంట్రడిక్షన్ నుంచి మరొక కాంట్రడిక్షన్‌కు మారుతూ వచ్చాడు. జాగ్రత్తగా గమనిస్తే పురాణాల్ని, రామాయణ భారత కథల్ని వెక్కిరిస్తూ, వాటిని తిరగేసి బోర్లిస్తూ ఇప్పటి రచనా ప్రమాణాలతో విమర్శిస్తూ రాయడం ఆయన తెలుగు దేశానికి అలవాటు చేశాడు. తెలుగులో ప్రేమకథలను తేలిపోవడాల్ని బట్టబయలు చేసింది చలమే.

## కొసమెరుపు చలం

ఒక సమాజం శిథిలమై నాశనం అవుతున్నప్పుడు దాని పునరుత్థానానికి కావలసిన వ్యక్తుల్ని అదే సృష్టించుకుంటుంది. జీవితంలోనూ, సాహిత్యంలోనూ,

కూడా అంతే. గురజాడ, గిడుగు, వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నం నాయుడు ఇలా వచ్చిన కారణజన్ములే. వీరందరికీ కొసమెరుపు చలం. చలం తన రచనల ద్వారా వ్యావహారిక భాషోద్యమానికి గొప్ప మేలు చేశాడు. తెలియకుండానే భాషా సంస్కరణ ఉద్యమ చరిత్రలో ఆయన పెద్దపీఠం అధిష్ఠించాడు. చలం శైలిని మెచ్చుకొన్న వారిని ఆయన స్వయంగా నిరసించినా అది నయాగరా జలపాతం లాంటిది. ఆయన భావాల్ని వ్యక్తం చేయడంలో ఆయన భాష ఆయనకు గొప్ప ఆయుధంలా పనిచేసింది. సాహిత్యంలో మార్పులు వస్తున్నప్పుడు దానికి అనువైన భాషా విప్లవం దాంతో బాటే వస్తుంది. ఉదాహరణకి చలంగారి కథలతో చలంగారి భాష ఏర్పడింది. అలా ఏర్పడడం ఒక భాషా విప్లవం, అలాగే చలంగారు తన వాక్య నిర్మాణానికి అనుగుణంగా పదాలను విరిచి, ఒలిచి వాటిని శక్తివంతం చేశాడు. ఆయా భావాల ఫోర్సును తట్టుకుందుకు ఆ పదాలు, గ్రామరు ప్రక్కకు తప్పుకున్నాయి. "వస్తో, పోతో, చేస్తో" ఇలాటి అక్షర వికారాలన్నీ ఆయన సాహిత్య ప్రకి్రియలో భాగం అనుకొని వాటిని కూడా అనుసరించిన వారు తెనాలి మొదలు విశాఖ వరకూ ఉన్నారు.

## జిజ్ఞాసువు, రెబెల్

చలంగారు నోటికీ, చేతికీ అడ్డులేని కాస్త ఉన్నత మధ్యతరగతి కుటుంబం లోనే పుట్టాడు. వాళ్ళ నాయనగారు ఇంచుమించు ఇల్లరికపు టల్లుడే. వారి తాతగారు చలంగారిని చాలా ముద్దుగా చూసుకున్నారు. చదువుకునే కాలంలో ఉన్నత విద్యాభ్యాసానికి వెళ్ళిన సందర్భాల్లో సంప్రదాయ జీవితానికి భిన్నంగా ఒక రెబెల్‌లా జీవించాడు. దాంతో ఆయనంతట ఆయనే కుటుంబంతోనూ, ఆ తర్వాత సంఘంతోనూ తెగతెంపులు చేసుకోవలసి వచ్చింది. ఆ కసితో ఆయన డబ్బు ఇబ్బందుల్ని పేదరికాన్ని కోరి ఆహ్వానించాడు. స్త్రీ సంబంధమైన జిజ్ఞాస ఒకటి ఆయన్ని ఆవహించి వుంది. చలం ఎంత తీవ్రవాది అంటే సంస్కరణ ఒక ఉద్యమంగా సాగుతున్నప్పుడు అందులో వచ్చే విపరీతమైన సమస్యలనుబట్టి ఆ వుద్యమ ధోరణులను, వాటి వైఫల్యాలను అప్పటి కప్పుడే తన రచనల ద్వారా విమర్శించేవాడు. ఆయన గోల అంతా ఆయన లోంచి పుట్టిందే. అయితే దానికిగల కారణాలు బయట సంఘంలో వుండవచ్చు.

## సంఘంతో సాయుధ పోరాటం

చలం తన జీవితానికి తన సాహిత్య కృషి మొదట్లో సెకండరీగానే భావించాడు. ఆయన కథలన్నీ జీవుని వేదనలే. తన కథలు పాఠకుల్లో సంచలనం సృష్టిస్తున్నాయని,తనని తిడుతూ విమర్శిస్తూ రహస్యంగా చదివి ఆనందిస్తున్నారని గుర్తించాక చలం తన కలంతో, సంఘంతో సాయుధ పోరాటం సాగించాడు. తన కలం బలం తెలిశాక దాని శక్తితో ఆటలాడుకొన్నాడు. సంఘం మీద తిరుగుబాటు చేసి తన జీవితాన్ని తన ఇష్టం వచ్చినట్లు నడుపుకుంటూ పరోక్షంగా సాహిత్యాన్ని కూడా ఆయన కొత్త దారుల వెంట నడిపించాడు.

ఆయన జీవితానికి ఆయన రాసిన సాహిత్యం సెకండరీ కాగా, దాని కోసం ఆయన ఒక తాత్వికమైన బేస్‌ను కూడా ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. ఏ సాహిత్య వుద్యమానికైనా ఒక తాత్వికపరమైన సిద్ధాంతపరమైన వేదిక ఏర్పాటు ఏదో ఒక స్థితిలో అవసరం అవుతుంది. వీరేశలింగంగారు ప్రహసనాలు,పత్రికలు పెట్టి సమాజంతో సమరం చేసినట్లుగానే చలంగారు కూడా కొన్ని కథలు, నవలలు రాసి కొంత హడావిడి చేయక ముందే స్త్రీ, బిడ్డల శిక్షణ, మ్యూజింగ్స్, ప్రేమ లేఖలు వగైరా రాశాడు.

## చలం ఒంటరి తనం

చలంగారి వ్యక్తిత్వాన్ని ఆయన సాహిత్యాన్ని, ఆయన భావాల్ని అర్థం చేసుకోవడానికి ఆయన నవలలు, కథలు, నాటకాలు చాలవని కాదు. చలం సాహిత్య జీవితానికి ఆయన కాల్పనిక రచనలతోబాటు సిద్ధాంతపరమైన రచనలు కూడా వాటి పాత్రను అవి నిర్వహిస్తూ వచ్చాయి. నిజానికి చలంగారి మాన్ అండ్ విమన్, 'స్త్రీ' 'బిడ్డల శిక్షణ' చలం సాహిత్యానికి మేనిఫెస్టో లాటివి. చాలామంది భావుకుల్ని ప్రతిభావతుల్ని, గొప్పవారిని ఒంటరితనం బాధించినట్లుగానే చలంగారిని కూడా ఒంటరితనం బాధించింది. ఆ ఒంటరితనం లోంచే చలం సాహిత్యం అంతా వచ్చింది.

ఆయన సాహిత్యం యొక్క శక్తిని ఆయనే గుర్తించి కథల్లో, నవలల్లో తనే రచయితగా ప్రవేశిస్తూ తనమీదే కామెంట్స్ విసురుతూ పాఠకుల్ని క్లిక్ చేసే

వాడు. రచన మధ్యలో తన ప్రసక్తి తనే తీసుకురావడం చలంతోనే ప్రారంభం అయిందనుకుంటాను. తెలుగులో ఈ బలహీనతను నేటివరకు అది ఒక కొత్త టెక్నిక్‌గా చాలామంది అనుకరిస్తూ వచ్చారు. ఇది బలహీనత అని ఎందుకన్నానంటే చలంగారి సాహిత్యాన్ని ప్రచురించడానికి ఆ రోజుల్లో ఎక్కువమంది వచ్చేవారుకారు. పత్రికలు, సాహితీ సంస్థలు, గౌరవనీయులు ఆయన రచనలను బహిష్కరించేవారు. కానీ రహస్యంగా చదివేవారు. ఆ కాలంలో అలా రహస్యంగా చదివేవారిని ప్రవోక్ చేయడానికి, తన కలంకున్న బలం ద్వారా రచనల మధ్యలో మిడిల్ స్టేట్‌మెంట్స్ ఆయన ఇస్తూ వుండేవాడు. అది ఆయనకు అవసరం అయింది. అవసరం లేని తక్కువ స్థాయి రచయితలు సైతం ఈ అలవాటును నేటి వరకూ గొప్పగా అనుకరిస్తూ రావడం మనం గమనించవచ్చు.

## నిరంతర పోరాటం

చలంగారికి ఇష్టమైన రచయితల్లో కృష్ణశాస్త్రిగారు, నండూరి సుబ్బారావుగారు చాలా ముఖ్యులు. ఆయనపై గీతాంజలి ప్రభావం అపారంగా ఉన్నది. శ్రీ శ్రీ, గీతాంజలి కంటే భక్తచింతామణి శతకం చాల గొప్పదని వాదించినప్పుడు చలంగారు తగురీతిని ఆ విమర్శను ఎదుర్కొన్నట్లు గుర్తు. గీతాంజలిలోని మిస్టిసిజమ్ ఒంటరితనంలో క్రుంగిపోతున్న చలాన్ని ఆకర్షించింది. ఆయన నిమ్నజాతులవారు నివసించే గుడిసెల్లోనూ, శిథిలమైన కొంపల్లోనూ వున్నాడు. ఆహార విహారాదుల్లో బ్రాహ్మణ కులానికి వ్యతిరేకంగా ఎన్ని చేయాలో అన్నీ చేశాడు. తన జీవితంతో తనే ఎన్నో ప్రయోగాలు చేశాడు. రాజకీయాలను అసహ్యించుకున్నాడు. సామాన్య ప్రజల సామాన్య జీవితంలోని సింప్లిసిటీని తెగ మెచ్చుకున్నాడు, అప్పటి కప్పుడు కొద్దికొద్దిగా నాగరికం అవుతున్న పట్టణ జీవితాల్లోని కృత్రిమత్వాన్ని తీవ్రంగా గర్హించాడు. రెండవ ప్రపంచ యుద్ధం కాలం నాటికి ఉధృతమౌతున్న జాతీయోద్యమాన్ని, కొద్దికొద్దిగా పారిశ్రామికం అవుతున్న దేశీయ జీవితాన్ని అతను విమర్శించాడు. ఆ రోజుల్లోనే రేడియోని, సినిమాల్ని అవి తెస్తున్న గందరగోళాన్ని. కృత్రిమ విలువల్ని నిరసించాడు. జాగ్రత్తగా గమనిస్తే, కన్యాశుల్కం కథా కాలంనాటికి టెలిఫోనుగాని, సినిమా గాని, గ్రామఫోనుగాని,ఫౌంటెన్ పెన్‌గాని, సైకిల్‌గాని వున్నట్లు కనిపించదు.గుర్రబ్బండీ

వుంది. అలాగే పూటకూళ్ళమ్మ తప్ప కాఫీహోటళ్ళ, కిళ్ళీకొట్ల కల్చర్ అప్పటికి ఇంకా ఉధృతంగా లేదు. కాఫీలు, టీలు గిరీశం, వెంకటేశంకూడా తాగలేదు. కాని చలంగారు కథలు రాసే కాలానికి సిగరెట్లు, వైను, ఇడ్లెను, కాఫీ హోటళ్ళు, కిళ్ళీ కొట్లు అన్నీ అవతరించాయి. భారతీయ సామాజిక జీవనం చాలా పెద్దఎత్తున అతి వేగంగా మారుతూ వస్తున్న కాలంలో ఒక ప్రపంచ యుద్ధం పూర్తయి, రెండవ యుద్ధం ముమ్మరంగా సాగుతున్న కాలంలో, చలం సాహిత్యం తెలుగు ప్రజల నడ్డి విరగ్గొట్టింది. పేరుకున్న స్తబ్ధతను చీల్చి చెండాడింది. కుహనా దేశ భక్తుల్ని అవహేళన చేసింది. కాంగ్రెస్ ఉద్యమంతోపాటు సభల కెక్కిన తెలుగుస్త్రీల లిబరేషన్‌ను ధ్వనించింది. సంప్రదాయాల మీద, పాత విలువలమీద కొత్త తరం ధ్వజమెత్తుతున్న కాలంలో,చలం సాహిత్యం దానికి అనుకోకుండా నాయకత్వం వహించింది. ఆ ఉధృతాన్ని ఎదుర్కొందుకు విశ్వనాథ వంటివారు కలంపట్టి "చెలియలికట్ట" వంటి నవలలు రాయవలసి వచ్చింది. చలంగారి "మైదానాని"కి చెలియలికట్ట జవాబుగా నిలుస్తుంది. చలం లేచిపోయిన ఆడవాళ్ళ చరిత్రలు గానం చేస్తుంటే విశ్వనాథవారు చిన్నపిల్లల్ని రెండవ పెళ్ళి, మూడవపెళ్లి చేసుకున్న వారి గురించి కథలల్లుతున్నారు. స్త్రీకి యాభై ఏళ్ళ తరువాత కోరికలు నశిస్తే, మగవారికి తొంభై ఏళ్ళదాకా ఆ పైనకూడా ఆ మరణాంతం స్త్రీని సంతోషపెట్టి, పిల్లల్ని కనిపించగలిగే శక్తి వుంటుందని వాదిస్తూ, ఆయన కథలు, నవలలు రాశాడు.

## నారీ దృక్పథం

తెలుగు కథా సాహిత్యానికి సంబంధించినంతవరకు గురజాడ తరవాత చలానిదే పెద్దపీట. చలం తెలుగు కథను శక్తి వంతం చేయడమేకాక దాన్ని సంఘంపై ఒక ఆయుధంగా మలిచాడు. అయితే శరత్‌లోను, చలంలోను ఉన్న ఒకేఒక సామాన్య లక్షణం పతితలైన, భ్రష్టలైన కులటలైన స్త్రీల పట్ల గల అపారమైన దయ ప్రేమ గౌరవం. తరతరాల నుంచి పురుషుల అహంకారానికి, ఆధిపత్యానికి, దోపిడీకి గురైన స్త్రీని నేనుకూడా అవమానించాలా? ఆమెపై నేనుకూడా ఒక రాయిఎట్లా వెయ్యను? అని చలం రచనల్లో బాధపడ్డాడు.

శరత్ ఎంత అభిమానించినా, ఎంత గౌరవించినా, స్త్రీకి ఇవ్వలేని స్వేచ్ఛని ఆమె భరించలేనంత స్వేచ్ఛని, ఆమెకు అపకారం కలిగించేంత స్వేచ్ఛని చలం

ఉదారంగా ప్రసాదించాడు. చలం సాహిత్యం అంతా ఉత్తమ కోవకు చెందినదే. స్త్రీ పట్ల వేదనా భరితమైన సాహిత్యమేకాని. సౌందర్యాన్వేషణతోను, ప్రకృతి ఆరాధనతోను మిళితమైన సాహిత్యమేకాని, చౌకబారు బూతు సాహిత్యంకాదు. చలం సృష్టించిన శృంగారం యావత్తు ఆరోగ్యవంతుల మధ్య ఆనందంగా జీవించ డానికి ఆయన ఇవ్వదలచుకున్నంత, వారికి కావలసినంత-అపారంగా ఇచ్చిన శృంగారమే కాని. అది నీచమైన సెక్సుకాదు. చలం సాహిత్యంలో ఉన్నదంతా కుళ్ళి పోతున్న సంఘం మీద ద్వేషమేకాని, దాన్ని షాక్ చెయ్యాలని సృష్టించిన సాహిత్యమేకాని, వ్యభిచారాన్ని ప్రోత్సహించే సాహిత్యంకాదు. వివాహం "లీగలైజ్‌డ్ ప్రోష్టిట్యూషన్" అయితే దాన్ని చలం నిరసించాడు. వివాహ వ్యవస్థ కల్పించిన కట్టడుల వలన దాని చట్రంలో స్త్రీ పడే బాధలను గుర్తించి. ఆమె విముక్తికై పోరాటానికి పిలుపు యిచ్చాడు. మర్యాదస్తుల జీవితంలోని కుళ్లని, హిపోక్రసీని, దొంగనీతుల్ని అతను వజ్రాయుధంతో ఖండించాడు. నిద్ర పోతున్న ఈ సమాజ మత్తగజాన్ని అంకుశంలాంటి తన కలంతో పొడిచి పొడిచి నిద్రలేపాడు. చలం స్త్రీ జన పక్షపాత రచయిత కావచ్చుగాక ; నవయుగ వైతాళికుదే!

## గోరంత దీపం

ఇటువంటి చలాన్ని గురించి ఒక లిటరరీ బయోగ్రఫీ రాయమని నన్ను విజయవాడ, న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్ వారు అడిగినప్పుడు కొండంత చలం గురించి గోరంత దీపం వెలిగించడం నాకు యిష్టమైంది. ఒప్పుకున్నాను.

చలం గురించి ఏమి రాసినా చలంగారి భక్తులు మాత్రం చాలా ఎలర్ట్‌గా వుంటారు. చాలా మంది గొప్ప రచయితలకు తమ భక్తులద్వారా జరిగే అపచా రాలే వీళ్ళవల్ల చలానికీ జరుగుతూ వుంటాయి. మూఢభక్తుల బాధ ఎంతటి వారికైనా తప్పనిసరి, అయినప్పటికీ చలం జీవితాన్ని చలం సాహిత్యాన్ని తులనాత్మకంగా సమీక్షిస్తూ ఈ పుస్తకం రాయడానికి ప్రారంభిస్తున్నాను.

విజయవాడ,
20 ఫిబ్రవరి 1979

— పురాణం సుబ్రహ్మణ్యశర్మ

నువ్వు లేక ముందు
ఈ లోకం నీకు పట్టిందా
నువ్వు పోయింతరవాత
నువ్వేమైనావో లోకానికి పట్టిందా

# 1

## స్వప్న శాఖ

చలం ఏరోప్లేన్లో వెళ్ళి పోతున్నాడు. స్పష్టంగా వుంది కల. తనూ ఆ ఏరోప్లేన్లో వుంది సౌరిస్.— "గట్టిగా కావిలించుకుని ముద్దు పెట్టుకున్నాను"అన్నా రామె.

ఎన్నో యేళ్ళు సన్నిహితంగా మసిలి కాలయవనిక వాలగానే, తెరల చాటుకు మరలి వెళ్లిన ఆప్తులు, కలల్లోకి వచ్చి పలకరించి పోతూ వుంటారు. అలాటి కలే మరొకటి-

-ఎవరో అతిథులు తిరపతి నుంచి రాత్రి వేళ వచ్చారు. రాత్రి వస్తే వారికి నీళ్ళు అవీ ఏర్పాట్లు చూడ్డానికి సౌరిస్ స్నానాల గదిలోకి వెళ్లింది.

"కలే యిదంతా. ఆ చీకట్లోంచి నాన్న మాట్లాడుతున్నాడు. చాలా స్పష్టంగా వినిపిస్తున్నాయి చెవికి. వినిపిస్తోంటే-సాధారణంగా కొన్ని యేళ్ళ అలవాటుగదండీ. ఎప్పుడూ యీ గుమ్మంలో తనని చూసే నేను లోపలికి వెళతాను. ఏదో మేలు కునుంటే ఏదన్నా చేయాల్సి వస్తే-అది అలవాటయి పోయింది. ఎప్పుడూ యీ గుమ్మంలోంచే వెళ్తాను. కల్లోకూడా ఇటు చూసే వెళ్ళాను. ఏదో మానాన్న నిద్ర పోతూన్నట్టు కనపడ్డాడు. కాని, నాన్న మాటలు ఎందుకింత స్పష్టంగా వినపడుతు న్నాయి? అర్ధరాత్రి. స్నేహితుల్ని ఎందుకు పెట్టుకున్నాడు అనుకున్నాను కాని, ఒక మొగ గొంతుక వినపడుతోంది. ఏమని?

"నాయనా నీకు శ్రమ కలిగిస్తున్నానేమో యీ ప్రశ్నలు వేసి" అంటున్నారు.

"నాకేం శ్రమ"

"మీ వయస్సెంతండీ" - అని అడుగుతున్నారు.

"నాకు వయస్సా? ఏమో.... ఎంతో.... ఎవరు చెప్పగలరూ?" (అన్నాడు చలం) ఏవిటిట్లా మాట్లాడు తున్నాడితను అనుకున్నాను మళ్ళీ. మళ్ళీ ఆ దృష్టి (పోయాడనే దృష్టి) నా బుర్ర కొంచెం పనిచేసింది.

"ఇక శ్రమ యిస్తున్నానండీ మాట్లాడించి" - అంటున్నారు అతను.... మాట్లాడించకండి అని నేను లోపలఅనుకుంటున్నా.

చలం - "నాకేం శ్రమలేదు. కాని, మీరు మాట్లాడే దేదో యిప్పుడే మాట్లాడేసెయ్యండి. రేపు పొద్దునకు వుంటానో వుండనో - ఏం చెప్పగలను?" అంటున్నాడు.

ఏవిటి యిట్లా అంటున్నాడితను? లేడుగదా తను - చచ్చిపోయినాడు గదా. ఇదేంటి యిట్లా అంటున్నాడూ.... అని నేను గదిలోంచి యిట్లావచ్చాను కలలోంచి; వస్తే యిట్లా.... సాధారణంగా అట్లా మంచం వేసి వుండేది.... యిట్లా మంచం వేసి వుంది.

పరిగెత్తుకుంటూ వచ్చానా-దగ్గర కొచ్చేసి గట్టిగా పట్టుకుని రెండు బుగ్గలూ ముద్దుపెట్టుకున్నాను అన్నమాట. చాలా ఫ్రెష్-బాగా తెలుస్తోంది. అంటే - చచ్చిపోయినప్పుడు తను ఎట్లా వున్నాడో, అట్లానే వున్నాడు. కళ్ళు మూసుకుని అట్లా వున్నాడు. వుండేటప్పటికే—

"ఏం? ఎట్లా వచ్చావు నాన్నా" అన్నాను. అని మళ్ళీ,

"ఈ శరీరం పోయింది గదా, ఎట్లా వచ్చావు" అంటున్నాను. ఇంతలో తెల్లారి పోతోంది. ఈయన వచ్చి యిక్కడ కూర్చున్నాడు, కృష్ణారావు. తెల్లారి పోతోంది.

"పోతే-నిన్ను ఆ రోజు మేం తీసికెళ్ళి, దహనంచేసి, కాల్చి- కాల్చేశాం. నువ్వు బూడిదై పోయినావు. ఏవండీ (కృష్ణారావునుద్దేశించి) బూడిద నుసికూడా నల్లని నుసి కూడా కట్టలేదు కదూ? విభూతి తెల్లగా వుంది కదూ - నాన్న బూడిద" అని ఆయన్ని అడుగు తున్నానన్నమాట.

"ఎట్లా వచ్చావ్ నువ్వు" అంటే "ఈశరీరం ఎట్లా వచ్చింది నీకు మళ్ళీ మేం కాల్చేశాం కదా?"

అట్లా పడుకునే మెల్లగా "ఈశ్వరుడిచ్చాడు" అనే సరికి - కళ్ళు మూసుకుని వున్నాయ్.

"కళ్ళు తెరచి చూడు" అన్నా.

"చూస్తాను మిమ్మల్నందర్నీ."

"చూడు చూడు కళ్ళు తెరూ" అన్నా. కళ్ళు తెరవలేదు. అట్లాగే పెట్టుకుంటే——

"వోన్లే తెరవకపోతే అట్లానే వుండు" అన్నా. అనేప్పటికీ కళ్ళు యిలా నెమ్మదిగా తెరిచి యిట్టా చూశాడు. కాని, అవి చచ్చిపోయిన వాళ్ళ కళ్ళే గాని అవి బతికున్న మనిషి కళ్ళలాగా లేవు. కాని చూపు మాత్రం బ్రైయిట్‌గా వుంది. అందర్నీ చూస్తున్నాడన్నమాట.

"మేం అందరం కనపడు తున్నామా నీకు" అంటే తల యిట్టా వూపాడన్న మాట. అంతే కల అయిపోయింది. అంతే కాని తను బ్రతికున్నట్లు చెప్పలేదు. శరీరం నాకు ఈశ్వరుడిచ్చాడు అన్నాడు."

చలం మీకు కని పిస్తారా అనే ప్రశ్నకు నాలోనే వున్నాడు అన్నారామె. సౌరిస్సే చలం. ఇప్పుడిక చలం వేరు సౌరిస్ వేరు అనే భావానికే తావులేదు. ఆమె కనుపాపల్లో వెలుగై నిశ్చలంగా ప్రకాశిస్తూ వుంటాడు. బాధలన్నీ జీవునికే గాని ఆత్మకేం బాధలు అని అనే వాడు చలం. శరీరం శిథిలమయి కృశించి పోతున్నప్పటికీ, అవేవీ పట్టకుండా అంతర్ముఖుడయి మనసుని ఖాళీ చేసుకుని నిశ్శబ్దంలోకి వెళ్లి పోయి వుండేవాడు. అతని సాధన అతను కోరుకున్న శాంతి తీరాలకు అతని మనసుని మళ్లించింది. ఆ చిరునవ్వు లో వెన్నెల, ఆ ముఖంలో కాంతి ఆ చూపుల్లో సత్యాన్వేషకుని తీక్షణతా పెరుగుతూ వచ్చాయే కాని తరగలేదు. చలానికి కొండలంటే యిష్టం. నడవలేక షికారు మానేసిన దశలో సోఫా వేయించుకు కూర్చుని ఆ కొండను చూస్తూ వుండేవాడు. ఈ వెంకటచలం ఆ అరుణాచలాన్ని చూస్తూ తన్మయుడయి పోయేవాడు. అరుణాచల శోభ ఆ సౌందర్యం ఆ నిశ్చలత అతనిలోకి ప్రవహించేవి కాబోలు. చలం ఎంత వున్నతుడయినా, ఎంత ఎదిగినా, గళ్ళ లుంగీతో బుష్ షర్టులో కనపడే చలంలోని ఋషిని గుర్తించడం పొరలు కమ్మిన కళ్ళకి చాలా కష్టమే కదా!

బాధలోంచి నడిచి
అగ్నిలో ఆహుతై
తాము లోకాని కిచ్చిందేమిటి?

# 2

# సాహిత్రిక పర్వం

పోయిన జులైలో అంటే 1978లో చలం ఆరోగ్యం ఆందోళనకరంగా పరిణమించింది. హార్ట్‌బీట్ తప్ప ఏమీ లేదు. అయిపోయింది అంతా-అన్ని లక్షణాలూ వచ్చాయి. చూపులు కూడా నిలిచిపోయాయి. మూడు రోజులల్లా కళ్ళు మూసుకుని వున్న వాడు విల్‌పవర్‌తో కళ్ళు తెరిచి చూశాడు. వొళ్ళంతా మంచు ముద్దలా అయిపోయింది. నెలరోజుల ముందు నించీ అలా చల్లగా వుంది. 'మంచు బాక్సు-మంచు బాక్సు' అంటూ వుండేవాడతను. అతని వొళ్ళు ముట్టుకుంటే మంచుబాక్సుతో ఆడుకున్నట్లు వుండేది. 'చిన్నప్పుడు నీతో యిట్లా ఆడుకునేవాళ్ళం కద నాన్నా' అంది సౌరిస్. అంటే కళ్ళు తెరిచి చూస్తున్నాడు తను. అప్పటికి మాటలేదు. ఆయన మాట్లాడిన ఆఖరు మాట—'నా మాట పోతోంది' అని. సబ్‌కాన్షస్ అయిపోయాడు. ఆ తరవాత కళ్ళు తెరచి చూసి 'ఆ-యిన్నాళ్ళు యాపైనాను' అని అడిగాడు. అడిగితే జరిగిందంతా చెప్పారు. చెప్పిన తరవాత విన్నాడు. ఆ రోజంతా చక్కగా మాట్లాడాడు. ఏమీ జరగలేదు కాని, మర్నాడు నుంచీ ఆ వొళ్ళు మళ్ళీ మంచు ముద్దలా వుంది. మళ్ళీ గేస్పింగ్, ఆ ఆయాసం అట్లా చాలా రోజులు వస్తూనే వుంది. అప్పుడు డాక్టర్లు మూడు రోజుల్లో తెలుస్తుంది వుండేదీ లేనిదీ అంటే, పరిస్థితి ప్రమాదకరంగా వుందని, తెలియపరచ వలసిన వాళ్ళందరికీ వర్తమానాలు పంపిం

చేశారు. రావలసిన వాళ్ళంతా వచ్చారు. మూడు రోజులు తరవాత కళ్ళు తెరచి చూశాక రికవరయి బతికాడు తను. పునర్జన్మ వచ్చేసింది అన్నారంతా.

ఇప్పుడు తిరిగి ఈ చైత్ర వైశాఖ మాసాల్లో— కఫం అదీ చేరి జ్వరం రావడం మొదలెట్టింది. అదికూడా ఎక్కువేమీ కాదు— 99°నుంచి 100° వరకూ వచ్చేది. తగ్గిపోయేది మళ్ళీ వచ్చేది. ఆ కఫం అలా చేరుతున్నట్టు ఇంట్లో ఎవరికీ తెలీదు. కొంచెం వుందేమో అనుకున్నారు గాని కఫం బాగా చేరి ఎక్కువగా వున్నట్లు ఎవరూ గమనించలేదు. మొహం వుబ్బరించలేదు. ఆరోగ్యంగా వుంది. ఇదివరకు నీరు పట్టిందేమో కాని, ఇప్పుడు అదీ తగ్గిపోయింది. శరీరం చాలా అరిగిపోయింది. ఆరోగ్యం సరిగ్గానే వుంది. కళ్ళు బావున్నాయ్. నోరూ మాటా అదీ బాగున్నాయ్. మూడు రోజులు జ్వరం వచ్చేసరికి బాధలేవీ లేనిదే ఏ మందులూ యివ్వడం సౌరిస్‌కి యిష్టం లేదు. అవి రియాక్టు చేసి కలత కలిగిస్తాయి. కఫం వుంది. జ్వరం 99° అనగానే నర్తకి హోమియోపతి వాడింది. తగ్గుతో వుంది. ఫామిలీ డాక్టరు వున్నా లేనట్లే. వాళ్ళు చచ్చి ప్రాణం పోతున్నా రోగిని చూడ్డానికి యింటికి రారు. వెళ్ళి చెబితే మందిస్తారు. రోగిని తీసుకెళ్ళి చూపాల్సిందే—తిరువణ్ణామలైలో డాక్టర్లు అంత కర్కోటకులు. దానివల్ల నష్టం జరిగినా జరగక పోయినా చలం అంతవాడికి 84-85 యేళ్ళ వయసులో కనిపెట్టుకుని చూసి మందిచ్చే డాక్టరే కరువయ్యాడు. ఫామిలీ డాక్టరు రానివాడు గదా అని చిన్న డాక్టర్లనెవరినైనా తీసుకు వస్తే, ఆ మందులు చలం తత్వానికి పడతాయో లేదో? అందుచేత వైద్యమంతా ఆ అమ్మాయి నర్తకి నేర్చుకుంది. బి. పి. పరికరం కూడా నర్తకే పెట్టి చూసేది. పెద్దవాడు కదా, కుర్ర డాక్టర్లను పిలిస్తే ఏం డోసు యిస్తారో, పాపం అతని వొంటికి యేం బాధలు వస్తాయో?

సౌరిస్‌కి సెంటిమెంట్సు యేమీలేవు యీ విషయంలో. శరీరం శిథిలమవుతోంది. బాధల్లేకుండా పువ్వులా వెళ్ళిపోతే మంచిది కాని, ఈ మందులిప్పించి ఆయన శరీరాన్ని కష్టపెట్టడం సౌరిస్‌కి యిష్టం లేదు. ఇలా నా కిష్టంలేదని ఆ విషయం ఆమె చలానికి స్వయంగా చెప్పేసింది. సంతోషంగా పోవాలి. అలా కాకుండా మందులిప్పించి శరీరాన్ని బాధపెట్టలేనని ఆమె చెప్పగానే చలం వొప్పుకున్నాడు. అందుచేత ఆయనకు శరీరాన్ని కష్టపెట్టే మందులిప్పించ లేదు సౌరిస్. ఇంక జ్వరం 101° వచ్చి ఎంతకీ తగ్గకపోయేసరికి, డాక్టర్ని పిలిచి ఇంజక్షనిప్పించేస్తే సరిపోతుం దనుకుంటే డాక్టరు రాలేదు. మరొకావిడ వచ్చి మందులిచ్చి ఇంజ

క్షను యిచ్చి వెళ్ళింది. కఫం అంతా బయటకు వచ్చేసింది. కాని జ్వరం మాత్రం తగ్గటం లేదు. ఫామిలీ డాక్టరుకి కబురు చేస్తే ఆయన వచ్చి చూస్తా నన్నాడు. ఇంతతా జరిగి ఐదారు రోజులయింది. జ్వరం తగ్గడం మళ్ళీ వస్తూండడం, కాని కఫం మాత్రం ఆవిడ యిచ్చిన మందులకి బాగా పైకి వచ్చేసింది. ఇంకా వస్తూనే వుంది. ఫామిలీ డాక్టరు వస్తానన్నాడు జ్వరం తగ్గకపోయేసరికి. ఏప్రిల్ 28వ తేదీన వచ్చి పరీక్ష చేశాడు.

పోయినసారి డాక్టరుగారు చచ్చిపోయాడనే అనుకున్నాక, చూస్తే బతికి వున్నాడు. అంటే డాక్టరే ఆశ్చర్యపోయినా డన్నమాట.... ఈసారి డాక్టరు వచ్చి చూసినప్పుడు మన తెలివిలో వున్నాడో లేదో తెలిసేది కాదు. కళ్ళు మూసుకునే వుండేవాడు. అన్నీ తెలుస్తూనే వుండేవి. ఈ జబ్బువల్ల కాదుగాని, అసలు ఈ దృష్టి పోయింది. ఏ లోకంలో వుండేవాడో.... కాని, అన్నీ అబ్జర్వు చేస్తూ వుండేవాడు. ఎవరైనా వస్తే, వచ్చారనే కాన్షస్‌నెస్ వుంది తనకి. కాని, ఒకళ్ళతో మాట్లాడడం కాని, ఒకళ్ళని చూస్తూ వుండడంకాని లేకుండా ఎక్కడో చూస్తూ వుండేవాడు. మాట వుంది, పోలేదు. జ్వరం వచ్చేవేళ వరకూ- చదివితే, చాలా అప్రీషియేట్ చేసేవాడు. చదివించుకునేవాడు యింట్లో ఎవరి చేతనయినా, వీళ్ళు చదివేవారు. ఇంత ఇలా జరుగుతూవున్నా, కాన్షస్‌నెస్ వుందో లేదో తెలిసేది కాదు. ఎప్పుడూ కళ్ళు మూసుకుని పడుకునే వుండేవాడు. ఇలా వున్నా, ఇదివరకు జులైలో యిలాగే జరిగి, మళ్ళీ కోలుకున్నాడు గనుక ఎవరూ పోవచ్చునని అనుకోలేదు. కోమాలేదు. అన్‌కాన్షస్‌గా వున్నాడు. ఈ లక్షణాలనుబట్టిచూస్తే (డాక్టరు 28 ఏప్రిల్‌న వచ్చాడు), ఒక నెల వుండవచ్చునని సౌరిస్‌కు అనిపించింది. మంచి పౌష్టికాహారం అదీ తీసుకు కోలుకుంటే, ఏడాదిదాకా కూడా వుండవచ్చు నని సౌరిస్ అభిప్రాయపడింది. డాక్టరు వచ్చివెళ్ళాక ఆయాసం, వూపిరాడక పోవడం అవీ వచ్చాయి. సౌరిస్ చూస్తూ వుండేది. ఆ కఫం ఆయాసం అవీ బాగా కుదిరాయి అనిపించింది.

ఇక పోతాడన్న ఆ రాత్రి, మే 4కి ముందు మూడురోజులు ఎగశ్వాస అంటారు, అది వచ్చింది. స్పృహ అదీ పోయిందా అనుకుంటే, చక్కగా అందర్నీ చూస్తున్నాడు. చెప్పలేదుగాని కొద్దిగా అబ్జర్వ్ చేస్తున్నాడు. ఇదివరకు యిలాగే వచ్చి కోలుకున్నాడు గనుక పోతాడని ఇంట్లో ఎవరూ అనుకోలేదు. ఎగ శ్వాస వస్తూన్న మూడవ రోజున, అంతా ఏదో మట్లాడుకుంటున్నారు. అది తను

ఫాలో అవుతున్నట్లు వెరిఫై చేస్తున్నట్లు 'ఆ' అన్నాడు పెద్ద కంఠంతో. ఎన్నో యేళ్ళయింది. అంత పెద్ద కంఠంతో అతను పిలిచి. గట్టిగా 'ఆ' అన్నాడు. తరవాత సౌరిస్ కజిన్ ఒక అమ్మాయి వచ్చింది చలాన్ని చూడడానికి. ఆవిడకి చలం అంటే చాలా ప్రేమ. కూర్చోమని మూడుసార్లు సౌంజ్ఞ చేశాడు.

'ఏమిటండీ— చేతులూ కాళ్ళూ, యిట్లా అయిపోయినారా' అన్నదావిడ. ఆమె చెయ్యి, పట్టుకుని వచ్చినందుకు కళ్ళతో వాళ్ళని చూశాడు, గుర్తుపట్టాడు. ఎప్పుడో వాళ్ళని చాలా చిన్నపిల్లలప్పుడు చూశాడు. గుర్తుపట్టి దగ్గర కూర్చోపెట్టు కున్నాడు.

ఆ తరవాత రాత్రి భజన చేసేటప్పుడు, రమణస్థాన్‌లో సాధారణంగా 'నామావళి' భజన చేస్తారు. ఆ రోజు భజన చేయవద్దనుకున్నాం అని చెబుతూ సౌరిస్ 'భజన చేశామంటే తంతాడు నాన్న లేచి. వద్దు చేయద్దు. కావలిస్తే పాటలు పాడు కుందాం' అని చెప్పి తండ్రివద్దకు వచ్చి కూర్చుంది.

కళ్ళు లొత్తయి పోయాయి. కారుస్తూనే వున్నాయి ఆ కళ్ళు కన్నీళ్ళు. కను గుడ్లు కరిగి నీరయి ప్రవహిస్తున్నాయి చెంపలన్నీ తడిసిపోయి. ఆ ఎగశ్వాస ఆయాసం వస్తూనే ఉంది. ఆ రాత్రి- ఇక్కడికి మామూలుగా ఆయన్ని చూడ్డానికి వచ్చే డాక్టరు వచ్చి—

'ఇంకా ఫ్లమ్(కఫం) కొంచెం వుంది. పొజిషన్ అదీ కొంచెం మార్చండి అదే తగ్గుతుంది. హార్ట్ కండిషనూ అదీ బావుంది. కొన్ని రోజులవరకూ వుండే టట్టు వుంది ప్రాణం' అని చెప్పాడు. చెప్పి ఆయన వెళ్ళాడు. ఇంట్లో అంతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఆ డాక్టరు వెళ్ళి గంటకూడా అవలే. అప్పుడే అయిపోయింది....ఒక్క క్షణంలో. అవి మృత్యుక్షణాలని ఎవరూ అనుకోలేదు— అంతే—వెంటనే ప్రాణం చక్కగా వెళ్ళిపోయింది. ఎలా తెలిసిందంటే— ఒక గేస్పింగ్ వచ్చింది. అనుమానంవేసి చప్పున అంతా దగ్గిరకు వెళ్ళారు. ఒక పది హేను నిమిషాల సేపు ఏ ఎగశ్వాస, ఆయాసం లేకుండా ప్రశాంతంగా పడుకుని వున్నాడు. సౌరిస్ దగ్గరే కూర్చుంది. ఆమె చేతుల్లోనే పోయాడు చలం. వైశాఖ మాసం, మే నాల్గవ తేదీ, శుక్రవారం రాత్రి 9 గంటల 5 నిమిషాలకు చలం కాల ధర్మం చెందాడు.

నిద్రలోనైనా నన్ను విడవని
నీ చేతుల్లో నిద్రించాను!

# 3

# ఉత్తరక్రియ

చలం కోరిన దేమిటంటే—

"నాకీ పాడెగీడె కట్టి తీసికెళ్ళద్దు, అట్లాటి వేవీ నాకిష్టంలేదు. నే నే ఈజీ. ఛైర్లోఎట్లా వున్నానో, అట్లా నన్ను తీసికెళ్ళండి. తరవాత యీ భజన్లు...."

రమణస్థాన్ ఆశ్రమం కదా. చలానికి భక్తులనే వాళ్ళు వున్నారు, వాళ్ళంతా వచ్చి "అన్నా శివ శివ"అని యివీ అవీ పాడతారు.

"వాళ్ళంతా వచ్చి హడావిడి చేస్తారు. అట్లాంటివి నాకిష్టంలేదు, సైలంటుగా వుండాలి" అన్నాడు చలం. పైగా ఒకటన్నాడు— అంపశయ్య మీద భీష్మునిలా వుండి,

"ఎవడన్నా అట్టా చేస్తే వాడ్ని తంతాను పట్టుకుని"

పూర్వపు చలం హ్యూ మరంతా చలం రుషిలోంచి పైకి తంతూవుంది. మొట్ట మొదట తన మరణాన్ని ఎవరికీ తెలపవద్దన్నాడు.

"బయట ప్రపంచానికి తెలపవద్దు. ఆశ్రమంలో తెలపవద్దు. బయట ఎవరికీ తెలపవద్దు. సైలంటుగా తీసికెళ్ళండి."

అప్పుడు సౌరిస్ అడ్డుకుంది—

"అట్లా జరగదు. నువ్వంటే మరి చాలామందికి యిష్టం. చాలామంది అభిమానులున్నారు కదా! పాపం వాళ్ళు బాధపడతారు. ఫలానా ఏపన్నా జరిగితే మాకు చెప్పండి అనేవారు కూడా వున్నారు. అట్లాంటి వాళ్ళకి నే తెలుపుతాను" అని సౌరిస్ చలం ఎవరికీ తెలుపవద్దన్న సూచనకి ఒప్పుకోలేదు.

"తరవాత రమణాశ్రమానికి తెలపవద్దంటావేమో. అది ధర్మంకాదు. ఆశ్రమం అన్న తరవాత భగవాన్ కోసం వచ్చేవాళ్ళకి తెలపడం మన ధర్మం. న్యాయం అది. అట్లాంటిది తెలుపుతాను నేను. వాళ్ళు వస్తారోరారో ఆ సంగతి వేరు. వాళ్ళు వచ్చి భజనలు చేస్తే మాత్రం, చెయ్యొద్దని మాత్రం నేను చెప్పను. నువ్వు కావిలిస్తే తన్నుకో-ఏదన్నా చేసుకో, వాళ్ళని, నీ సంగతది. నేను మాత్రం చెప్పడం నాడ్యూటీ".

ఎంత ఆశ్రమంతో సంబంధంలేక పోయినా, సోషల్‌గా వుంటారు, చలం కుటుంబసభ్యులు. ఏం జరిగినా వాళ్ళు వస్తారు. వీళ్ళు వెడతారు. ఒకరికొకరు సాయంగా వుంటూ వుంటారు. పోయినసారి జులైలో ప్రమాదం చేస్తే పోతాడను కుని తెలప వలసిన వారందరికీ తెలిపింది సౌరిస్.

"నేనెవళ్ళకి చెప్దామనుకున్నానో వాళ్ళిక్కడే వున్నారు. మాసిస్టర్ యిక్కడే వుంది. మా చిన్నసిస్టర్ తప్ప మా ఇంకో పెద్ద చెల్లెలు యిక్కడే వుంది, అందరూ కావలసిన వాళ్ళంతా వున్నారు. అందుకని నాకెవరికీ తెలపవలసిన పని లేకపోయింది.

వీళ్ళేవో టెలిగ్రాములు, రేడియోకి చెప్తాము అంటే సరే అన్నాను. అయిపోయింది. ఎవరెవరికో టెలిగ్రాములు యిస్తే వాళ్ళొస్తారు అని వెళ్ళింది నర్తకి."

శుక్రవారం రాత్రి 9 గంటల 5 నిముషాలకు పోతే, ఎల్లుండి అంటే ఆదివారం తీసుకెళ్తామని చెప్పింది నర్తకి, శనివారం అంతా వుంచి ఆదివారం మధ్యాహ్నం నాలుగు గంటలకు అంత్యక్రియలు అని అంది నర్తకి. పత్రికలకు, రేడియోకి, ఆశ్రమం వారికి ఆదివారం మధ్యాహ్నం నాలుగు గంటలకు దహనక్రియలు అని ఆవిడే చెప్పింది. చెప్తే, సౌరిస్ అంది.

"మేం అందరం వెళ్తున్నాం. ఈ ఎండల్లో నాలుగు గంటలకు పోయినా మంటే చెంపమాడి పోతుంది. ఎక్కడ నించుంటాం?" అని

ఆవిడ ఏమన్నదంటే—

"సరే యివాళంతా చూద్దాం. ఎవరూ రాకపోతే, రేపు ఎనిమిది గంటలలోపున తీసుకెళ్ళి పోదాం" అని చెప్పి నర్తకిని కన్విన్స్ చేసింది.

ఇంతలో రమణాశ్రమం వాళ్ళు వచ్చి.

"యు. ఎన్. ఐ వాళ్ళూ, రేడియో, పత్రికల వాళ్ళూ అడుగుతున్నారు ఎప్పుడు దహనం?" అని అంటే—

"మేం రేపు పొద్దున్నకల్లా తీసికెళ్ళి దహనం చేసేస్తున్నాము" అని చెప్తే వాళ్ళు అన్నారు—

"మరి మాకు మధ్యాహ్నం నాలుగు గంటలకని చెప్పారు. మేం అందరికీ అట్టానే చెప్పాం మరి. మళ్ళీ స్టేట్మెంటు యివ్వండి" అని, నాలుగు గంటల కయితే మేం అందరం వస్తామన్నారు.

"ఎవరికోసం మేం మార్చుకోదల్చుకోలేదు" అంది సౌరిస్.

"బాడీని అంతసేపు వుంచడం కూడా మంచిది కాదు ఎండల్లో. ఏ తెల్లవారు జామునో పూర్తిచేసి వచ్చేద్దామనుకుంటున్నాం" అనంటే ఆశ్రమం వాళ్ళన్నారు—

"ఎట్టా అన్నా మీరు మార్చుకోండి నాలుగు గంటలకి" అని.

"మేం ఏ మాత్రం నాలుగు గంటలకి చెయ్యబోవడంలేదు. నేనప్పుడే మీకు చెప్పాను. ఉదయం సమయం మంచిది. అలా కాకపోతే, మాకు ఎండ దెబ్బలు వచ్చేట్లున్నాయ్. మా సిస్టర్స్ అందరం వెళ్ళాలని" చెప్పేసరికి ఆశ్రమం వాళ్ళు డిజప్పాయింటయి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిం తరవాత అదివారం ఉదయం తీసికెళ్ళి స్నానం చేయించారు. పై నేదో బట్ట కప్పాలన్నారు.

"బట్టకప్పడం అదీలేదు. హాయిగా లుంగీ షర్టూ వెయ్యండి. మామూలుగా తను ఎట్టా వుంటాడో అట్టా వెయ్యండి"అని చెప్పింది సౌరిస్.

"తీసుకొచ్చి వెయ్యండి, ఏం చేసుకుంటారు అవన్నీ?" అని బుష్ షర్టూ కొత్తపంచె తెల్లటి లుంగీ వేయించింది. చలంగారి భార్య చిట్టి రంగనాయకమ్మ పోయినప్పుడు ఆవిడకి కూడా బట్ట అవీ కప్పలే. మామూలుగా చీరా అదీ వేసేశారు. చుట్టూ వున్నవాళ్ళు భక్తితో పూల దండలూ గులాబి పూలూ తెచ్చి వేశారు. ఇన్వేలిడ్ చైర్లో కూర్చోపెట్టడం కష్టం. అప్పటికి బాడీ సుమారుగా ముప్పై ఆరు గంటనుంచీ అలావుంది. చక్రాలు పెట్టించిన వాలుకుర్చీ ఒకటి వుంది. దిండువేసి, ఆ కుర్చీలో కూర్చోపెట్టారు. కాని, రమణస్థాన్లోని వాళ్ళంతా-

"మేం మోస్తావండీ. మేంపాడె కడతావండి- మేం తీసికెళ్తావండీ" అని వాళ్ళ ప్రేమకొద్దీ అడిగారు.

"మీరంతా నాన్నని మోస్తాం అంటున్నారు. అతను నాతో చెప్పలేదు. నాన్నని ఈజీచైర్లో తీసికెళ్తానని నేనొప్పుకున్నాను. పాడె-మోసుకెళ్ళడం అనగానే బ్రాహ్మణులనీ వాళ్ళనీ పిలవాల్సి వస్తుంది. అవన్నీ తన కిష్టంలేదు. నాకిష్టంలేదు, అందుకని నేనదంతా ఏం చేయబోవడం లేదు. ఆ తంతులూ అవన్నీ యిప్పుడు చేయించడం నాకిష్టం లేదు. నేను తీసికెళ్ళేది ఈజీ చైర్లోనే" అంది సౌరిస్.

"కాదండీ మేం కడతాం" అన్నారు వాళ్ళు.

"కడతాం అంటే—మీకు చేతకాకపోతే, మధ్యలో నాన్న కిందపడిపోతే ఏం చేస్తాం? ఏదైనా- రిస్కు వుంది దాంట్లో. ఆయన అడిగారట్లా—అట్లానే నే చేయించబోతున్నాను" అని ఖచ్చితంగా అంది ఆమె.

ఇంతసేపూ తెరమీద దెబ్బలాడిన
కర్ణార్జునులు
కాలపేటికలో కావలించుకు పడుకున్నారు.

# 4

# మహాప్రస్థానం

భజనలు చేస్తే తంతానని, ఎవరికీ తెలపవద్దని, జరిగేదంతా నిశ్శబ్దంగా జరగాలని, ఎవరూ శోకించ వద్దని కోరుకున్న చలానికి ఆ శనివారం అంతా మృత్యువు ప్రసాదించిన విశ్రాంతే. అగరొత్తులు, సాంబ్రాణి ధూపాలు, పుడుకులాం జల్లులు, ఆప్త పరివారం, బంధుమిత్ర కోటి సమర్పించిన పుష్పాంజలుల మధ్య అంపశయ్యమీద



పరున్న భీష్మునిలా పాత తెల్లబుష్షర్టుతో పడుకొని వున్నాడు చలం. ఆయన నాటిన దానిమ్మ చెట్లు, చంద్రకాంతం మొక్కలు, తురాయిచెట్టు, రాధా మనోహరి, మల్లె, శివగన్నేరు, తులసి, భోగన్ విల్లాలు తలలువంచి నమస్కరిస్తున్నట్టున్నాయి. ఆశ్రమంలోని నెమళ్ళు ఆ చెట్లమధ్య క్రేంకారాలు చేస్తూ తిరుగుతూ, చలం అస్తమయ వార్తను నెమరేస్తున్నాయి. సంచలనం లేని చలం చుట్టూ, ఆయన సృష్టించిన శశిరేఖ, అమీనా, పద్మావతి, రాజేశ్వరి, చిత్రాంగి ఇలా పుస్తకాల్లోంచి మెట్లు దిగి ఆ తల్లులంతా వచ్చి ఆత్మ ప్రదక్షిణలు చేస్తున్నారు. మనుషులెవరూ స్వప్నాలలోనైనా భావించుకోలేని లావణ్య తేజస్సులతో. ఈ ధరణి తిమిర కల్మషంలోకి విలాసంగా దిగి, అరుణాచలం మీదికిథెంగున ఒక్క గంతేసి.

మెట్లమీంచి నడిచినట్లువచ్చి, తడివొంటితో జుట్టుతో పరుగెత్తి, అతని మెడచుట్టూ చేతులు వేసి పెదిమలమీద ముద్దు పెట్టుకుంది. అతను కదలలేదు. అతని పాత తెల్ల బుష్ షర్టుమీద తన తడితలను ఆనించి నిట్టూర్పు విడిచింది, అతిలోక లావణ్యరాశి: వూహాలలో మధురోహ చలం ప్రేయసి- కాదు ఊర్వశి.

బట్ట కప్పవద్దన్నాడు కాని,బుట్టలకొద్దీ పూలు అప్పుడే వికసించిన గులాబీలు వద్దనలేదుగదా! ఆదివారం ఉదయం చివరి స్నానం చేయించి తెల్లటి బుష్ షర్టూ, తెల్లటి లుంగీ కట్టి, ముఖానికి విభూతి రేఖలు దిద్ది, నుదుటను ఎర్రకుంకం బొట్టు పెట్టారు. రెబెల్‌గా వచ్చి ఋషిగా మారిన చలానికి ఆ చిన్ని రమణస్థాన్‌మీది. ఆకాశం వంగి వీడ్కోలు చెప్పింది.

ఆ ఆదివారం ఉదయం, వైశాఖమాసపు ఆకాశమే కాదు. అంతిమయాత్రలో చలంవెంట నడుస్తున్న స్త్రీలూ, పిల్లలూ ఆప్తుల ముఖాలు 'రవి కిరణాంగుళీ నఖక్షతాలతో, కంది ఎరుపెక్కుతున్నాయి. అరుణగిరికి వామ భాగాన, ఎర్రమన్నూ రాళ్ళ మధ్య, శోకిస్తున్న యమునా నదిలా వున్న తారురోడ్డుమీద, వెనకనుంచి యెండ మెల మెల్లిగా తరుముకురాగా- బంధుమిత్రుల అతి చిన్న ఆప్త సమూహం చలం ఈజీ చైరుని ఛాయలా అనుసరిస్తున్నది. ఆ చక్రాలవాలు కుర్చీలో పరిచిన తెల్లని పెద్ద పంచ అది చలానికి జిల్లెళ్ళమూడి అమ్మ రమణస్థాన్‌కి వచ్చినప్పుడు పెట్టినదే!

కొద్దిమందే—అయినా కావలసిన వారూ, రావలసిన వారూ అంతా వెంట రాగా చలం చివరి ప్రయాణం 'సామూహిక మార్నింగ్ వాక్'లా ప్రారంభమయింది. ఆయనకు అత్యంత ప్రీతిపాత్రులు ఆత్మీయులైన కృష్ణ, బసవరాజు, బాబ్జీ, కె. సభా ఆ ఈజీ చైరుని తోసుకుంటూ వెంటరాగాఆయాత్ర పరమపురుషునికి పరమ ఆప్తులు ఇచ్చే వీడ్కోలులా వుంది. అంతేకాని, పాడె, కుండలో నిప్పు, తడిబట్టలవాళ్ళూ, బ్రాహ్మడూ యిలాటి భీతావహమైన తతంగం ఏమీలేదు. అడవిలోకి వెళ్ళి మాయమైన పాటలా, అరుణగిరిలో ఐక్యంకాబోతున్నాడు చలం. ఆ రోజు చలాన్ని అనుసరించిన వారిలో భగవాన్ గురించి పుస్తకం రాసిన పర్షి

యన్ వనిత భగవాన్ ప్రియమాతృశ్రీ తలియార్ ఖాన్ వుంది. శ్రీ రమణాశ్రమం నుంచి మౌంటెన్ పాత్ ఎడిటర్, భగవాన్ తమ్ముని మనవడు గణేష్, చలం ఫామిలీడాక్టర్ సుబ్బరామన్ చెట్టియార్ యింకా ఎందరో ఆత్మీయులు వచ్చి పుష్ప గుచ్ఛాలతో శ్రద్ధాంజలి ఘటించారు. ఆదివారం మధ్యాహ్నం నాలుగు గంటలకు కాక ఉదయం ఎనిమిది గంటలకే అంత్యక్రియలకు ఏర్పాట్లు చేసినందువలన, రమణాశ్రమం నుంచి ఎవరూ అంతిమయాత్రలో పాల్గొనలేదు. లోకయాత్ర చాలించి ముప్ఫై ఆరు గంటలయినా, ముఖవర్చస్సులో తేడాలేదు. దేహంలో మార్పులేవు. ఆ ఈజీ చైర్ తన యజమానిని, తిరిగిరాని మార్నింగ్ వాక్‌కు తీసుకెళ్తున్నాననే బాధతో, నల్లని దారితో మెల్లగా మొరపెట్టుకుంటున్నదా అన్నట్లు చక్రాలు కిర కిర మని రోదించాయి.

తిరువణ్ణామలైకి రమణాశ్రమం సుమారుగా మైలున్నర రెండు మైళ్ళ లోపు. ఆ ఊరికి ఊరి చివర ఇల్లు చలంగారి రమణస్థాన్. రమణస్థాన్‌కి ముప్పాతిక మైలు దూరంలో 'యమలింగాల' దేవాలయం వుంది. అరుణగిరి చుట్టూ శివలింగాలూ చిన్న చిన్న దేవాలయాలే. ఈ యమలింగాల దేవాలయం వద్దనే కావ్య కంఠ గణపతి శాస్త్రి తపస్సు చేసుకునే వారట. భగవాన్‌కి చాలా యిష్టులు. అంతా రాళ్ళూ ఎర్ర మట్టీ తుప్పలే కాని నీడనిచ్చే చెట్లు అక్కడేమీ లేవు. చలంగారి ఈజీ చైర్ వచ్చి వచ్చి అటు యమలింగాల దేవాలయం యిటు అరుణగిరి ఆమధ్యన ఆగింది. ఎండ చుర చుర మనిపిస్తోంది. చలం వెంట వచ్చినవారిలో యామిజాల పద్మనాభ స్వామి, నజీర్ రహ్మన్, రాయిడి నాగేశ్వరరావు వున్నారు. రమణస్థానం నుంచి కొంత మంది ఆప్తులు మేం చూడలేమని శ్మశానానికి రాలేదు. మొత్తానికో ముప్ఫై నలభై మంది అన్ని మతాలవారూ చలం అంతిమ యాత్రలో పాల్గొన్నారు.

కట్టెలని సరిచేసి ఈజీ చైర్‌లోనుంచి దింపి చలాన్ని పడుకోబెట్టారు. ఎండ చుర చుర మంటోంది. కనుచూపు మేరను తల దాచుకుందుకు నీడ నివ్వగలిగిన చెట్టే లేదు. అన్నీ రాళ్ళే, బండలే. సౌరిస్ ఆధ్వర్యంలో అంత్యక్రియలు నిరాడంబరంగా జరుగుతున్నాయి. పద్మనాభస్వామి వాల్మీకి రామాయణం నుంచి జటాయు

వుని శ్రీరామచంద్రుడు అనుగ్రహించిన ఘట్టంలోని శ్లోకాలను చదివారు. ఎవరూ కంట తడి పెట్టడంలేదు కాని అంతా ఆర్ద్రంగా విన్నారు.

యాగతిర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చ యా గతిః।
అపరావర్తినాం యాచ యాచ భూమిప్రదాయినామ్॥

యజ్ఞ శీలురకు యేగతి కలుగుతుందో, ఆ హితాగ్నులకే గతి కలుగుతుందో మరల తిరిగిరాని వారికి ఏ గతి కలుగుతుందో. భూమి దాతల కేగతి కలుగుతుందో.

మయాత్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకాననుత్తమాన్।
గృధ్ర రాజ మహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ॥

(ఆ) అనుత్తమమైన (మనోహరమైన) లోకాలను నాచే అనుజ్ఞ ఇవ్వబడి (మహాసత్త్వుడైన గృధ్రరాజా) సంస్కరింపబడి చేరుకో.

తరువాత సుధనుంచి అరుణాచలేశ్వరుని స్తుతిని రాయిడి నాగేశ్వరరావు గానం చేశారు.

యామిని శిరోజ దీప్త జ్వాలా కుసుమాలు
తేజోతల్పంపై రాలి
అదృశ్యమైనాయి
రవికిరణాంగుళీ నఖక్షతాలతో
శ్యామలాకాశం కందింది
అరుణాచలేశ్వర వామ భాగాన
కుంకుమ పూజ జరుగుతోంది
మేలుకో

నీ కళ్ళ కడగంటి చూపుకై
ఆసక్తిపడ జ్యోత్స్నపతి
ముకుళిత కరుడై
నిలిచి పోయినాడు గవాక్షంవద్ద.
తల్ప పార్శ్వానికి చేరిన నీ రెండ
నీ నిద్రా వగహిత మానసాన్ని
నూతన దినోత్సవాని కాహ్వానిస్తోంది
కేతకీ పరిమళాసక్తుడై వొచ్చి
నీ ధమ్మిల్ల తమో మర్మంలో చిక్కుకున్న
మలయా నిలుడు
విముక్తికై ప్రాధేయ పడుతున్నాడు
కళ్ళు తెరు!

చలానికి చాలా ప్రియమైన చెల్లెలి పిల్లల్లో ఒకరు వక్కలంక నరసింహా రావు. ఆయన చితికి నిప్పు పెట్టారు మంచి గంధపు చెక్కతో, సౌరిస్-మీ ప్రేమ కొద్దీ మీరూ వేసుకోండి చితిమీద" అని అందరికీ చందనపు చెక్కలు యిప్పించింది. అంతా గంధపు చెక్కలను చితిమీద వేసారు.

ఈ చందనపు చెక్కల గురించి ఓ కథ వుంది. ఎప్పుడో ఒక ఏడాది ఆర్నెల్ల క్రితం చలాన్ని చూడ్డానికి రాయలసీమ నుంచి ఒక ఆసామీ వచ్చాడు.

ఆయన వస్తూ ఓ చందనపు చెక్కను తెచ్చి "ఇది మీ కోసం తెచ్చానండీ" అని చలానికి బహూకరించాడు, ఆయన రచయిత కాడు, పెద్ద భక్తుడు కాదు. చలం గురించి విని ఓ మాటు చూసి పోదామని వచ్చాడు. ఉత్తి చేతులతో రావడం ఎందుకని చందనపు కర్ర తెచ్చి సమర్పించుకున్నాడు ప్రేమతో.

"ఈశ్వరుడు నాకు అంత్యకాలం వచ్చిందని చందనం పంపించాడు" అని చలం చమత్కరించాడట. ఆ చందనం నిజంగా అలానే వుపయోగపడింది.

దహనకాండ పూర్తయే వరకూ ఓ గంట సభా, బాబ్జీ. రాయిడి నాగేశ్వర రావు వున్నారు. చితి మంటలు లేచి చలం కాలిపోతూంటే నాగేశ్వరరావు ఏడ్చాడు. ఇంతలో రాజు వచ్చి, కాటికాపరితో ఒక్కరుంటే చాలు, మిగతావారు వచ్చేయండి అన్నాడు. బాబ్జీ వున్నాడు. మిగతావారు వచ్చేశారు. చలాన్ని తీసుకెళ్లిన ఆ ఈజీ చైరుని కాటికాపరికి ఇచ్చి వేయగా, ఆ కుర్చీని ఒక జర్మన్ యువతి కొన్నారు. శుక్రవారం రాత్రి 9 గంటల 5 నిముషాలకు ఆయన పోతే మళ్ళీ ఆదివారం ఉదయం సరిగ్గా 9 గంటల 5 నిముషాలకు ఆయనకు అంత్యక్రియలు జరిగాయి. శనివారం నాడు కాని ఆదివారం ఉదయంకాని, ఆయన అంతిమయాత్రను ఫొటోలు తీయనివ్వలేదు. "చలం బాడీ అలా పేతటిక్‌గా వున్నపుడు ఫొటోలు తీయడం ఆ హంగామా అంతా బేడ్ టేస్ట్" అన్నాడు వజీర్. చలం చితికి వక్క లంక నరసింహారావు చేత నిప్పు పెట్టించడాన్ని వజీర్ ప్రశ్నించాడు.

"ఆయనకేం చాదస్తం లేదు. తీసికెళ్ళి మీ వాడి చేత చేయించావు. బ్రాహ్మణ్ణి ఎందుకు ఇంట్రడ్యూస్ చేశారు?"

సౌరిస్ యిలా జవాబిచ్చింది—

'ఆయన బ్రాహ్మడని చేయించలేదు, మేనల్లుడని కూడా కాదు. సొంత మేనల్లుళ్ళు వచ్చారు, వారెవరి చేతా చేయించలేదు. దూరపు మేనత్త కొడుకు మీద ఆయనకు ప్రేమ. ప్రేమకు నేను కట్టుబడ్డానండీ దేనికీకాదు.'

ఆమె ఇంకా ఇలా వివరించింది——"ఎన్నడూ రానివాళ్ళు సరిగ్గా సమయానికి, ఏవిటీయన సంగతేమీ తెలీటల్లేదు, చూసి పోదాం అని వచ్చారు. వచ్చేటప్పటికి యిదీ పరిస్థితి అని అర్థమైంది. అదేదో పిలుపు జరిగినట్టు వచ్చారు. ఆవిడ గురించి మీ కింకా చెప్పాలి. (చలం చెల్లెలు) ఆవిడ పోయినప్పుడు ఆవిడ స్పిరిట్‌ని వీళ్ళ

ఆహ్వానించి కొన్నాళ్ళు మాట్లాడేవారు. ఆవిడ మొట్ట మొదటిమాట- "అన్నయ్య- మా అన్నయ్య గురించే నేను బాధ పడేది" అని అంది. "అన్నయ్య కోసమే నేను బాధ పడేది" అని మళ్ళీ చెప్పింది. పోయి కూడా ఆ జీవికి అన్నయ్య మీద అంత మమకారం పట్టు వుందన్నమాట. అందుచేత నేను అలా చేయించడం రైటే నండీ. ఆయనకి చాలా ప్రియమైన చెల్లిలి పిల్లలన్నమాట. వీళ్ళనాన్న మా మేనత్త మొగుడు కామరాజుగారు డాక్టరాయన. ఆ పిల్లల మీద ప్రేమ కొద్దీ వాళ్ళ చేత చేయించాను. లేకపోతే వీళ్ళెవరో చితికి నిప్పు పెట్టేసేవారు. మా అమ్మకి యీయనే (కృష్ణ) కొరివి పెట్టారు, అట్టాటి సెంటిమెంట్సు నాకేంలేవు. కాని ఆయన ప్రేమ వాళ్ళమీద అటువంటి ప్రేమ. అందుకే యితనే పెట్టాలని అనుకున్నా. పైగా ఈ నరసింహారావు, యింతమంది మేనల్లుళ్ళు న్నారు కాని అచ్చు నాన్నలా వుండే వాడు యితనొక్కడే. నాన్న చిన్నప్పుడు వుండే వాడు అట్టా వుంటాడన్న మాట- అంత పోలిక. అందుకనే అందరూ సంతోష పడ్డారు. మావయ్య అనే ప్రేమ వాళ్ళకి వున్నా, ఎంతో సేవ చేసి జీవితా లంతా ఆయనతో గడిపి ఆయనన్నంతగా ప్రేమించిన వాళ్ళు వీళ్ళు (కృష్ణ, బసవ రాజు) కాని, నేనట్లా చేయించేప్పటికి, నిజంగా రియాక్షన్ రావడమనేది సహ జమే. ఏవిటండీ యిట్టాంటి పని చేశారు. అని ఆయనే (వజీర్) అడిగారు. వీళ్ళంతా వచ్చి అర్థం చేసుకున్నారు. ఎందుకంటే మా అమ్మ పోయినప్పుడు యీయన (కృష్ణ) చేతే పెట్టించాను తల కొరివి. ఆవిడ కెవరూ పుట్టింటి తరుపున లేరు. దూరాన కజిన్ ఓ బావగారున్నారు. అప్పుడు నేనెవరికీ తెలపలేదు. రాకపోక లుంటే తెలప వచ్చు కాని, ఎక్కడో యీవిడ చితికి నిప్పు పెట్టించడానికి అతడ్ని పిలిపించడ మెందుకు? ఆవిడకి బ్రాహ్మణభక్తి ఎక్కువ. బ్రాహ్మడ్ని పిలిపించాం. అయితే ఆవిడ యిచ్చిన సూచనల ప్రకారం నేనేమీ చేయించలేను. నాకు తోచినట్టే నేను చేయించాను. ఈయన్ని మీరేమో కొడుకుగా (కృష్ణ) వుండండి అన్నా. అంతే నిప్పు పెట్టాడు. ఏ బ్రాహ్మణ్నో యిక్కడకి రమ్మని మేం అనలేదు. అస లిక్కడ వాళ్ళని బ్రాహ్మలు అను కోరెవ్వరూ, మా కట్టాటి సెంటిమెంట్సు లేవు. మిగతావి బ్రాహ్మలే చేశారు, ఎందుకంటే ఆవిడకాపట్టింపు వుందికనుక. అందు

కనే బ్రాహ్మల్ని పిలిపించాం, పాడె కట్టారు, తీసి కెళ్ళారు, దహనంచేశారు. అందుకనే నాన్నకి అది గూడా చేయించలేదు. నా కిష్టం లేదు.



చలం భార్య శ్రీమతి రంగనాయకమ్మ
సమాధి, రమణస్థాన్

ఆ ఆదివారం ఉదయం చలం భౌతిక కాయానికి నిరాడంబరంగా అంత్య క్రియలు చేసి వచ్చాక, మామూలుగా సుమారు ఓ యాభై మంది వరకూ రమణ స్థాన్‌లో భోజనాలు చేశారు. ఎవరెవరు వెళ్ళి పోవాలనుకున్నారో వాళ్ళు వెళ్ళి పోయారు సెలవు తీసుకుని. ఆ రాత్రి భజనలో సౌరిస్ గొంతు మూగ పోయింది. పాడలేదు. ఆమె వీణ కూడా పలకలేదు. లాంఛనంగా నాగేశ్వరరావు 'సుధ' నుంచి చలంగారి పాటలు కొన్ని పాడారు.

మర్నాడు శ్మశానంలో పాలు పొయ్యడానికి మాత్రం నరసింహారావుని వుంచేశారు. సభా వెళ్తా నంటే ఉండమన్నారు, సౌరిస్ కజిన్ పదోరోజు వరకూ వుంటా నన్నాడు,

"నా కటువంటి వేవీ తెలీవు. శుభ్రంగా వెళ్ళి పోవాలంటే వెళ్ళి పోండి." అని సౌరిస్ చెప్పింది. పద్మనాభ స్వామి ఆదివారం రాత్రి వెళ్ళారు.

సోమవారం ఉదయం 7 గంటలకు చెంబుతో పాలు తీసుకుని చలం మేనల్లుడు నరసింహారావు శ్మశానానికి వెళ్ళి చితిమీద పోశాడు. ముందు రోజు దహన క్రియలకు వచ్చిన వారంతా సౌరిస్‌తో సహా యమలింగాల దేవాలయం సమీపాన, అరుణగిరికి వామ భాగాన వున్న శ్మశానానికి చితా భస్మాన్ని అస్తికలను సేకరించడానికి ఓ మట్టిపాత్ర, తెల్లని బట్ట తీసుకుని వెళ్ళారు. తలో గరిటెడు పాలు పోశారు. ఆయన కూర్చునే చక్రాల కుర్చీ కూడా వచ్చింది. యమలింగాల దేవాలయ సమీపానికి.

ఆ బూడిద తెల్లగా రజితభస్మంలా వుంది. మంచు ముద్దలా కూడా కనిపించింది అన్నాడు సభా. బసవరాజు, బాబ్జీ. సభా అస్తికలను ఏరారు. ఆ భస్మ రాశిని తడుపు కుంటూ. అస్తికల కలశానికి తెల్లని వస్త్రాన్ని కప్పి, దానిని చక్రాల కుర్చీలో పెట్టి రమణస్థాన్‌కి తెచ్చారు.



రమణస్థాన్‌లో చలం సమాధి

ఈ అస్తికల కలశాన్ని రమణస్థాన్ ప్రవేశంలో చలం భార్య రంగనాయకమ్మ సమాధి పక్కనే పాతి పెట్టి, సరిగ్గా అలానే వర్తులాకారంలో సమాధి

కట్టారు. చలం సమాధి మీదకు లతలూ అవీ యింకా పాకటంలేదు, కొత్త గనుక ఆయన పెంచిన శునకాలు రెండూ వెళ్ళి అక్కడే చలం సమాధి దగ్గర పడుకుంటాయి.

రమణాశ్రమంలో రాజయ్య గారనే తెలుగు వారువున్నారు. అంతా వెళ్లాక ఆయన ఒక బ్రాహ్మణుడిని తీసుకు వచ్చి పుణ్యా వచనం చేయిస్తామన్నారు. "నాకేం అభ్యంతరం లేదు. నా కసలేమీ తెలీదు. కాని, ఎవరైనా చేసుకుంటానంటే నా కభ్యంతరంలేదు. సరే చేసుకోండి" అంది సౌరిస్.

బ్రాహ్మణుడు వచ్చి ఏం చేయాలో పుణ్యా వచనం అదీ, పూజ అంటే తెలియని సౌరిస్ చేత అవన్నీ చేయించాడు. ఏవిటీ మీ చేత చేయిస్తున్నాడని అంతా నవ్వారన్న మాట. "ఈ కర్మ కాండలూ అవీ నాకు తెలీదు. ఇవేవీ ఎవరికీ చేయలేదు. పడుకునేప్పుడు నిర్మలంగా వుండటానికి రోజూ భజన అనేది ఓటి పెట్టించాడు నాన్న. తరువాత ఈ గురువు ఋణ మెప్పుడు తీర్చు కుంటారు మీరు అని భగవాన్ పుట్టిన రోజు జయంతి చేయించాడు. అంతేగాని, మాకు మతంతో సంబంధంలేదు. ఈశ్వరుడు వచ్చిన రోజు ఆగష్టు 15 అన్న మాట. రమణస్థాన్‌లో ఈశ్వరుడు వచ్చిన రోజు ఉత్సవం చేస్తాం" అంది సౌరిస్.

పదవ రోజు స్నేహితులు, కొంతమంది భక్తులూ, అభిమానులూ వచ్చారు. ఆ రోజు చలం గారికి వారి భార్యకు ఎలా చేశారో అలానే జరిపించారు. ఈ వైశాఖ మాసంలోనే బుద్ధ పౌర్ణిమనాడు చలం లేకుండా మొదటిసారి ఆయన పుట్టిన రోజు వచ్చింది. తుపాను బాధితులు వచ్చారు. భజనలు అవీ చేశారు.

"చలం పుట్టిన రోజు చేసుకుంటే అభ్యంతరం లేదు. వాటితో నాకు సంబంధంలేదు." అంది సౌరిస్. ఇంకా ఆమె వివరంగా యిలా చెప్పింది-

"నాకు రెలిజియన్‌తో అసలేం సంబంధం లేదు. రెలిజియన్ అంటే ఏవిటో నాకు తెలీదు. ఏదో ఈశ్వరుడు ఏదో కొన్ని చేయమన్నాడు. అవి మాత్రం నేను చేస్తాను. అంతే. అంతే తప్ప రెలిజియన్ ఏం చెప్తుందో, రెలిజియన్ ఏవిటో, అది ఏ రెలిజియన్‌కి నేను సంబంధిస్తానో.... నాకు బ్రాహ్మణతత్వమే లేదు. నేను ఏ రెలిజియన్‌కి సంబంధించిన దాన్ని ? దేనికీ కాదు."



రమణస్థాన్‌లో సౌరిస్

మాసికాలు పెట్టాలో మానాలో సౌరిస్ ఏమీ నిర్ణయించుకోకుండానే కలలోకి వచ్చి 'మాసికం అదీ నాకిష్టంలేదు' అని చలం డైరెక్షన్ ఇస్తున్నాడు సౌరిస్‌కి. ఆమెకు మరొక కల వచ్చింది. ఆ కలలో 'అగస్త్యునికి అంత్యక్రియ లయాక నాన్నకి జరపాలి' అని డైరెక్షన్ వచ్చింది. ఏమిటండీ ఇట్లా కల వచ్చింది అని కృష్ణతో సంప్రదించింది సౌరిస్. తీరా కేలండర్ తెప్పించి చూస్తే, 1979, జూన్ 3వ తేదీన అగస్త్యులవారి అస్తమయం అని వుంది. జూన్ నాలుగేమో చలం పోయిన రోజు. నెల అయింది అప్పుడే. కలలో చలం కోరినది' అగస్త్యులవారికి అయాక నాకు చేయండి' అని. మళ్లీ 'నాన్నకు చేయండి' అని మరెవరో చెప్తున్నట్లు సౌరిస్‌కి అనిపించింది.

'పదో రోజు అయిన తర్వాత నా బాధ్యతలన్నీ పోయినయ్. నేనేం చేయించ బోవటంలేదు నాన్నకి' అని స్పష్టంగా అందరికీ చెప్పింది సౌరిస్. అప్పుడు కృష్ణతో సౌరిస్ యిలా అంది—

'ఏమిటండీ అగస్త్యులవారి తర్వాత నాన్నకిక చేయించే దేవిటి? ఆయన అంత్యక్రియలన్నీ అయిపోయినయ్ గదా' అన్నాక-జూన్ 3 అగస్త్యులవారి అస్తమయం అని వుంది.

'ఏం చేస్తాం మరి నాకేం తెలియదు' అంది సౌరిస్.

'మాసికాలు ప్రతి మాసం పెడుతూ వుండాలి. పెడుతూంటారు' అన్నాడు కృష్ణ. ఎలా చేయాలని ఆమె అడిగిన మీదట—

'ఏదో బ్రాహ్మడిని పిలిచి స్వయం పాకం అదీ యిస్తాంమేం' అన్నాడు కృష్ణ.

బ్రాహ్మణుడికి బట్టలు పెట్టమని డాలీ యిచ్చి వెళ్ళింది. అప్పుడు బ్రాహ్మణుడు వచ్చినప్పుడు డాలీ యిచ్చిన బట్టలు పెట్టించారు. సంస్కృత పాఠశాలలోని ఒక ఘనాపాఠీకి యిప్పిం చేశారు.

మృతుల విషయంలో వైదికంగానో అవైదికంగానో ఏదో ఒక రూపంలో ఛాయా మాత్రంగా జరగవలసినవి జరిగిపోతూ వుంటాయి. లేకపోతే తెలిసి తెలిసీ మనసు పీకుతుంది. ఎవరితృప్తి వారిది.

టాగూర్ ఉత్తరణిలో చలమే తెలిగించినట్లు,

నేను వెళ్ళిపోవలసిన రోజున

మబ్బుల్ని చీల్చుకుని వెలుగుతాడు సూర్యుడు

.... .... .... ....

జ్యోత్స్నానిబిడ నిశ్శబ్దంలో

కరిగిపోయే కన్నీటి గానంలో

నేను వదిలిపోయే ప్రపంచ గుసగుసల్ని

అపరిచిత పుష్పవసంత భానుద్యుతిలో సుఖించే

దూర సింధు వలయిత ద్వీప శ్వాసనీ.

నా దగ్గిరికి తీసుకొస్తుందా సమీరం.

చరాచర ప్రపంచాన్ని
సహస్ర కరాల ఆలింగనంతో
దేదీప్యమానంగా హత్తుకునే
హిరణ్యగర్భుడి అవ్యాజమిత్రత్వాన్ని
హర్షించిన హృదయ మొక్కటీ లేదు.

# 5

# ఆనంద హారతి

తెలుగు పత్రికలు తప్ప చలం మరణాన్ని ఎవరూ అంతగా పట్టించుకోలేదు. చలం స్థాయి రచయిత అన్నాళ్ళు అస్వస్థుడయివుండగా, ఈ అకాడమీలు, విశ్వ విద్యాలయాలు, రచయితల సంఘాలు ఎవరూ వెళ్ళి పలకరించలేదు. ఆయన గురించి ఎవరూ ఆలోచించలేదు, ఏ కొద్ది మంది వ్యక్తులో తప్ప. తెలుగు దేశం చలం పట్ల అవసాన దశలో అంపశయ్యపై భీష్ముల వారిలా వున్న చలం పట్ల చూపిన నిర్లిప్తత తెలుగు వారి దివాళాకోరుతనానికీ, నిర్లక్ష్యానికి. హిపోక్రసీకి భయంకరమైన ఉదాహరణగా చరిత్రలో నిలిచిపోతుంది.

చలం స్థాయి రచయిత మళ్ళీ మళ్ళీ పుట్టడు. మరే దేశంలోనో చలం జన్మించి వుంటే ఆయనకు బ్రహ్మరథం పట్టేవారు. జయప్రకాష్ నారాయణ్‌కు జరిగి నంత స్థాయిలో వైద్య సదుపాయాలు కల్పించి వుండేవారు, ఆయన వుండగాఒక

live documentary తీసి వుండేవారు. ఆయన మృతిని టీ.వీ.లో కవర్ చేసి వుండేవారు. తెలుగు భాషకు, తెలుగు సారస్వతానికి ఎంతో జవం జీవం యిచ్చిన ఒక మహా రచయితను ఎలా ట్రీట్ చేయాలో తెలియని అసమర్థులు తెలుగువారని మరోసారి ఋజువయింది. ఈ ప్రభుత్వాలు ఎంత గుడ్డివి, చెవిటివి కాకపోతే, శుక్ర వారం రాత్రి అస్తమించిన చలానికి శనివారంగాక, ఆదివారం ఉదయం అంత్య క్రియలు జరిగితే, శ్రద్ధాంజలి చెప్పడానికి కూడా ఎవరూ రాలేదు. ఒక వీరుని పట్ల జాతి చూపించే గౌరవాసక్తులు యివా ?

మే అయిదవ తేదీ శనివారం ఉదయం హైదరాబాద్ ప్రాంతీయ వార్తలలో తప్ప నేషనల్ న్యూస్‌లో చలం మరణవార్త వెంటనే ప్రసారం కాలేదు. ప్రాంతీయ వార్త ఆధారంతో, తెలుగు పత్రికలు అయిదవ తేదీ సాయంకాలానికే సాయంత్రపు ఎడిషన్లలో చలం అస్తమయాన్ని ప్రముఖంగా ప్రచురించాయి, ఆరవ తేదీ యు. ఎన్. ఐ వార్తా సంస్థ చలం మరణవార్తను 'ఒక తెలుగు రచయిత 'మృతి' అన్నంత సాధారణంగా ప్రకటించింది. అప్పటికీ తెలుగు పత్రికలకు Follow up రాలేదు. యావత్ భారత దేశంలో గొప్ప ఇంగ్లీషు దిన పత్రికగా విక్రవీగే 'హిందూ' పత్రిక, చలం మృతిని యు. ఎన్. ఐ. వారిచ్చిన వార్తను చాలా నిర్లిప్తంగా క్లుప్తంగా సింగిల్ కాలంలో 'మరణాలు' అనే సాధారణ శీర్షిక కింద చాలా సామాన్యంగా ప్రచురించింది.

## "హిందూ" వార్త

## OBITUARY

### GUDIPATI VENKATA CHALAM

Hyderabad, May 5 —

Mr. Gudipati Venkatachalam, a Telugu writer died last night, at the Ramanashramam at Tiruvannamalai, where he had been living for the last three decades. He was 84,

The Ashramam President, Mr. P. N. Venkataraman told UNI that' 'Chalam" as he was known, passed away at about 9 p. m.

"Chalam" known for his nonconformist outlook was a relentless fighter against social evils and injustice. His novel "Maidan" has been considered a landmark in the growth of Telugu literature. Among his other famous works were "Jeevitha Adarsha" and "O Puvvu Poosindi".-UNI.

ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో వేల కాపీలు అమ్ముకునే హిందూ పత్రిక, హైదరాబాద్ ఎడిషన్ లో కూడా చలం గురించి మరణ వార్తను ప్రకటించడం మినహా మరే వివరాలు సేకరించలేదు. చలంపై ప్రత్యేక వ్యాసం ప్రచురించే శ్రద్ధ ఆ పత్రిక తీసుకోలేదు. డాస్టొవిస్కీ, లియోటాల్‌స్టాయ్ కోవకు చెందిన రచయితలు ఆంధ్ర దేశంలో పుట్టడానికి ఎలా అవకాశంలేదో, అలాగే చలం. కృష్ణశాస్త్రి, శ్రీశ్రీల వంటి రచయితలూ కవులూ తమిళనాడులో తలక్రిందులా తపస్సు చేసినా పుట్టరు. విజయవాడ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ మాత్రం, తెల్ల బుష్‌షర్ట్‌లో నవ్వుతున్న చలం ఫొటోతో, మరణ వార్తను రెండు కాలాల శీర్షికతో జీవిత వివరాలతో ప్రముఖంగా ప్రచురించింది. డక్కన్ క్రానికల్, హైదరాబాద్ నుంచి వెలువడే ఆంగ్ల దిన పత్రిక ఆవేదనా పూరితమైన స్వరంతో సంపాదకీయం రాసింది. తెలుగులో ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి చలానికి జోహార్లర్పిస్తూ ఆయన కృషిని సమీక్షిస్తూ సంపాదకీయాలు రాశాయి.

రమణస్థాన్‌లో ఒక చెంప ఆయనకు అంత్యక్రియలు జరుగుతుండగా చలం గౌరవార్థం 1979 మే 6వ తేదీ నాటికే 'అసాధారణ రచయిత' అనే శీర్షిక కింద ఆంధ్రజ్యోతి మొట్టమొదటి సంపాదకీయాన్ని ప్రచురించింది. శ్రీ నండూరి రామమోహనరావు రాసిన సంపాదకీయ వ్యాఖ్యను యథాతథంగా యిక్కడ పొందు పరచడమైనది.

ఆంధ్రజ్యోతి సంపాదకీయం

## అసాధారణ రచయిత

చలం గారిని పోలిస్తే ఒక నిర్ఛిద్ర సముద్రంతో పోల్చాలి. ఒక మహా జలపాతంతో పోల్చాలి. ఒక ఝంఝూనిలంతో పోల్చాలి.

చలంగారి అస్తమయంతో ఒక సముద్రం స్తంభించినట్టు, ఒక జలపాతం నిశ్చలమై పోయినట్టు, ఒక ఝుంఝూనిలం శాంతించినట్టు.

అరవై ఏళ్ళనాడు గుడిపాటి వెంకట చలంగారు ఆంధ్ర సాహిత్యంలో ఒక సుడిగాలి వలె, ఒక పెద్ద వరదవలె ప్రవేశించారు. సంఘంలో, సాహిత్యంలో, ప్రజల ఆలోచనలలో తరతరాలుగా పేరుకు పోయిన కశ్మలాన్ని కడిగి వేశారు. చెత్తాచెదారం, దుమ్మూ మాగర ఎగర గొట్టారు. కొత్త గాలికి తలుపులు తెరిచారు. కొత్త భావాలకు లాకులు ఎత్తివేశారు.

ఒక గొప్ప రచయిత ప్రవేశం తర్వాత ఏ సాహిత్యం యథాతథంగా మిగలదు. దాని స్వరూపం మారిపోతుంది. దాని స్వభావం మారిపోతుంది. సాహిత్యం పై అతడు తన ప్రభావాన్ని ఎన్నటికీ చెరగని విధంగా ముద్రిస్తాడు.

చలంగారు చేసిన పని అదే. తెలుగు వచన స్వరూపాన్ని, రచనా స్వభావాన్ని మార్చి వేశారు. సమకాలిక రచయితల పైన, తర్వాత తరం వారిపైన తన ప్రభావముద్ర వేశారు.

ఆ నాడు ఆయనను గురించి రెండే రెండు అభిప్రాయాలు. విమర్శిస్తే అతి తీవ్రంగా విమర్శించడం, లేదా అంతే గాఢంగా అభిమానించడం. మరొక అభిప్రాయానికి - ఫరవాలేదు బాగానే వ్రాస్తాడు అనో, లేదా ఏమి వ్రాశాడు లెద్దూ అనో చప్పరించి వేయడానికి - వీలులేని రచనలు ఆయన చేశారు.

"చలం ఏమిటి, ఇలా వ్రాసాడు? ఇంత పచ్చి బూతులా? ఇంత బరితెగింపా? అవినీతిని, విశృంఖలత్వాన్ని బోధిస్తున్నాడే; సంఘాన్ని, ముఖ్యంగా వివాహవ్యవస్థను కూకటివేళ్ళతో సహా కూలద్రోయడానికి యత్నిస్తున్నాడే; హిందూ సంప్రదాయాన్ని, ఆచారాలను, విశ్వాసాలను, కులభేదాలను మంట గలుపుతున్నాడే?" —ఆయనను ద్వేషించిన వారి విమర్శ ఇది.

కాని, విమర్శలకు చలంగారు చలించలేదు. తాను నమ్మిన సిద్ధాంతాల కోసం సంఘానికి, వ్యక్తులకు ఏది శ్రేయస్కరమని తాను భావించారో ఆ విలువలకోసం ఆయన పుంఖానుపుంఖంగా రచనలు చేస్తూనే పోయారు.

"సెక్స్‌తో సహా అన్ని విషయాలలోను స్త్రీకి పురుషునితో సమానమైన హక్కు లుండాలి. యుగయుగాలుగా పురుషుడికి స్త్రీ బానిసగా పడి వుంది. పురుష

సమాజం స్త్రీని అణగద్రొక్కి వేసింది. ఆమె ఒక వ్యక్తి అని, ఆమెకొక వ్యక్తిత్వం వుంటుందని, ఆమెకు కూడా సొంత ఇష్టాయిష్టాలు, అభిరుచులు, స్వేచ్ఛానురక్తి వుంటాయని ఊహించలేదు. కేవలం పిల్లలను కని, వంటచేసిపెట్టే మరబొమ్మగానే స్త్రీని పురుషుడు పరిగణించాడు. ఇది అన్యాయం. పురుషునికున్న స్వేచ్ఛ స్త్రీకీ వుండాలి. అప్పుడుగాని ఆమె వ్యక్తిత్వం పరిపూర్ణత్వం చెందదు" అని చలంగారు ఆనాడు ఘోషించారు. కాలానికి ఎదురీదుతూ, గొప్ప ఆత్మవిశ్వాసంతో అచంచల ధైర్య సాహసాలతో ఆయన తన భావాలను ప్రచారం చేశారు. తన మొత్తం సాహిత్యాన్ని తన సాంఘిక విశ్వాసాలకు అంకితం చేశారు.

ఎన్ని రచనలు? ఒక పెద్ద ఉప్పెన వలె చలంగారి రచనలు ఆంధ్రదేశంపై విరుచుకు పడ్డాయి. ప్రేమలేఖలు, మ్యూజింగ్స్, దైవమిచ్చిన భార్య, శశాంక, చిత్రాంగి, పురూరవ, మైదానం, బ్రాహ్మణీకం, అమీనా, అరుణ—ఇంకా ఇంకా ఎన్నో అసంఖ్యాకమైన నవలలు, నాటకాలు, కథలు. ఇతర రచనలతో, వాటిలోని విప్లవాత్మక భావాలతో ఆయన తెలుగు వారిని ఉక్కిరి బిక్కిరి చేశారు.

తన భావాలను కాదని, తన వచన శైలిని ఎవరైనా మెచ్చుకుంటే ఆయన సహించేవారు కాదు. "నా భావాలనుంచి, నా ఆవేశాల నుంచి నా శైలిని విడదీయవద్దు. అవి పరస్పరాశ్రితాలు" అని ఆయన అనేవారు. అయినా, తెలుగులో వ్యావహారిక వచనాన్ని తీర్చిదిద్దిన కొద్ది మందిలో ఒకరుగా ఆయన చరిత్రలో నిలిచిపోతారు. ఒకసారి ఆప్యాయంగా కబుర్లు చెబుతున్నట్టు, మరొకసారి అదిలిస్తున్నట్టు ఒకసారి మృదువుగా, మరొకసారి తీక్షణంగా వుండేది ఆయన భాష. తెలుగు దేశపు ప్రకృతిని అంత అందంగా, అనురక్తితో వర్ణించిన ఆధునిక రచయిత మరొకరు లేరనడం అతిశయోక్తి కాదు. ఆయన ఛందోబద్ధంగా వ్రాయలేదుగాని, వచనంలోనే కవితా సౌరభాన్ని గుబాళింప జేసేవారు.

తొలినుంచి ఆయనలో ఒక ద్వైదీభావం వుండేది. ఒకటి హేతువాదం, రెండవది విశ్వాస వాదం. చివరకు రెండవదే గెలిచింది. ముప్పదేళ్ళనాడు ఆయన ఆంధ్రదేశాన్ని వదిలి అరవ దేశానికి మహాభినిష్క్రమణం చేశారు. తిరువణ్ణామలైలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. జీవిత ప్రథమార్థంలో నిరీశ్వరవాదిగా, లేదా అజ్ఞేయవాదిగా పేరుపొందిన చలంగారు మలి దశలో పూర్తిగా ఈశ్వరవాదిగా మారిపోయారు, ఇదొక విచిత్ర పరిణామం.

చలంగారిని తెలుగువారు చిరకాలం జ్ఞాపకం పెట్టుకుంటారు కాని, హేతు వాదం నుంచి భగవద్విశ్వాసానికి మారిన చలంగారిని కాదు. సంఘ దురాచారాల మీద, మతం మీద ధ్వజమెత్తి, స్త్రీ స్వేచ్ఛ కోసం, వారికి సాంఘికన్యాయం కోసం పరితపించిన మానవతా వాదిగా చలంగారిని జ్ఞాపకం పెట్టుకుంటారు. సమ కాలికుల ఆలోచనాధోరణిని సమూలంగా మార్చి వేయడానికి కలం పట్టిన అసాధా రణ రచయితగా ఆయనను కలకాలం జ్ఞాపకం పెట్టుకుంటారు.

ఆంధ్రభూమి దినపత్రిక పదవతేదీ సంచికలో శ్రీ గోరాశాస్త్రి ఎంతో ఆవేదనతో చలానికి సమర్పించిన శ్రద్ధాంజలి యిది.



## సాహితీ విరాట్ పురుషుడు చలం

వెనుకటికి ఒక కవిగారు "వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరొ తెల్పుడీ" అంటూ అన్వేషించారు. పూర్వం రకరకాల వీరులుండేవారేమో కాని, ఇవాళ సమా జానికి రాజకీయనేతలు మాత్రమే వీరులు, వీర మూర్ధన్యులూ, సమస్త రంగాలనూ

రాజకీయాలు శాసిస్తున్నాయి. కాబట్టి రాజకీయనేతలే మనకు ఆరాధ్య దైవాలు. వార్తా పత్రికల్లో అనుదినం వాళ్ళ సంరంభాలు, వృత్తాంతాలు మాత్రమే వెలువడుతూ వుంటాయి. సర్వం ఖల్విదం బ్రహ్మ అన్నట్లు నేడు సర్వమూ రాజకీయమే. ఆ రాజకీయ నేతల్లో పదవిలో ఉంటూ ఉన్న ఒక అమాయకుడు మరణించినాసరే ఆ వార్త పతాక శీర్షికల్లో ప్రచురితమవుతుంది. ఆయన నిర్యాణానికి సంతాప సూచకంగా సర్కారు వారు సెలవుదినం ప్రకటిస్తారు. ప్రముఖులందరూ తెచ్చి పెట్టుకున్న గద్గద స్వరంతో ఒక మహాతార రాలిపోయిందని, ఒక వటవృక్షం కూలిపోయిందని, అంతటి మహానుభావుడు లేనిలోటు పూడ్చడం ఎవరితరమూ కాదనీ నిట్టూర్చుతారు. అలాంటి అమరమూర్తుల కీర్తి క్షణభంగురమని అందరికీ తెలుసు. కాని ఆమాట పైకి చెప్పడానికి జంకుతారు. రాజకీయాలే మన ఊపిరి.అవే మన దైనికాహారం. ఇది కలియుగమవునో కాదో కాని, నిస్సందేహంగా రాజకీయ యుగం. విలువలు ఈ తీరుగా ఉన్నాయి కనుక, క్రిందటి శుక్రవారం రాత్రి తిరువణ్ణామలైలో ఒక 85 సంవత్సరాల వృద్ధుడు మరణిస్తే, దేశం సంగతటుంచి, మన రాష్ట్రం కూడా అంతగా పట్టించుకోలేదు. ఆ వృద్ధమూర్తి పూర్తి పేరు గుడిపాటి వెంకటచలం. తెలుగుసాహితీలోకానికి చలం అనే కలం పేరుతో ఆయన సుమారు అర్ధశతాబ్దం నుండి ప్రసిద్ధుడు. గుడిపాటి వెంకట చలం కనుక బ్రిటన్‌లో జన్మించి ఉంటే, ఆయన అంత్యక్రియలు వెస్ట్ మినిస్టర్ అబే అనేచోట జరిగి ఉండేవి. ఇంగ్లండ్‌లోని సాహితీ దిగ్గంతులకు అది రాజ్‌ఘాట్. బ్రిటిష్ రాజవంశీకుల సమాధుల పక్కనే సాహితీవేత్తల సమాధు లుంటాయి. చలంగారితో తుల్యుడైన ఇంగ్లీషు రచయిత మరణించి ఉంటే, అక్కడ పత్రికలు రాజకీయవేత్తల వార్తలను పక్కకుపెట్టి, ఈ వార్తకు పతాక శీర్షిక ఇచ్చి వుండేవి. అక్షరాస్యులైన బ్రిటిష్ వారందరూ కంటతడి పెట్టి వుండేవారు. సాహిత్యానికి అక్కడ అంత పెద్దపీట ఉంది.

తెలుగుదేశం ఇంగ్లండు కాదు. చలం గారి మరణవార్తను తెలుగు దిన పత్రికలు మాత్రమే ప్రముఖంగా ప్రకటించాయి. ఇంగ్లీషు పత్రికలు సింగిల్ కాలముతో సరిపెట్టాయి. ఈ రకమైన ఉదాసీనతవల్ల చలంగారి ఆత్మ ఖేదించదు. జీవించినంతకాలమూ ఆయన ప్రచారాలకు దూరంగా ఉండేవారు. నిరాడంబరంగా జీవించి, అంత నిరాడంబరంగానూ తనువు చాలించారు. అకాల మరణం అనడానికి వీల్లేదు. సహస్రమాసైక జీవి. జీవిత చరమకాలంలో రుజాభారంతో కృంగి

పోయారు. ఒక రకంగా మరణం ఆయన బాధలన్నిటికీ విముక్తి కలిగించింది. తెలుగు సాహితీ జగత్తులోని ప్రభంజనం చల్లారిపోయింది. జీవితాంతమూ ఆయన సంఘంతో యుద్ధం చేస్తూనే వచ్చారు. ఆయన ఆయుధం కలం, ఐతే అది చిచ్చర పిడుగులు కురిపించేది. అగ్నిగోళాలు వర్షించేది. విసూవియస్ అగ్నిపర్వతం నుండి లావా వెలువడినట్లు ఆయన లేఖిని నుండి సాంఘిక దురాచారాల పట్ల అమానుష సంప్రదాయాలపట్ల ఆగ్రహజ్వాలలు వెలువడేవి. సుమారు మూడు దశాబ్దాలపాటు అవిశ్రాంతం రచనలు సాగించి తెలుగు సాహితీ లోకంలో విరాట్ పురుషుని వలె వెలుగొందారు. ఆయన మార్గంలో ఆయనకు సాటి మరెవరూ లేరు. చలం పేరు చెపితే సంప్రదాయవాదులు, ఛాందసులు, మర్యాదస్తులు గజగజ లాడేవారు. పేరు వినబడితే చాలు, హరి హరీ అని చెవులు మూసుకునేవారు. ఆయన రచనలు తుచ్ఛ శృంగార భూయిష్ఠమైనవి. యువతీ యువకుల మనస్సులను పాడు చేస్తు న్నాడని ఘోష పెట్టేవారు. "అతడి పుస్తకాలు చదవద్దు, అతడు సభ్యతా సంస్కృతుల పాలిటి మైరావణు.... వివాహ వ్యవస్థను కూలద్రోసి విశృంఖల కామాన్ని ప్రోత్సహిస్తున్న దుష్టుడు" అంటూ పెద్దవాళ్ళు తమ కొడుకులకూ, కూతుళ్ళకూ, భార్యలకూ హితబోధ చేసేవాళ్ళు. పిన్న వయస్కులెవరైనా చలం పుస్తకం చదువుతూ పట్టుబడితే తీవ్రమైన శిక్షలకు గురయేవారు. సంఘ పెద్దలు చలాన్ని దూషించారు. దుర్భాష లాడారు. విమర్శించారు, మర్యాదస్తుల సంఘం నుండి వెలివేశారు. ఇంతటి దుమారాలు లేపి ఇన్ని విమర్శలకు గురైన రచయిత వెయ్యి సంవత్సరాల తెలుగు సాహిత్య చరిత్రలో మరొకరు లేరనడం అతిశయోక్తికాదు. దూషణలన్నిటినీ ఆయన చిరునవ్వుతో భరించారు. ముళ్ళకిరీటాన్ని సంతోషంగా ధరించారు. అంతేకాని కించిత్తు భయపడలేదు. తాను నమ్మిన సిద్ధాంతాల ప్రచారాన్ని మానుకోలేదు. ఎనభయ్యవ పడిలో పడిన తరవాత ఆయనకు ఆంధ్రాయూనివర్సిటీ కళాప్రపూర్ణ బిరుదాన్నిచ్చింది. తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవ చేశారని ప్రస్తుతించింది. సాహితీ జగత్తులో మేరునగధీరుడని కొనియాడింది. అంత్యదశలో చలంగారు అమాంతం మర్యాదస్తులైనారు. ఆయన మహోన్నత ప్రతిభను సంఘం గుర్తించింది. ఆయనను ఋషితుల్యుడన్నారు. ఆధ్యాత్మికశక్తిసంపన్నుడన్నారు. ఇంకా ఏమేమో ప్రశంసలందించారు. ఒకనాటి దుర్మార్గుడు చలం చరమ దశలో మహర్షితుల్యుడైనాడు. లోకం తీరు అలాంటిది. ఒకప్పుడు రాళ్ళు రువ్వారు. ఆయన శృంగార రచనా వ్యాసంగాన్ని కట్టిపెట్టిన తరవాత పూల వర్షం కురిపించారు.

బ్రిటిష్ తత్వవేత్త భావుకుడు. మహారచయిత థామస్ కార్లయిల్ సంఘానికి ఎన్నడైనా సాహితీవేత్త ఒక్కడే మార్గ దర్శకుడని మహావీరుడని సిద్ధాంతీకరించారు. ఆయన సిద్ధాంత ప్రమాణాన్ని అన్వయిస్తే తెలుగు జాతికి చలం మహావీరుడు. పసువంపు వయస్సులో ఆయన పదునైన కలాన్ని చేపట్టి తెలుగు సాహితీగతిని కొత్త మలుపు తిప్పారు. ఆయన చేపట్టని సాహిత్య ప్రక్రియలేదు. కథ, కథానిక, నవల, నాటకం, కవిత, వ్యాసం, లేఖాసాహిత్యం. అన్నిటిని చేపట్టి ప్రతిప్రక్రియ లోనూ సిద్ధహస్తుడనిపించుకోవడమే కాక కొత్త శిఖరాలందుకొని కొత్త ప్రమాణాలు నెలకొల్పారు. తెలుగు సాహిత్యానికి ఆయన కలం పసుసవేది వంటిది. దానితో ఆయన బంగారు పంటలు పండించారు, పురుషాధికారానికి, అహంకారానికీ గురియై నలిగిపోతున్న స్త్రీల తరపున ఆయన కలం పట్టి వాళ్ళ స్వేచ్ఛకోసం నిర్విరామ సంగ్రామం జరిపారు. ఆర్థికంగా, సాంఘికంగా, ఆఖరికి లైంగికంగా, స్త్రీకి పరిపూర్ణ స్వేచ్ఛ ఉండాలన్నారు. సంఘం తాలూకు కొడిగట్టిన అంతరాత్మను ఆయన ఛెళ్ళున కొరడా దెబ్బలు కొడుతూనే వచ్చారు. తెలుగునాడులో స్త్రీ స్వాతంత్ర్య పోరాటానికి నిజంగా అంకురార్పణ చేసింది చలం. సాహిత్యాన్ని మహత్తర ఆయుధంగా వినియోగించుకుని వ్యవధిలేని సంగ్రామం నడిపించారు. సర్వవిధాలా స్త్రీకి పురుషునితోపాటు సమాన ప్రతిపత్తి ఉండాలన్నారు. ఆయన కలం కదనుతొక్కిన రోజుల్లో ఆయన వెళ్ళినంత దూరం పయనించడానికి స్త్రీలుకూడా భయపడ్డారు. కొందరి అభిప్రాయం ప్రకారం చలంగారు విప్లవకారుడు కాదు. ఆమాట కొంత వరకూ నిజమే. ఐతే ఆయన సంఘంమీద సాహసోపేతంగా తిరుగుబాటు చేశారు. ఆయన సృష్టించిన స్త్రీ పాత్రలన్నీ తిరుగుబాటుకు ప్రతీకలు. ఐతే ఆ పాత్రలన్నీ విషాదాంత నాయికలు. ఆనాటి ఛాందస సంప్రదాయాల రోషాగ్నికి బలిదానమైన మహిళలు. తన రచనల్లో చలంగారు సమృద్ధిగా సెక్సును రంగరించేవారు. నాటికి నేటికీ సంఘమూ సాంఘిక విలువలూ పోల్చుకోలేనంతగా మారిపోయాయి. కాబట్టి ఇవాళ ఆయన రచనలు "షాకింగ్"గా అనిపించక పోవచ్చును. ఆనాడు అశ్లీలమనుకున్నది నేడుకాదు. ఐతే ఇంతటి సాంఘిక విప్లవానికి భావవిప్లవానికి బాట వేసిన వారిలో ఆయన అగ్రగణ్యుడు. తన తరువాత తరం రచయితలకు ఆయన స్ఫూర్తినిచ్చి ధైర్యం చెప్పారు. రచనల్లో అంత విశృంఖల కామాన్ని ఎందుకు వర్ణిస్తారని అడిగితే, తన రచనలు చదివించడానికి అదొక ఎర అని జవాబిచ్చారాయన. ఆ విధంగా పాఠకుల్ని ఆకర్షించి తన సిద్ధాంతాన్ని ప్రబోధించి సంఘాన్ని మూల

వేళ్ళనుండి కదిలించడం ఆయన ధ్యేయం. అంతేకాని సెక్సును కేవలం సెక్సు కోసం ఆయన వర్ణించలేదు. ఆ రోజుల్లో ఆయన రచనలను తగులబెట్టాలని పైకి చెప్పేవాళ్ళందరూ వాటిని రహస్యంగా పడకటిళ్ళలోనూ, వంటిళ్ళలోనూ ఆప్యాయంగా చదువుకునేవారు. సాహిత్యాన్ని ఆయన ప్రచారం కోసం వాడుకున్నారు. కాని, ఆయనది కేవలం ప్రచార సాహిత్యంకాదు. సాహిత్య శిల్పంలో ఆయనది అందెవేసిన చేయి. సాహిత్య విలువలను పోషించటం విషయంలో ఆయన మహా కళాకారుడు. ఆయన ఒకొక్క రచనా ఒకొక్క కళాఖండం. కథా రచయితగా, నవలా కారుడుగా, ఆయన ప్రపంచ సాహితీ వేత్తల కోవనందుకున్నారు. ఆయన వాడినది సజీవమైన వ్యావహారిక భాష. ఆయన శైలి అనితర సాధ్యమైనది. అల్పమైన మాటలతో అనల్పమైన భావాలను వ్యక్తీకరించగలిగేవారు. భాషమీద ఆయనకున్న అధికారం అనితర సాధ్యమైనది. చిన్న చిన్న మాటలతో గొప్ప గొప్ప చిత్తరువులు కట్టేవారు. ఉండంతలో కొండంత అమర్చి ఇమడ్చ గలిగేవాడు. ఆయన కథానాయికలు ఆది భౌతికమైన స్త్రీ శక్తికి ప్రతీకలు, ఆ పాత్రలలో స్త్రీత్వం అణువణువునా ఉజ్వలంగా భాసిస్తుంది. ఆయన నాయికలు పిండిబొమ్మలు కారు, ఉద్రిక్త జీవన వాంఛలతో గుండెల్లో తుపానులు దాచుకున్న శక్తి స్వరూపిణులు. టాగూరు మహాకవి ఊర్వశిని వర్ణిస్తూ, "నహోమాతా, నహోకన్యా, విశ్వప్రేయసి ఊర్వశీ" అని గానం చేశారు. స్త్రీలోని విశ్వప్రేయసి తత్వాన్ని సందర్శించ గలిగిన రసద్రష్ట చలం.

తెలుగు సాహిత్యానికి అందించిన వారసత్వం అమూల్యమైనది, తెలుగు భాష ఉన్నంత కాలమూ ఆయన సాహిత్య సృష్టి నిలుస్తుంది. తెలుగుజాతికి తన మహారచయితలను ఎలా గౌరవించి ఆరాధించాలో తెలియదు. తెలుగు సంస్కృతిని, సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన మహా రచయిత చలం. తాను నమ్మిన విశ్వాసాలను ధైర్యంగా ఆచరణలోపెట్టి జీవించిన స్థితప్రజ్ఞుడు. తాను నమ్మిన సత్యాన్ని అనుసరించారు. కాని, తాత్కాలిక ప్రయోజనాల కోసం ఎన్నడూ వాటిని వదులుకోలేదు. వ్యక్తిగత జీవితంలో ఆయన మహాసౌమ్యుడు. దయా హృదయుడు. శ్రీమంతుడిగా జన్మించినా తాను నమ్మిన సిద్ధాంతాల కోసం ఆయన సంపదను త్యజించి మామూలు టీచరుగా జీవితం గడిపిన ఆత్మవంతుడు. ఆయన మరణంతో తెలుగు సాహిత్యంలో విరాట్ పురుషుల యుగం అంతరించింది. ఒక అమూల్యమైన

సాహిత్యరత్నమంజూషను ఆయన మనకు అందించి వెళ్ళిపోయారు. అందు కాయనకు మనస్సులోనైనా కృతజ్ఞతలు అర్పించడం తెలుగుజాతి కర్తవ్యం.

## పత్రికల కర్తవ్య నిష్ఠ

రాజకీయాలు, రాజకీయ నాయకులే, వారి అభిభాషణలే వారి రాకపోకలే పత్రికలను ఆక్రమించుకుని లోకానికి అధినాథులు వీరే అయినట్లు జీవితంలోని అన్ని రంగాలనూ కలుషితం చేస్తున్న యీ కాలంలో, కొన్ని పత్రికలు సాహిత్య రంగాన్ని దాదాపు విస్మరిస్తున్న దశలో, చలం మరణవార్తను ప్రకటించడంలో ఏ పత్రికకు ఆ పత్రిక తన విశిష్టతను చాటుకుందుకు ప్రయత్నం చేసింది. ఉదాహరణకు విజయవాడ ఈనాడు దినపత్రిక ప్రముఖ ఆధునిక వచన కవి శ్రీ వేగుంట మోహనప్రసాద్ చేత 'చలం ఆబిచ్యువరీ' కొత్త రకంగా రాయించింది. ఇరవై ఆరేళ్ళ వయసులో చలం ఫొటోను, చలం లైన్‌డ్రాయింగ్‌ను ప్రముఖంగా ప్రచురించింది.

సంప్రదాయ వాదులకే కాక అభ్యుదయ వాదులమనుకునే ఆధునికులకు కూడా చలాన్ని అంగీకరించడానికి అభ్యంతరాలున్నాయి. తను పోయాక ఈ లోకం తన మరణానికిచ్చిన ప్రాముఖ్యంతో చలానికేమీ నిమిత్తంలేదు. అందువలన ఆయనకు ఒరిగే దేమీలేదు. తమ గొప్ప రచయితలను తాము ఎట్లా గౌరవించుకున్నారనేది, అది మనకు మన సంస్కారానికి సంబంధించిన ప్రశ్న. టాగూర్, శరత్‌లకంటేకూడా ముందు చూపు కలవాడు చలం. అతను భవిష్యత్తులోకి చాలా దూరం చూశాడు.

ఈనాడు వ్యాఖ్య

## చలం మహాభినిష్క్రమణం

తిరువణ్ణామలై మే 5 —

అర్ధశతాబ్దంపాటు ఆంధ్ర దేశాన్ని, తెలుగు సాహిత్యాన్ని, ఖండించి, దీవించి, ఊగించి, శాసించి, రక్షించిన అపూర్వ శక్తి, తెలుగు సాహితీజగత్తులో

ఝంఝామారుతాలు సృష్టించి విప్లవ కెరటాలు రేపిన నవభారత సంచలనం గుడిపాటి వెంకటచలం ఇకలేడు. చాలా కాలంగా చలం చేసిన అంతర్ బహిర్ యుద్ధారావమిక ముగిసింది.

దశాబ్దాల తరబడి మాటల్ని కత్తులు, ఈటెలు, మంటలుగా మార్చిన చలం చేతికి ఇదివరకే పక్షవాతం కమ్మింది. లక్షలాది మందిని ఆలోచింప జేసిన ఆయన మాటకూడా వారంరోజుల క్రితం పడిపోయింది.

ఉద్యోగరీత్యా ఆంధ్రదేశమంతా తిరిగి, సాహిత్య లోకంలో ప్రపంచమంతా నడిచి, తెలుగు మాట్లాడే ప్రతేచోట అసంఖ్యాక అభిమానుల్ని సృష్టించుకుని చివరికి, తెలుగువారికి దూరంగా, ఆధునిక ప్రపంచానికి అతీతంగా, అరవదేశంలో అరుణాచలం మీద మౌనమే వ్రతంగా పావు శతాబ్దంపైగా గడిపి, నిన్న అనంత విశ్వంలో కలిసిపోయారు.

1894 మే 19 వ తేదీన పుట్టిన చలం టీచర్‌గా, విద్యాశాఖలో అధికారిగా ఎన్నో ఊళ్ళు తిరిగారు, ఎంద రెందరితోనో స్నేహం కలిపారు. ఆయనకు అతి సన్నిహితంగా ఆత్మీయులుగా, ఆంతరంగికులుగా సంచరించిన కవులు, రచయితలు కళాకారులు, జీవనశిల్పులు ఎందరోవున్నారు. జీవనయానంలో, మధ్యమజిలీలలో కలిసి, ఆయన స్నేహపాశంలో చిక్కి, అభిమానులై స్వాధీనులైన వారింకెందరో ఉన్నారు. ఆయనను చూడకపోయినా, రచనలు చదివి అందులోంచి ఆయన వ్యక్తిత్వాన్ని గ్రహించి, చలం కలం స్నేహితులై ప్రగాఢమైత్రిని పెంచుకున్నవారు మరెందరో ఉన్నారు. ఆయనతో ప్రత్యక్ష పరిచయం లేకపోయినా, అక్షర పరిచయంతో ఆయన భావాల ఉద్ధృతికి, శైలీ విన్యాసానికి లొంగిపోయి, ఆరాధకులైన వారు అసంఖ్యాకంగా ఉన్నారు.

దీనుల దుఃఖానికి ప్రకంపించి "కాలికింద నలిగిన చీమల కాళ్లు విరిగిన చప్పుడును" కూడా వినగలిగిన ఆర్ద్రను పెంచుకొని సామాజిక సంస్కరణకు, స్త్రీ జనోద్ధరణకూ, దీక్షపూని ఛాందసత్వాన్ని చీల్చివేస్తూ, రచనలు చేస్తున్న రోజులవి. అప్పట్లో ఆయన ఆరాధనను ప్రారంభించి, అరుణాచలం చేరుకోగానే నిరాశ పొంది, నిస్పృహతో నీరుగారిన వారు కొందరైతే, ఆయనంటే మండిపడి, ఈనాడు

ఆయనను రమణ మహర్షి శిష్యునిగా పూజించేవారు మరికొందరు. ఇప్పుడూ, అప్పుడూ ఆయన ధ్యాస, ధ్యానానికీ, మౌనానికీ, కార్యానికీ విజయాలకి.

అందువల్లనే 'సాహితీ చలం' గాను, 'అరుణా చలం' గాను కూడా ఆయన అసాధారణ సంచలనాన్ని సృష్టించారు. ఆంధ్రదేశాన్ని పెనుతుపానులా ఊపి వేశారు.

బ్రహ్మసమాజంలో కూడా ఇమడలేని స్వేచ్ఛాప్రియత్వం ఆయనది. హైందవాన్ని తిరస్కరించి ఒక కొత్త ఆంతరిక ప్రపంచాన్ని కనిపెట్టిన గొప్ప ప్రవక్త ఆయన. భగవద్గీత, జీసస్ జీవితం, రూబాయీలు అన్నింటిని తనలో ఇంకించుకొన్నాడు. నిర్భీకమైన ఆత్మ పరిశోధన ఆయన మూలతత్వం. బాధ, మరణం, దరిద్రం, అవిశ్వాసం, అశాంతి లేని మరో ప్రపంచాన్ని మహా ప్రపంచాన్ని ఊహించిన భగ్నస్వాప్నికుడు చలం.

"ఈ నికృష్ట లోకంపై
హృదయం ద్రవించి
ఎందరు మహనీయులు
ఎన్ని మతాలు బోధించారో
ఎన్ని జ్ఞానమార్గాల్ని
విశదీకరించారో
ఎన్ని సాధనలు
ఉపదేశించారో
ఎప్పుడూ కాంతి వేపు
కన్ను తెరవాలని రెప్పలెత్తే
ఈ అర్ధాంధులకు
ఈ ప్రజకోసం

— చలం

మిత్రులు, అభిమానులు బంధువులు తుది చూపు చూసేందుకు వీలుగా ఆయన అంత్యక్రియలు రేపు ఉదయం తొమ్మిది గంటలకు జరుగుతాయి.

చలంమృతికి సంతాపంగా విజయవాడలోని పుస్తక ప్రచురణ సంస్థలు నేడు మూసివేశారు.

## నెత్తురూ, కన్నీళ్ళూ కలిపిన కొత్త టానిక్—చలం

ఒక శతాబ్దం క్షణకాల మాగిపోయింది. ఒక స్వప్నం వెన్నెముక విరిగింది. ఒక సంస్కారం అశ్లీలం పలికింది. ఒక ప్రపంచ మాతృభాష అవాక్కయింది. ఒక సత్యం క్షణిక లౌల్యంలో అనృతాన్ని పలికింది.

వేదాంతి, స్వాప్నికుడు, ఆదర్శోన్ముఖుడైన ఆనార్కిస్టు, పశ్చిమ భౌతికవాది, స్వేచ్ఛాప్రియుడు, ప్రవక్త, సత్యాన్వేషి వోధార్మికవాది, తిరుగుబాటుదారుడు, మౌనశీలి చలం ఇకలేడు. చలం యుగం ముగిసింది.

ఒక వేమన, ఒక వీరేశలింగం, ఒక గురజాడ, ఒకచలం, ఒక శ్రీశ్రీ వీరే తెలుగు సాహిత్యంలో, సమాజంలో, మానవుడి బహిరంతర సంబంధాలను పట్టించుకొన్నది. సమాజాన్ని చైతన్యవంతం చేస్తే, వీళ్ళంతా, వీళ్ళలో మళ్ళీ వ్యక్తిని, అతని బాహ్యంతర సంఘర్షణలను దీప్తిమంతం చేసింది చలం.

చెలం

తెలుగు నేలమీద నీ వెల్తుకు
రమణాశ్రమం కొండెక్కి
దీపమై వెలుగుతోంది
అక్షరాక్షరానా నీ నగ్నరక్తం
ఊజయి కన్నీళ్ళుఅయి
చివరి కెవరికీ పట్టని ఎడారుల
ఇంకిపోయింది దయగా
బెంచీ మీద నుంచో మంటే
ఒంటేలు కెళ్ళొస్తానన్నవాడివి
హౌంటెన్ మీదే నుంచోని
పండిపోయేవు చెలం!

— మోహన్ ప్రసాద్

చలం రచనలన్ని అతని అంతఃకరణకు ప్రతిబింబాలు. అతనిలో విశృంఖలత్వమూ ఉన్నది. నిశ్చలత్వమూ వున్నది. ఆర్థిక పరమైన కారణాల్ని అజలోకి తీసుకోనివ్వని ఆదర్శ వాదమూ, కాల్పనిక దార్శనికతా, సంస్కారాభిలాషా, జనన మరణాల మధ్య ఇరుక్కున్న అస్తిత్వ భావ వేదనా ఆయన రచనలోని ఐతిహ్యాలు (sic). అతని రచనామయ జీవనాన్వేషణ ఒక గొప్ప ప్రశ్నాశ్చర్యార్థకం. ?!

ఏ బంధనాలూ లేని స్వచ్ఛ స్వేచ్ఛ ప్రేమని దర్శించిన చలంలో శృంగారాన్నే చూచింది లోకం. ప్రేమలో గొప్పత్యాగాన్నీ కరుణనీ కలగలిపాడు. స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలకు శరీర హృదయాలకుండే సహజ స్పందనలని, నిరూపించి మనస్సుని వికసింప చేసాడు చలం. ఈ ప్రయత్నంలోనే ఆత్మోన్నతిని పొందాడు మౌనంలో.

# స్వప్నం వెన్నెముక విరిగింది

ఆయన పాత్రలు— పద్మరాణి. శశిరేఖ, అమీనా, పురూరవ, అరుణ మృత్యువును జయించాయి. స్త్రీ జనోద్ధరణ ఆయన ఆశయం. పూర్వఆదర్శాలకు పూర్తి వ్యతిరిక్తత ఆయన విప్లవ మార్గం. ప్రేమలేఖలు, మ్యూజింగ్స్, ఆనందం, విషాదం, ఉత్తరాలు, ఉత్తరణ, కవిహృదయం మార్తాజీసస్ జీవితం; చలం (ఆత్మచరిత్ర), భగవద్గీత, వీటన్నిటిలో చలం, "కవీనాంకవిః"

భావకవుల అమలిన శృంగారంలోని మాలిన్యాన్ని ఎత్తిచూపి, తన నవలల్లో, నాటకాల్లో, కథల్లో ప్రేమలోని నిసర్గ సౌందర్యాన్ని వెలిగించాడు. అతని భావ వాదం అంతటా సౌందర్య తృష్ణ, సంఘ సంస్కారాభిలాష దాక్కొని ఉంటై. ఉద్యమాభిముఖమైన గొప్ప అంతర్ముఖి చలం.

ఈ జన జంతువుల అనంతశరీర భారాన్ని యాంత్రో పొమార్ఫికల్‌గా వర్ణించి, పక్షవాతం కమ్మిన శిశువుని రెండుగా కోసి దయగా కండరాల్ని నరాల్ని ముడివేశాడు చలం. పిచ్చెక్కి ప్రవచించి, లారెన్స్‌లా, మామ్‌లా, హాతార్న్‌లా, మొపాసాలా మానవత్వాన్ని మన్నించి, ప్రేమించి, క్షమించాడు. భావ దాస్యపు గొలుసులు విప్పి వాస్టేట్ చేసి, డివాస్టేట్ చేసి ఇరుకు తెలుగులో విశ్వరూపాన్ని బిగించాడు.

"మొదటి పుస్తకం దగ్గరనుంచి ఈనాటి వరకు వూరికే రాయాలి అని రాసిన పుస్తకం ఒక్కటీ లేదు. ఒక్క కథా లేదు. అవి నన్ను చీల్చుకుని నా రక్తంలోంచి వచ్చిన సత్యాలవి "అన్న చలం ఈ శతాబ్దపు తెలుగు సాహిత్యానికి తిరిగి ఒక కొత్త ఊపిరినీ, రక్తాన్నీ, మాంసాన్నీ ఇచ్చిన మహాఋషి, కవి.

— మోహన్ ప్రసాద్

# సాహితీ ప్రభంజనం

చలం అస్తమయవార్తను చాలా ప్రముఖంగా ఆంధ్రప్రభ దినపత్రిక మే 6 వ తేదీ సంచికలో 'సాహితీ ప్రభంజనం' గా ఎనిమిది కాలాలు బాక్సు కట్టి ప్రచురించింది.

'ఆంధ్ర సాహితీ రంగంలో విప్లవశంఖం పూరించి, స్త్రీ జనోద్ధరణ యితి వృత్తంగా ఎన్నో రచనలు వెలయించి, దాదాపు నాలుగు దశాబ్దాలపాటు తెలుగు పాఠకలోకాన్ని ఉర్రూతలూగించిన మహారచయిత, స్వాప్నికుడు, దార్శనికుడు ఆయన-' అంటూ చలాన్ని అభివర్ణించింది.

-'తనపై ఆనాడు సనాతన ఛాందసవాదులు కత్తికట్టినప్పటికీ లక్ష్యపెట్టక తాను నమ్మిన సిద్ధాంతాన్ని. విశ్వసించిన ఆశయాన్ని నిజం చేసుకొందుకై అవిశ్రాంత పోరాటం సలిపి, చివరకు ఒకానొక విలక్షణ సమయంలో రమణా శ్రమానికి ప్రస్థానించిన ఆయన-జీవితంలోనూ, ఉద్యోగంలోనూ, రచనలలోనూ కూడా వివాదాస్పదమైన వ్యక్తిగానే మిగిలి పోయారు.' అని వ్యాఖ్యానించింది.

'మైదానం నవల తెలుగు సాహిత్యంలో ఒక పరిణామ దశకు సంకేతం' అని చెబుతూ 'ప్రాచ్య పాశ్చాత్య దేశాల ఆలోచనా ధోరణి ఆయనలో సంగ మించింది. ఆయన రచనలలో ఆధునికుడు. ఏది వ్రాసినా కృతకత్వం' కానరాని సహజత్వం చలం ప్రత్యేకత. తెలుగు వచనానికి వేగం సంతరించినా వ్యవహారిక భాషా వాదానికి పరోక్షంగా ఎనలేని సేవచేశాడు. ఆర్ద్ర హృదయుడు, స్వాప్నికుడు, మానవోద్యమం పట్ల ఎనలేని విశ్వాసం గలవాడు' అంటూ ప్రస్తుతించింది.

ఆయనపై వచ్చిన విమర్శలను పేర్కొంటూ— 'స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతం ద్వారా 'సెక్స్'ను రెచ్చగొడుతున్నాడని ఆయనపై విమర్శలు వచ్చాయి. అయితే వివాహ వ్యవస్థ పేరున కుటిల దాంపత్య జీవితాలపై స్త్రీల అసహాయతపై పురుషుల దవుష్ట్యంపై ఆయన ధ్వజం ఎత్తాడు. స్త్రీ జాతి మానసిక విప్లవానికి సన్నద్ధం కావాలని శంఖం పూరించాడు. కేవలం స్త్రీ సమస్యలు, 'సెక్స్' గురించి మాత్రమే ఆయన రచనలు చేశాడనడం సబబు కాదు.' అంది ఆంధ్రప్రభ.

మ్యూజింగ్స్, ప్రేమలేఖలు, ఆనందం, విషాదం, (వ్యాసాలు), దీక్షితులు గారికి, కురంగేశ్వరరావు, వజీర్ రెహ్మాన్, శివం వీరికి రాసిన లేఖాసాహిత్యం స్త్రీ, బిడ్డల శిక్షణ చలం తాత్వికభావాలకు అక్షర దర్పణాలుగా నిలుస్తాయని ప్రభ రాసింది. ఆయన పుట్టినతేదీ మే. 19, 1894 కాని మే. 18, 1894 కాదు. గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారి చలం పుస్తకంలో మే 18, 1894 అని వుంది. దీనిని ఆధారంగా తీసుకుని రాసిన పత్రికలన్నీ 18 వ తేదీ అని రాశాయి.

'జీవితం, ఆదర్శం, రచనలు-ఒక్కటే మూర్తిగా పరిణతి చెందిన సాహితీ తపస్వి చలం ఇక లేడు కాని- అరుణాచలంలో ఆధ్యాత్మిక పిపాసిగా కనులు మూసిన చలం సాహిత్యజగత్తులో హిమాచలంగా నిలిచిపోతాడు' అని తన విశ్వాసాన్ని ప్రకటించింది,

అదే రోజు శ్రీ జి. కృష్ణ రాసిన 'స్వేచ్ఛాప్రియుడు చలం' అనే ప్రత్యేక వ్యాసాన్ని, విజయవాడలో పూర్వం చలం నివసించిన రెండంతస్థులమేడ ఫోటోతో సహా ప్రచురించారు.

శ్రీ జి. కృష్ణ తను అప్పటికప్పుడు రాసిన వ్యాసంలో, చలం శైలిని గురించి ప్రస్తావిస్తూ, 'చలం ఉన్నది ఉన్నట్లు వ్రాశాడు. ఉన్నది ఉన్నట్లు వ్రాయక వేరేవిధంగా రచనను శిల్పీకరించాడా? శిల్పీకరించలేదు కాబట్టి చలంశైలి వాడిగా వేడిగా వుంటుంది' అని సూత్రీకరించారు.

తెలుగు శైలి, తెలుగులో స్వతంత్ర భావన మెచ్చుకునే వారందరూ తిరువణ్ణామలైకి వెళ్ళి చలం ఆతిథ్యం స్వీకరించి వచ్చేవారు. చలం ఆతిథ్యం అనుభవించనివారు అక్కడి నుంచి తిరిగి రావడానికి ఇష్టపడరు. 'చలంది అంత ఆప్యాయత' అన్నాడు కృష్ణ. చలం శైలిని 'స్వతంత్ర భావనను మెచ్చుకునే వారంతా చలం రచనలను అభిమానించి చదువుతారు' అని సామాన్యంగా పత్రికా రచయిత చెబుతాడు. కృష్ణ ఆతిథ్యానికీ, చలం శైలికి, భావాలకూ ముడిపెట్టి పాఠకులను రెచ్చగొడుతున్నాడు. చలం గురించి తన వాక్చిత్రాన్ని యిలా చెప్పాడు-

'చలం భావుకుడు, కలలు కనేవాడు, స్వేచ్ఛాప్రియుడు. ఏకతారపై పాడుకుంటూ, పక్కనే నడిచే చిన్నారితో గొంతుకలిపి పాడుకుంటూ హాయిగా తోటలో

నుంచి నడిచిపోతూ, స్వేచ్ఛా ప్రపంచంలో కాలు పెట్టాలని ఆయన ఆశ,' అదే జరిగిందా? అనే ప్రశ్నతో మనల్ని వదిలేస్తాడు,

## (అ) శ్రద్ధాంజలి ఒకటి

'ప్రముఖ రచయిత శ్రీ గుడిపాటి వెంకటచలం కాలధర్మం' అనే శీర్షికతో చలం మృతిని ఆంధ్రపత్రిక మూడు కాలములుగా ప్రచురించింది. వార్తలను ప్రచురించడంలో ఆంధ్రపత్రికకు ఒక రకమైన ఒరవడి వుంది. ఈ క్రింది వాక్యాలు గమనిస్తే వారి వైఖరి తెలుస్తుంది,

"—తమ రచనలతో ఆంధ్రదేశ ప్రజలను ఉద్రుతలూగించారు,

బాల్యంలో సనాతన వాతావరణంలో పెరిగినా, పరిస్థితుల ప్రాబల్యం వల్ల భావ పరివర్తన పొందారు.

శ్రీ చలం ఆధునిక సారస్వత ప్రక్రియ లన్నింటిని అవలంబించారు. ఆంధ్ర సారస్వతంలో అపూర్వ చైతన్యం ఆవహించిన ప్రతిభాశాలి.

అసంఖ్యాకములయిన కథలు, నవలలు, నాటకాలు వ్రాశారు. అంతేకాక వ్యాసాలు, విశృంఖలములయిన లేఖలు, వచనగేయాలు కూడా లిఖించారు. స్త్రీజాతి సముద్ధరణకు ఆయన కంకణం కట్టుకున్నారు. స్త్రీలపై ఆయన పలురచనలు చేశారు.

.... బ్రహ్మమతమును అభిమానించి శ్రీ చలం భజన గేయాలు వ్రాసారు.

...వారి కవిత్వంలో ప్రధానాంశం సంఘసంస్కరణ కాదు, ఆత్మ సంఘర్షణ. శ్రీ చలంగారి రచనలు ముఖ్యంగా శ్రీ మహాప్రస్థానమునకు, శ్రీ దీక్షితులు గారి ప్రజావాఙ్మయమునకు వ్రాసిన యోగ్యతా పత్రాలు చదివితే వారి శైలి తెలుస్తుంది. ఆ శైలి అందరికీ అలవడు నట్టిది కాదు"

ఈ వాక్య విన్యాసమంతా చాలా 'ఇన్ సిన్సియర్‌గా, గొడవగా, వుంది. అవకతవక వాక్యాలూ' అర్థంలేని పదప్రయోగాలతో చలం మరణవార్తను ప్రహసన

ప్రాయంగా వ్యాఖ్యానించారు. (విశృంఖలములయిన లేఖలు, స్త్రీలపై ఆయన పలు రచనలు చేశారు. భజనగేయాలు శ్రీ మహాప్రస్థానమునకు- ఏవిటీ అపభ్రంశాలు?)

## (అ) శ్రద్ధాంజలి రెండు

విశాలాంధ్ర దిన పత్రిక ఆరవ తేది సంచికలో 'గుడిపాటి వెంకటచలం మృతి.' అని ఏవిధమైన విశేషణాలూ వాడకుండా మూడుకాలముల వార్తను వ్యాఖ్యనూ ప్రచురించింది. వెంకటచలాన్ని రచయిత అంటే పార్టీ పాలసీకి ఏమన్నా చిక్కులు వస్తాయేమో అన్నంత జాగ్రత్తగా హెడ్డింగ్ పెట్టారు.

'ఏ సాహిత్య సమాజంతోనూ సంబంధం పెట్టుకోకుండా ఆంధ్రజాతిని తన రచనలతో విస్మయాందోళనలలో ముంచెత్తిన శ్రీ గుడిపాటి వెంకటచలం గత రాత్రి మద్రాసుకు సమీపంలోని తిరువణ్ణామలైలో, మృతిచెందారు.'

మరొక వాక్యం—

1894 మే18 న ఆయన కృష్ణాజిల్లా కపిలేశ్వరపురంలో జన్మించారు. ఆయన తండ్రి కొమ్మూరి సాంబశివరాజు.

ఆయన జన్మదినం మే 19, 1894 కాని మే 18, 1894 కాదు. ఆయన మద్రాసులో కపిలేశ్వరాలయం సమీపంలోని ఒక వీధిలో జన్మించారుకాని, కృష్ణా జిల్లా కపిలేశ్వరపురంలో కాదు. తండ్రిపేరు సాంబశివరావు, — రాజు కాదు.

విశాలాంధ్రకు చలాన్ని గొప్ప రచయితగా బాహాటంగా ఒప్పుకోవడం యిష్టం లేనట్లుంది. వార్తలోపల రాస్తూ—

'వివాదాస్పదమైన మహా రచయితగా వెలుగొందిన శ్రీ చలంకి చిన్నప్పటి నుండి కూడ 'స్త్రీ' జీవన్మరణ సమస్యగానే తోచింది.'

ఈ వార్తను చాలా తెచ్చి పెట్టుకున్న మూతి బిగింపుతో రాశారు. చలం మృతికి సంతాపసూచకంగా విజయవాడ లోని పుస్తకాల షాపులన్నీ మూసివేశారన్న వార్తతో రిపోర్టు ముగిసింది.

## (అ) శ్రద్ధాంజలి మూడు

బెంగుళూరు నుంచి వెలువడే ప్రభ దిన పత్రిక 'ప్రముఖ రచయిత చలం అస్తమయం' అనే మూడు కాలముల వార్తను ప్రముఖంగా ప్రకటించింది. కాని, గుడిపాటి వెంకటచలం 1894 వ సంవత్సరంలో గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలో జన్మించారు' అని రాసింది.

'— బి.ఏ.ఎల్.టి పట్టం పొంది కొంతకాలం ఉపాధ్యాయుడుగా పని చేసారు. అనంతరం ఆయన దృష్టి సమాజంలోని వివిధ సమస్యలపై మళ్ళింది. కలంపట్టి ఆకాశం దారులంటా సాగిపోయి, స్త్రీ స్వేచ్ఛను కోరుతూ సాహిత్యం ద్వారా సాంసారిక విప్లవోద్యమ ప్రచారం చేశారు.

... తను నమ్మిన నిజాన్ని నీటుగా, ఘాటుగా, సూటిగా చెప్పే స్వభావం ఆయనది. ఆయన గ్రహించిన యితివృత్తాలు ప్రధానంగా సాంసారిక జీవిత సమస్యలకు సంబంధించినవి. అందునా శృంగారం కూడా ఆయన రచనల్లో అధికంగానే చోటు చేసుకుంది. యువకుల ఉద్రేకాలను రెచ్చగొట్టే సాహిత్యాన్ని సృష్టించాడని చలాన్ని కొందరు ఈసడించుకొన్నారు. దుయ్యబట్టారు. చివరకు చలం అంటే శృంగారం అనే భావం స్థిరపడడమే కాక ఆయన నవలలు బహిరంగంగా చదవడమే నేరంగా భావించేవారుకూడా.

ఆయనలా ఒక ఆదర్శం కోసం, ఒకలక్ష్యం కోసం, నమ్మిన సిద్ధాంతాల కోసం పోరాడే వ్యక్తులు ఒక పట్టాన అర్ధంకారు. అందుకే చలం కూడా తెలుగు సాహిత్యంలో ఒక వివాదాస్పదమైన వ్యక్తిగా రూపు దిద్దుకున్నాడు.'

బెంగుళూరు ఆంధ్రప్రభలో యిలాసాగిన రిపోర్టు వలన చలం సాగించిన పోరాట స్వభావం సరిగా అర్ధంకాక చదివే వారిలో అయోమయం యేర్పడిపోతుంది.

కలం పట్టి ఆకాశం దారులంటా సాగిపోవడం ఏమిటి? స్త్రీ స్వేచ్ఛను కోరుతూ సాహిత్యం ద్వారా సాంసారిక విప్లవోద్యమ ప్రచారం ఏమిటి? మరణ వార్తలు రాసేవేళ, మృతుని జీవిత విశేషాలను వివరించే సందర్భంలో ఎంత చిత్త

శుద్ధి, నిజాయితీ వుండాలి? ఏ మాటలు దొర్లుకొస్తే వాటిని అలా తగిలించేయడమేనా? చలం వంటి రచయిత గురించి 'అబిచ్యువరీ' రాసేప్పుడు ఎంత సంయమనం, ఎంత జాగ్రత్త తీసుకోవాలి పద ప్రయోగాల్లో, అదే పత్రిక ప్రచురించిన అదే వార్తలో మరి కొన్ని వాక్యాలు—

'— చలం గొప్ప సౌందర్యారాధకుడు. ఆత్మ సౌందర్యం అంటే చలానికి ప్రాణం. కనీసం చుట్టూ వున్న ప్రకృతినైనా చూచి ఆనందించలేని వాడు, మానవత్వం కోల్పోయిన మనిషి అంటా డాయన.'

ఈ వార్తా లేఖరి సౌందర్యారాధన, ఆత్మసౌందర్యం, మానవత్వం అంటూ మాటల్ని దుబారా చేసి చలం మీద ప్రయోగిస్తున్నాడు.

'—చలం ఈ విధంగా ఆధ్యాత్మికత వైపు, సత్యాన్వేషణవైపు మనస్సు లగ్నం చేసి తన్ను తాను శోధించుకోవడానికీ, అర్థం చేసుకోవడానికి గల కారణం ఏమిటో అనూహ్యం.

వాక్కు ఒక వైపు పోతే అర్థం మరొక వైపు పోతూ వుంటుంది.

చలాన్ని ప్రశాంతంగా వెళ్ళి పోనివ్వకుండా, ముళ్ళకంపల్లాంటి వాక్యాలతో ఇంకా బాదుతున్నాడు.

తెలుగు సాహిత్యంలో అప్రతిహత ధోరణులతో, అద్భుతశైలితో, స్త్రీ స్వేచ్ఛకై కలం పట్టి, నిర్భయంగా, నిశ్చలంగా, నిర్మూలంగా తెలుగు భాషకు కొత్త మెరుగులు, కొత్త వెలుగులు, కొత్త జిలుగులు సంతరించిన ఘనత చలానికే దక్కుతుంది.

ఎటువంటి చలానికి ఎటు వంటి (అ)శ్రద్ధాంజలి?

## ఆంధ్ర భూమి

హైదరాబాద్ నుంచి వెలువడే ఆంధ్రభూమి దినపత్రిక 'మహారచయిత గుడిపాటి వెంకటచలం అస్తమయం' అనే మూడు కాలాల శీర్షికతో యిలా రాసింది.

'తమ రచనలతో అర్థశతాబ్దిపాటు తెలుగుదేశాన్నే కాక, పరిసర కన్నడ తమిళ ప్రాంతాలనూ ఉర్రూతలూపి, అహర్నిశం స్త్రీ జనోద్ధరణకు, పతిత జనోద్ధ

రణకు పాటుపడి, కామిగాక మోక్షకామి గాడు అనే నానుడిని సార్థకం చేసి, సర్వ సంగ పరిత్యాగులై అరుణాచలంలో రమణ సన్నిధిని బ్రహ్మానందానుభూతితో గడుపుతున్న శ్రీ చలం....' అని ప్రస్తావించారు ఎంతో హుందాగా.

ఆంధ్రభూమి చలం గురించి రాస్తూ- 'ఫ్రీలవ్ సొసైటీ' స్థాపించి స్త్రీలకు న్యాయమైన స్వేచ్ఛ ప్రసాదించడానికి కృషి చేశారు అని వెల్లడించింది. ఈ అంశం పై జాగ్రత్తగా విచారించ వలసిన అవసరం వుంది.

—సాహిత్యంలో నవచైతన్యాన్ని నింపారు. కథలలో, నవలల్లో, నాటికల్లో సాంఘిక విప్లవ శంఖం పూరించారు, అంత మాత్రాన అవి ప్రచార ధోరణి కలవి కావు. కళా వైదగ్ధ్యానికి మచ్చు తునకలు.

ఆయన "దైవమిచ్చిన భార్య, స్త్రీ స్వాతంత్ర్యానికి, "మైదానం" సుఖాను భూతి స్వేచ్ఛకు, "అమీనా" అలౌకికాధ్యాత్మిక అనుభూతి అన్వేషణా పరాయణతకు "అరుణ" స్త్రీత్వనిష్ఠ, దైవత్వ నిరూపణకు తార్కాణలు. "మైదానం" నవల ఆయన దృష్టిలో గొప్ప కళాఖండం. కాని "స్త్రీ", "మ్యూజింగ్స్" తత్త్వాన్వేషణ పరాయ ణమయిన గొప్ప గ్రంథాలని పలువురి విశ్వాసం. "స్త్రీ"లో స్త్రీ హృదయపు లోతు లను గాఢంగా చిత్రించారుచలం. ఆయన "ప్రేమలేఖలు" తత్త్వ దృష్టికి నికషాలు. "బ్రాహ్మణీకం" గొప్ప సంస్కరణ నవల.

ఆయన వ్యక్తిత్వం గురించి ప్రస్తావిస్తూ, 'శ్రీ చలం నిర్భీక వ్యక్తి, తాను నమ్మిన దానిని ఖండితంగా చెప్పగల దిట్ట: వ్యక్తిత్వంలో స్వాతంత్ర్యం, సత్యా న్వేషణ తత్పరతలో నైరంతర్యం ఆయన సొమ్ము.' అని రాసింది. ఆయనలో వచ్చిన పరిణామాన్ని గురించి కూడా లోకం వ్యాఖ్యానించింది.

ఆయన అరుణాచలంలో మకాం పెట్టగానే పలువురు "ఇంతవరకూ అన్ని ఆటలూ ఆడి ఇప్పుడు అక్కడికా?" అని వెక్కిరించారట. కాని, ఆయన "నేను దేవుడు లేడన్న రోజులలో అందరూ నన్ను తిట్టారు, నాస్తికుడని. నేనిప్పుడు దేవుడున్నాడు మొర్రో అంటే నమ్మడం లేదు" అని వాపోయారు. ఇదీ లోకపద్ధతి.

శ్రీ చలం అస్తమయంతో తెలుగు దేశంలో మహా రచయితల, ధైర్యం, నిష్ఠ, నిబ్బరం గల గొప్ప మనస్వివరేణ్యుల పాతతరం, అంతమయిందనడంలో సందేహం లేదు.

## చలం గురించి శ్రీశ్రీ

చలం గురించి ప్రతి తెలుగు పత్రికా రాసింది. అన్ని పెద్ద పత్రికలూ ఆదివారం అనుబంధాల్లో ప్రత్యేక వ్యాసాలను ప్రచురించాయి. మే నెల అంతా చలం పేరు మారుమోగి పోయింది, కాని చిత్రం ఏమిటంటే- ఏ స్త్రీ జాతి విముక్తికోసం కలం పట్టి హోరాహోరీ పోరాడాడో, ఆ స్త్రీ జాతి కిమ్మన కుండా వూరుకుంది, ప్రముఖ మహిళా సంస్థలు కాని, రచయిత్రులు, సంఘ సేవకురాళ్ళు కాని ఎవరూ చలం మృతి పట్ల ఏ విధమైన చలనం చూపించలేదు! మే నెలలో మరొకసారి చలం గురించి ఎవరి ధోరణిలో వారు అంచనాలు వేసుకొన్నారు. మార్క్సిస్ట్ భావాలు కల వారి అంచనాలు ఒక విధంగానూ, మిగతా వారివి మరొక విధంగానూ వున్నాయి. ఈ సందర్భంలో వరంగల్లులో జరిగిన ఒక ఇంటర్వ్యూలో శ్రీశ్రీ.

"చలం నవలలు సాహిత్యం చదివినవారు (మీతోసహా) లెఫ్టిస్టులుగా మారి పోయారని ఒక ప్రగాఢమైన నమ్మకముంది! ఈ అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారా" అని ప్రశ్నించగా శ్రీశ్రీ "అవును నేను అలాగే భావిస్తాను. ఆ విషయంలో నేనొక్కడినే కాదు రచయిత్రులు కూడా వున్నారు——" అన్నారు,

అంటే చలం సాహిత్య ప్రభావం నుంచి విడిపడినవారిలో కొందరు మార్క్సిస్ట్ భావాలను స్వీకరించి ఆ దిశగా పయనించారు.

శ్రీశ్రీ చలం రచనల గురించి ప్రస్తావిస్తూ——

'చలం తన రచనలలో ప్రధానంగా వ్యక్తిగత సమస్యలను తద్వారా సమాజాన్ని ప్రతిబింబింపజేస్తూ, సాంఘిక మూఢాచారాలను ఎన్నిటినో బట్ట బయలు చేశారు. కాని, ఏ రచనలో కూడా ఈ సమస్యలకు పరిష్కార మార్గాన్ని సూచించ లేదు అన్నారు.

చలం నాయికలు ఉత్తమ జీవితాన్ని కోరి లేచిపోయి కేవలం దుఃఖ భరితమైన జీవితాలు గడిపారు. ఉదాహరణకు 'మైదానం' నవలలోని రాజేశ్వరి. ఆయన వారికి తననవలల్లో మరో రకమైన మంచి జీవితం ఎందుకివ్వలేదు అనే ప్రశ్నకు జవాబిస్తూ శ్రీ శ్రీ,

'ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకంగా సాంఘిక వ్యవస్థ ఎలా రూపు దిద్దుకున్నదో ప్రజలకు తెలిపేందుకు ఇదొక్కటే మార్గం' అన్నారు.

చలం వివాదాస్పదమైన వ్యక్తిగా మీ రనుకుంటున్నారా అనే ప్రశ్నకు శ్రీ శ్రీ-

'తన సాహిత్యంలో, జీవితంలో, ప్రయోగంతో తీవ్రమైన విపరీతధోరణులు అవలంబించిన వ్యక్తులలో చలం ఒకరు. ఒక ప్రత్యేక విషయంపై తనదృష్టిని మరలించి ఆ రంగంలో కొంత దూరం పయనించాడు. అనంతరం ఆయన గమ్యం ఏమిటో, ఏ లక్ష్యం వైపు ప్రయాణం సాగిస్తున్నాడో ఆయనకే అంతు పట్టక చివరకు రమణ మహర్షి ఆశ్రమంలో జీవితాధ్యాయాన్ని ముగించాడు. ఇదికూడా ఒక విపరీత ధోరణే' అని తేల్చారు.

చలం నవలల్లోని పద్ధతి గురించి కూడా శ్రీ శ్రీ తన అభిప్రాయం యిలా వ్యక్తం చేశారు.

'వ్యక్తి గతస్వేచ్ఛకు సంబంధించి, స్త్రీ స్వేచ్ఛకు సంబంధించి, పిల్లల శిక్షణ, విద్యకు సంబంధించి, ప్రకృతి సిద్ధమైన పద్ధతులవైపు చలం దృష్టి మళ్ళించారు.'

స్వాతి మాసపత్రిక జూన్ సంచికలో శ్రీ శ్రీ ఒక ప్రతేక వ్యాసంలో చలం గురించి—

'సమాజంలో ఎంత కపటత్వం ఉందో, చలంలో అంత నిజాయితీ వుంది. ఈ రెండూ ఘర్షణ పడకుండా సహజీవనం నెరపడమనేది అసంభవం. అందుకే చలం కలం సంఘం మీద కత్తి కట్టి జీవితం పొడుగునా వీర విహారం చేసింది.' అంటూ— 'అభ్యుదయ భావాలున్న బూర్జువా మేధావిగా సాంఘిక రుగ్మతను చలం సరిగానే నిదానం చేశాడు. ఆయనకు మార్క్సిస్ట్ దృక్పథం వుండి వుంటే ఈ రోగాన్ని కుదర్చగల ఔషధంకూడా సూచించ గలిగేవాడు' అని తన అభిప్రాయాన్ని వివరించారు.

చలం మహాప్రస్థానం మరణంకాదు. ఇది మరో 'మావోలాంగ్‌మార్చ్ లాంటిది' అని శ్రీ శ్రీ చలం మృతిగురించి వ్యాఖ్యానించారు.

'చలం కుటుంబీకులైన వారెవ్వరూ చలం గురించి ఏమీ రాయలేదు. శ్రీ కొడవగంటి కుటుంబరావు మే13 ఆదివారం' ఆంధ్రజ్యోతిలో, ఒంటరివాడుగా జీవించిన చలం' అనే ప్రత్యేక వ్యాసాన్ని రాశారు. చలం గురించి కుటుంబరావుగారి అవగాహనకు యీ వ్యాసం ఒకఉదాహరణ—

# ఒంటరివాడుగా జీవించిన చలం

కళాకారులు ఒకంతట మరణించరు. అందులోనూ రచయిత తన రచనలు బ్రతికున్నంత కాలమూ బతికుంటాడు. చలం తన రచనా జీవితాన్ని కొంత కాలంగా సంక్షేపించుకున్న కారణంచేత, ఆయన భౌతిక మరణానికి ప్రత్యేకమైన విలువ ఏమీలేదు. ఆయన మృతికి ఇవాళ సంతాపం వెలిబుచ్చే వారందరూ భౌతికంగా చాలా దూరంగా వుంటున్నవాళ్ళే.

చలం రచనలు బతికున్నాయి, చలంతోపాటే, చలాన్ని చూసి, రచనలు ప్రారంభించినవారి రచనలు ఏనాడో కాలగర్భంలో కలిసిపోయాయి, కాని చలం రచనలు ఒకటికి రెండుసార్లు సమగ్రంగా ప్రచురించబడటమేగాక పాఠకులు వాటిని చదువుతున్నారు.

ఆ రచనలను ఆకాశానికి ఎత్తినవారున్నారు. చలం సాహిత్యాన్ని "శవ సాహిత్యం" అన్నవా రున్నారు. రెండు అభిప్రాయాలకు ఆధారాలు చలం రచనల్లో వున్నాయనుకోవాలి.

ఆ రచనల్లో జీవితం మీద రోతపుట్టి ఏకాంతవాసం చేసేవాడి లక్షణాలు కొన్ని ఉన్నాయి. అవి సమాజం మీద శాపాలు, అందులో దీవనలు లేవు. తన వ్యక్తిగత సంస్కృతిని అవమానించిన మేరకు చలం సమాజాన్ని దుమ్మెత్తిపోశాడు, సమాజంలోని కుసంస్కారానికి కూడా ఏవో భౌతికాధారాలుంటాయన్నది చలం పట్టించుకోలేదు. "ఏం చేస్తే ఈ సమాజం నాకు నచ్చుతుంది?" అని ఆయన తనకు తాను ప్రశ్నించుకోలేదు. సమాజం బురదలో పొర్లివచ్చిన గొడ్డు అని, తాను దగ్గరకి పోతే తన మీద బురద విసురుతుందని భయపడ్డాడు. చలంలాటి సంస్కారం గలవారందరికీ చలం సమాజానికి పెట్టిన శాపనార్థాలు బ్రహ్మాండమైన సంతృప్తి నిచ్చాయి.

## మారని సంఘం

సమాజాన్ని నిజంగా సంస్కరించే ఉద్దేశం చలానికి లేకపోయినా ఆయనవి ఆ కాలపు సంస్కర్తల బాణీయే; సంస్కర్తల ప్రచారాలలో ఉండే లోపాలు

చలం రచనలలోనూ ఉన్నాయి, ఆయనచేత తిట్లు తిన్న సామాజిక మాయరోగా లన్నీ సుఖంగా ఉన్నాయి. కొన్ని చిలవలూ పలవలూ కూడా వేశాయి.

ఇంకో దృష్టినుంచి కూడా చలం రచనలు చాలా ఉదాత్తంగా ఉన్నట్లు కని పిస్తాయి. ఈ నాడు రాజకీయ నాయకులను సైతం తన వ్యూహంలోకి దింపేసిన సినిమా సంస్కృతితో పోల్చితే చలం రచనలలోని సంస్కృతి ఆకాశం ఎత్తు. ఇంకోపక్క గాంధీభక్తులు ప్రచారం చేసే నీతి నియమాలతో పోల్చితే చలం రచనలలో కనిపించే విశృంఖలత చాలా ఆరోగ్యమైన దనిపిస్తుంది.

సినిమా సంస్కృతికీ, చలం రచనలలోని సంస్కృతికీ. ఏదన్నా పోలిక చూపాలంటే అది సెక్స్ విషయంలోనే. కాని చలం రచనలలోని సెక్స్ సిని మాలో దానికన్న ఉదాత్తం అనిపిస్తుంది. జంతువుల మైథునం లాటిది సినిమా లలో ఉంది కాని చలం రచనలలో లేమ. అచ్చగా సెక్స్‌కోసమే బతికినట్టు కన బడే జంట కూడా "మైదానం"లో మనుషులకు దూరంగా చేరింది గాని ప్రఖ్యాత తమిళ దర్శకుడు సేతుమాధవన్ తీసిన "కన్యాకుమారి" లో ఒకడు ఒక ఆడదాన్ని ఇంకో మగవాడు చూస్తుండగానే "రేప్" చెయ్యటానికై యత్నించడం లాంటి అసభ్యత చలం రచనల్లో లేదు. చలం పాత్రలు "రేప్" చెయ్యవు, జంతువులు కూడా చెయ్యవుకాని చెయ్యటానికి ప్రయత్నిస్తాయి. మనకు నచ్చినా, నచ్చక పోయినా, చలం తన రచనల్లో సమర్థించే పాత్రలు జంతువులు మటుకు కావు.

## కవితా హృదయం

వ్యక్తిగా చలం కవి. కవిత్వం కోసం బ్రతికినంతగా కవిత్వాన్ని ప్రేమిం చాడు. కవిత్వం చలంకంట నీరు తెప్పించడం నేనెరుగుదును. ఇతర మనుషుల్లో ఉండే దౌర్బల్యాలు చలంలో ఉండి ఉండవచ్చు. కాని అనేక విషయాలలో ఆయన విశిష్ట వ్యక్తి, ఆయన కీర్తికోసం తానై పాటు పడలేదు. ఏ సాహిత్య ఉద్యమంలోనూ చేరలేదు. సాహితీసమితిని "మ్యూచువల్ అడ్మిరేషన్ సొసైటీ" అన్నాడు; కాని కీర్తి తనను వెతుక్కుంటూ వస్తే దాన్ని పరీక్షించకుండా కావలించు కున్నాడు. అప్పుడప్పుడూ కనువిప్పు కలిగేది.

"నన్ను మెచ్చుకునే వాళ్ళంతా నా రచనలు అర్థం చేసుకున్నారని భ్రమ పడ్డాను!" అన్నాడాయన ఒకసారి,

ఒంటరితనం, బహుకొద్దిమంది స్నేహితులు, బంధువులతోనైనా గాఢమైన సంబంధాలు లేవు, ఒంటరితనం ఆయన చుట్టూ ఉన్నవారికి కూడా సోకిందేమో ననుకుంటాను, అదే ఆయనను రమణాశ్రమం చేర్చింది. చివరకు ఒంటరితనం పరకాష్ఠకు వచ్చి, ఆయన రజనితో ఇంటర్వ్యూలో "ఈ చలం నన్ను వదలకుండా ఉన్నాడు!" అని విసుక్కున్నాడు.

చలం ఎంత ఒంటరివాడో, చలం రచనలు అంతగా జనాదరం పొందాయి చిత్రం!

— కొడవటిగంటి కుటుంబరావు

చలం అస్తమయానికి సుమారు ఇరవై మాసాల క్రితం 1977 ఆగస్టులో, సి. ధర్మారావు,మరి కొంతమంది మిత్రులు, తిరువణ్ణామలై వెళ్ళి చలంగారి దర్శనం చేశారు. అప్పుడు సి. ధర్మారావు చేసిన ఇంటర్వ్యూని ఆంధ్రభూమి దినపత్రిక 20-5-79 వ సంచికలో ప్రకటించింది. ఈ ఇంటర్వ్యూ చలాన్ని మరో కోణం నుంచి ప్రదర్శిస్తుంది. ఇక మరో రెండు సంవత్సరాలకు పోతాడనగా ఆయన ఎలావున్నారో యీ గోష్ఠి ద్వారా వూహించుకోవచ్చును.

## 'రమణస్థాన్'లో రెండు రోజులు

వ్యక్తులంతా తనకి కావలసిన వాళ్ళే, వ్యవస్థ మళ్ళీ వద్దంటాడు.

తెలుగుదేశాన్ని రోసి దూరంగా వెళ్ళిపోయాడు. అక్కడి నుంచి ప్రతి రోజూ తెలుగు వాళ్ళకి డజన్లకొద్దీ జవాబులు రాస్తాడు.

వెళ్ళటం వేటకనే వెళతాడు. తుపాకి దెబ్బపడిన పక్షిని దయగా సాకి మళ్ళీ స్వేచ్ఛలోకి ఎగరవేస్తాడు.

లోకాలు దద్దరిల్లేటట్లు స్త్రీ హీన స్థితిని గూర్చి గగ్గోలు పెట్టాడు. కాని ఆమె వెనుకవున్న ఆర్థిక దుస్థితిని చూడనొల్లక ఏవో రంగులస్వప్నాలు కంటాడు.

నవసమాజ కర్తలకి స్వాగతాలు చెప్పి, యోగ్యతా పత్రాలిచ్చాడు. అయినా లోకవృత్తం తెలుసుకో నిరాకరిస్తాడు- పత్రిక తిప్పడు, రేడియో ముట్టడు.

తన మనసులో మాలిన్యాన్ని పాత్రలుగా చిత్రించి, ఆ ఆపాత్రల హాహాకారాల్లో తన అహాన్ని ముక్కలు ముక్కలుగా కోస్తున్నానంటాడు. మళ్ళీ తన రెండక్షరాల పొట్టి పేరుకి పీఠాన్ని ప్రతిష్ఠించి తనే హారతులు పడుతుంటాడు.

సుమారు పద్నాలుగేళ్ళు మథనపడి చివరికి రమణాశ్రమం చేరుకుంటే, తను చేరుకున్న రెండునెల్లకే రమణ మహర్షి తనువుచాలిస్తే, అక్కడే జీవిత శేషం గడపదలచి వుండిపోయాడు. ఇంత జరిగాక నువ్వు భగవాన్‌కి పూర్తిగా లొంగిపోయావా అంటే, లేదని ధిక్కరిస్తాడు.

అల్లాంటి మేరునగధీరుడు, విలక్షణుడు, మొన్న మే 4న కన్ను మూసిన గుడిపాటి వెంకటచలంగారు.

ఆయన కన్నుమూసింది మద్రాసుకు అవతల 200 కి.మీ. దూరంలో ఉత్తర ఆర్కాటుజిల్లా లోని తిరువణ్ణామలై పట్టణంలో. 1894 మేలో పుట్టిన శ్రీచలం తెలుగుదేశంలో ఓ మూడు దశాబ్దాలపాటు తన రచనలే భీషణాయుధాలుగా చేసి, తన జీవితమే ఒక సంకుల సమరంగా నడిపి, 1950లో తిరువణ్ణామలైలోని భగవాన్ రమణ మహర్షి ఆశ్రమం చేరుకున్నారు.

ఆయన్ని చూడటానికి నేనూ, కొందరు మిత్రులు కలిసి సుమారు ఇరవై మాసాలక్రితం 1977 అగస్టులో ఎండల్నీ. ఎర్రదుమ్మునీ తోసుకుని తిరువణ్ణామలై చేరాం. భూమితో పాటే ఏర్పడిందని అక్కడి జనం నమ్మే అరుణగిరి పర్వతం, పర్వత పాదాన పదో శతాబ్దంనాటి అరుణాచలేశ్వరాలయం-ఈ రెండూ యాత్రికులకి కన్నుల పండుగ చేస్తాయి. ఆలయానికి తూర్పుదిశగా వూరు. వూరికి ఒక పెడగా అరుణగిరి నానుకుని శ్రీ రమణాశ్రమం, ఆశ్రమానికి కొంచెం అవతలగా రోడ్డుకు రెండోవైపున చలంగారి యిల్లు, చిన్న కొయ్యగేట్లు తెరుచుకుని లోనకు అడుగు పెడుతూనే కుడిచేతివైపున చక్కనిపూదోట, అదిదాటగానే, అంత చిన్నదీ పెద్దదీ కాని డాబాయిల్లు. ఇంటికిముందు ఎత్తయిన వరండా మీదికి దింపిన పెంకుల వసారా ముందువున్న తగుమాత్రపు జాగాలో కొద్దిగా మొక్కలూ. ఒక పెద్ద చెట్టుకి పాకుతున్న పచ్చటి తీగె, పాడికి ఒక ఆవు, అదే చలం గారి సొంత ఆస్తి అని మిగిలివున్న యిల్లు-దానిపేరు "రమణస్థాన్",




చలం రమణస్థాన్

1977 ఆగస్టు 6,7 తేదీల్లో ఆయన్ని చూడటానికని వెళ్ళినప్పుడు ఆ యింట్లో పరివారం—

ఎప్పుడూ తెల్ల చీరలో నుదుట విభూతి, కుంకుమలతో కనిపించే వారి పెద్దమ్మాయి సౌరీస్. ఈమె ఎక్కువకాలం ధ్యానంలో, భజనలో, చదువుతో గడుపుతారు.

తరువాత ఎప్పటినుంచో వారింట్లోనే పెరిగిన చిత్ర, ఆమె పుత్రుడు 'తంబి' కడసారి పుత్రిక అడ్డాలలో ఒక చిట్టి మనవడు.

ఇహ చలంగారి ఆలనా పాలనా చూసుకుంటూ ఇంటి భారాన్ని యావత్తూ ప్రేమగా నిర్వహిస్తున్న నర్తకి.

మేడమీద చిన్న గదిలో వున్న అమెరికను యువతి తోటపని చూసుకుంటుంది, ఆవును చూడటానికి గోపాలకుడు,

ఆ పైని పచ్చటి వర్ణంతో చిరుగడ్డంతో ప్రసన్నమూ ప్రశాంతమూ అయిన దరహాసంతో మనకంతా పరిచయమైన సహస్రమాస జీవి చలంగారు.

అసలే చలం మితభాషి. మిత్రులూ అభిమానులూ వచ్చినప్పుడు సౌరిస్సే వారితో ఎక్కువగా చర్చించినా, ముచ్చటించినా, చలంగారు మాత్రం వింటో ఆనందిస్తో మధ్య మధ్య ఒకటీ అరా మాట చేరుస్తుంటారు. అప్పటి కాయన చక్రాల కుర్చీలో ఇంట్లోకి బయటకి తిరగటము, శుభ్రంగా తినటము, చూపు మందగించినా వచ్చిన వారిని గుర్తించటము వున్నాయి. ఆ పరిస్థితిలో భవదీయుడూ, మిత్రుడూ చలంగారితో నేరుగా సాగించిన పరిమిత సంభాషణం, తీర్చుకున్న సందేహాలు పాఠకుల ముందుంచుతాను. సౌరీస్ కూడా అంతసేపు మాతో ఉన్నారని వేరే చెప్పనక్కరలేదు.

భ వ: ఇప్పుడు ఎట్లావుంది మీ ఆరోగ్యం ?

చలం : ఏదో బొత్తిగా మంచాన పడెయ్యకుండా యిట్లావుంది.

భవ : (సౌరీస్‌తో) నాన్నగారికి చివరికి యిక్కడ శాంతి దొరికినట్లేనా?

సౌ : పూర్తిగా కాకపోయినా చాలావరకు ఇదివరకటి అశాంతి, ఆవేదనా తగ్గాయి. కాకపోతే చిన్నపిల్లడిలా మాతో పేచీలు పెట్టుకోవడం, దెబ్బలాడటం జాస్తి అయింది (నవ్వుతూ)

భవ : జీవితమంతా అంత స్ట్రగులయ్యారుకదా జీవితానికో Fulfilment కలిగిందని భావిస్తున్నారా ?

చలం : (మౌనం)

భవ : పోనీ. మీ జీవితమంతా ఓ అన్వేషణ అనుకుంటే ఆ అన్వేషణ పూర్తయిందా ?

చలం : లేదు.

భవ : మీరు భగవాన్ రమణ మహర్షికి పూర్తిగా Surrender అయ్యారు కదా.

చలం : Surrender కాలేదు చూడ్డానికివచ్చా. ఆ ప్రశ్నలు రాలేదు.

భవ : ఆయన మీద ఏదో గురి ఏర్పడే మీరు యిక్కడికి వచ్చారు కదా ?

చలం : గురి-ఆ మాట ప్రయోగించకండి. వస్తున్నా, చూస్తున్నా. పోతున్నా ఆయనా అట్లానే Casualగా తీసుకున్నారు. ఒకసారి ఆయన ఆపరేషన్ రూం ముందు అందరూ నించున్నారు. భక్తులు వందో రెండువందల మందో, నేనూనించు న్నాను ఎక్కడో వెనక.

ఆయన బయటికి వచ్చాక- "అయితే ఎప్పుడొచ్చారు మీరు? అని నన్ను ప్రత్యేకంగా గుర్తు పట్టి అడిగారు" ఈయన వెంకటచలంగారు. తెలుగులో పెద్ద కవి" అని మిగతా వాళ్ళతో చెప్పారు. అదీ ఆ ఒక్కసారే నన్ను ప్రత్యేకంచేసి నాతో మాట్లాడినందుకు సంతోషం వేసింది. అట్లా ఆయన పలుకరించి నప్పుడు తక్కువాలేదు.... ఎక్కువాకాదు. పలుకరించినప్పుడు మొదటిసారి 1936లో వచ్చాను.

భవ : ఒకసారి జిల్లెళ్ళమూడి అమ్మ మిమ్మల్ని చూడడానికి వచ్చారటగదా? అప్పుడు మీకేం అనిపించింది?

చలం : అనిపించటం గాదు. ఒకరి చేతులు ఒకరం పట్టుకుని ఒకటే ఏడవటం. ఎందుకు ఏడుస్తున్నారు అన్నాను "సంతోషం "అన్నారు. సంతోషం కూడా కాదేమో అదేదో భావం మరి,

భవ ; మరి మీరు వెనక రాసినవన్నీ వదిలేసుకుని ఇక్కడి ఆశ్రమానికి వచ్చారని అందరూ చెప్పుకోటం అట్లా పూర్తిగా మారిపోయారా?

సౌ : ఏమీ మారలేదు, మొదటి నుంచీ అట్లా ఆయన్ని గురించి ఎన్నెన్ని చెప్పేవారో....

చలం : ఏదో ప్రచారం,

భవ : అయితే అప్పటికీ యిప్పటికీ మీరు వివాహానికి వ్యతిరేకులా ?

సౌ : వివాహం ఒక Institution కాకూడదు, అట్లా అయితే దానికి ఏదో Vice పడుతుంది. స్కూలుకు పోతానంటే వద్దనే వారుగాని, పెళ్ళి చేసుకుంటానంటే ఎవర్నీ వద్దనలేదు. కాకపోతే- "అది నిన్నే మింగేస్తుందిరా. నేనో స్నేహితుడిని Miss అవుతానురా" అవానేరు. అందులో వివాహ వ్యతిరేకతలేదు. Personal గదా. అంతే కదు నాన్నా?

చలం : (తలూపారు)

భవ : శ్రీశ్రీ అడిగినట్లు, మానవ జాతికి మంచికాలం రహిస్తుందా ? మీ భవిష్యద్దర్శనం ఏమిటి?

చలం : భవిష్యద్దర్శనం. మంచికాలం ... ఎవరికి? ఆ ప్రశ్నకి మనని మనంగా అట్టేపెట్టుకుంటే సమాధానం వస్తుంది.

ఇంతకుమించి దీనికి వివరణ లభించలేదు, వ్యక్తిగతంగా, ఎవరితోవ వారిది అన్నది వారి అభిప్రాయం అనిపించింది,

భవ: ఒక డాక్టరుగారు మీమీద ఒక విమర్శ గ్రంథం రాసి కొంత సంచలనం కలిగించారు. విన్నారా?

చలం: ఏదీ....స్మశాన సాహిత్యం! స్మశానం .... అదేం పేరు. అన్యాయం....

భవ: దానికి రంగనాయకమ్మ గారు, కుటుంబరావు గాంధీ, సమాధానంగా మరో పుస్తకం రాశారు.

చలం: ఆసమాధానం రాస్తున్నప్పుడో, రాస్తామనో, అన్నారు—వారిక్కడికి వచ్చారు.

భవ: శ్రీ శ్రీ "ప్రజాతంత్ర" వార పత్రికలో ఆత్మకథ రాస్తున్నారు. అనంతం పేరుతో

చనం: అట్లానా....

భవ: స్నేహితులు మీ సంతకాలతో పుస్తకాలు తెమ్మన్నారు. మీ రేమో సంతకాలు చేసే స్థితిలో లేరు. కానుకగా తలో పుస్తకం యివ్వొచ్చునని ఆశపడ్డాం.

చలం: (సౌరీస్‌తో) ఏమిటి, ఏదో ఆశపడ్డాం అంటున్నారు?

సౌరిస్ మళ్ళీ చెప్పడమే తడవుగా ఆయన కలం తెమ్మన్నారు. ఉత్సాహం తెచ్చుకుని, ఒకప్పుడు తెలుగుజాతిని జాతినే తొడచరచి సవాల్ చేసిన రెండు పొడి అక్షరాలు "చలం" అని చాలా పుస్తకాలమీద నెమ్మదిగా సంతకాలు చేసి యిచ్చారు ఆయనలో ఆ ఆర్ద్రత, ఊట, ఎన్నటికీ ఆగేది కాదనిపించింది.

తర్వాత సౌరిస్, తమ చిన్నతనం కబుర్లు, నాన్నగారి పిల్లల పెంపకం పద్ధతులూ చెపుతున్నప్పుడు ఆయన కళ్లు మిలమిలా మెరిశాయి. అట్లాగే ఆమె తన ఈశ్వరానుభవాలు— "అక్క" ఆరునెలల్లో చచ్చిపోతుందని ఈశ్వరుడు చెప్పిన జోస్యం ముచ్చటిస్తున్నప్పుడు, ఆయన కంటతడి పెట్టారు. ఆంధ్రదేశంలోని ప్రతి చిన్న, పెద్ద, పట్టణం ఆయన్ని ఆయన కుటుంబాన్నీ, వెలివేసి దూరంగా నెట్టిన ప్రస్తావన వచ్చినప్పుడు — "మీరు పిక్చరైజ్ చేసుకోలేరు.... అంత ద్వేషం. ఐసొలేషన్. ఒకప్పుడు నా ఫామిలీ లోనే నాకు రికగ్నిషను, ఆమోదం వస్తుందని అనుకోలేదు" అన్నారు.

ఆశ్చర్యం, ఇప్పుడాయన్ని శత్రువులు కూడా మహర్షి అంటున్నారు. అయితే వాళ్ళంటున్న అర్థమేమిటో తెలియదు. చలం ఏమిటి? ఎందుకు ఆంధ్రదేశం వొదిలి వెళ్ళిపోయాడు. చివరికి మహర్షి ఏమిటయ్యాడు—అన్న ప్రశ్నలు తెలుగు జాతి ఇంకా చాలా కాలం తర్కిస్తుంది.

— సి. ధర్మారావు

## మే నెల వార్తావరణం

మే 1979 మొదటి వారం పత్రికలు చూసినట్లయితే చలం మహాభినిష్క్రమణ సమయానికి ముందూ వెనుకా దేశం ఎలావుందో తెలుస్తుంది. ఎండలు నూట నాలుగు డిగ్రీలు దాటి నూటఆరు వరకు వెళ్ళాయి. తెలుగు వారిళ్ళల్లో ఊరగాయల హడావిడి, మామిడి పళ్ళ ధరలు డజను తొమ్మిదీ పది రూపాయలు పలుకుతోంది. ప్రభుత్వ కార్యాలయాల పని వేళల మార్పుకై హైదరాబాద్‌లో అభిప్రాయ సేకరణ జరుగుతోంది. కేంద్ర బడ్జెట్ అత్యంత నిరాశాజనకంగా ఉందని, ధరలు పెరుగుతున్నాయని విమర్శలు వినిపిస్తున్నాయి, బ్రిటన్‌లో కన్సర్వేటివ్ పార్టీ విజయం పొంది శ్రీమతిమార్గరెట్ థాచర్ తొలి మహిళాప్రధాని అయింది. స్పెషల్ కోర్టుల వ్యతిరేక ప్రదర్శనకు స్వయంగా ఇందిరా గాంధి నాయకత్వం వహించాలని అనుకుంటోంది. కడప ఆసుపత్రిలో చేరిన దయ్యాల శాంతికి పూజలు జరిపిస్తున్నారు. గోసంరక్షణపై రాజ్యాంగ సవరణ బిల్లుకు కాంగ్రెసు (ఐ) వ్యతిరేకత వెల్లడించింది. బంగాళాఖాతంలో వాయుగుండం నాగపట్నానికి వెయ్యి కిలోమీటర్ల దూరంలో కేంద్రీకృతమై వున్నది. గుంటూరులోనూ నరసరావుపేటలోనూ నీటి కొరత వల్ల యిబ్బందులు, గవర్నర్ పదవి ప్రభుత్వోద్యోగం కాదని సుప్రీం కోర్టు నిర్ణయం చెప్పింది, విశాఖ జిల్లాలో కొట్లాటలు, దొమ్మీల సంఖ్య పెరిగింది.రాయలసీమలో దుర్భిక్ష నివారణకు కృష్ణా జలాలను మళ్ళించాలని అఖిల భారత కమ్యూనిస్ట్ పార్టీ కార్యదర్శి చంద్ర రాజేశ్వరరావు అనంతపురంలో అన్నారు. తంజావూరు నుంచి లోక్‌సభకు పోటీ చేయడం గురించి ఇందిరాగాంధి పై వారంలో నిర్ణయం తీసుకుంటుంది. మన దేశంలో మనిషి సగటు ఆయుర్దాయం యాభై రెండేళ్ళకు పై బడి పెరిగింది, ప్రణాళికా సంఘం నిర్దేశించిన ప్రమాణాల ప్రకారం 1977-78 లో దేశంలోని పల్లెలు, పట్టణాలలో కనీసం 29 కోట్ల మంది ప్రజలు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నట్లు కేంద్ర ప్రణాళికాశాఖ స్టేట్ మంత్రి రాజ్యసభలో చెప్పాడు. రూపాయి విలువ 24పైసలకు పడిపోయింది. సంజయ్ గాంధిని బెయిలుపై విడుదల చేశారు. రాష్ట్రంలోని అన్ని యూనివర్సిటీలలో తెలుగు బోధనాభాష కావాలని విద్యామంత్రి భవనం వెంకట్రామ రెడ్డి హైదరాబాద్‌లో చెప్పాడు. విజయవాడ వద్ద కృష్ణానదిపై మరొక బ్రిడ్జి నిర్మిస్తారని ఎనిమిది కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందనీ లోక్‌సభలో మంత్రి అన్నాడు, ఆవు—దూడ

చిహ్నం తమకు చెందాలని కాంగ్రెస్ (ఐ) వాదించింది. శాసన మండలిలో ప్రతి పక్ష నాయకుడుగా వున్న రోశయ్యను కాంగ్రెసు (ఐ) లో చేరవలసిందిగా ముఖ్యమంత్రి చెన్నారెడ్డి ఆహ్వానించాడు. పాకిస్తాన్‌లో ప్లుటోనియం ఫ్యాక్టరీ ఏర్పాటుచేస్తున్నట్లు అమెరికా ధ్రువీకరించింది. హైదరాబాద్ నుంచి గల్ఫ్ దేశాలకు కూరగాయల ఎగుమతీ పథకాన్ని ప్రభుత్వ వాణిజ్యసంస్థ రూపొందించింది. బంగారు చెల్లెలు ఆరోవారం, మనవూరిపాండవులు ఇరవై అయిదో వారం ఆడుతున్నాయి. మరోసీతకథ, శివకేశవులు, లక్ష్మిపూజ, విజయ, ది గ్రేట్ గేంబ్లర్, అవసరానికో అమ్మాయి, సినిమాల ప్రకటనలతో తెలుగు దిన పత్రికలు కలకల్లాడుతున్నాయి. దేశాయ్, చరణ్‌ల కుటుంబ సభ్యుల పై అవినీతి ఆరోపణలను సుప్రీంకోర్టు రిటైర్డ్ జడ్జికి నివేదిస్తున్నట్లు కేంద్ర హోమ్ మంత్రి హెచ్. ఎం. పటేల్ రాజ్యసభలో ప్రకటించాడు. ఏప్రిల్ ముప్పైన ప్రముఖ కవి అబ్బూరి రామకృష్ణారావుగారు కొత్త ఢిల్లీలో కాలధర్మంచెందారు. తర్వాత నాలుగు రోజులకే చలాన్ని కూడా ఆంధ్రులు పోగొట్టుకున్నారు.

మేనెల మొదటి పది రోజులలోనే ఏడుగురు రాష్ట్రమంత్రులకు ముఖ్యమంత్రి ఉద్వాసన చెప్పాడు. మే పన్నెండవ తేదీన ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాలకు తుపాను ప్రమాదం వున్నట్లు హెచ్చరికలు వచ్చాయి. పన్నెండవతేదీ శనివారం నాడు ఆంధ్ర కోస్తాను తాకిన పెనుతుపాను నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో చాలా జననష్టం, ఆస్తినష్టం కలిగించింది, చలంపోయిన పదవ రోజుకు యింకా ముందుగానే తుపాను వచ్చి అపారమైన కష్ట నష్టాలను తెలుగు దేశనికి కలిగించింది. రైతులకు కోటి మేరకునష్టం కలిగింది. అయిదువందల మంది మరణించారు. లక్షలాది పశువులు ప్రాణాలు కోల్పోయాయి. 680 కోట్ల నష్టం వచ్చింది.

తరవాత—

ఎప్పటి చీకటి పొరలు

మనసులపై చీకు ఆలోచనలు

చిక్కు వ్యవహారాలు

చూడు!

కదలక రోదించే

ఈనికృష్టజీవుల్ని

ఎట్లా
మెడపట్టి గెంటుతోందీ
నిరంకుశ క్రూరవిధి

రక్తారుణ
మృత్యుదంష్ట్రా
భీకర గహ్వరంలోకి

## అ క్ష రా భి షే క ం

అరుణాచలంలో అస్తమించిన చలం పై తెలుగు పత్రికలన్నీ నమస్కార బాణాలు వేశాయి. చలాన్ని మర్చి పోయిన తెలుగు దేశం ఒక్కసారి ఆవలించి వొళ్ళు విరుచుకుంది. చలం గురించిన ఆలోచనలు అందరిమనసులలోనూ చేరాయి. కలాలు కదిలాయి. కాగితాలమీద అక్షరాలు నృత్యంచేశాయి. భస్మసింహాసనాసీను డైన చలానికి అక్షరాభిషేకం జరిగింది.

## తెరచిన దేవాలయం

'జీవితంలో నువ్వేం చేశావ్? నువ్వేం సాధించావ్? అన్నది కాదు ముఖ్యం, నువ్వేంగా తయారయ్యావ్?' ఇదీ ఆయనప్రశ్న.

'ఒకరి బాధని నీ స్వహస్తాలతో తీసివేశావా? కులం అన్నది పలక్కుండా పోయిందా నీ హృదయంలో? నిన్ను నీవు మరిచి ప్రేమించావా ఎప్పుడైనా?' అని సూటిగా పాఠకుని గుండెలకు తగిలే ఆత్మవిమర్శనా పూర్వక ప్రశ్నల బాణా లని వొదులుతాడు. ఆ తర్కం, ఆ ప్రశ్నలూ ఆత్మపొరల్ని చించి నగ్నంగా

మనల్ని నిలవెడతాయ్, చలం రచనల్లో అంతటా యీ వేగం వాడి వేడి హృదయాన్ని తాకుతాయ్.

నిజ జీవితంలో ఆయన కరుణామూర్తి, దయామయుడు. తన వొద్దకి వచ్చిన ఎంతమంది బాధలను కన్నీళ్ళను తన చిర్నవ్వులతో తుడిచేశాడో ఎంత మందికి యీ జీవన పోరాటానికి కావల్సిన ధైర్యాన్ని సాహసాన్ని వూపిరిగా పోశాడో, ఆ హృదయం అందరికీ తెరిచిన దేవాలయం. ఆయన నివాసం మనుషులకే కాదు పక్షులకీ జంతువులకీ అనురాగ ఆశ్రయాన్నిచ్చే ఆశ్రమం.

సత్యమైన ఆనందాన్ని అనుక్షణం అన్వేషిస్తూ, అరుణాచలం చేరుకున్న చలం, రమణ మహర్షి ప్రభావంతో ఆస్తికుడయ్యాడు. ఈశ్వర సాక్షాత్కారం పొందిన తన కుమార్తె సౌరిస్ అనుగ్రహంతో పర్యవేక్షణలో ఆ మహాకవి అంతకంతకూ ఎదిగాడు. ఋషిగా పరిణమించాడు. అప్రమేయానందాన్ని నిశ్చల మౌన ప్రశాంతిని సాధించాడు.

తన రచనలకన్నా గొప్పవాడైన చలం జీవితం సాహిత్యం వేరుకాదు. ధీరంగా నిశ్చలంగా చివరిదాకా అన్వేషణలోనే గడిపిన సాహసి చలం తెలుగు వారికి గర్వకారణం. అతని సాహిత్యం తెలుగుజాతికి మూలధనం— అంటూ 'తెలుగు విద్యార్థి' పత్రిక అక్షర హారతి సమర్పించింది.

## చలం పరిణామక్రమం

'జీవితాన్నంతా అన్వేషణగా చేసికొన్న వీరి యాత్రలోని మొదటి ఘట్టం వద్ద నుంచి మాత్రమే చూసిన వారికి, అయన లోకంలో ఓడిపోయిన ఆధ్యాత్మిక పలాయన వాది. యాత్రలోని తుది ఘట్టాన్ని మాత్రమే గుర్తించిన వారికి అయన ఆధ్యాత్మిక గృహానికి తిరిగివచ్చిన అల్లరి బిడ్డ (ప్రాడిగల్ సన్) మొత్తం కలిపి చూసిన వారికి వారి జీవితమొక సుసంబద్ధమయిన క్రమ పరిణామం, ఇవేమి అక్కరలేని మామూలు పాఠకుడి కతనొక సెక్సు రచయిత, అన్నారు శ్రీ వావిలాల సుబ్బారావు తమ వ్యాసంలో (చలం సాహితీ జీవితంలో క్రమ పరిణామం, ఆంధ్ర జ్యోతి, సాహిత్య వేదిక 10 జూన్ 1979 ఆదివారం)

"వీరేశలింగం గారు స్త్రీకి గల పునర్వివాహ నైతిక హక్కును మాత్రమే సాధించారు, చలం గారు స్త్రీ పురుష సంబంధంలో వుండి తీరవలసిన ఒక జీవన దృక్పథాన్ని— విలువను ప్రతిపాదించారు,

చలం తన జీవితంలో తాను చేసిన తిరుగుబాట్లు అన్నీ మానవుణ్ని ప్రేమించడానికి - గౌరవించడానికి - సౌందర్యాసాధనకు ఆటంకమయిన సందర్భాలలోనే,

లోకనీతికి ప్రేమకు తన జీవితంలో సంఘర్షణ కలిగినప్పుడు నీతికే ఎక్కువ ప్రాముఖ్యాన్నిచ్చే బ్రహ్మసమాజాన్ని విడిచి ప్రేమ పక్షాన నిలుచున్నారు. "ఈ నీతి, ఈ లోకం యింతే: దేవుడు చేసేదే ఇంత" అనిపిస్తే దేవుణ్ణే వదులు కున్నారు. ఇది దేవుని తప్పుకాదు. దేవుని ప్రేమగుణం మనుష్యులలో ఋషి త్వాన్ని కల్పిస్తుందని తెలుసుకొని-ఏ "రమణ మహర్షి" యో, ఏ చిరునవ్వులోనో చూపిస్తే, మళ్ళీ అంతే దీక్షతో ఆ దివ్యత్వాన్నే వెతుక్కుంటూ వెళ్ళారు. అన్ని ప్రేమలను అంగీకరించే లోకం స్త్రీ పురుషుల ప్రేమలోని స్వేచ్ఛను దోషంగా ఎంచి కన్నెర్ర చేస్తుంది.

ఈ కన్నెరయే చలంగారిని అరుణాచలం వెళ్ళే వరకు తరిమి కొట్టింది.... ఈ పరిష్కారం అందరికీ సరిపడక పోవచ్చు. వైయక్తిక మార్గమే కావచ్చు. దీన్నే కొందరు పలాయన వాదమన్నారు. అంటే ఈ లోక సమస్యలనుంచి పలా యనమని వారి ఉద్దేశం. కాని ప్రేమ స్వేచ్ఛల అవసరం తమ అంతరంగం నుంచి పుట్టి ఎవరికి విలువనీయుని ప్రేరణను ఇస్తుందో వారికే యీ పరిష్కారం. దాన్ని స్వీకరించలేని వాళ్ళు తమ ఆత్మలనుంచి పలాయనమయి లోక సమస్యల ఉరవడిలో తలదాచు కుంటున్నారని చలం గారంటారు.

మొదటి దశలో చలంగారు లోకంలోని ఈ క్రూరత్వం, నిర్దయ ఎక్కడ నుంచి వచ్చాయా అని వాటిని తిట్టారు. రెండవ దశలో ప్రేమ ఎక్కడ వుందా అని వెతికారు.... ప్రేమ వల్ల కలిగిన ద్వేషంలో నుంచి ప్రేమ వల్ల కలిగిన మౌనంలోకి క్రమంగా ప్రయాణించారు!

చలం జీవితంలోని క్రమపరిణామాన్ని వివరించడంలో, కొన్ని నిశ్చితాభి ప్రాయాల మూలమట్టాలను కదల్చడంలో సుబ్బారావుగారి విశ్లేషణ చాలా వరకు

వుపయోగపడుతుంది. చలం జీవితంలోని రెండు దశలకు సంబంధించిన అనుమానా లకు జవాబులు పై సమీక్షలో వున్నాయి.

## నిత్య సత్యాన్వేషి

'సత్యాన్వేషి చలం' అనే వ్యాసంలో (ఆంధ్రప్రదేశ్. 1-14, జూన్ 1979) లో శ్రీ ఎ.బి.కె. ప్రసాద్ చలంగారి ఈశ్వర జిజ్ఞాస ఆయన సత్యాన్వేషణలో ముఖ్యమైన అంశంగా గుర్తించి యిలా వివరించారు-

'చలం పాత చలం కాదు. మారిపోయాడు. ఈశ్వర జ్ఞాని అయిపోయాడను కున్నవారు కొందరున్నారు. నిజానికి చలంలో ఈశ్వర పదజిజ్ఞాస అరుణాచల ప్రవే శానికి ముందు నుంచీ వున్నదే. అయితే అతను తర్కించే ఈశ్వరుడూ, మామూ లుగా అనుకునే ఈశ్వరుడూ వేరు. అతని మొదటి ఈశ్వరుడు సంఘ మానవుడు; రెండవ ఈశ్వరుడు తనను తాను విమర్శించుకుని, వేదనలో అంతర్మథనంలో, దడులూ మడులూలేని, కల్మషం లేని వ్యక్తిగా తాను రూపొందాలని భావించిన నిత్య సత్యాన్వేషి. అందుకే, ఎక్కడో కాదు, గ్రహించి సక్రమంగా మెలిగితే ఈశ్వ రుడు నీలోనే వున్నాడని భావించినవాడు. స్వేచ్ఛను గురించి భావ విప్లవం తీసుకు రావడానికి సీరియస్‌గా చెబితే అర్థంకాదని, శృంగార వర్ణనలకు దిగినట్లే, ఉత్తుత్తిగా కాలక్షేపంగా ఈశ్వర పద జిజ్ఞాసలో వున్న తనదేశీయులలో, కర్మనూ- చేయ వల సిన పనినీ, ధర్మాన్నీ, సమత్వాన్నీ సాధించేందుకూ- ప్రబోధించేందుకే అతను ఈశ్వరుణ్ణి అడ్డంపెట్టుకున్నాడు. ఇక్కడే-సమాజంతో సంబంధంలేని ముముక్షువు లకూ, చలానికీ వున్నతేడా. ద్వైతం అద్వైతం అంతా తానే! వేరే ఈశ్వరుడు వున్నదీ లేనిదీ ఆయనకు తెలియదు.

....సంఘంతోనే రాజీపడలేని చలం, అంతర్మథనంద్వారా గుండె గొంతుక నుంచి నిర్భీకంగా నిత్యసత్యాలను చెప్పినందుకు తనను వెలివేసిన 'సోక్రాట్స్' మేధా వులతో రాజీపడతాడా? ప్రారంభమైన వేదన నిరంతర ఆవేదనగా మారి మనశ్శాంతి కోసం అరుణాచల యాత్ర చేసిందేగాని ఆవేదన మాత్రం ఆఖరి శ్వాస వరకు చల్లారలేదు.

ఎందువల్లనంటే అతను సత్యాన్వేషి కనుక,

....'సంఘక్షోభ రహస్య కార్యాలవల్ల కలుగుతుందే' కాని స్వేచ్ఛవల్ల ఎన్నడూ కలగదని ఆయన విశ్వాసం.

కులవర్ణ విభేద ఫలితాలను, కర్మ సిద్ధాంత ఫలితాన్ని సంఘం నేడనుభవిస్తోం దని చెప్పినవాడు చలం. చివరికి 1965లో ఆశ్రమంలో రాసిన భగవద్గీత వ్యాఖ్య లో కూడా అతను కర్మ మార్గబోధ చాలా మంది స్వార్థపరులకూ, దురాశా పరు లకూ, మోసగాళ్ళకూ మంచి కనుమరుగుగా కూడా సహాయ పడింది. ఎంత నీచమూ, దుర్మార్గమైనవృత్తిలో వున్నా దాన్ని సమర్థించుకోడానికి బాగా ఉపయోగ పడ్డదే కర్మబోధ అన్నాడు. క్షేమం అవిభాజ్యం అన్నవాడు శ్రీశ్రీయే కాదు, చలంకూడా!

శ్రీ ఎ. బి. కె. ప్రసాద్ మార్క్సిస్ట్ అయినా కూడా ఎంతో లిబరల్‌గా తన అభిప్రాయాలను, అంచనాలను మనసు పెట్టి చెప్పాడు. అంతేకాని బూర్జువా సత్యా న్వేషి అనే పిడివాద ధోరణికి ప్రసాద్ తావీయలేదు. చలం ప్రదర్శించిన సర్వ మత సమన్వయ దృష్టిని కూడా శ్లాఘించాడు.

## విశ్రమించిన మహోత్తుంగ తరంగం

చలం అస్తమయ వార్తపై ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక ఇలా వ్యాఖ్యా నించింది.

'మనుషులలోని కల్మషాన్ని, మురికిని కడిగి ఈ లోకాన్ని మంచికి మారు ద్దామని, మనుషులు పరస్పరం ద్వేషించు కుంటూకాక, ప్రేమిస్తూ బ్రతికే కొత్త లోకం ద్వారాలు తెరుద్దామని ప్రయత్నించి ఏమీ మార్చలేక, ఎందుకు మారదని అవేదన చెంది తమదారిన తాము వెళ్ళిపోయిన వారెందరో మహాను భావులున్నారు. ఎంత ప్రయత్నించినా మంచికి మారని లోకాన్నిచూసి నిరాశచెంది తమ జీవిత ప్రయత్నమంతా వ్యర్థమయిందని తెలుసుకుని, ఆత్మాన్వేషణలో తన దారితాను వెతుక్కుంటూ వెళ్ళిపోయిన గుడిపాటి వెంకటచలంగారు, జాన్ బనియన్ 'పిలి గ్రిమ్స్ ప్రోగ్రెస్'లోని బాటసారి లాంటి వారు. ఆయన యాత్ర ముగిసింది. కడలి నుంచి ఉద్భవించిన ఒక మహోత్తుంగ తరంగం కడలిలోనే విశ్రమించింది.

'చలం విజువ' అనే వ్యాసంలో (ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక. నుంచి 25-5-79) శ్రీ పి: రామకృష్ణారెడ్డి—

....కాదు....కాదు. కథలూ నవలలూ చదివినందుకేకాదు. మా హృదయాల లోపలివైపునించీ బయటి ప్రపంచం వేపు ఆలోచనాద్వారాలు తెరిచినందుకు, మా లేత రక్తానికి పోరాటపు యెర్రదనం యిచ్చినందుకు, కృతజ్ఞతలు చెప్పకోడానికి వచ్చా మనాలా?

....ఇప్పుడు చలం రెండోసారి చచ్చిపోయాడు? చలం కొన్నేళ్ళ కిందట ఆత్మహత్య చేసుకొన్నాడు. ఇప్పుడు విచారించవలసింది ఈ రెండో చావుకికాదు. మొదటి దాని నష్టంతో పోలిస్తే ఈ రెండోదాని నష్టం లెక్కలోకిరాదు. ఈ సందర్భంలో ఈ మాటనడం కటువుగా వుందేమో. కాని వాస్తవం సందర్భాన్ని బట్టి వేషం మార్చుకోదు. దాని స్వభావం కటువుగా వుండటమే.

తెలుగు సాహిత్యంలో 'చలం' అనే రెండక్షరాలు పేరులేకపోతే సాహిత్యం సమాజం ఎంత వెనుక బడివుండేదో మనం యిప్పటికీ పరిశోధించి తేల్చుకోలేదు!

జూన్ పదవ తేదీ ఆదివారం ఆంధ్రజ్యోతి దినపత్రిక, సాహిత్య వేదికలో చలంపై పరిశోధనచేస్తున్న శ్రీ వావిలాల సుబ్బారావు చలం ఆత్మహత్య చేసుకున్నాడా, రెండవసారి మరణించాడా అనే జిజ్ఞాసువుల ప్రశ్నలకు వివరణను సమకూర్చాడు. (చూడండి యిదే అధ్యాయంలో చలం పరిణామక్రమం పేరాలు)

'తనను గురించి చలంగారు చెప్పకున్నంత వివరంగా దాపరికం లేకుండా మరే తెలుగు రచయిత చెప్పకోలేదు.

....అయినా ఆయన గురించి ఏర్పడినన్ని అపార్థాలు - భిన్నార్థాలు - ఒక్కోసారి అనర్థాలు కూడా- మరి ఏ తెలుగు రచయిత గురించీ యేర్పడ లేదు. పాఠకులు, విమర్శకులు తమకు ఇష్టమయిన, లేక కష్టమయిన ఏ ఒక భాగాన్నో మాత్రమే తీసుకొని భూషణో దూషణో చేశారు.

....అందుకే చలం గారి మరణానికి కొందరు బాష్పాంజలులు సమర్పిస్తే, మరికొందరు గౌరవంతో వారిని జ్ఞాపకం చేసుకుంటూనే "చలం రచనా జీవితాన్ని

కొంతకాలంగా సంక్షేపించుకున్న కారణంగా ఆయన భౌతిక మరణానికి ప్రత్యేక మయిన విలువ ఏమీలేదు" అని శ్రీ కొడవటిగంటి (ఆంధ్రజ్యోతి-13 మే. 79). "చలం గారికి ఇది రెండవ మరణం" అని శ్రీ రామకృష్ణారెడ్డి (ఆంధ్రజ్యోతి వార పత్రిక "చలం విలువ",) వ్యాఖ్యానించారు. ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'చలం' గూర్చిన సంపాదకీయంలో వారి జీవితాన్ని రెండుగా విశ్లేషించి ప్రథమ భాగాన్ని గురించి ప్రశంసించి, ఎప్పటికయినా లోకం మొదటి చలాన్నే జ్ఞాపక ముంచు కుంటుంది గానీ, రెండవ చలాన్ని కాదన్నారు. అంటే వీరందరి దృష్టిలో రెండవ "చలం" లోకానికి అక్కరలేని "చలం", ఆయన జీవితంలో అది వ్యర్థమయిన భాగమన్నమాట.

చలానికి సరిపడని కొలతలతో అతన్ని కొలిచి నీళ్ళతో పాటు బిడ్డను కూడా పారవేసినట్లుంది ఈ నిర్ణయం. మొట్టమొదటి నవల శశిరేఖనుంచి గ్రాఫ్ గీ స్తే పురూరవ, అరుణ, అమీనాల మీదుగా జీవితాదర్శం వరకూ పరిశీలిస్తే చలం మిస్టిక్ కావడమనేది చాలా సహజమైన పరిణామమే. సత్యాన్వేషకులు ఆధ్యాత్మిక శిఖరారోహణ చేయడం 'రెండవ మరణం' గానూ, 'ఆత్మహత్య'గానూ ఎందుకు భావించవలసి వచ్చిందో ఈ పుణ్యభూమిలో అర్థం కాదు. చలం రచనల వలన ప్రభావితులైన వారుమార్క్సిజం వైపు మళ్ళగా, చలం నిరంతరాన్వేషణ ఆధ్యాత్మిక శిఖరారోహణ చేయడం 'మోసం'గా భౌతికవాదులు సైతం భావించారని చెప్పుకోవాలి.

శ్రీ వావిలాల సుబ్బారావు తన వ్యాసంలో—

'చలంగారిలో ఒక చిత్రమైన వైరుధ్యమున్నది. వారు ఆలోచించింది సమాజం గూర్చేగాని వ్రాసింది మాత్రం తనకొరకు. అంటే తనను శోధనం చేసు కోవడం కోసమేగాని లోకాన్ని ఏదో మరమ్మత్తు చేద్దామని కాదు? రజని గారితో ఇంటర్వ్యూలోనూ, మిత్రులకు ఉత్తరాలలోనూ పదేపదే ఇదే చెప్పారు. నా పుస్త కాలలో తిట్టింది బయటవున్న మనుష్యులను కాదు. నన్నే. నాలో ఏయే మచ్చ లున్నాయో వాటిని నేను గట్టిగా తిట్టుకోవడంతో.... నేను వ్రాసిన పుస్తకాలన్నీ బయలు దేరాయి. అని మిమ్మల్ని అనుకుని మీరు చాలా కోప్పడ్డారు. దీనిలో వారు చేసిన సామాజిక విమర్శకు లక్ష్యం ఏమిటో బోధ పడుతుంది'- అంటూ వివరించారు.

ఈ జవాబును భౌతిక వాదులు, మార్క్సిస్టులు; కొంత మంది మేధావులూ హర్షించారు, దీనిని హిపోక్రసీ క్రింద బూర్జువా పలాయనవాదంకింద వారు కొట్టిపారవేస్తారు. చలాన్ని, చలం సాహిత్యాన్ని, అతని ప్రభావాన్ని తిరస్కరిస్తూ శ్రీ ఐ. సిహెచ్. వి. బసవరాజు (జ్యేష్ఠ) చలం మరణానికి ముందే తీవ్రమైన పదజాలంతో ఎలా విమర్శించాడో ఈ చిన్న వ్యాసంలో గమనించండి—

## ప్ర వ క్త గా చ ల ం

"మాసిపోయిన మనస్సులిని ఉతుక్కోలేక
మహర్షుల లాండ్రీల్లో పారేస్తారు"

— 'త్వమేవా హం'లో ఆరుద్ర.

చలం మనకున్న కొద్దిపాటి కుహనా మేధావుల్లో పెద్దవాడు, అతనివ్యాసాల లోని ఆకర్షణ టాపిక్ వల్ల వచ్చిందే; (సెక్స్) విశృంఖలత్వం చాలా మందికి. ముఖ్యంగా యువకులకి మంచి మత్తు పానీయం కనుక దాంట్లో, ఎంత విషం కల్తీ ఉన్నా వాళ్ళు గమనించరు. చలం భావాల్లో ఆవేశమూ, అసంతృప్త కామమూ ఎంత ఎక్కువో లోకజ్ఞానం అంత తక్కువ. అందుకే అతనికి లోకమంతటా అజ్ఞానులే కనిపిస్తారు. మనుషుల్ని పందులూ, చవటలూ వగైరా ముద్దు పేర్లతో తప్ప అతను పిలవడు.

చలం అనే వింత మనిషికి (నేటి రాజ్‌నారాయణ్ లాగానే) చాలా నాళ్ళుగా 'పేరు' ఉందిగాని ప్రభావం చాలా తక్కువ. అతని భక్తులెవరూ అతను గొంతు చించుకుని అరిచిన సెక్స్ స్వేచ్ఛని ఆచరణలో చూపక పోడమే దానికి తార్కాణం.

పాశ్చాత్య మేధాప్రపంచంతో పరిచయం లేనివారికి చలంలో చాలా 'ఒరిజినాలిటీ' కనిపిస్తుంది. కాని అతని రచనల్లో ఫ్రాయిడ్, వెల్స్, లారెన్స్, రసెల్ మొదలగువారి రచనలు పేజీలకి పేజీలు దూరిపోయాయని వాటిని చదివిన వాళ్ళకి మాత్రమే తెలుసు.

సొంత ఆలోచన అటుంచి అసలు ఆలోచనేలేని 'మేధావి' చలం. అతని భావదారిద్ర్యానికి పరాకాష్ఠ "స్త్రీ" అనే ప్రసిద్ధ గ్రంథంలో కనిపిస్తుంది. అది ఒక్కటీచాలు చలం 'లోతు' గ్రహించడానికి.

చలం వయసు 'స్త్రీ' వ్రాసే నాటికి ముప్పై ఏళ్ళలోపు (1925). 1975లో వెలువడిన లేటెస్టు ముద్రణని చూశాను; అప్పుడేనా పశ్చాత్తాపం కనిపిస్తుందేమో నని. ఏ మాత్రమూ కనపడలేదు. పాతికేళ్ళ 'రమణాస్థాన్'లో గడిపినా అతనికి బుద్ధి ఎదగలేదు. ధ్యానంతో మనుషుల బుద్ధి వికసించాలి మరి

నేనూ ఒకప్పుడు చలాన్ని ఆరాధించాను; కారణం అతన్ని అపార్థం చేసు కోడమే. పుస్తకాల్ని ఎలా చదవాలో తెలియక! చాలా మందికి సక్రమంగా చదవ డం చాతకాదని సూచిస్తూ ప్రొఫెసర్ ఏడ్లర్ (ఎన్‌సైక్లోపెడియా బ్రిటానికా ఛీఫ్ ఎడిటర్) ఈ మధ్య ఒక ఇంటర్‌వ్యూలో వివరించారు. ఆ తప్పు నేనూ చేసేవాణ్ణి.

పుస్తకం చదువుతూ ప్రపంచాన్నీ తననీ మరిచిపోడం చాలా మంది చేసే పొరపాటు. ఏది చదివినా లైను లైనుకీ 'ఇది సహజమేనా ఇది సాధ్యమేనా' అని ప్రశ్నించుకోవాలి, రచయిత భావాల్ని అన్నిటినీ పోల్చి చూడాలి. మన అనుభవంతో వాటిని లింక్ చేయాలి. కాకపోతే మంచిఏదో కానిది ఏదో తెలిపే కొలత ఏముం టుంది?

చలం స్త్రీ ఇప్పుడు చదివి ఆ ప్రశ్నలే వేసుకున్నాను. ఫలితం ఇది.

1. చలం భావాలు అతనికే పనికి రాలేదు, అతని భావాలు పరిపూర్ణ జీవనానికి సోపానాలైతే రమణస్థాన్ ప్రయాణమే అనవసరం.

అంటే అర్థం అవి ఆచరణీయాలు కావని; అసహజమని.

2. అంతేకాదు. ఒక పేజీలో చెప్పేదానికి మరో పేజీలో చెప్పేదానికి చుక్కెదురు.

3. చలానికి సెక్సులో ఆనందం అందలేదు. అందుకే అంత ఆక్రోశం.

4. మనుషులు సహజ పాపులు అన్నట్లు తెగతిట్టటం అతని అజ్ఞానానికి నిదర్శనం.

చలం చాలా దుర్మార్గుడు. మానవద్వేషి.

పాఠకులకి బాధ కలుగుతుందని తెలుసు; కాని సాక్ష్యంకోసం ఇవ్వాల్సి వస్తున్న 'స్త్రీ' లోని కొటేషన్లని క్షమించి చదవండి.

1. "మృగం వలె స్త్రీ తినడం కనడం స్థితిలోనే ఉంది" పేజీ 51

"దివ్యమైన మాతృ అనుభవం లోపమైతే స్త్రీ జీవితం శూన్య మవుతుంది." పేజీ 210

పిల్లల్ని కనడం మృగత్వమా దివ్యత్వమా చలం దృష్టిలో?

2. "అదిగాక తల్లుల వల్ల కుటుంబాలలో వొచ్చే దుర్గుణాలూ అందరు పిల్లలతో పెరగడం వల్ల (నర్సరీల్లో) వొచ్చే సద్గుణాలూ పిల్లలకు ఎక్కువగా ఉన్నాయి."

దుర్గుణాలు తల్లులకే ఉంటాయి, ఆయాలకు ఉండవని! ఎంత కుటుంబ ద్వేషం!

3. " ఈ పతివ్రత లందరూ భర్తల రెక్కల కష్టం మీద ఆధారపడి నెత్తురు పీల్చుకునే నల్లులూ జెలగలూ " పేజీ 56

" ఆమె చేసే వంటా, సేవా నీచం కావనీ -- " పేజీ 56

గృహిణి శ్రమకి చలం దృష్టిలో విలువ ఉన్నట్లే కనిపిస్తుంది రెండో వాక్యం చూస్తే. అలాంటప్పుడు భర్తల రెక్కల కష్టాన్ని దోచుకోవడం అనేమాట ఎలా వచ్చింది?

భావాల్లో ఎంత స్పష్టత, ఎంత పొంతన!

4. "తీర్థయాత్రలు వెళ్ళి వొచ్చి, గుళ్ళ ప్రదక్షిణాలు చేసి, యోగులదగ్గర వరాలు పొంది, పిల్లల్ని కంటారే, అక్కడ కూడా పురుషుడు మారడమే తటస్థించి ఉంటుంది" పేజీ 215

అంటే అర్థం : ఆలస్యంగా తొలికానుపు వచ్చిన వారంతా వ్యభిచారిణులనా?

ఎంత మురికి చలం మనస్సులో!

.... .... ....

మానవ జీవితం గురించి సమగ్రమైన అవగాహన లేకపోడం తప్పుకాదు. లేనిది ఉన్నట్లు నమ్మించ బూనడమే తప్పు. అదే చలం తెలుగు జాతికి ఏభై ఏళ్ళుగా చేసిన ద్రోహం.

.... .... ....

అసలు రహస్యం ఇది. నిజానికి రహస్యం కానేకాదు; అందరికీ తెలుసు. ప్రేమించడం ప్రేమించబడటం మంచిదని, స్వేచ్ఛ అన్నింట్లోకీ గొప్పదనీ. కాని వాటిని సాధించడానికి కావల్సింది శక్తి. ఆ సంగతీ తెలుసుకనుకనే మనుషులు మర్యాద ఇస్తారు ఒకరి కొకరు—అశక్తత కారణం అని చలం ఒక్కడికే ఈ సంగతి తెలీదు.

దైహిక మానసిక శక్తులు పుష్కలంగా ఉన్నవాళ్ళని సంఘం తాలూకు చట్టాలు, సంప్రదాయపు బంధాలు ఏమీ చేయకలేపోడం నిత్యం చూస్తున్నాం. శక్తిలేని వాళ్ళకు (తనతో సహా) స్వేచ్ఛ, మోహం, ప్రేమా లేవని కుళ్ళడం శాపనార్థాలు పెట్టి రెచ్చకొట్టడం మానవతత్వం తెలీని వారు చేయాల్సిన పని. ఆ పనే చేసి చేసి ఉన్నమతి కూడా పోగొట్టుకున్న 'ప్రవక్త' చలం. శక్తి ఉన్నవాళ్ళకి చలం అక్కర్లేదు; లేనివాళ్ళకి ప్రమాదం.

రజనికి యిచ్చిన రేడియో ఇంటర్వ్యూలో చలం చెప్పిన జవాబుల్లోనే 'జ్యేష్ఠ' లేవదీసిన విమర్శలకు వివరణ వుంది.

'నా పుస్తకాల్లో తిట్టింది బయటవున్న మనుష్యులను కాదు నన్ను, నాలో ఏయే మచ్చలున్నాయో వాటిని నేను గట్టిగా తిట్టు కోడంతో, వాటిని గట్టిగా గోక్కోడంతో ఆ పుస్తకాలు.... నేను రాసినవి అబద్ధం, అసత్యం అని నేను బ్రతికుండగా అనిపిస్తే దినపత్రిక లన్నిటిలో స్వంతఖర్చుతో ప్రకటన వేయిస్తాను.'

చలం భౌతిక మరణానికి ప్రత్యేకమైన విలువ ఏదీ లేదని కొందరంటే, జ్యేష్ఠ, చలం జీవితానికీ సాహిత్యానికీ కూడా ఏమీ విలువలేదని మొత్తంగా తిరస్కరించాడు. ఇందులో దూకుడు, దుందుడుకుతనమే ఎక్కువగా వుంది. చలం

ప్రధానంగా సాహిత్యకారుడిగా తన కృషిని ప్రారంభించలేదు. సంఘ మౌఢ్యంతో పోరాడే శక్తిగా అవతరించి కలాన్ని ఆయుధంగా స్వీకరించాడు. అతను చెప్ప దలచుకున్న విషయాలకు కావలసిన సరంజామాను ఎక్కడినుంచైనా గ్రహించే స్వేచ్ఛను తనకు తాను యిచ్చుకున్నాడు. He never cared for originality అన్నాడు కొడవటిగంటి కుటుంబరావు. చలం ఏ సాహిత్య మార్గానికి సంఘానికి చెందినవాడు కాదు. అతను సాహిత్య సంప్రదాయాలను మర్యాదలను అన్నిటినీ ఉల్లంఘించినవాడు. తమతమ రచనలతో మార్క్సిస్ట్ భావాలను పేజీలకు పేజీలు కోట్ చేస్తున్నవారిలో ఒరిజినాలిటీ వుందా? భావాలు ఖండాంతరాలు దాటి స్వేచ్ఛగా ప్రయాణం చేయకపోతే సమాజంలోని మనుషులు నిలవనీటిమడుగులో క్రిమి కీటకాల్లా కుళ్ళిపోతారు. మురికి పేరుకున్నప్పుడే ప్రవక్తలూ సంస్కర్తల అవ సరం, మురికిలోంచే పద్మాలన్నీ వికసించటం జ్యేష్ఠ గారు చూడలేదా? సమాజంలో వున్న మురికి, కుళ్ళు, కల్మషాలతోనేకదా పోరాటం? మన మీద రుద్దిన బ్రిటిష్ మిడిల్ క్లాస్ విక్టోరియన్ మోరల్స్‌తో కూడా చలం పోరాడాడనే విషయం జ్యేష్ఠగారు గుర్తుంచుకోవాలి. సర్వేపల్లి రాధాకృష్ణన్ కంటె చలం ఎంతో మెరుగు....రాధా కృష్ణన్ గారు చెప్పినవన్నీ ఆయన భావాలా? సందర్భాన్నుంచి విడదీస్తే ఏ వాక్యా లైనా హాస్యాస్పదాలవుతాయి. చలం స్త్రీ రాసేనాటికి అది బిగ్ లీప్, ఈనాడు కాదు.

గురజాడ అప్పారావు తర్వాత చలం అవతరణ ఒక చారిత్రక అవసరం. గురజాడ తన కథలలో వాడిన వ్యావహారికాన్ని చలం కథలలోని వ్యావహారికంతో పోల్చిచూస్తే, గురజాడ నాటికి ఆ తొలి కథలలో శైలి అంత బలంగా యేర్పడలేదని తెలుస్తుంది. చలం ప్రభావం ఏమీ లేదన్నారు. అడవి బాపిరాజు నవలల్లో, కుటుంబరావు, గోపీచంద్, బుచ్చిబాబు, ధనికొండ వీరందరి సాహిత్య విన్యాసాల్లో చలం ప్రభావం ఛాయామాత్రంగా కనిపించి తీరుతుంది. చలం ఎలక్ట్రిక్ ట్రైన్ లాంటివాడు, మిగతావన్నీ పొగబళ్ళే.... జీవితకాలం లేటుగా గమ్యస్థానం చేరుకుంటాయి.

'చలం సృష్టించింది గందరగోళమే కొందరి మనసులలో— మహర్షి త్వానికి చలాన్ని కొన్నిమెట్లు దిగువుననిలిపింది. ఆయనలో మొదటినుంచి వ్యక్తమైన ఈ క్వాలిటీయే.' నని జ్యోతి మాస పత్రికలో సవ్యసాచి పేరుతో నండూరి వారు అక్టోబరు 65 సంచికలో యిలా విశదీకరించారు.



ఆగస్ట్ 78లో చలం (పెద్ద జబ్బుచేసి కోలుకున్నాక)

# మహర్షి కాని మనీషి

వెనుకటికి ఎందరో భక్తులు, ఎందరో జ్ఞానులు, ఎన్నో విధాలుగా భగవంతుడిని సాక్షాత్కారం చేసుకున్నారట. చైతన్యుడు భగవంతునికి తన్ను తాను ప్రేయసిగా అర్పించుకున్నాడు; ఆయనది మధుర భావం. రామకృష్ణ పరమహంస ఈశ్వరుడిని జననిగా ఆరాధించాడు; అయనది మాతృభక్తి. చండీదాసుకు తన ప్రేయసి రామినిలో భగవంతుడు కనిపించాడు; ఆయనది సహజమార్గం. శంకరుడు తనకు, పరమాత్మకు ఆ భేదం చెప్పుకున్నాడు; ఆయనది అద్వైతం – ఇలా ఒక్కొక్కరి దొక్కొక్క మార్గం.

కలడు కలండనెడు వాడు కలడో కలయో తెలియదుగాని, గుడిపాటి వెంకట చలం గారు మాత్రం ఈశ్వరుడిని సెక్సులో అన్వేషించినట్టు చెప్పుకోవచ్చు.

ఎందుకంటే, చలంగారికి చిన్నప్పటినుంచి భగవంతుని గురించిన జిజ్ఞాస వున్నట్లు కనబడుతుంది. ఆయన రచనలలో తరచుగా భగవంతుని ప్రస్తావన

వస్తుంది. అయినా, భగవంతుడిని తనతర్కం ద్వారా తిరస్కరించి, మానవ జీవితంలో అన్నిటికంటె ఉన్నతమైన స్థానంలో సెక్సుకు ఆయన పట్టాభిషేకం చేశారు, సామాన్యులను బాధించే అనేక సమస్యలు, ఈతి బాధలు, రాగద్వేషాలను గురించి ఆయన ఎన్నడూ లోతుగా ఆలోచించినట్టు లేదు. ఊహాలోకంలో తమకు తామొక మైదానాన్ని సృష్టించుకుని, దానిలో అమీనాలను అరుణలను కల్పించుకుని ఆయన కాలక్షేపం చేశారు.

చలంగారిది కేవలం అశ్లీల సాహిత్యమని త్రోసి పుచ్చినవారు లేకపోలేదు. వారి నిరసనతో నేనేకీభవించను. దేశ స్వాతంత్ర్యంకోసం ప్రాణాలర్పించిన వారున్నారు; వ్యక్తిస్వాతంత్ర్యం కోసం, మత స్వాతంత్ర్యం కోసం పోరాడిన వారున్నారు, చలంగారు సెక్సు స్వేచ్ఛ కోసం పోరాడారు. ఆయన— కనీసం ఆయన శిష్యులు - దానికి స్త్రీ స్వాతంత్ర్యోద్యమమని పేరు పెట్టినా, నిజానికి అది సెక్సు స్వాతంత్ర్యోద్యమమే. దానికోసం ఆయన ఎన్నో త్యాగాలు చేశారు: సంఘంలో నిరంతర యుద్ధం సాగించారు; కట్టుబాట్లను కాలదన్నారు; విశృంఖలత్వాన్ని ఉపదేశిస్తూ ఎన్నోకథలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు, లేఖలు వ్రాసారు.

అయితే, దురదృష్టవశాత్తు చలంగారు వాడదలచిన ఔషధం రోగాన్నే కాక రోగినికూడా అంతం చేయగలిగినంత ఘాటైనది, అందుచేతనే ఆయన విచికిత్సను మెచ్చుకున్నా, చికిత్సను మాత్రం ఆంధ్రదేశం అంగీకరించ లేకపోయింది. ఆంధ్ర దేశమేకాదు — ఆధునిక కాలంలో ఏ మానవ సంఘమూ దాన్ని ఆమోదించ లేదు. అందుకే ఆయన ఆంధ్ర దేశంపై ఆగ్రహించి అరుణాచలంలో ఆశ్రమం ఏర్పరచుకున్నారు. ఆయన ఉద్బోధించిన సెక్సు స్వేచ్ఛ ఆయన ఆదర్శలోకంలోనే ఆశ్రయం ఏర్పరచుకుంది.

చలంగారు ఒకందుకు అదృష్టవంతులు. ఆయనపట్ల గాఢ విశ్వాసం తప్ప మరేమీలేని శిష్యులాయనకు కొల్లలు. వారు చలం గారిలాగా 'వాస్తో—చేస్తో—వొంటరిగా' లాంటి ప్రయోగాల దగ్గర్నుంచి అన్నిటిలో ఆయన అడుగు జాడలనుసరిస్తారు. ఆయన సెక్సును మించినదేదీ లేదన్నప్పుడు వారు భళీ అన్నారు; ఈశ్వరు డున్నాడల్లే వుందని ఆయన కనుమానం కలిగితే తలకాయ లూపారు: సొరీస్ ఈశ్వరుడంటే 'మరే' అన్నారు; అష్టగ్రహకూటంతో ప్రళయం రాబోతోందంటే భయపడి పోయారు; కలదో లేదో అని ఆయన గందరగోళంలో పడితే వారూ పడ్డారు; అందర్నీ వదిలి అరుణాచలం వెళ్ళిపోతే అరుణకోసం కాకపోయినా

చలం కోసంతామూ వెళ్ళారు; కేవలం ప్రచురణకోసమే నన్నట్లు అసంఖ్యాకంగా ఆయనకు లేఖలువ్రాశారు; వ్రాయించుకున్నారు. స్వతంత్రాలోచనకు అంత విలువ నిచ్చే చలంగారు తమ శిష్యుల భక్తిని హర్షించే 'వ్యానిటీ' కి లోను కావడం విచిత్రమే. భక్తులాయన్ని మహర్షిగా భావించినా. మహర్షిత్వానికి ఆయన్ని కొన్ని మెట్లు దిగువన నిలిపింది ఆయనలో మొదటినుంచి వ్యక్తమైన ఈ వ్యానిటీయే. చివరి కాయన మిగిల్చింది కొందరి మనస్సులలో గందరగోళమే.

— సవ్యసాచి

ఏ కారణాల వలన సనాతనులు, ఛాందసులు, పూర్వాచార పరాయణులు చలాన్ని అతని సాహిత్యాన్ని గర్హించారో, అతడ్ని వెలివేశారో, అటువంటి కారణాలతో నిమిత్తం లేకుండా ఆధునికులు సైతం చలాన్ని విస్మరించడానికి ప్రయత్నించారు. చలం విశృంఖలత్వాన్ని ప్రేరేపిస్తున్నాడనీ, యువతీ యువకుల మనసులను కలుషితంచేస్తున్నాడనీ, వివాహవ్యవస్థను ధిక్కరించి స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాన్ని ప్రబోధిస్తున్నాడనీ ఆధునికులకు కూడా కంగారు పుట్టింది.

దీని వెనుకనున్న రహస్యం ఏమిటంటే- స్త్రీ పురుష సంబంధాల విషయంలో ఏవిధమైన మార్పుకు సమాజం సిద్ధంగా లేదు.

పెళ్ళిపేరిట ఏమి జరిగినా సమాజానికేమీ పట్టదు. పెళ్ళి చాటున ఎన్నెన్ని ఘోరాలు జరిగినా, ఆ అన్యాయాలను సమాజం సహిస్తుంది.

స్త్రీలకు కావలిసింది తిండి బట్ట యిల్లు మాత్రమే కాదు. యుగయుగాల తరతరాల బానిసత్వం నుంచి విముక్తి. ఆమె వ్యక్తిత్వ పరిపూర్ణ వికాసానికి అడ్డువచ్చే గోడ లన్నిటినీ పడగొట్టాలి.

ఆమెను ఉద్ధరించడానికి చేయూతనిచ్చి చెప్పుచేతల్లో నడిపించడానికి సమాజం సిద్ధంగావుంది కాని, స్త్రీ పురుష సమానత్వాన్ని అంగీకరించి, స్త్రీకి స్వేచ్ఛని పొందే హక్కును (పురుష) సమాజం ఆమె కివ్వదు. తమ శరీరాలమీద, మనసులమీద జీవితాలమీద తమకు పూర్తి స్వేచ్ఛ కావాలని స్త్రీలు తిరుగుబాటు చేస్తే, వివాహ వ్యవస్థ వలన జరుగుతున్న ఘోరాలనుంచి విముక్తికై ఆ వ్యవస్థను ధిక్కరిస్తే—

ఎంతటి అభ్యుదయ వాదులు సైతం బూటు కాళ్ళతోతన్ని ఆడవాళ్ళను ఇళ్ళల్లోత్రోసి అణచి పెట్టి వుంచుతారు. జానిసల తిరుగుబాటును ప్రభువులు ఎలా లెక్కచేయరో అలాగే స్త్రీల అభివృద్ధి కాంక్షించేవారు కూడా స్త్రీల తిరుగుబాటును గుర్తింప నిరాకరిస్తారు. చలాన్ని మురికి చలం అనీ, కూహనా ప్రవక్త అనీ, సెక్స్ రచయిత అనీ రాళ్ళు విసిరేవారంతా 'స్త్రీ' విషయంలో యధాతథవాదాన్ని సమర్థించేవారే.

ఏ అన్యాయాలమీద అతను ధ్వజం ఎత్తాడో, ఏ పాత విలువలను అతను ధ్వంసం చేయదలచుకున్నాడో, ఏ స్ట్రగుల్, ఏ పోరాటాన్ని జీవితాంతం అతను సాగించాడో దాన్ని సెక్సు స్వాతంత్ర్యోద్యమంగా, మానవజీవితంలో ఉన్నతమైన స్థానంలో సెక్సుకి పట్టాభిషేకం చేసినట్లుగా ఆయన మీద సభ్యసమాజం విరుచుకుపడింది. సెక్స్ స్వాతంత్ర్యం అంటే- ఆ స్వేచ్ఛ స్త్రీకి యివ్వడమే. స్త్రీ పురుషుల సంబంధాలలో రావలసిన మార్పు స్త్రీకి ఆ స్వేచ్ఛ వున్నపుడేగాని రాదు.

స్త్రీ స్వాతంత్ర్యోద్యమంలో ఆమెకు భావ స్వాతంత్ర్యంతో పాటు మిగతా పరిస్థితులలో కూడా మార్పురానిదే-ఈ స్వేచ్ఛ నవ్వులపాలవుతుంది. అంత వరకూ చలంగారు వాడ దలచిన ఔషధం వికటించే ప్రమాదం వుంది. స్త్రీ విషయంలో పాతవారైనా కొత్త వారైనా Thus far. no further అనే దృక్పథంతో వున్నపుడు ఆమెకు ప్రసాదించే స్వేచ్ఛ (యిప్పటి పరిస్థితులలో) ఆమెకే ప్రమాదం కలిగిస్తుందని భయపడతారు. స్త్రీ పురుషుల మధ్య ప్రేమకు స్వేచ్ఛా వాతావరణం చాలా అవసరం. ఆ స్వేచ్ఛ మళ్ళీ స్త్రీ వ్యక్తిత్వవికాసానికి కావలసినది. ఇవేమీ లేకుండా, వీటిని సాధించడానికి పోరాడే శ్రమ తీసుకోకుండా, కొత్త సంస్కృతిని ప్రోదిచేసుకొనడానికి ప్రయత్నించకుండా మనం ముందుకి ఎలా పోతాం ?

స్త్రీకి స్వేచ్ఛ అనగానే వ్యభిచారానికి ప్రోత్సాహంగా భావించి భయపడే వారికి చలంలో గందరగోళమే కనిపించితీరుతుంది.

చలం మరణానికి కొన్ని రోజులు ముందుగా ఉత్తర అమెరికా తెలుగు సమ్మేళనం (డెట్రాయిట్) ప్రత్యేక సంచికకు చలం గురించి రాయమనగా శ్రీఆరుద్ర రాసిన చిన్న వ్యాసం కూడా అభ్యుదయ భావుకుల దృక్పథానికి మచ్చుతునక.

# చలం మీద.....

సాహిత్యలోకంలో నేను కన్ను తెరచి, పెన్ను పట్టుకొనే రోజుల్లోనే చలం ప్రభావం తగ్గుముఖం పట్టింది. ఇంకా ఆ రోజుల్లో సైతం చాటుగా చలాన్ని చదువుకొనే వాళ్లు వుండేవారుగాని, చలాన్ని చదువుకొని చెడిపోతారనే ఆందోళన కూడా తగ్గుముఖం పట్టింది.

కథకులుగా కుటుంబరావు, గోపీచందూ కుర్రాళ్లను ఆకర్షిస్తున్న రోజులవి. తన మహాప్రస్థానానికి చలం చేత యోగ్యతాపత్రం రాయించుకున్న శ్రీశ్రీ యే పద్యాల్లో చలాన్ని అవహేళన చేయకపోలేదు.

"కటకటా లొటి పిటా చస్తే
కృ.శా. విషాదగీతం రాయాలా
సెక్సులోని ఎక్స్ కర్థం తీస్తూ
చలం కలం పట్టాలా?"

ఈ నాలుగు లైన్లలో శ్రీశ్రీ పెట్టిన చురకలు ఆనాటి పద్య రచనలకూ,గద్య రచనలకూ సరిసమానంగా సరిపోయాయి. శ్రీశ్రీ ఈ విమర్శ చేసిన రోజుల్లో ఆంధ్ర దేశంలో ఇంకా అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడలేదుగాని, యువకుల్లో అభ్యుదయ భావాలు అంకురించి, కృష్ణశాస్త్రిమీదా, చలం మీదా మోజు మాత్రం ఏర్పడలేదు.

నేను చలాన్ని బాహాటంగానే చదువుకొన్నాను. బ్రాహ్మణీకం, మైదానం, అమీనా, పాపం వగైరాలు చదివినప్పుడు ఏమో గొప్ప రచనలు చదువుతున్నట్లు ఫీలవలేదు. కుటుంబరావు రచనలు, 'నీకేం కావాలి?' 'కులంలేని పిల్ల' మొదలైనవి నన్నూ నాలాంటి వాళ్లని బాగా ఆకట్టుకొన్నాయి. చలం మీద ఏ మాత్రం సాహిత్య గౌరవమైనా వున్న వాళ్ళకు గోపీచంద్ రాసిన 'వెంకట చలం పాత్ర' అన్న రచన గొప్ప కనువిప్పు కలిగించింది.

రాను రాను చలం లోకాన్ని పట్టించుకోడం మానేశాడు. లోకం కూడా అతణ్ణి పట్టించుకోడం మానేసింది. "మ్యూజింగ్స్" రాసే నాటికే అతని లోకం వేరైంది.

అయినా ప్రయోజనాత్మకమైన రచనలు చేయదల్చుకుంటే చలం చేయగలడు. అతని కలం చాలా శక్తివంతమైనది. అభ్యుదయ రచయితలు మద్రాసులో మహాసభలు జరిపిన కొద్దిరోజుల్లో ఆయన 'కొత్త చిగుళ్లు' అనే కథానిక రాసి, పెట్టవలసిన చీవాట్లు చాలా మృదువుగా పెట్టి మెత్తని పాదరక్షలతో చెంపలు వాయించాడు. శ్రీ శ్రీ దానికి జవాబు రాశాడుగాని అది సంజాయిషీలాంటి క్షమాపణే. లేక క్షమాపణలాంటి సంజాయిషీయే.

చలం శైలిమీద గానీ, అతని పనివాడితనం మీదగాని నాకు చాలా సదభిప్రాయం లేక పోలేదు. ఆనాటి చారిత్రక పరిస్థితులలో ఆయన లేవదీసిన తిరుగుబాటు తక్కువదేంకాదు. పౌరాణిక వ్యక్తులను నేలమట్టానికి తీసుకురావడంలో ఎంతో నేర్పు ఆయన చూపెట్టారు. ఆయన నాటికలు కొన్ని ఆధునిక భావాల పేటికలు. ఇవి నిజంగా స్టేజీమీద ఆడవలసినవి. అయితే ఎవరూ ఆడినట్టు నాకు తెలియదు.

పద సంపదలో చలం ఏమాత్రం గొప్పవాడుకాదు—గాని, వున్నంతలోనే ఆమాటలను వాడిగా వాడి ఎన్నెన్నో భావాల వేడిని రగిలించగలడు. సంఘంలోని కుళ్లను చూపించి దానికి బాధ్యులైన వాళ్లమీద ధ్వజమెత్తకపోలేదు. చాపకింద నీరు బైటపెట్టడమేకాదు దానిని మరిగించగలడు.

మహాప్రస్థానానికి ఇంట్రో రాస్తూ 'ప్రభుత్వాలు, న్యాయస్థానాలు, రక్షక భట వర్గాలు, చెరసాలలు, ఉరికొయ్యలూ, భావకవిత్వం యివన్నీ మీ ప్రియ మిత్రులకు యుద్ధాలనుంచి, ముష్టివాళ్లనించి, విప్లవాలనించి, అనాథులనించి, అశాంతినించి, సత్యాన్నించి మిమ్మల్ని కాపాడుతారు వీళ్లు. వీళ్లందరికీ అధ్యక్షుడు మీ దేవుడు, మీ డబ్బుకి దాసుడు. మీ నంగి పూజలకి ప్రార్థనలకీ వశ్యుడు, దొంగభక్త పరాధీనుడు' అని చలం చెప్తూంటే సనాతన సంఘంమీద ఎన్ని చావుదెబ్బలు కొట్టాడో అని అభ్యుదయ వాదిగా పొంగిపోయానుగాని, అదే చలం ఆదే దేవుడికి వంగి పూజలు చేస్తూ వుంటే 'ఎంత విద్రోహం' అని క్రుంగిపోయాను. అందుకే యిలాంటి వాళ్లు మాసిపోయిన మనస్సులు 'ఉతుకోక్కలేక మహర్షుల లాండ్రీలో పడేస్తారు' అని నా త్వమేవాహంలో రాయవలసి వచ్చింది.

భావకవిత్వం పద్యరచనలో ఎంతవరకు విజయవంతమైందో, ఎంతవరకూ విఫలమైందో చలం సాహిత్యం గద్యరచనలో డిటో డిటో—

—ఆరుద్ర

## అ చ ల ం

చలం గురించి 'అచలం' అని రాస్తూ జ్యోతి మాసపత్రిక ఆగష్టు సంచికలో శ్రీ పన్నాల సుబ్రహ్మణ్యభట్టు- 'ఆయన రాసిన వాటిని ఉద్యమ సాహిత్యం ప్రచార సాహిత్యం, అనుభూతి సాహిత్యం, అంతరావలోక సాహిత్యం అని విభజించుకుంటే కొన్ని కొత్త కోణాలు కనబడతాయన్నారు.

## చలానికి తెలియనిది

తెలుగులో 'రేపు' అనే మాసపత్రిక వుంది. అది మన స్తత్వశాస్త్ర సంబంధమైన సమస్యలను ఆసక్తికరంగా చర్చిస్తూ విజయవాడ నుంచి వెలువడుతున్నది. జూన్ '79 సంచికలో 'చలం సాధించినదేమిటి?' అనే ప్రశ్నకు జవాబుగా ఈ పత్రిక వారే 'చలానికి స్త్రీల లైంగిక ప్రవృత్తి గురించి ఏమీ తెలియదు' అనే శీర్షికతో, చలం జీవిత సాహిత్యాలకు సంబంధించిన ఒక పార్శ్వాన్ని మాత్రమే పరిగణించి పరిశీలించినట్లు సంక్షిప్త వ్యాసాన్ని ప్రకటించారు.

'సాహితీ పరంగా ఆయన సాధించిన దేమిటో మాకు తెలియదు.' అంటూ తెచ్చిపెట్టుకున్న డాబుసరిగొంతుకతో— సెక్సులోని యక్సు రాళ్ళతో చలాన్ని తూచడానికి ప్రయత్నించారు. చలం గురించేకాదు తెలుగులో ఏ ప్రముఖ రచయిత గురించయినా- 'వీరికి స్త్రీల లైంగిక ప్రవృత్తి గురించి ఏమీ తెలియదు' అని తెచ్చిపెట్టుకున్న ఆధిక్యతా భావంతో యీ రోజుల్లో యిలాగే రాసుకుంటూ పోవచ్చు. చలం గురించి ప్రయత్నించి తెలుసుకోకుండా చలం మీద జడ్జిమెంటు యిచ్చి- అతన్ని కొట్టి పారవేస్తూ, అతని గురించి అందరూ స్మరించే వేళ అవహేళన చేయాలనే మన స్తత్వానికి యీ వ్యాసం ఓ మచ్చుతునక- చలం జీవితంలో సెక్సుకి ప్రాధాన్యం యిచ్చాడు కాని. అతను సెక్స్‌రచయిత కాదు. చలం తెలుగు వచనానికి ప్రాణం

పోశాడు. తెలుగు సాహిత్యాన్ని అన్ని శాఖలలోను ఎంతో ముందుకు తీసుకెళ్ళి అద్వితనం చేశాడు. చలం కళాస్రష్ట. అతనెక్కడా అశ్లీలం అనేది జొప్పించలేదు.

## చలం సాధించిందేమిటి?

ప్రముఖ సాహితీ వేత్త శ్రీ గుడిపాటి వెంకటచలంగారు, మే నెల ఐదవ, తేదీన చనిపోయారు. జీవించియున్న రోజులలో ప్రభుత్వం ఆయనకు ఎటువంటి అవార్డులు బిరుదులు బహూకరించలేదు. ఆయన లైంగిక విషయాలలో స్త్రీకి స్వేచ్ఛ ఉండాలని భావిస్తూ అస్తవ్యస్తంగా ఉన్న ఈ సమాజ స్వరూపాన్ని నగ్నంగా తన రచనలద్వారా వ్యక్తపరిచారు. ఇంతవరకూ వ్యక్తిగతంగా ఆయన సాధించిన విలువలు ఏమిటి? ఆయన రచనలు సమాజంపై ఎటువంటి ప్రభావం కలుగ **జేసినాయి?**

— బాలరాజు, పాకాల.

## చలానికి స్త్రీల లైంగికప్రవృత్తి గురించి ఏమీ తెలియదు

సాహితీ పరంగా ఆయన సాధించిందేమిటో మాకు తెలియదు. శతాబ్దాలుగా అట్టడుగున పడివున్న స్త్రీలను ఉద్ధరించాలని ఆయన కంకణం కట్టుకొన్నాడని, స్త్రీ స్వేఛ్ఛను ఆయన ఉద్బోధించాడని చెబుతుంటారు. లైంగిక విషయాలకు సంబంధించి స్త్రీలు తమ వాంఛలను స్వేచ్ఛగా వ్యక్తం చేయాలని ఆయన ఘోషించాడు.

కాని ఈ సందర్భంలోనే ఆయనపప్పులో కాలేశాడు. స్త్రీల లైంగిక ప్రవృత్తి పట్ల చలానికే కనీస అవగాహన కూడా లేదు. అంతేకాదు. ఆయనకు స్త్రీల లైంగికావసరాల పట్ల అనేక దురభిప్రాయాలు, మూఢ విశ్వాసాలున్నాయి. వాటిలో కొన్నింటిని ఇక్కడ పేర్కొంటున్నాము. 1) మగవారు స్త్రీల శరీరాన్ని గురించి మైథునాన్ని గురించి ఊహించుకొని తీవ్రమైన ఉద్రేకానికి లోనవుతారు. 1) స్త్రీలిలా కేవలం ఏదో ఊహించుకోవడంద్వారా లైంగిక ఉద్రేకానికి లోనవ్వరు, మగవారి స్పర్శ వలన మాత్రమే వారు ఉద్రేకానికి లోనవుతారు. 2) మగవారు నిగ్రహించుకొనడానికి వీల్లేనంతటి లైంగికోద్రేకానికి లోనవుతారు? ఈ లైంగికోద్రేకం తారస్థాయికి జేరుకున్నతర్వాత వారు అంగజాన్ని పొందలుతారు. 2) స్త్రీలు నిగ్రహించుకోనంతటి తీవ్రమైన లైంగికోద్రేకానికి లోనుకారు. లైంగికోద్రేకం తీవ్రతరమవ్వగానే వారు అంగజాన్ని పొందుతారు. 3) మైథునంలో పాల్గొన్న

సమయంలో మగవారు ఓకే అంగజాన్ని పొంద కల్గుతారు. 3) స్త్రీలు తమ ఉద్రేకం తీవ్రస్థాయికి జేరుకొంటున్న కొద్దీ అనేక అంగజాలు పొందుతారు. 4) మగవారు స్త్రీల శరీరావయవాలు చూసి తీవ్రమైన ఉద్రేకానికి లోనవుతారు. 4) స్త్రీలు మగవారి శరీర నిర్మాణాన్ని చూసినప్పుడు ఎటువంటి ఉద్రేకానికి లోనుకారు.

మగవారిలైంగికావసరాలు స్పష్టంగా వుంటాయి. వారి మనస్థితి, శారీరక ఆరోగ్యం ఆధారంగా వారు ఎన్నిసార్లయినా మైధునంలో పాల్గొనడానికి ఉత్సాహం కనపరచవచ్చు. అంతేకాదు. స్త్రీలతో సంబంధం లేకుండా వీరికి లైంగికావసరాలు ఏర్పడుతాయి. స్త్రీల పొందుతోగాని, స్వయం మైధునం ద్వారాగాని వీరు, లైంగిక వాంఛలను తీర్చుకో కల్గుతారు. 5) స్త్రీల లైంగికావసరాలు ఇందుకు భిన్నంగా వుంటాయి. వీరి లైంగిక వాంఛలు మగవారితో నిమిత్తం లేకుండా స్వతంత్రంగా జనించవు. భర్తరోజుకు ఒక్కసారే మైధునంలో పాల్గొంటుంటే- భార్య లైంగికావసరం సైతం రోజుకు ఒకసారే అవుతుంది. భర్తరోజుకు అయిదు సార్లు పాల్గొంటుంటే ఆమె అవసరం సైతం అంతే అవుతుంది. అలా కాకుండా భర్త నెలరోజులకు రెండుసార్లు మాత్రమే పాల్గొంటుంటే భార్య అవసరం కూడా అలాగే రూపొందుతుంది.

పైన పేర్కొన్నవన్నీ అనేక పరిశోధనలలో వెల్లడైన శాస్త్రీయమైన విశేషాలు? ఇంతకుముందు స్త్రీల లైంగిక స్వభావం గురించి అనేకానేక దురభిప్రాయాలు ప్రచారంలో వుండేవి. మగవారు స్త్రీల లైంగిక ప్రవృత్తినే పోలి వుంటుందని భావించేవారు. చలం సైతం పైన పేర్కొన్న తేడా గుర్తించకుండా ఇదే కోవలో ఆలోచించేవాడు. ఈ దురవగాహనతో ఆయన వ్రాసిన రచనలు స్త్రీల మనఃప్రవృత్తిలో విప్లవం కొని తెస్తాయని కొందరు, స్త్రీలు పతనమైపోవడానికి తోడ్పడతాయని మరి కొందరు పొరబడ్డారు, కాని అటువంటిదేమీ జరుగలేదు. జరగడానికి వీల్లేదు. మగవారి లైంగికవాంఛలు స్పష్టమైన రీతిలో తీవ్రమైనస్థాయిలో వుండడం వలన వీరు ఇతర స్త్రీలతో అక్రమ సంబంధం నెలకొల్పుకోవడానికి తపించి పోవచ్చు. లైంగిక అసమర్థతా భయానికి లోనయిన మగవారు మాత్రమే ఇతర స్త్రీలను ఆకర్షించడానికై తహతహలాడి పోతుంటారని. ఆరోగ్యకరమైన మన స్థితిని సంతరించుకున్న వ్యక్తి ఎంతటి లైంగిక అసంతృప్తికి లోనయినా అక్రమ సంబంధాలకోసం ఆరాటపడడని అనేక పరిశోధనలలో వెల్లడైంది.

అలాగే స్త్రీలు లైంగిక అసంతృప్తి కారణంగా ఇతరులతో అక్రమ లైంగిక సంబంధం నెలకొల్పుకోవడం ఎక్కడా జరుగదు. (నింఫోమానియా అనే జడత్వానికి లోనయినవారు మాత్రమే ఇలా ప్రవర్తిస్తారు. వీరిసంఖ్య అత్యంత స్వల్పంగా వుంటుంది) తమభర్త తమపట్ల సరైన శ్రద్ధను, ఆసక్తిని కనబరిచడం లేదని అనుమానించే స్త్రీలు తమపట్ల పూర్తి ఆసక్తి కనబరచే వ్యక్తితో గడపడానికి సంసిద్ధమవుతారే తప్ప లైంగిక అసంతృప్తివలనమాత్రంకాదు. తమపట్లనిరంతరం ఇతరులు శ్రద్ధాసక్తులు కనబరచాలని ఎదురు చూడడంఅపరిపక్వమనస్థితికిచిహ్నం. నిరాదరణా భయానికి సంకేతం, బాల్యంలో పడినప్రభావాలు, అనుభవాలను పైదొలి గించుకోలేని ఫలితం.

అందుకే తమ భర్తతో లైంగిక సంతృప్తి పొందలేనప్పుడు మరొక వ్యక్తితో లైంగిక సంతృప్తి పొందవచ్చని సూత్రీకరించిన చలానికి స్త్రీ ప్రవృత్తి తెలియదని నిర్ణయించవచ్చు. ఇక చలం రచనలు మగ వారిలో లైంగికోద్రేకాన్ని ఉద్దీపింప జేయడానికి, స్త్రీలల్లో స్వైరకల్పనలను సృష్టించుకోవడానికి మాత్రమే తోడ్పడ్డాయి.

## బహు వివాద గ్రస్తమైన సాహిత్య మూర్తి

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1-6-79 సంచికలో— చలం గురించి—

'తెలుగు దేశంలో గద్య సాహిత్యంలో వస్తురూపేణా- కథనంలోను కూడా "తిరుగుబాటు" తీసుకువచ్చిన "చెలం" గారు-కొంతకాలం నిరీశ్వర వాదియై పిదప సుమారు ఒక పాతిక సంవత్సరాలుగారమణాశ్రమవాసియై ఆధ్యాత్మిక చింతనలో కాలం వెళ్ళబుచ్చుతూ, ఆధ్యాత్మిక రచనలు చేస్తూ కొంతకాలంగా తీవ్ర అస్వస్థులై తమ 85వ ఏట తిరువణ్ణామలైలో మే 4వ తేదీ రాత్రి యిహలోక యాత్ర చాలి చారు. గుడిపాటి వెంకటచలంగార్ని "చెలం" గానే అందరికీ తెల్సు, "మైదానం" "బ్రాహ్మణీకం". "ఓ పువ్వు పూసింది", "దైవ మిచ్చిన భార్య", లాంటి ఆయన రచనల పునర్ముద్రణలు యిప్పటికీ పాఠకులను వుర్రూతలూగిస్తూనే వున్నాయి—

"చెలం" ఒరవడి తెనుగు కథలో "పొదుపరి" తనానికి "నాంది" అనే వాదంతో- "చెలం" గారు ఆదిలో ప్రతిపాదించిన "స్వేఛ్ఛ" సిద్ధాంతాలంటే యిష్టంలేనివారు కూడా ఏకీభవిస్తారు. తక్కువ మాటలతో పెద్దపెద్ద భావాలకు అర్థమయ్యే అంద మైన చిన్న బొమ్మలు చెయ్యడం "చెలం" ప్రత్యేకత.... బహు వివాద గ్రస్తమైన సాహిత్యమూర్తి. ఆయన మరిలేడు. ఆయన రాసిన భగవద్గీత వ్యాఖ్యానం, ఏసు జీవితం వంటి గ్రంథాలే నిలుస్తాయో, "మైదానం" "హంపీ కన్యలు" నిలుస్తాయో, మరో ఐదేళ్ళ తర్వాత కాని చెప్పలేం.

చలం గురించి తాపీగా ఎటువంటి సంచలనం బహిర్గతం చేయకుండా రాసి నట్లు కనిపిస్తుంది. దాపరికం లేకుండా చలం తన శృంగార వాంఛ గురించి, ఈశ్వరుణ్ణి గురించి, తన struggle గురించి, తన ఆదర్శ స్త్రీ మూర్తి గురించి, కన్నకలలూ, అవి తన జీవితాన్ని శాసించి, లాలించి, కీర్తించి, ఎలా నడిపించాయో ఆత్మకథలో, మ్యూజింగ్స్‌లో, ఉత్తరాలలో చెప్పుకున్నాడు.

'-నేను చేసిన పనులు, నేను రాసిన రాతలు అన్నీ ప్రజాసంస్కరణ కోసం కాదు. నన్ను నేను సంస్కరించుకోడానికి.

## ఈశ్వరుడు

-ఎప్పుడూ నాలో తీవ్రమైన struggle, నా స్వభావం ఇంకా ఉన్నతం కావాలని. వైరాగ్యం ఎక్కువ కావాలని, ఈశ్వరుణ్ణి సాక్షాత్కరింప చేసుకోవాలని, ఇంతలో ఠాగూరుగారి గీతాంజలి నా జీవితంలోకి వొచ్చింది. ఆ నాటి నుంచి యీ రోజు వరకూ ఠాగూరు గారి భక్తి గీతాలు నాజీవితపులోతుల్ని infeuence చేస్తోనే వున్నాయి. ఆయన గానం చేసిన personal God నా దగ్గరగా వొచ్చి నా పక్కన కూచున్నట్లుండేది. ఈశ్వరుడు వొచ్చి నా జీవితంలో ప్రవేశించి నా అంతరాంతర భావాలలో కలిపి పెనవేసుకున్నట్లు అనుకునేవాడ్ని. నా జీవితమే ఒక పెద్ద struggle.

## నా రొమాన్స్

-పరస్త్రీతో సంగమమేకాదు, ఆ విధమైన మనోవాంఛ సహితం పాపం. నా రొమాన్స్ అనేది నా రక్తంలో కలిసి నాలోనే పుట్టింది. ఎంత ప్రయత్నించి

శృంగార వాంఛని ఈ నాటి వరకూ జయించలేకపోయినాను. అదే లేకపోతే నేను ఎందుకు బ్రతికి?

స్త్రీ తో కొన్నాళ్ళు స్నేహమయితే, మా లోని శృంగార భావం పాతబడి. ఇంక నన్ను ఆకర్షించడం మానేసేది, అప్పుడు యింకో కొత్త శృంగార సంబంధం కోసం కొట్టుకునే వాణ్ని. ఇది గొప్ప ప్రేమకాదు. ఉత్తి కామమూకాదు. పసితనం నించినాకు అన్నేళ్ళుగా ఈ వాంఛలు వుంటూనే వుండేవి. ఎంతో విరహపడేవాణ్ని. అపేకలు.

## స్వప్న చారిణి

లోపరహితమైన ఈ భూమి లిమిటేషన్స్‌ని మించి సంచరించే ఓ స్త్రీ నాతో మెలుగుతూ వుండేది. ఆమె నా స్వప్నచారిణి. ఆమె ఈ భూమి మీద అలభ్యమని తెలుసు. అందుకనే నేను ప్రయత్నించి, ఉన్నతుణ్నయి, ఆమెను అందుకోవాలని చూసేవాణ్ని. నేను వాంఛించే వెలుగు, వైశాల్యం, అన్నీ ఆమెలో నాకు లభ్యమౌతాయని ఆశపడేవాణ్ని. ఎక్కడ? ఎక్కడ? అనే నా అన్వేషణ నన్ను ఆవరించింది. (ఈ స్వప్నచారిణి, ఈ అన్వేషణ ఫలమే పురూరవలో చలం అపురూపంగా తేజోవంతంగా మలిచిన విశ్వప్రేయసి ఊర్వశి)

'కాని ఈ శృంగారమంతా కామంతో ముడిపడటం వల్ల పాపం అనిపించేది. నాలో వెలిగే ఈశ్వరుడికి ఆగ్రహకారణం అనుకున్నాను. ఈ శృంగార వాంఛ నించి తప్పించుకోవాలి. జయించాలి అని ఎంత గట్టిగా ప్రయత్నించానో!.... కాని ఆ శృంగారం లేనిది నేను బతుకుతున్నట్టు ఉండేది కాదు నాకు. ఇంకో దాంట్లో, దేంట్లోనూ సుఖంలేదు. అర్థంలేదు. ఈశ్వరుణ్ని ఎంత ప్రార్థించేవాణ్నో!

ఇది పాపమా? ఇంత ఆనందకరమైనది పాపమా? ఎందుకు పాపం? భార్యతో లేని పాపం ఇంకో స్త్రీతో పాపమెట్లా అయింది? ఈ శృంగారం పాపమని నిజంగా ఈశ్వరుడు చెప్పాడా? అసలీ శృంగారమంటే తెలీని జడులు ఇట్లాంటి అబద్ధపు నిబంధనలు ఏర్పరిచారా? ఇదంతా ఒక భార్యని కట్టుకోవడం వల్లనే గదా! స్త్రీని తలుచుకుంటే పాపం! ఆమెనే పెళ్ళిచేసుకుంటే, ఆ నిమిషం నుంచి ఆలోచనతోనే కాదు, ఆమె దేహాన్ని ఏమి చేసుకున్నా పవిత్రమయింది.

దీన్నే పెళ్ళి అంటున్నారు. ఇట్లా గట్టి సందేహాలు రేగాయి. క్రమంగా ఈ సందేహాల వల్ల నా మనసు బ్రహ్మనిబంధనలనించి ఎదురు తిరిగింది.

(చలంలో ప్రారంభమయిన అంతర్ బహిర్ సంఘర్షణలకు మూలం యిక్కడే వుంది. అతని తిరుగుబాటంతా లోకవృత్తికి తనప్రవృత్తికి సరిపడక పోవడం వల్లనే- ఇంత అంతర్వేదన లేకుండా అంత సాహిత్యం ఎలా పుట్టుకొస్తుంది? తనూ, ఈశ్వరుడు, స్త్రీ యిది ఒక మూడు స్తంభాలాట లేక ముక్కోణాకారపు పోటీ-చలం జీవితానికి. అతని స్ట్రగుల్‌కి యిదే base. స్త్రీతో కొన్నాళ్ళు స్నేహమయితే, మాలోని శృంగార భావం పాతబడి, ఇకనన్ను ఆకర్షించడం మానేసేది'- అన్నాడు చలం. ఈ శృంగార భావం పాతబడి, ఆకర్షించడం మానేశాక- ఆ స్త్రీ జీవితం ఆమె సమస్యలూ చలానికి పట్టలేదు. అందుచేత ఆయనకు పరిష్కారాలు కూడా తట్టలేదు.)

## ఒకే జ్వాలకు రెండు ముఖాలు

ఆంధ్రప్రభ 13-5-79 ఆదివారం అనుబంధంలో- 'ఒకే జ్వాలకు రెండు ముఖాలు చలం, శ్రీశ్రీ' అనే ప్రత్యేక వ్యాసాన్ని ప్రచురించింది. అందులో-

చలం శ్రీశ్రీ మహాప్రస్థానానికి యిచ్చిన యోగ్యతాపత్రం వలన శ్రీశ్రీ కృతార్థుడయ్యాడు. అయినా చలం గురించి శ్రీశ్రీ 'చెలం కలం విశృంఖలం' అనే మాట తప్ప చెప్పిందేమీలేదు. చలం మరో ప్రపంచానికి(రమణాశ్రమానికి) వెళ్ళిపోయాడు. శ్రీశ్రీ వెళ్దామనుకున్న మరో ప్రపంచం యింకా ఎక్కడా కనుచూపు మేరలో లేదు.

చలం శ్రీశ్రీ యిద్దరూ పిడుగుల్లాంటి వాళ్ళే- అగ్ని శిరస్సున వికసించిన వజ్రాలే. ఇద్దరూ కనిపించని ఉద్యమాల జ్వాలలే.... ఒకానొక సమాజంలో ఒకానొక కాలంలో రావలసిన తిరుగుబాటు రెండు మార్గాలను ఎన్నుకుంటే అందులో ఒకటి చలం వచన మార్గం, మరొకటి శ్రీశ్రీ కవన మార్గం. శ్రీశ్రీ తన ప్రాస క్రీడల్లో "గుడిపాటి వెంకటచలం కలం కోరకోరాడెస్" అని విదూషక ఫక్కీలో ప్రశంసిస్తే, చలం తన యోగ్యతా పత్రంలో—

'అగాధంలోంచి పైబడదేరే నల్లని అలలు మొహాన కొట్టి, ఉక్కిరి బిక్కిరై, తుపానుహోరు చెవుల గింగురుమని. నమ్మిన కాళ్ళకింద భూమి దొలుచుకు పోతోవుంటే, ఆ చెలమే నయమని వెనక్కి పరుగెత్తచూస్తారు.' అంటూ తనకన్నా శ్రీశ్రీ గొప్ప విప్లవ కారుడని చలం ఒప్పుకున్నాడు. చలం సమాజంలో పోరాడుతూ నిలబడ్డాడు. శ్రీశ్రీ సమాజాన్ని దొలిచాడు. అదీ యిద్దరికీ తేడా. చలం శ్రీశ్రీ కవిత్వాన్ని అనుభవించి పలవరించ గలిగాడు. శ్రీశ్రీని చలాన్ని చదవకుండా ఆధునిక కవిత్వ సంప్రదాయాలు తెలియవు, కథా సంప్రదాయాలు తెలియవు.

తనకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవి చేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వం.

నెత్తురూ కన్నీళ్ళూ తడిపిన కొత్త టానిక్ తయారు చేశాడు శ్రీశ్రీ యీ వృద్ధ ప్రపంచానికి.

అభ్యుదయ కవిత్వానికి తెలుగులో మేనిఫెస్టో లాంటిది (శ్రీశ్రీ కవిత్వానికి లక్షణ దీపిక) చలం యోగ్యతా పత్రం.

1910 ప్రాంతాల్లో పాత వాఙ్మయం మీద తిరగబడిన వాళ్ళే 1940 నాటికి తిరుగుబాటు మర్చిపోయారు. తాము తెచ్చిన సంస్కారమే ఇంక తెలుగు సారస్వతానికి శాశ్వతావధి అని నిరూపించి ఉపొంగిపోయారు. ఇటువంటి వారిమీద తిరుగుబాటు చేసిన శ్రీశ్రీని అవరోధించడానికి జరిగిన ప్రయత్నాలకు చెంపపెట్టు యోగ్యతాపత్రం. కృష్ణశాస్త్రిని సందేహించాడు కాని చలం శ్రీశ్రీని సందేహించలేదు. ఇద్దరి కవిత్వాలకు వున్నతేడా చలమే చెప్పగలిగాడు. అందుకే రానున్న తిరుగుబాట్ల కాలానికి భాష్యకారుడు కాగలిగాడు.

## చలం కన్ను కాపలా

చలం యోగ్యతాపత్రం రాసి వూరుకోలేదు. తనకి యిష్టులైన ముగ్గురు కవుల్ని 'వాచ్' చేస్తున్నాడు రమణస్థాన్ నుంచి. 19-5-56న జరుక్ శాస్త్రికి రాసిన ఓ ఉత్తరంలో—

'ఒకరు అడుగుతున్నాడు. కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ నండూరి, సబ్బారావుగార్లకవులుగా మరణించినట్టేనా అని, నేను రాస్తున్నాను, ఒకరి కవిత్వం చచ్చి కుళ్ళుకంపు కొడుతోంది, ఇంకొకరిది ఎంకి అస్తి పంజరమయింది. మూడోది దయ్యమై పలుకుతోందని.'

1954లో శ్రీశ్రీకి జబ్బుచేసినపుడు చలం చాలా బాధపడ్డాడు. ఆ సందర్భంలో జరుక్‌కి రాసిన లేఖలో—

'శ్రీశ్రీ సంగతి దిగులుగా వుంది. త్వరలో నయమౌతుందని ఆశ—

బసవరాజు అప్పారావు పిచ్చికి కారణం అతనిలోని బలహీనాలూ, అతని సౌందర్య పిపాస. అది సెక్సుతోవలుపట్టడం, దాన్ని సఫల పరుచుకొనే రూపం అతనికి లేకపోవడం. అతని మార్దవత్వం- ఎన్నో కారణాలు. తక్కిన కవులు జాగర్త కలవారు. స్వార్థ పరులు, గట్టివారు- వాళ్ళకి పిచ్చి ఎక్కలేదు. కృష్ణశాస్త్రికీ విశ్వనాథ గారికి ఏ మాత్రం పిచ్చెక్కదు. బద్ధకమూ, అహంభావమూ ఏ కాపుదలా ఇవ్వనక్కర్లేదు, కృష్ణశాస్త్రికి బద్దకం బదులు గడ్డగట్టిన స్వార్థమూ పెట్టండి. అట్లానే శ్రీశ్రీని స్టడీచేస్తే ఈ స్తితికి కారణం తెలుస్తుంది. ఇతరుల దూషణే అతన్ని వూగించేట్టయితే, ఎన్నడో ఎక్కవలసింది పిచ్చి. మొపాసాకి పిచ్చి ఎక్కింది గాని, షెల్లీకి, బైరన్‌కీ ఎక్కలేదే? మొపాసాకి ఎక్కవలసిన బైటి పరిస్థితి ఏదీలేదు.'

వేమన గురించి కూడా చలం అభిప్రాయం వేరుగా వుంది, చలం వేమనని కుటుంబరావుని కలిపి 31-3-58న జరుక్‌కి రాసిన లేఖలో గట్టిగా యిలా అన్నాడు—

వేమన జ్ఞానికాని, కవి కాడనీ, అతని శతకంలో ఏ మూలా కవిత్వరసం లేదనీ రాస్తో—



'కథకుడు కుటుంబరావు జ్ఞానిఐ, పద్యాలురాసే, వేమన మల్లే రాసేవాడేమో' నని చలం ఈశ్వరుడితో (సౌరిస్) అన్నారట.



'—కుటుంబరావు జ్ఞాని కావడమేమిటి? జ్ఞాని అయ్యే లక్షణాలు ఏ మాత్రం వున్నా, అతను కుటుంబరావు కాడు. ఇంకెవడో అవుతాడు. ఈ బల్ల చెక్క జ్ఞాని

కావడానికి వీలుంది కాని అతనికిలేదు. ఈ బల్లలోనన్నా ఏదన్నా రసం వుందికాని, అతనిలో లేదు. తన రాతకీ తన బతుక్కీ ఎంత వ్యత్యాసమో ఎప్పుడూ కనపడదు కుటుంబరావుకి- ఈనాడు శ్రీశ్రీకి కనపడనట్టే. తన కళ్ళని 'మహాప్రస్థానం' వేస్తు తిరగనీక తిపుగుతున్నాడు.

రాతకీ బతుక్కీ వ్యత్యాసం అంటే కుటుంబరావుకి అర్థమే కాదు. అసలు ఎవరూ అడగరు. ఎందుకంటే ప్రజలందరూ అంతే. వాళ్ళ రాతతో డబ్బు చేసుకున్నారు, అదృష్ట వంతులు. కొందరు చేసుకోలేక పోయినారు, తెలివి తక్కువ వాళ్ళు.

## చలానికీ వేమనకీ చుక్కెదురు

చలం రాతలకీ జీవితానికీ వ్యత్యాసాన్ని సహించడు. వేమనని కుటుంబరావునీ ఒక గాటను కట్టేసి కవిత్వ రసాన్నెరగని వారని అన్నాడు. చలాన్ని అందుకే వేమనతో పోల్చడం అనవసరమని శ్రీశ్రీ గుర్తిస్తే మంచిది. సమాజంలోని చీకటితో పోరాడాలి నిజమే. 'ఈ బైటి అంధకారంతో తగూలాడే ముందు మనసులోని అంధకారంతో తగూ పెట్టుకోవాలికద' అంటాడు చలం.

ఇతరుల గురించి నిష్కర్షగా అభిప్రాయాలు ప్రకటిస్తూ - మళ్ళీ 'ఇట్లా నిష్కారణ ద్వేషాన్ని రేపడం నాజాతకం కాబోలు' అని తన గురించి తానువిలోకిస్తాడు. కృష్ణశాస్త్రిగారి ప్రస్తావన వస్తే చురుకుగా తగిలే కొంటె మాట ఏదో ఒకటి విసరకుండా వుండలేడు చలం-(13-12-52న జరుక్ రాసినఉత్తరానికి జవాబురాస్తూ) 'కృష్ణశాస్త్రిగారు అంత ఇంటికే రాకపోతే, రోజూ, తెల్లారక ముందే జుట్టుకి రంగు అక్కడే ఆ వుండేచోటే వేసుకొంటున్నారా?' అని వేళాకోళంగా అడుగుతాడు విమర్శక చక్రవర్తి శ్రీ జరుక్‌ని-

లోకానుభవం తనకు జ్ఞాన మిచ్చిందా అనే విషయం పై చలం యింకా యిలా రాసుకున్నాడు—

'నాకా? లోకానుభవం? పైగా అది నాకు జ్ఞాన మివ్వడమా? లోకానుభవం నాకు అక్కరకు రాకపోవడమే, నన్ను ఈశ్వరుడి పాదాల దగ్గర చేర్చింది. లేకపోతేనా, నేను తెలివిగా- ఎంత గొప్పోణ్ణి, సమర్థుణ్ణి అయేవాణ్ణో....'

తన రచనల గురించికూడా చలం—

'నేను అట్లానే అనుకునేవాణ్ణి నాలో ఈ రాతలు accident. అని. నా బాధ వాటిని పుట్టించిందని ఇన్నేళ్ళూ—'

చలం రాతలన్నీ బాధాతప్త గాథా శతి అన్నమాట. తన స్వభావమే తన మతం. ఒకచోట—

'ఈ నాటికీ నా మతం.' అన్యాయాన్ని చూసి ఆపుకోలేని ఉగ్రం రాకపోతే మనుషులముకాము. అంతకన్న కీటకాలం—' ఈ అశాంతే చలాన్ని నడిపించింది జనపదం నుంచి అరుణాచలానికి.

చలంగారి గురించి మీ పాయింట్లు చెప్పవలసినదిగా శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారిని కోరగా కావలి నుంచి 5-6-79 ఉత్తరంలో యిలా రాశారు—

## కొన్నిపాయింట్సు

అసలు "చలంతో రెండు గంటలు" అని ఒక వ్యాసం వ్రాయాలని ఉంది. ఉన్నది కొద్ది పరిచయమైనా మరువలేని కొన్ని సన్నివేశాలున్నాయి. 1. పూర్వరంగం 2. మధ్యరంగం 3 ఉత్తర రంగం. ఒంట్లో బాగాలేదు, జీర్ణశక్తి పాడయింది, చిరాకు, మందులు తింటున్నాను. సాహిత్య జీర్ణశక్తికూడా పోతోందేమో! అయితే మిగిలేదేముంది. సున్న 'zero'.

చలం సంస్కరణ దుమారానికి గాని వి. స. గారి సంప్రదాయపు ఊబికి గాని నేను లొంగలేదు. ప్రచండమైన వారి రచనాప్రతిభ నన్ను పట్టుకుంది.

చలం వట్టి, ఒదులు, కూరగాయమాటలు తీసుకుని ఎలెక్ట్రిఫై చేస్తాడు. దానిలోనుంచి చిటచిటమని రవ్వలు బయలుదేరుతాయి. అవి మండుతాయి పేలుతాయి. ఆ ఆశ్చర్యంలో మునిగిపోయాను కొన్నాళ్లు. పురూరవ రివ్యూ చేశాను తొలిగా రేడియోలో. దానితో పరిచయం గాఢమయింది.

అయన మనస్సేమంటే- చెప్పవలసినదానివేగమే, మాటలుగా బద్దలై బయట పడ్డాయేమో అనుకుంటాను.

ఆయనకు పటిష్ఠమైన భాషరాదు. చాలా అపశబ్దాలు వాడతాడు. చంటిపిల్లాడి లాగ- ఆ మాటలు అడవిలో మొలిచిన స్వచ్ఛమైన గడ్డిపువ్వుల్లా మిల మిల మెరుస్తాయి. వాటిమీద కోపంరాదు, సరదా కలుగుతుంది. అట్లా ముందు మన్ని లాగేస్తాడు. తరువాత చెవిపట్టి వినిపిస్తాడు. కొన్నిచోట్ల 'చెవి' నొప్పిగా ఉంటుంది. విడిపించుకోవాలని ఉండదు, అదే తమాషా. ఆ విధంగా చలం మాటల ఇంద్ర జాలికుడు. తన భావాల మోహంలో పడగొట్టే మాయలఫకీరు.

ఏమైనా తెలుగు మాటల్లో తుపాకీపేల్చగల ప్రజ్ఞ ఇంకెవరికీ లేదు. గొప్ప సత్యాన్వేషి. ఒక సత్యానికి కొన్ని విలువలకు, తన్ను తాను అర్పించుకొనే హఠ యోగి.

ఒకకొసని సత్యనారాయణా, వేరొక కొసని వెంకటచలం- అంతటివాళ్ళు ఇంతట్లో పుడతారనే నమ్మకంలేదు. ఇద్దరూ ఎంతోఇష్టం నాకు. ఇద్దరన్నా ఎంతో భయంనాకు- వాళ్ళలో మునిగిపోకుండా ఉండడానికి తపస్సు చేశాను.

— ఇం. హ.

కొన్ని పాయింట్స్‌కాదు, ఇంకా వివరంగా మీ ఊహలు చెప్పాలి అని శ్రీహనుమచ్ఛాస్త్రి గారిని కోరగా—

## చలం గురించి నా ఊహలు

చదువు, పెరకువ, సంప్రదాయంతో పెనవేసుకున్ననాకూ, అన్నిటినీ ఎగర గొట్టే గుడిపాటి వెంకటచలంగారికి, స్నేహమేమిటని చాలా మందికి ఆశ్చర్యం!

ఆస్తికుడైన దీక్షితులుగారికీ నిరీశ్వరుడైన చలంగారికీ, ఉన్న స్నేహం గురించీ చాలా మందికి ఇదేప్రశ్న. దీక్షితులుగారితో తనస్నేహం ఎంతో సహజం అన్నారు, ఒకప్పుడు చలంగారు. ఆస్తికత్వానికీ నాస్తికత్వానికీ ఎంతో దూరం లేదు. కాల్చే తపన, నిద్రపోని అన్వేషణ ఉండాలిగాని. చలం 1948 ప్రాంతంలో నాకు రాసిన ఉత్తరాలలో ఈ ఆధ్యాత్మిక చింతన, ఆరని ఆవేదన, స్పష్టంగా కన పడతాయి.

చలం తరంలో ముందూవెనుకా, నవ్య ఉజ్జీవనం కోసం కలలు కన్నవాళ్లు, రచనలు చేసినవాళ్లు, ముందుకు పోవాలనే తహ తహ కలవాళ్లు చాలామంది ఉన్నారు. రచనలు చేశారు, ప్రకటించారు, పరుగులెత్తేరు, పాటలు పాడారు. ఉద్రిక్తులై ఉపన్యసించారు. క్రమంగా ఒక గిరి గీసుకుని అందులో పడి ఊరుకున్నారు. వారి పని అయిపోయింది. అంతకన్నా వారు ఎత్తుకు ఎదగలేక పోయారు.

చలానికి ఆస్తిక వాసన బ్రహ్మసమాజంనుంచి అంటింది. ఎందులోనైనా మునిగి అంతు చూడడమేగాని, ఒడ్డునుంచి ఊహించడం ఆయనెరగడనిపిస్తుంది. దానిలోని బోలుతనం, ఆడంబరం, పై మెరుగులు, ఆయన్ని విడదీసి పైకి లాక్కొచ్చాయి. దాని ఆవలి ఒడ్డు నిరీశ్వరవాదమే అయింది. మొహమాటం లేని నిజాయితీపరుడు. దేనిలోనూ నిశ్చింతగా ఇమిడి పోలేడనుకుంటాను.

మతం మీద తిరగబడ్డంతో తృప్తిపడలేదు. సంఘంమీద తిరుగుబాటు తప్పని సరి అయింది. దేనితోనూ రాజీపడలేని వాడికి రొష్టు పడడం తప్పదు. స్త్రీలు బానిసలన్నాడు, దేవుడూ వేదాంతం దొంగల ఆయుధాలన్నాడు; ఇలా అన్న వాళ్లు ఆనాడు చాలా మందే ఉన్నారు. కాని చలం నిలబడ్డాడు. అసలు ఆయన చలం కాడు; ఆ చలం నిజంగా అచలం. వెంకటాచలం అన్న మాటను విడదీస్తే మిగిలేది అచలంగాని చలంకాదు. చలపతి అన్నమాట వింటే నవ్వొస్తుంది నాకు-అచలపతి అన్న మాట- చలపతి అని ఎట్లా ప్రచారమయ్యిందా? అని- వదిలేద్దాం-

నా21ఏట- నిప్పుకడిగే ఆచారపరులైన ఒక వైష్ణవులింట. చలంగారి శశిరేఖ అనే నవల దొరికింది. రచన గ్రాంధికంలో ఉంది. ఏకబిగిని చదివాను. మనస్సుకు కితకితలు. అంతవరకు తెలుగులో అలాంటి పుస్తకం చదవలేదు. ఎందుకింత పట్టుకుంది?

ముందు ఆ చిన్న వయస్సులో బలమైన సెక్స్ ఊపిరాడ నివ్వదు. శశిరేఖ నలుగురు భర్తలను (ప్రియులను) మారుస్తుంది.

ఆవింత ఒకటి-దానికి శివశంకర శాస్త్రిగారి పీఠిక దాన్ని సమర్థిస్తూ. తర్వాత సాహితి పేచు కాగితాల పాత పత్రికలు దొరికిన వన్నీ చదివాను. చలానికి జరగ గలిగినంత దగ్గరగా జరిగాను.

చలం ఒక సుడిగుండం; అయస్కాంత వలయం, తృణావర్తం. దానిపొడ తగిలినా, వాడు ఇక బయట పడటం కల్ల అనాడు. మెదలువంచి చదివిస్తాడు. తన ఇంద్రజాలంలోకి లాగుతాడు. కొన్నాళ్ళదాకా కొన్నేళ్ళదాక, ఆ మయసభనుంచి బయటపడడం సాధ్యంకాదు.

ప్రజామిత్ర పత్రికవాళ్ళు 'నా అభిమాన రచయిత' అన్న శీర్షిక మీద వ్రాయదలచిన వాళ్ళ వ్రాయమన్నారు. నేను చలాన్ని ఎన్నుకుని హంపీకన్యల మీద, 'వేదాంతం' అనే కథమీద వ్రాశాను. తెలుగు స్వతంత్రంలో 'సెక్సు లోని ఎక్సు కర్థం' అని గాబోలు ఒక వ్యాసం పడింది, చలాన్ని విమర్శిస్తూ, దాన్ని ఎదుర్కొని 15 పేజీల వ్యాసం రాసి 'ప్రజామత'లో వేశాం, మిత్రుల ప్రోత్సాహం నా అభిమానం అందుకు ప్రబల కారణాలు,

దాని పేరు 'సాహిత్య భాణం'

చలం భక్తులు దాన్ని ఆయనకు వినిపించారు. చలం నాకు పెద్ద ఉత్తరం రాస్తూ, 'నా ప్రయత్నమేమిటో నాకు విడమర్చి చెప్పారు, ఇది మీ నుంచి రావడానికి కారణమైన 'ఆయన'కి కృతజ్ఞత తెలుపుదా మనుకుంటున్నాను' అన్నాప అందులో.

తర్వాత సంప్రదాయంలోని ఉద్గ్రంథాలు ఎన్నో చదవడం జరిగింది. మనస్సు ప్రాథమిక ఆవరణంలోనుంచి ఎదుగుతోంది. అన్నింటినీ ప్రశ్నించే చలాన్ని ప్రశ్నించడానికి సన్నద్ధమయింది.

హరీ మనేదాకా కలం దింపకుండా రాసిపోసినవారు ఇద్దరే ఇద్దరు మహా ప్రతిభావంతులు 1) విశ్వనాథ 2) చలం.

ఒకరు చిరంతన సంప్రదాయానికి ప్రతినిధి అయితే ఇంకొకరు పరంపరా విశ్వాసాలను చీల్చి చెండాడే సంస్కారోద్యమానికి ప్రతినిధి.

ఇద్దరూ రాజీలేని స్థితప్రజ్ఞులు.

నేను ఇద్దరి ప్రతిభకు ముగ్ధుడనౌతూనే ఆ సంప్రదాయపు ఊబికిగాని, ఈ సంస్కారపు రొంపికిగాని అంకితం కాలేదు.

విశ్వనాథవారు ఆరాధించే సంప్రదాయ బాహ్య రూపంకంటే, అతీతమైన భారత ధర్మ, ఆధ్యాత్మిక కాంతులు వేరే ఉన్నాయని నమ్ముతున్నాను.

అట్లాగే చలం అవ్యవస్థితమైన సంస్కారం మీద అతివాదం మీద, మోజు పెంచుకోలేదు. స్త్రీ స్వాతంత్ర్యం మీదా, వివాహ వ్యవస్థ మీద ఆయన భావాలు తిరుగులేని వేదవాక్యాలు కావు. ఆక్షేపణలకు అతీతమైనవీకావు.

నేను ముఖ్యంగా వారిని ఆరాధించేది వారి నవనవోన్మేష శాలిని అయిన ప్రతిభా సమృద్ధికోసం.

చలంలో ముఖ్యంగా రెండు వైపులున్నాయి. ఒకటి దేనినైనా సునిశితంగా చూచే తీక్ష్ణ దార్శనికత, రెండవది లోకోత్తర భావుకత. ఆదార్శనికతతో మనకు దోస్తీ లేకపోయినా ఆయన తన హృదయావేదన కిచ్చే కళారూపంఅనన్యసాధ్యం. ఈ కళా సాధనతోనే, సత్య సౌందర్య మహాతృష్ణతోనే, ఒక తపస్విగా మారి పోయాడు. ఎడ తెగని తపనతో వేచివేచి కలలు కని దర్శించిన వెలుగులో కలిసి పోయాడు.

— ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

## ఓడమీద పక్షి

జూలై 11, 1953న శ్రీ రమణాశ్రమం నుంచి హనుమచ్ఛాస్త్రి గారికి రామ చంద్రపురం రాసిన ఉత్తరంలో తీరందాపులో వున్నా, తెలియని ఓడమీద పక్షిలా వున్న తన స్థితి గురించి చలం ఆసక్తికరంగా వివరించాడు. విశ్రాంతిలేని నా జీవితం కొంచెం స్తిమితంగా గడిపే యోగ్యత కలగ చేస్తే చాలునని భగవాన్ పాదాల దగ్గర చేరిన మూడేళ్ళకు ఆ కోరిన కొంచెం శాంతేకాదు, పరిపూర్ణమైన ఆత్మానుభవం కలగచెయ్యబోతున్నానని, ఈశ్వరుడి వాగ్దానం పొందినట్లు చలం ఈ లేఖలో చెప్పుకున్నాడు. అంతేకాదు ఈనాడు దేశం ఆధ్యాత్మిక జీవనాన్ని మరచి పోయిందని వాపోతున్నాడు చలం. ఇది చలం లెక్చరు-

ఈ ఉత్తరం నా చేత ఈశ్వరుడు

రాయించానని మీకు రాయమన్నారు

శ్రీ హనుమశ్చాస్త్రి గారికి,

అవును. లోపలికి చూసుకుంటే మొదట ఒకటే కనబడుతుంది. తలుపులు చాలా గట్టిగా బిగించి వుంటాయి. కానీ చూసుకున్నకొద్దీ అవతలి వెలుతురుకు

తెరుచు కుంటుంది హృదయం. ఓడ మీద పక్షి ఉపమానం చాలా సమంజసంగా వుంది. వొడ్డు ఒకటి రెండు రోజుల దాపులో వున్నప్పుడు కూడా ఇంకా తెలీదు పక్షికి. "ఇంకెన్ని యుగాలు ఇట్లా ఈ వోడ మీదనే కూచోవాలో అని పరి తాప పడుతూ వుంటే ఈశ్వరుడు వొచ్చి అభయహస్తమిచ్చిందాకే నాకూ ఈశ్వరుడనే వారున్నారని నమ్మకమూ లేదు, నేనో స్థితికి రాగలననే విశ్వాసమూ లేదు. ఆయన అనుగ్రహంతో తప్ప ఏదీ జరగదు. విశ్రాంతి లేని నా జీవితం కొంచెం స్తిమి తంగా గడిపే యోగ్యత కలగ చేస్తే చాలునని భగవాన్ పాదాల దగ్గర చేరాను మూడేళ్ళ కిందట. ఎందుకంటే, ఈశ్వరుడి మీద సందేహమైనా, భగవాన్ రమణ మహిమలోనూ. ఆయనకి నామీద ప్రేమలోనూ నాకు ప్రత్యక్షానుభవం. అట్లా వొచ్చిన వాడికి ఇప్పుడు ఆ కోరిన కొంచెం శాంతే కాదు, పరిపూర్ణమైన ఆత్మానుభవం కలగ చెయ్యబోతున్నానని, ఈశ్వరుడి వాగ్దానం. షరతు ఆయన లోని విశ్వాసం, ఆయన ముందు సంపూర్ణమైన అచంచలమైన ఆత్మార్పణ, జీవితార్పణ, ఆత్మ సాక్షాత్కార మంటే ఏమిటో మీకు రాయనక్కర్లేదు. మీరు చదివైనా తెలుసుకునే ఉంటారు. కాని అది ఎవరికి కావాలి? భగవాన్ ముందు అన్నేళ్ళల్లో సాష్టాంగ పడ్డ లక్షలాది ప్రజలలో (ఎంతమందికి) కావాలి? ఏదో పుణ్యం, కోర్కెలూ, బా(ధలు) పోవడం, మోక్షం, ఇట్లాంటి దూరపు ఆశలే గాని. భగవాన్ తనని నమ్మి అంటి పెట్టుకున్నవాళ్ళందరికీ అభయ హస్తమిచ్చారు. కాని వాళ్ళకి జీవితం సుఖంగా గడవాలనీ, ఆయన మీది ప్రేమ తప్ప అంతకన్న ఎక్కువ ఆకాంక్ష లేదు. ఆ స్తితిని పొందడం సులభం కాదు భగవాన్ సహాయంతో నైనా. ఆయన వ్యాయామ గురువు. ఆ సాధన అంతా మనమే పడాలి; నీ గుండెలు (ఇ)చ్చి చమట లోడ్చి సంపాయించాలి. చెయ్యి అందివ్వడమే ఆయన ధర్మం. కానిమనం మన చేతిని ఆయన వేపు గట్టిగా చాచాలి.

ఈ నాడు దేశం మరిచిపోయింది ఆధ్యాత్మిక జీవనం. భక్తి ఉన్నవాళ్ళకి కూడా అక్కర్లేదు. పీఠాధిపతులు కూడా శాస్త్ర విచారణా, బోధనా, ఆధ్యాత్మిక జీవనమనుకుంటున్నారు. నిష్కామకర్మ. వైరాగ్య జీవితం- ఇట్లాంటివి వుత్త మాటలు.

టాగుర్ అంటారు——మార్గమంతా ముళ్ళేకాని అతని వీణా రవం పిలు స్తోంది.

చాలా లెక్చరు రాశాను మీకు. ఈశ్వరుడు అన్నారు. మీరు ఇక్కడ చేరే వారేనని అన్నారు. అందుకూ—

దీనికి జవాబు రాయాలే అనుకోకండి. ఏమీ ఆదుర్దా పడకండి. రోజు వొచ్చే ప్పటికి, ఒక్క గంతున దాటతారు. కాని దాటింతర్వాత వుంది అసలు సాధన. అప్పుడూ మన పస కనపడేది. ఆ రోజు వొచ్చేప్పటికి తనని లాగి కట్టేసుకున్న గొలుసులు పూలహారాలవుతాయి. ఈశ్వరుడి కృపాపూర్ణ ఆశీర్వచనాలతో.

— చలం.

తిరువణ్ణామలై వెళ్ళి అరుణాచలంలో ఓ వెలుగై సుమారు ముప్ఫై సంవత్స రాలు సత్యాన్వేషణలో సాధకుడై జీవించిన చలానికి ముత్యాలగొడుగు పట్టిన సంప్ర దాయ రచయితల్లో శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారుముఖ్యుల్లో ఒకరు. జరుక్ శాస్త్రి గారే స్వామిగారికి చలాన్ని పరిచయం చేసింది. చలంగారి పూర్వ జీవితంతో వారి అపూర్వరచనలతో పరిచయం లేకపోయినా, రుక్మిణీనాథశాస్త్రి "చలం అచంచలమైన అత్మవిశ్వాసం కలద్రష్ట" అని ప్రకటిస్తూ యామిజాల వారిని చలం దారికి మళ్ళించారు. సౌరిస్ గారి ప్రేరణతో ప్రోత్సాహంతో స్వామిగారు భాగ వతం రాశారు. భాగవతం రాశాక స్వామిగారికి సంసారంలోని ఒడిదుడుకులు ఆర్థికమైన చికాకులు సమసిపోయి మంచిరోజులు ప్రారంభమయినట్లు వారే అన్నారు, జరుక్ శాస్త్రి, సౌరిస్‌తో నేనే భాగవతం ఎందుకు రాయకూడదు, నాకు రాయాలని వుందన్నారట. స్వామిగారే తగినవారు. ఈశ్వరాదేశం ప్రకారం వారే రాస్తారు, మీకు నిలకడలేదు. మీకా ఛాన్సు లేదని ఆమె చెప్పారట. స్వామిగారు ఉభయ భాషా ప్రవీణులు. ప్రబంధాలు రామాయణ మహాభారతాలు. ప్రాచీన కావ్యాలు, పురాణాలు అన్నీ క్షుణ్ణంగా తెలిసినవారు. ప్రాచీన కావ్యాల్నీ కవుల్నీ అవుపోసన పట్టినవారు. అనర్గళమైన వాగ్ధాటి, అనన్యమైన రచనా శక్తిగలవారు. చాలా వేగంగా రాస్తారు. ఉపాధ్యాయునిగా, కవిగా, రచయితగా నిర్విరామకృషి చేసినవారు. ఎన్నోయేళ్ళుగా తమిళనాడులో మద్రాసులో నివాసం ఏర్పరచుకొని లోకయాత్ర సాగిస్తున్నా, యిప్పుడే శ్రీకాకుళం విజయనగరం నుంచి రైలుదిగిన తెలుగు పండితుళ్ళా స్వచ్ఛమైన ఉత్తరాంధ్రపు ప్రాంతీయ ఉచ్చారణ శైలిలో గంగా ప్రవాహంలా మాట్లాడగలరు. జాతక పరిశీలన, జ్యోతిష్యం కూడా వీరికి

వచ్చు. చలంగారి మిత్రులలోని వెరైటీకి ఒక ఉదాహరణగా స్వామిగారు నిలుస్తారు. ఆంధ్రపత్రిక, ఆదివారం మే 20,27వ తేదీ సంచికల్లో చలం గారి గురించి ప్రత్యేక వ్యాసాన్ని రాశారు. స్వామి గారికి చలం గారికి వుండే అనుబంధానికి అక్షరసాక్ష్యం యీ చిన్న వ్యాసం.

## ఏమి వ్రాసేది ?

ఆగది సింహం లేని గుహలాగు తోచింది. ఆ మాటే అన్నారు బసవరాజుగారు.

అనుకోకుండా వచ్చిన మర్వార్తవిని మా రెండవ పిల్లవాడు చి॥ ఆనంద్, నేనూ మండుటెండను లెక్కచేయక బయలుదేరి వడగాలులకు జోహారు పలుకుతూ శనివారంనాడు రాత్రి పదిన్నర గంటలకు రమణాస్థాన్ గెస్టు హౌసుకి చేరాము. 'సర్వ శూన్యం' అన్నట్లు తిరువణ్ణామలై యీ మూలనుంచి ఆ మూలవరకు కరెంటు కట్టు. మినుకు మినుకు దీపపు వెలుగు కూడా లేదు. అర్థం అయింది నాకు, 'సుమారు మూడు దశలు ఇక్కడ వెలిగిన తెలుగు వెలుగు చప్పున ఆరిపోయింది. చలం కలం నేలమీదకి జారిపోయింది. అరుణాచలం స్నేహముతో అంతెత్తు వెలిగిన అపూర్వ జ్యోతి పరంజ్యోతిలో కలిసిపోయింది. కాబట్టి యిక తిరువణ్ణామలైలో వెలుగు కనిపించదు.

నాకు సుమారు ఇరవై అరేండ్ల హార్దిక సంబంధం కల అపురూప వ్యక్తి ఆయన. అంతకుముందు మద్రాసు రాకుండా తెలుగు దేశంలో ఉన్నప్పుడు నేను చదివిన చలం సాహిత్యం చాలా స్వల్పం. చెప్పకేమీ నాకు నచ్చలేదు. మద్రాసు వచ్చాక 'ఓ పువ్వు పూసింది'-అనే రచన భారతిలో చదివి రుక్మిణీనాథశాస్త్రితో అన్నాను, "చలం అచంచలమైన ఆత్మ విశ్వాసం కల ద్రష్ట" అని, "దారికి వచ్చావా? దా అతనిని చూదువుగాని" అని ఆ రాత్రే నన్ను తిరువణ్ణామలై తీసుకుని వెళ్ళాడు:

ఉదయం స్నానం, ధ్యానం అయాక చలం వద్దకు వెళ్ళి గోత్రనామాలు చెప్పకుని నమస్కరించాను. "మీరా పద్మనాభస్వామిగారు అంటే. శాస్త్రిగారు అప్పుడప్పుడు ఆ దేశములో నున్న కాలములో, పత్రికల్లో వెలువడిన మీ పద్యాలు చదివి ఎలాగున్నాయి? అని అడుగుతూ ఉంటే, యీయన ఎవడో ఛాందస

బ్రాహ్మడు- అనేవాణ్ణి. ఏ వయసు మళ్ళిన తాతయ్యో అని అనేవాణ్ణి కూడా. మీరు నాకంటె చాలా చిన్నవారు. కూర్చోండి" అన్నారు. 'షా! యీయనే స్వామి గారంటే- అని ఆయన కూతురికి నన్ను పరిచయం చేశారు. అలాగు మాకు పరిచయం అయింది. ఆనాటి నుంచి నా వ్రాత చాలా పరీక్షగా చదివేవారట-మాటాడుతూన్నపుడు నాకు నోరు పెగిలేది కాదు. ఇతనిని సరిగా అర్థం చేసుకోలేదా నేను'- అని అనుకునేవాణ్ణి నాలో.

ఆయన భగవద్గీత వ్యాఖ్య వ్రాస్తున్న రోజుల్లో 'స్వామిగారూ యీ శ్లోకాలకు నేను వ్రాసినది సరిగా ఉందా వినండి-అని చదివేవారు. అది విని 'సరిగా ఉంది' అని చిన్న నవ్వుతో చెప్పేవాణ్ని. "నాకు సంస్కృతం రాదు. ఈశ్వరుడు లోపలినించి చెప్తూఉంటే నా తెలుగులో ఏదో రాస్తున్నాను- అనిఒకనాడునవ్వుతూ, "ఆంధ్రపత్రికలో ఎప్పుడేనా దీనిని మీరు ఆపరేషన్ చేస్తారేమో అని ముందుగానే మీ అభిప్రాయం తీసుకుంటున్నాను అక్కడక్కడ"అని అన్నారు. నేను ఆయన లాగ నవ్వలేకపోయాను.

ఒకనాడు ఆయన షికారు వెళుతూ నన్ను చూసి అన్నారు కదా, "స్వామి గారూ! కత్తులు దూసి బల్లాలు విసిరి పిచ్చికుక్కని తరిమినట్టు నన్ను తెలుగు దేశం నుంచి తరిమివేశారు. ఇక్కడ భగవాన్ పాదాల ముందు శరణు పొంది ఈశ్వర ప్రేరణతో ఏవో వ్రాస్తున్నాను. చలం ! నువ్వు రాస్తూ ఉండు. వాటి సంగతి నేను చూసుకుంటాను. అని ఈశ్వరుడు హామీ యిస్తూంటే రాస్తున్నాను, నాకేమీ తెలియదు. ఇప్పుడే కాదు, ఆనాళ్ళలో కూడా నా ఆత్మ వ్రాయిస్తే వ్రాసినవే ఆకథలూ, నవలలూ, నాటకాలున్నూ. ఇప్పుడు నన్ను ఏమిటో అంటున్నారట కొందరు. తెలుగుదేశంలో మైలపడి వెళ్ళి పోయాడు. ఇప్పుడు మడిగట్టుకున్నట్టు గడ్డం పెంచుకుని ఏవో రాస్తున్నాడు- అని- ఈ నంగనాచితనం ఇంకా అక్కడ చాలా మందికి పోలేదు. నా దగ్గరకు వచ్చినవారికి 'భజనపరులుగా బిరుదులిస్తున్నారట-' అని అమాయకంగా ఆయన నవ్వారు. నేను ఏమీ అనలేదు.

కొందరికి చలం వ్రాతలు వాతలు. కొందరికి అంటే ఆయన హృదయతత్వం అర్థం చేసుకుని తాత్కాలిక సమాజ జీవితంపై సుపరామర్శ కలవారికి శాంతి గీతలు. నేను మద్రాసు రేడియో కేంద్రంలో ఇలాగే అనగా కొందరు నన్ను వెక్కిరించారు. ఓహో! ఈయన కూడా ఆ కామయోగిని భజించేవారితో

చేరాడా? అని, నేను సహజంగా చలించే వ్యక్తినికాను. మసి పూసి మారేడుకాయ చేసి మంకుతనముతో మాట్లాడడం నాకు తెలియదు.

ఒకనాడు అడిగాను మీకు తిరువణ్ణామలై రాకముందు దేవుడన్నా, పురాణ వాఙ్మయమన్నా ఒక సద్భావన ఉందా? అని.

'నేను ఘంటాకర్ణుణ్ని కాను. ఉన్నదేదో చూడాలనే తపన నాలో లోకములో కాలుపెట్టిన నాటినుంచీ ఉంది. అయితే ఆ దేశపు వాతావరణం ఆ అన్వేషణకి నాకు అవకాశం యివ్వలేదు. ఇక్కడికి వచ్చి భగవానుని చూశాక సాధనకి ఉపక్రమించాను. ఇంతకంటే సాఫీగా ఏమి చెప్పాలో నాకు ఆ భాష రాదు-' అని ఆయన నవ్వారు.

మీరు చెప్పింది సాఫీగా ఉంది. మీ హృదయం అర్థమయింది అని అన్నాను నేను.

ఒక సాయంకాలం షికారునుంచి తిరిగివస్తూ స్వామిగారూ! గజేంద్ర మోక్షం కథలో పోతన్నగారు ఒక పద్యములో 'పెంజీకటి' - అని అన్నారు. పెంజీకటి అంటే సర్వపదార్థాలు ఈశ్వరుడిలో చేరిపోయి బ్రహ్మాండమంతా అంధకార బంధురం అయిపోవడం అనేనా అర్థం- అని అడిగారు. ఔను- అన్నాను. 'సంస్కృతం' నాకు తెలియదు. ఈలాటి తెలుగుపదాలు అర్థంకావడంలేదు. వెంటనే నామనసులో ఏదో తోస్తుంది షౌని అడుగుతాను, 'అంతే'- అంటుంది. సందేహం ఉంటే స్వామిగారీమారు వచ్చాక అడుగు, లేదా జాబు వ్రాయి, జావాబు వ్రాస్తారు అని అంటుంది- అన్నారు.

విమర్శ అంటే ఏమిటో నాకు తెలియదు. ఇప్పుడు కొందరు రాస్తున్న తెలుగు నాకు అర్థంకాకుండా ఉంది. ఏమిచెయ్యాలి? అని పకపకా నవ్వారొకనాడు. అవి చదవకపోతే మీకువచ్చిన నష్టమేమిటి? అన్నానునేను. అంతేనా? అన్నారు తిరిగి నవ్వుతూ.

నా 'కుమార సంభవం' తెలుగుసేత విని 'కాళిదాసు అంటే ఈయనా? ఇంగ్లీషులో వచ్చిన శాకుంతలం చదివి' సరే అనుకున్నాను. మీ తెలుగు కుమార సంభవం విని ఈయనే కాళిదాసంటే ఇతణ్ణి వాళ్ళతోనూ వీళ్ళతోనూ పోల్చడం

తెలివితక్కువతనం. నేను ఇలాగు ఉండగానే యీ గ్రంథాన్ని అచ్చువేయించి నాకొక కాపీ పంపండి- అన్నారు. ఆ పనే జరగలేదు.

అంతకుముందు నేను తెలుగు చేసిన విశ్వగుణాదర్శం విని 'స్వామిగారూ! ఇదిగో ఈ పోర్షన్‌లో మీ తెలుగు అంత ఇమోషన్ కలిగించలేదు- మార్చండి- ఇదిగో ఇక్కడ మజాగా ఉంది .సంస్కృతానికి మీరు మెరుగుపెట్టినట్టు తెలుగులో చెప్పారు' అని అన్నారు. మొగమాటం ఎరుగని'మనీషి-' చలం-

చలం జీవితం అంతా ప్రతి పుటలోనూ ఏదో క్రొత్తదనం. దానిలో సమాజానికీ సాహిత్యానికీ అమూల్యమైన ఉద్బోధ అంతర్వాహినిగా పడుగు పేకగా కలిసి ఉంటాయి. అర్థం చేసుకుంటే ఆ వ్యక్తిత్వమూ తత్వ చింతనా, సాత్విక పరాకాష్ఠ కనిపిస్తాయి. ఈ మూడుగుణాలూ మూర్తీభవించిన పుణ్య పురుషుడు చలం. మాటకి భయపడడం ఎరగని నయశాలి. జీవించిన నిండు జీవితములో అరవై సంవత్సరాలు తనజాతికి అంతరమైన చింతారహితమైన పూత భావ జ్యోతిని మంటికీ మింటికీ అఖండ జ్యోతిగా వెలిగించి తాను నమ్మిన యోగ మార్గములో మనసారా దర్శించిన ఈశ్వరుడి దగ్గరకు వెళ్ళిపోయాడు.

'త్యాగేనైకే అమృతత్వ మానశుః'

— యామిజాల పద్మనాభస్వామి

సంప్రదాయం క్షుణ్ణంగా తెలిసిన పండిత కవులలో రుక్మిణీనాథశాస్త్రి, హనుమచ్ఛాస్త్రి, పద్మనాభస్వామి చలాన్ని అర్థం చేసుకుని ఆరాధించిన గొప్ప మిత్రులు. చలం వీరిని కదిలించాడు. తనవైపు తిప్పుకున్నాడు. అరుణాచలం వెళ్ళిన చలాన్ని తిరస్కరించి కొట్టిపారేసిన మిత్రులు జారిపోయి గందరగోళ పడ్డారు. పై వారంతా చలం admirers కావడం చలం పతనానికి పరాకాష్ఠ అను కున్నవారున్నారు. అయితే, యిందులో ఒక ధర్మసూక్ష్మం వుంది జాగ్రత్తగా వెది కితే. వీరంతా చలం సాహిత్యంలోని ఏదో ఒక అంశం వలన స్పష్టంగా ప్రభావితు లైన వారేనని చెప్పాలి. చలం రచనలు ఏకాలంలో రాసినవైనా పరవశింప చేసి వివశుల్ని చేస్తాయి. ఆధునిక కవులలో విలక్షణమైన వ్యక్తిత్వం, సౌమ్యత, సర శత్వం మూర్తీభవించిన కవి శ్రీ ఇస్మాయిల్. కృష్ణశాస్త్రిగారు ఆయనకు యిష్ట

గురువు. చలం ఆయనకు విశ్వసింపదగిన ద్రష్ట. చలం హృదయ మందిరానికి తలుపులూ తాళాలు లేవు. స్త్రీ పురుష సంబంధాలు మారనంత కాలం చలం పోరాటం అవిశ్రాంతంగా సాగుతూనే వుంటుంది, గనుక, చలానికి అంతకాలమూ శాంతి లేదు చావులేదని వ్యాఖ్యానించారు ఇస్మాయిల్ (ఆంధ్రజ్యోతి వీక్లీ 3.8.79, 10.8.79. 17.8.79).

చలం అస్తమయం తరవాత వచ్చిన వివిధ వ్యాస పరంపరలో ఇస్మాయిల్ గారి వ్యాసానికి ఒక ప్రత్యేకత వున్నది. చాలా సందేహాలకు జవాబుల్ని స్ఫురింపజేస్తూ వివేచనకు కొత్త కోణాన్ని ప్రదర్శిస్తున్నది. ఇది చలానికి ఇస్మాయిల్ నమస్కారబాణం.

## సిరాపాశంతో 'చలం'

ఈమధ్య కాకినాడ ఫిల్మ్ సొసైటీవారు "ఏకాకిని" అనే మలయాళం ఫిల్మ్ ప్రదర్శించారు. ఇద్దరు యువతీ యువకులు ప్రేమించి పెళ్ళిచేసుకుంటారు.. కార్యంనాడు భార్యని ఇంచుమించుగా రేప్ చేసేస్తాడు భర్త. అతని కంతకన్నా తెలీదు. అతకంటే ఆమెకు విముఖత ఏర్పడుతుంది, అసలు విషయం ఏమిటంటే, అతడామెను రేప్ చేశాడన్నవిషయం ప్రేక్షకులెవరికీ అర్థంకాలేదు. ఇదేమిటి, కారులో తిప్పుతున్నాడు, రెస్టారెంట్లకు తిప్పుతున్నాడు. ఇంకేం కావా లీపిడకి. మొహం అలా పెడుతుందేమని ఆశ్చర్యపోయేవాళ్ళే అంతాను. చిత్రం— మామూలు సినిమా ప్రేక్షకులు కాదువీళ్ళు. చదువుకున్నవాళ్ళూ, సంస్కారవంతులు. ఆ హీరోది, Normal behaviourగా- అంటే, భర్త భార్యయెడల మామూలుగా ప్రవర్తించే తీరుగా తీసుకున్నారన్నమాట. ఆనాడు ఆ చీకటిహాల్లో నాకు చలంగారి ఆత్మకథలో ఓ సంఘటన గుర్తుకొచ్చింది. డెబ్భైఏళ్ళ క్రితం తన చిన్నతనంలో, చిన్నపిల్లి తన చెల్లెల్ని కార్యంగదిలోకి పంపిస్తుంటే, ఇంత చిన్నపిల్లని ఆ మొరటాడి దగ్గరకి పంపించవద్దని తను దెబ్బలాడిన ఘట్టం గుర్తుకొచ్చింది. అప్పటికీ, ఇప్పటికీ ప్రపంచం ఏమీ మారలేదన్నమాట. ఆడవాళ్ళ యెడ అదే నిర్లక్ష్యం, అదే న్యూనతా భావం. స్త్రీ పురుష సంబధాలు మారనంతకాలం చలం సాగించిన ఈ పోరాటం సాగుతూనే ఉంటుంది. అంతకాలమూ చలానికి శాంతిలేదు, చావులేదు

## 2

చలాన్నేకాదు. ఏ రాజకీయ, సాంఘిక, సాహిత్య సంస్కరణ వాదిని అర్థం చేసికోవాలన్నా యూరోపియన్ చరిత్రనిఅధ్యయనం చేయవలసి వస్తుంది.యూరప్‌లో కానీ తరువాత వాళ్ళ అడుగుజాడల్లో మనదేశంలోకానీ, ఇటీవల వచ్చినమార్పు లన్నిటికీ మూలకారణం రినేజాన్స్‌తో పల్లవించిన మానవతావాదం. సంఘంకన్నా వ్యక్తి ముఖ్యమనే జ్ఞానోద్భవం కలిగిన మీదట యూరోపియన్ దేశాలు సాంస్కృతికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, బహుముఖాలుగా పురోగమించాయి. లోగడ వచ్చిన అన్ని సంస్కరణలకీ అదే మూల సూత్రం. వ్యక్తిస్వేచ్ఛ అనే టప్పటికి. స్త్రీ వ్యక్తుల ప్రశ్న ముందు వస్తుంది. అందరికన్నా తాడితులు, పీడితులు స్త్రీలు. కార్మికుడిన్ని దయ తలుస్తారు. వాడి పెళ్ళాం మాటేమిటి? ఇంకా కనా కష్టం కదా. అందుకనే మన సంఘ సంస్కర్తలందరూ స్త్రీ సమస్యల మీదే తమ దృష్టిని కేంద్రీకరించారు. రాజా రామమోహన్‌రాయ్ స్త్రీలోకానికి చేసిన మేలు యింతా అంతా కాదు. మీ కందరికీ తెలిసిందే. వీరేశలింగం పంతులు గారు ఆడవాళ్ళకు జరుగుతున్న అన్యాయాలమీదే యెక్కువగా దాడిచేశాడు. గురజాడ అప్పారావుగారు "కన్యాశుల్కం" అంటే సొమ్ముకి ఆడపిల్లల్ని అమ్ముకోటం గురించి బాధపడ్డాడు. కానీ, రచయితగా ఆయన వీటన్నిటికీ అతీతుడు. పెద్ద దొంగ. మధురవాణిఅనే వేశ్యారత్నాన్ని సృష్టించిన సంఘ సంస్కర్త దొంగ కాకపోతే మరేమిటి! ఈ విషయం తరవాత యెత్తుకుంటాను.

## 3

### హిపోక్రసీ మీద కసితో

చలం తిరుగుబాటు దేనిమీద? మనలో, మన సంఘంలో పాతుకుపోయిన హిపోక్రసీ మీద. హిపోక్రసీకి తెలుగులో సరైన పదంలేదు, మనమంతా హిపోక్రసీతో కుళ్ళి కంపు కొడుతున్నాం, మన ఆత్మ పరిజ్ఞానం ఏపాటిదో కూడా దీని వల్లతెలుస్తోంది.

చలం మొదటి తిరుగుబాటు సంప్రదాయంలోని హిపోక్రసీమీద. హిందూ సమాజంపై, దాని పద్ధతులపై వెగటుపుట్టి బ్రాహ్మసమాజంలో చేరాడు. కాకి

నాడ కాలేజీలో చదువుకునే రోజులవి. రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి ఉజ్జ్వలమైన ఆకర్షణ. కాని, అప్పటికే చలం నిశితదృష్టికి బ్రాహ్మమతంలో కూడా మచ్చలు కనిపించసాగాయి. రెండో తిరుగుబాటు బ్రాహ్మసమాజంమీద. ఆ రోజుల్లోనే చలం తన మొదటి నవల "శశిరేఖ" రాశాడు, అందులో చలం గొంతు శశిరేఖే. స్త్రీ పురుషులకి ద్వంద్వ ప్రమాణాలేమిటి? ప్రేమలేని పెళ్ళిలో పవిత్రత ఏముంది.? స్త్రీ పురుషుడికి బానిసగా ఎందుకుండాలి? అని శశిరేఖ ప్రశ్నిస్తుంది.

బ్రాహ్మసమాజంలోని హిపోక్రసీని నిరసించడంతో ఆగలేదు. చలం తన మూడోనేత్రాన్ని భరతమాత, దేశభక్తి లాంటి సెంటిమెంట్స్ మీదా, వాటిమీద పురుగుల్లా బతుకుతున్న రాజకీయ నాయకుల మీద, తరవాత కమ్యూనిజంలోని హిపోక్రసీ మీదకూడా ప్రసరించాడు.

చివర్ని చలం అరుణాచలంలో వానప్రస్థం చెయ్యటం ఈ రెండో తిరుగుబాటులోని ఒక మలుపు మాత్రమే. దీని బీజాలు శశిరేఖ వేసిన ప్రశ్నల్లోనే నిక్షిప్తమై ఉన్నాయి.

## 4

మన తెలుగు రచయితలకి స్త్రీ లౌల్యం (సాహిత్యంలో సుమండీ!) కాస్త జాస్తి పాలుందనుకుంటాను, గురజాడ అప్పారావు మధురవాణి వలలో పడి. కథావసరాలకి మించి మెరుగు పెట్టేశాడు ఆ పాత్రకి, విశ్వనాథశాస్త్రి రత్తాలు అసలు భూమ్మీద నడుస్తుందా? చలం పూర్తిగా స్త్రీల మీదే కేంద్రీకరించాడు; స్త్రీలూ, స్త్రీ పురుష సంబంధాలూ, ద్వంద్వవిలువలూ, స్త్రీకి జరుగున్న అన్యాయం దీని పరిష్కారం- ఇదే ఈయన పరిధి కనక, సహజంగానే ఒక స్త్రీ పాత్రచుట్టూ కథ అల్లుతాడీయన. ఈయన Protagonist ఎప్పుడూ స్త్రీ పాత్రే. ఈయన అభిప్రాయాలు స్త్రీ పాత్రలద్వారా వెల్లడౌతాయి.

రెండు రకాల స్త్రీ పాత్రలు కనిపిస్తాయి ఈయన రచనల్లో, పురుషనీతికి బలైనవి, పురుషనీతిపై తిరగబడినవి. మొదటివి వాస్తవికంగానూ రెండోవి అవాస్తవికంగానూ కనిపించవచ్చు. రెండో రకంవాళ్ళు మన సంఘంలో సకృత్తు కనుక.

కనకనే ఇంగ్లీషు నవలలనించి పాత్రల్ని చలం దిగుమతి చేసుకున్నాడనే విమర్శ తరచూ వినిపించేది ఆ రోజుల్లో. ఇది నిజం కాదు. శశిరేఖా, అరుణా, లాలసా మనలోనూ ఉన్నారు కళ్ళు తెరిచి చూస్తే, వీళ్ళు చలానికి ఆదర్శ స్త్రీలు.

## 5

చలం జీవితంలోని రెండు ముఖ్యమైన మలుపులకి ప్రతీకలుగా ఇద్దరు స్త్రీలు నిలుస్తారు; శశిరేఖా, అరుణా, బ్రాహ్మ సమాజంతో అసంతృప్తి చెంది పూర్తిగా తిరగబడిన చలానికి ప్రతినిధి శశిరేఖ, భౌతికమైన, శారీరకమైన అవధుల్ని దాటిన సంపూర్ణ స్వేచ్ఛని, ఆనందాన్నీ, శాంతినీ అన్వేషించే చలానికి ప్రతినిధి అరుణ. చలం అరుణాచలోన్ముఖంగా పరిపక్వమయాడని మొదట ఈ నవలే సూచించింది. "నా సౌందర్యం ఒకటే నాకు దేవతలిచ్చిన వరం. ఆ వరాన్ని వుపయోగించి నప్పుడల్లా లోకం నన్ను కరిచింది. కాని ఈ అంధకారంలో ఆకాశం కొంచెంగా తెరుచుకుంది. కొత్తవిధం ఆనందానికి కొత్తద్వారం కొంచెంగా తెరిచారు. ప్రయత్నిస్తాను. ఈ మొద్దుని భారాన్ని అతిక్రమించి ఎగరడానికి చూస్తాను అంటుంది" అరుణ. ఈ కొత్త ఆనందానికి కొత్తద్వారమే అరుణాచలం.

## 6

చివర్న చలం అంటాడు: "కాని అరుణ చచ్చిపోలేదు, నాకు తెలుసు. ఇంకా మబ్బుల్లో, చిన్నబిడ్డల లేత మడమలమీద, కందిన ప్రియురాలి పెదవిమీద రోజా పువ్వు రేకుల్లో, పద్మాలరేకుల నడుమ, తాగిన మా కళ్ళ కొలుకుల్లో ఎరుపు జీరలు నశించలేదు.

జీవితంలో ఈ దేహానికి నా శృంగార భావాలకి ఎట్లా స్వర్గద్వారాలు తెరిచిందో అట్లానే నా ఆత్మకీ, నా ఆధ్యాత్మిక సందేహాలకి ఎప్పుడో ఏ ఆశ్రమం నుంచో కైలాస ద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం" అని ముగిస్తాడు.

ఏ లక్ష్యం కోసమైతే చలం మొదట సనాతన ఛాందసాచారాల మీదా, తరవాత బ్రాహ్మసమాజంమీదా తిరుగుబాటు చేశాడో ఆ లక్ష్యమే చలాన్ని అరుణా చలం వెళ్ళడంవల్ల చలం ఓడిపోయాడనీ పాత నమ్మకాలు వదులుకున్నాడనీ, పశ్చా

త్తాప పడ్డాడనీ ఐహికం వదిలి ఆ ముష్మికంలో పడ్డాడనీ జనం అపోహపడ్డారు. ఇది నిజంకాదు. మొదట్నించి చివరివరకూ చలాన్ని ఒక్క సూత్రమే నడిపిస్తూ వచ్చింది. అది జీవితానందం. జీవించడంలో గొప్ప ఆనందముంది. దీన్ని జనం ఎందుకు పాడుచేసుకుంటారు? ఈ ఆనందం సంపూర్ణంగా అనుభవించడానికి మనిషికి స్వేచ్ఛ అవసరం. స్వేచ్ఛని ఆటంకపరచేవన్నీ లాగిపారేయి. ప్రేమా, సెక్సూ, ప్రకృతి, సౌందర్యం ఈ జీవితానందంలోని వివిధ అంశలు, మాత్రమే, ఈ భౌతిక, శారీరక బంధాలకి అతీతమైన ఆనందంకోసం అన్వేషణే అరుణాచల యాత్ర. దేశాన్ని వదిలి చలం అరుణాచలం వెళ్ళిపోవడంలో నాకేమీ Contradiction కనిపించడం లేదు. చలాన్ని మొదట్నించి చివరివరకు నడిపించిన చోదకశక్తి ఈ జీవితానందమే.

"మ్యూజింగ్స్"లో ఒకచోట అంటాడు: "ఇన్ని తీరని యిబ్బందుల్నీ, ఇవి యెందుకు వుండాలని పోట్లాడుతాను గాని, జీవితమనేది చాలా గొప్ప సంగతి. చివరికి తూనికలకి వొస్తే సుఖం దుఃఖం కన్న యెన్నోరెట్లు, పక్క సినిమాలో యెన్ని అరుపులు అరిపించినా యెప్పుడో ఒకప్పుడు నాయుడుగారి ఫిడేలో, సుబ్బలక్ష్మి, యింగు మిరలదాయో, అనే రికార్డూ పెడుతూనే వుంటారు పాపం. నిన్న రాత్రి తిన్న చేపల పులుసు, దాన్ని తినేందుకే ఈ జన్మ ఎత్తితే నేమనిపించింది. ఎప్పుడూ కనుమరుగు కాని ఆకాశం, ఎక్కడ చూసినా గడ్డినించి ములగచెట్టు వరకు విరగపూసే పువ్వులు, ఒకప్పుడు ఉక్క పెట్టినా, ప్రియురాలి హస్తాలమల్లే తాకి ముద్దుచేసే గాలి, ఉచితమై ముంచే ఈ ఎండ, అప్పుడప్పుడు ఏ పుంతల్లోనో కనిపించే అందమైన వృక్షపు తీరు, పక్షుల రెక్కల వూపు, పురుగుల మీద నక్షత్ర గుర్తుల వర్ణాలు, లీలగారి కళ్ళ నించి దయగల చూపు, ఏ దూరాన్నించో హృదయంతో పలకరించే ఓ ఉత్తరం, కారణం లేకుండా నన్ను చూసి సంతోషించే పాపాయి చిరునవ్వు.... యెంత అందం జీవితం!

## 7

### జీవితంలో ఆనందమూ ప్రేమా వీటిమధ్య

పన్నెండేళ్ళ క్రితం మొదటిసారిగా చలంగారిని చూట్టానికి తిరువణ్ణామలై వెళ్ళాను. ఊరవతల తోటలో యిల్లు, సౌరిస్, నర్తకి, చిత్రా, ఆమె పిల్లలూ, బసవరాజూ, ఇంకా కొంతమంది అతిథులూ. వీళ్ళందరిమధ్యా ఆనంద సరసిలో హంస

లా తేలుతున్న చలం మొహంలో గొప్ప ప్రశాంతత. ఆయన్ని Disturb చెయ్య బుద్ధవలేదు. ఒకటి రెండు మాటలు మాట్లాడి తన ప్రశాంత తరంగాల పైకి వెళ్ళిపోయాడు. నేను అడగదల్చుకున్న ప్రశ్నలన్నీ క్రమంగా ఆనంద కాసారం అడుక్కి కనిపించకుండా యింకి పోయాయి. ఒకటే ప్రశాంతత. కెరటకెరటాలుగా ఆనందం.

ఇలా రెండు మూడు గంటలు మాట్లాడకుండా కూచున్నాం. మధ్యాహ్నం భోజనా లయాక తోటలో కెళ్ళి కూచుందామన్నారు. చెరువుగట్టుని మామిడి చెట్ల నీడల్లో కూచున్నాం. ఉస్మానియా యూనివర్శిటీ స్టూడెంట్లెవరో వాళ్ళ కాలేజిలో ఎన్ని విధాలుగా కాపీలు కొడతారో, మేష్టర్లని ఎలా మోసం చేస్తారో, ఎలా బెదిరిస్తారో చిలవలు పలవలుగా వర్ణిస్తుంటే, చిరునవ్వు నవ్వుతూ కూచున్నాడాయన.

ఆనందమూ, ప్రేమా, అందరిలోనూ ఉత్తినే, అయాచితంగా పెల్లుబికే ఆప్యాయతా, ప్రేమా, వెల్లువలుగా పారి ముంచెత్తే ఇటువంటి ప్రేమని నా జీవితంలో ఇదే మొదటిసారి ఎదుర్కోవటం, జీవితంలో చరమ విలువలు ఈ రెండే నని నిర్ధారించుకున్నాను; ఆనందమూ, ప్రేమా.

## 8

ఏ రచయితైనా తన నమ్మకాలకన్నా, అభిప్రాయాలకన్నా, Prejudices కన్నా, గొప్పవాడు. అతడు ద్రష్ట కనక. తన అవగాహనకు మించి చూడగలడు. చలం గొప్ప thinker అని నేననను, ఆయన చదివిందీ తక్కువే Western standards తో పోలిస్తే. కాని, ద్రష్ట కనక. సమకాలీ జీవితాన్ని సిరాపాశంతో పట్టేశాడు. చలానికి అంకిన జీవితం అతని అవగాహనకన్నా విశాలమైంది,గొప్పది అతని Prejudicesకీ, విశ్వాసాలకీ మించింది.

ప్రతి గొప్ప రచయిత విషయంలోనూ యిది నిజం. స్రష్టకన్నా సృష్టి గొప్పది. గురజాడ అప్పారావునే తీసుకోండి. కన్యాశుల్కమనే దురాచారాన్ని ఖండించటం కోసం నాటకం రాస్తున్నానన్నాడు. నాటకంలో కన్యాశుల్క మెక్కడుంది? కన్యాశుల్క ఖండనలాంటి అల్ప ప్రయోజనాల్ని, గురజాడ సంఘసంస్కరణ పరిధినీ మించి జీవితమంత విశాలంగా, ఉన్నతంగా పెరిగిపోయింది ఆ

నాటకం. అందులో లేనిదేముంది? హెడ్‌కానిస్టేబుల్ మొదలు సౌజన్యారావు పంతులు వరకు సకల ప్రపంచమూ వుంది. ఇది ఫలానా ప్రయోజనం కోసమని చెప్పి చిన్ని గూట్లో దూర్చబోతే దూరుతుందా! "కన్యాశుల్కం" ఎంతమందిని ఎన్ని విధాలుగా తాకిందో నాకు తెలుసు. మధురవాణి చేత ఆకర్షణ చెంది, భోగంవాళ్ళ యెడల ఆసక్తి చూపించిన కుర్రాళ్ళున్నారని వింటే, సంఘ సంస్కర్త అయిన అప్పారావుగారు గుండెలు బాదుకుంటారనుకుంటాను. కన్యాశుల్కానికి హీరో బైరాగేనని వాదించి నాచేత ఒప్పించిన ఉత్సాహవంతులైన మిత్రులున్నారు. (వినాయక్‌గారూ, వింటున్నారా?) దురాచార నిర్మూలనా కన్యాశుల్క ప్రయోజనం? అది సంఘ సంస్కర్తల, కమ్యూనిస్టుల హ్రస్వదృష్టిని దాటి పెరిగిపోయి వామనుడిలా సర్వ ప్రపంచాన్నీ ఆక్రమించుకుంది.

## 9

సాహిత్యంలో form, content అని విడదీసి మాట్లాడతారు కొంతమంది. ముఖ్యంగా కమ్యూనిస్టులు, ఇది సరైన దృష్టి అనుకోను; ఇవి రెండూ విడదీయరానివి. విడివిడిగా దొరకనివీ. చలంగారి అభిప్రాయమూ ఇదే. తన అవసరాలకి అనుగుణమైన శైలిని తయారుచేసుకున్నాడాయన. ఆయన పొంగి పొర్లే emotions తోనూ, సున్నితమైన feelings తోనూ నిండిన మనిషి. ఆ రంగు రంగుల feelingsని చిత్రించగలిగే కుంచె లాంటి మెత్తని శైలి అవసరం. మనుషుల్లో హిపోక్రసీని అసహ్యించుకుని, వాళ్ళ మనసుల్నీ, ప్రవర్తనల్నీ విశ్లేషించగలిగే చాకు లాంటి శైలి అవసరం, మూఢ విశ్వాసాల్లో పాతుకుపోయిన వాళ్ళని కూకటి వేళ్ళతో పెళ్ళగించి తుఫానులా తనతో ఎత్తుకు పోయే శైలి అవసరం. ఇటువంటి శైలి ఒకటే, విలక్షణమైందీ, కొత్తదీ, రూపొందించాడాయన. కుంచె, కత్తీ, తుఫానూ.

తెలుగు భాష కింత శక్తి వుందని చలాన్ని చదివేవరకు తెలుగువాళ్ళకి తెలీదు. ఆ తుఫానులో కొట్టుకుపోయి, ఎక్కడో కాళ్ళానాక, దిక్కులు తెలుసుకుని గోలపెట్టేవాళ్ళు; అబ్బే, ఇదంతా శైలి తాలూకు మాయ, అంతా అబద్ధం అని చలం వాళ్ళకి సమాధానం చెప్పాడు: నేను చెప్పేది నిజమని మీకు అంతరంతరాళాల్లో తెలుసును. అందుకే అంత గోల పెడుతున్నారు అని. చలానికీ, ఛాందస పాతకుడికీ జరిగే ఈ యుద్ధంలో యెప్పుడూ చలానిదే గెలుపు.

"మ్యూజింగ్స్"లో ఒకచోట చలం ప్రశ్నిస్తాడు: "ఇన్ని గొప్ప యత్నాలు జరుగుతున్నాయి, నూతన లోకశాంతి అంటారు. కాని ప్రజల మనసుల్లో ఎంత విశ్వాసం తక్కువయిందో, ఎంత అశాంతి ప్రబలిందో చూస్తున్నావా ?"

"ఎందుకీ సొద? ఏం చేస్తావు మరి!" (అని అడుగుతాడు స్నేహితుడు) "ఏం లేదు. చందమామని చూసి కుక్క ఏడ్చినట్లు, నక్షత్రాన్ని చూసి నీతో నా హృదయ బాధని చెప్పుతున్నాను" (అంటాడు చలం.) "ఏం లాభం లేదంటావా?" —స్నేహితుడు.

చలం సమాధానం—: మానవుడి హృదయంలోని స్వర్గాన్ని మానవుడికి విప్పి చూపగల ప్రవక్త జన్మించాలంటాను.

మానవుడి హృదయంలోని స్వర్గాన్ని మానవుడికి విప్పి చూపటానికి చలం కూడా కొంత ప్రయత్నం చేశాడని అనుకుంటున్నాను.

—ఇస్మాయిల్

## చలంతో గోరా

1962 ఎన్నికల ముందు గోరాగారు పార్టీ రహిత ప్రజాస్వామ్యం గురించి లెక్చర్లిచ్చేందుకు చిత్తూరు వచ్చి మీటింగు పెట్టమని సభాను కోరారు. కె. సభా యింట్లో భగవాన్, సరస్వతి ఫొటోలను చూసి, యివన్నీ ఎప్పుడు ప్రారంభించా డని అనుమానం వచ్చింది గోరాగారికి. అడిగారు. చలంగారిని చూసినప్పటి నుంచీ జరిగిన విశేషాలు, తాను ఎలా మారిందీ సభా చెప్పాడు. రమణ ఆశ్రమ ప్రభావం గురించి కూడా విశదీకరించాడు. 'అయితే నేను చలాన్ని చూస్తాను. ఈ విషయం మీద డిస్కస్ చేస్తాను,' అన్నారు గోరా. సభా ప్రోగ్రాం అరేంజి చేస్తాను అంటే మళ్ళీ వచ్చినపుడు చెయ్యమని గోరా అన్నారు. సభా తిరువణ్ణా మలై చలానికి ఉత్తరం రాశారు. తరువాత యిద్దరూ తిరువణ్ణామలై రమణస్థాన్‌కు వెళ్ళారు. భోజనాలు చేసి కూర్చున్నారు. ఒంటి గంట దాకా గోరా-చలం మాట్లాడుకున్నారు. ఇంకేమేమో మాట్లాడారు కాని, ఈ విషయం మాట్లాడ లేదు. చలం-గోరా యిద్దరు రెస్ట్ తీసుకోవడానికి వెళ్ళారు. సభాకి ఆత్రంగా

వుంది. టీ వేళకి ముందుగా సబ్జెక్ట్ ఎత్తలేదేమని గోరాను అడిగాడు. 'వాళ్ళు మాట్లాడందే నేనేమి మాట్లాడుతాను' అన్నారు గోరా. ఇదేమిటిది ప్రహసనంలా తయారయింది అనుకున్నాడు సభా. తరవాత- గోరాగారికి తెలీకుండా చలంగారి దగ్గరకు సభా వెళ్ళాడు.

'ఈ సబ్జెక్ట్ చాలా సీరియస్. దేశానికి అవసరమైనది. మీ రెండు కుటుంబాల వారు మతాల మూలాలను అంతా కుదిపేశారు చాలా తీవ్రంగా. మీ అభిప్రాయాలలో భేదం దేవుని విషయమై వుంది. మీరు అవును- ఆయన కాదు అంటున్నారు. నేను పూర్వం ఆయన (గోరా) శిష్యుడ్ని, ఇప్పుడు మీ శిష్యుడ్ని. సౌరిస్ సమక్షంలో మీరిద్దరూ మాట్లాడితే నేను రికార్డ్ చేద్దామని వచ్చాను.' అన్నాడు,

దానికి చలం 'నేనేం చెప్పాలి ఆయనకి. ఆయనకి అవసరమై అడిగితే నేనే సమాధానం చెప్తాను-' అన్నాడు.

టీ టైముకి మళ్ళీ కూర్చున్నారు. చలంగారి యింట్లో అందర్నీ పరామర్శిం చడం, పరిచయం చేసుకోవడం గోరా చేస్తున్నారు.

గోరాగారి గురించిన సంగతులు చలం కుటుంబం వారు అడుగుతున్నారు. ఆ మాటలలో ఏవో ఆత్మీయమైన కుటుంబాలు కలిసి మాట్లాడు కొంటున్నట్లు వుంది కాని, పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు, భేదాలు వున్న చాయలే ఎక్కడా కనిపించలేదు. అయిదున్నర వరకు కాలక్షేపం జరిగింది. గోరాగారు సెలవు తీసుకుంటూ- కర్రచేత్తో పట్టుకుని, 'చలంగారూ చూడండి. చాలా కార్య క్రమాలు వున్నాయి. ఐ మస్ట్ అటెండ్. నేవెళ్ళక తప్పదు-, అన్నారు.

'అప్పుడేనా-ఊరికేనా' అని చలం అంటూండగా, నేను వారిని బండి ఎక్కించి వస్తాను' అని సభా కూడా వెళ్ళాడు. సమావేశం జరక్క పోయినా, శ్రీ గోరా షష్టిపూర్తి అభినందన సంచికలో చలం, 'ఆస్తికుడు' అని చాలా ఆర్ద్ర మైన గొంతుకతో పలికిన రచనను ప్రకటించారు. ఈ వ్యాసంలో వారిరువురి సమావేశాన్ని స్ఫురింప చేసే రసధ్వని, తరంగాలు తరంగాలుగా వినిపిస్తుంది.



గోరా గారి
చేతి వూపులో గాక
ఎక్కడున్నా
డీశ్వరుడు?

# ఆస్తికుడు

నేనెరిగిన కొద్ది మంది నిజమైన ఆస్తికులలో గోరాగారొకరు.

నేనెరిగిన కొద్ది ఆస్తిక కావ్యాలలో మహాప్రస్థానం ఒకటి.

నాస్తికుడు ఈశ్వరుడి ఉనికిని ప్రశ్నించి తర్కించుకుంటాడు. వెదకుతాడు. నమ్మకాల్ని పరిశీలిస్తాడు. ఈశ్వరుడు లేడనడానికి అతనికి తగినన్ని కారణాలుంటాయి. అందులో రామచంద్రరావుగారి వంటి నాస్తిక ప్రచారకులు క్షణక్షణమూ ఈశ్వరుణ్ణి తలుచుకోక తప్పదు.

భయానగాని, విరోధానగాని, ఏ విధంగానైనా నన్ను తలుచుకున్నవాడు నాకు పరమ భక్తుడన్న భాగవత వాక్యాన్ని మరుస్తారు పరమ భాగవతులు.

తక్కిన తిట్లుతోపాటు 'నాస్తికుడ'న్నది ఒక తిట్టు పదమయింది. హిందూ మతం పునాది ఋషుల్లో నాస్తిక ఋషులు వేదాంతులన్న విషయాన్ని మరచి.

Give a dog a bad name, and hang it.

మానవుడిలోని ఏ మోసాన్ని, కుచ్ఛితాన్ని, సంకుచితాన్ని నివారించడానికి కమ్యూనిస్టు మహానాయకులు ఈశ్వరుణ్ణి నిరాకరించవలసి వచ్చిందో ఏమీ తెలుసు

కోకుండానే ఒక్క గుక్కలో నాస్తిక వాదం అని కమ్యూనిజాన్ని తుడిచి అవతల పెడతారు. ఏ ఆస్తికత్వం జీవితంలో ఏమూలా కాగడా లేసి వెతికినా కనపడని, వయసు మళ్ళిన దేశనాయకులు, గాంధీ శిష్యులు. ఆకలి అనేది లేని దేశంలో ఈశ్వరుడు లేడా ?

ఆ మధ్య నా పైని ప్రేమతో గోరా నన్ను కలుసుకున్నప్పుడు చాలా సులభంగా స్పష్టమయింది. నా ఆస్తికత్వానికీ, ఆయన నాస్తికత్వానికీ అట్టే దూరం లేదని, మనిషిని ఈశ్వరుడినించి దూరం చేసేది అతని అహం, అతని స్వార్థం. ఈ రెండూ తక్కువైన వారు ఈశ్వరుడి కెంతో సన్నిహితులు. తపస్సు అంటే అహాన్ని దగ్ధం చేసే యత్నం. అహం నశిస్తే చాలు తన్మయుడు కావడం దానంతట అదే జరుగుతుంది.

రామచంద్రరావుగారూ! మీరే స్వార్థపరులైతే మీరు ఇన్నేళ్ళు చేసిన కృషి వల్ల ఈనాడు మీరు ప్రభుత్వంలో ఓ ఘన పీఠంలోఆసీనులై వుండవలసింది, ఔనా ?

అంగీకారంగానేమో వూరుకున్నారు గోరా.

మీరెందుకెగబాకలేదు? మీలోని సిన్సెరిటీ వల్ల,నిస్వార్థంవల్ల, మానవ ప్రేమ వల్ల, మానవుల్లో విశ్వాసం వల్ల, ఇవే ఈశ్వరుడు నా దృష్టిలో.

మీ ప్రబోధంవల్ల, ప్రచారం వల్ల మీ Example వల్ల. తెలుగుప్రజ మేలుకుంటారని, ఉన్నత ఋజు ప్రవర్తనకి, వికాసానికి, సత్యజీవితానికి కళ్ళు తెరుస్తారనే విశ్వాసంతో త్యాగం చేశారు. మీరు, ధనాన్ని, సుఖాన్ని జయ్ జయ్ నినాదాన్ని.

ఎందుకు విశ్వాసం మానవుడిలో మీకు?

ఎందుకు అతను కళ్ళు తెరవాలి ? తెరుస్తాడనుకోవాలి ?

మీలోని సత్యం, ధర్మం, ఇలకోడి హృదయంలో ఎందుకు పలకాలి?

పలుకుతూంది, కాని అంగీకరించడు, అంగీకరించుకోడు. అంగీకరిస్తే ఆచరించాలి. ఆచరిస్తే తన సుఖాల్ని, ఘనతల్ని వదులుకోవాలి. లేదా చాలా అధముడుగా తనకితానే కనపడతాడు.

ఎందుకంటే, మీలో అతనిలో, ప్రతి మనిషిలో వెలుగుతున్న వెలుగు, (ఎంత మసకపడ్డా) అంతా ఒక్కటే వెలుగు, అదే ఈశ్వరుడు.

ఈ ఆస్తికులలో, భక్తుల్లో మీరు నిరసించిందంతా న్యాయమే.

తమ స్వార్థాలకూ, నీచాలకూ. దోపిళ్ళకూ, హత్యలకూ, ప్రజ ఈశ్వర నామాన్ని ఉపయోగించుకున్నట్టుగా ఇక దేనినీ ఉపయోగించుకోలేదు-అన్నాను.

ఆలోచిస్తున్నారు గోరాగారు.

ఇంకా మాట్లాడు కున్నాం.

చివరికి ఆయన ఆస్తికుడూ కాలేదు, నేను నాస్తికుడూ కాలేదు.

ఆస్తిక నాస్తికత్వాలకు మించిన ఐక్యం స్పష్టమైనది మా మధ్య.

ద్వంద్వాతీతుడైన ఈశ్వరుడు నాస్తికుడూ కాదు, ఆస్తికుడూ కాదు. 'ఉన్నాడు' అనడంకూడా ఆయన అనంతత్వానికి అవధిని నిర్ణయించడమే గనక!

నిరీశ్వరత్వాన్ని, మతరాహిత్యాన్ని, అనాచారాన్ని ఖండించే ప్రభువులు ఈశ్వరుడంటే ఏమిటి? విశ్వాసమనే దానికి అర్థమేమిటి? ఎక్కడున్నాడా ఈశ్వరుడు? ఇతరుల్ని ఖండించే అర్హత మనలో ఎంతవరకు వుందని ఆలోచించరు. చివరికి భాగవతమన్నా, భగవద్గీతనన్నా చదవరు. చదివి అర్థం యేమిటనివెతకరు. మంద కిందపోయి పురాణాలూ ఉపన్యాసాలూ విని వస్తారు.

"నీటిలో రుచిని నేను. సూర్యచంద్రుల్లో వెలుగుని నేను. ఆకాశంలో శబ్దాన్ని, పురుషుల్లో పౌరుషాన్ని, అగ్నిలో తేజస్సుని"- భగవద్గీత.

"మన్ను మిన్నె యలమి
మసలు నీ వన్నియలె
మల యహిమ మరుణఘ్రుణులా
నా తల్లి మరుగు సాగరపుమణుల"-కృష్ణశాస్త్రి

ప్రతిచోటా ప్రతినిమిషంలో, ప్రతి అణువులో నిర్విరామంగా వ్యక్తమవు తున్న ఈశ్వరుడు లేడని ఒకరూ, వాడెవడో లేడంటున్నాడు అని ఇంకొకడు వాపోతున్నారు.

తొక్కేస్తాడని భయం లేకుండా 'సుహ్వేనా' అని పలకరించే గడ్డిపువ్వు విశ్వాసంలో. సుదపడే రాళ్ళ వర్షానికి తన వొంటినంతా చెప్పి పిల్లని పొట్టలో అదుముకునే కోతి తల్లి త్యాగంలో........

"మురుషా మురుషా" అంటూ ఆలయం వాకిట ఆత్రతగా హారతి కోసం చూసే ముసలి బిక్షుకి కన్నీళ్ళతో—

నా పాపాల్ని శిక్షించు, నన్ను కాల్చినా పశ్చాత్తాపాగ్నిని ఆర్చు—అనే పతితుడి అరుపులో, లేవా, లేవా, వుంటే చూడవా: అనే మానవ దౌర్జన్య ఘట్టితుడి విస్పృహాయాక్రందనంలో నా ప్రజలు ఎక్కడ రోగంతో, ఆకలితో, మత్సరంతో భయంతో బాధపడచవనరంలేదు, అని అభయ హస్తం చాచే నిరీశ్వర నియంత కరుణామృతవాక్కుల్లో,....

"మీ రిక్కడే నిలిచి చూస్తూ వుండండి, నేను లోకాన్ని జయించి వస్తాను. అని చరచరా నడిచి వెళ్ళిపోతూ గోరాగారి చేతి వూపులో గాక ఎక్కడున్నా డీశ్వరుడు.

—చలం.

బెజవాడ నుంచి 3 జనవరి 1949న హనుమచ్ఛాస్త్రి గారికి రామచంద్ర పురం రాసిన పోస్ట్‌కార్డులో నిజమైన ఆస్తికత్వానికి నాస్తికత్వానికి దూరమే కాదు భేదమే లేదని చలం వాదన- 'ఆస్తికుడు' అని గోరా గురించి చలంరాసినవ్యాసంలో వ్యక్తం చేసిన భావాలకు బీజం ఈ ఉత్తరంలో స్పష్టంగా వుంది.

బెజవాడ,

3-1-49.

శ్రీ శాస్త్రి గారికి.

ఏం లేదు జవాబు రాయడానికి. కాని మీరు రాశారే. నేను జవాబు రాయి వొద్దా అనే బలహీనం. అవును చిన్నారావుగారికి నామీద చాలా ఇష్టం ఉండేది. తెలుగు సారస్వత వాతావరణానికి చిన్నారావుగారు ఒక మెరుగు. ఆయన చదివితే నా కథలో కొత్త అర్థాలు కనపడతాయి నాకు' ఇప్పుడు మానేశారు 'నేను' అని రావడం.

అవును. చాలామందీ ఆశ్చర్యపడతారు. దీక్షితులు గారికీ చలానికీ స్నేహం. కాని నా మనసుకి చాలా సహజం. మాకు స్నేహం కాకుండా ఎట్లా వుంటుంది? అనిపిస్తుంది.

అవును నిజమైన ఆస్తికత్వానికి, నాస్తికత్వానికి దూరమేకాదు భేదమే లేదు. 'ఉంది' అనే దానికన్న పూర్వం 'లేదు' వుంది. అంతే **ఉంది** అనేది లేనప్పుడు లేదు అనేది **ఉంది.**

శూన్యం కొడుకు నిర్గుణం. నిర్గుణం_ఎంత దగ్గిర 'లేదు'కి! సుగుణం—శూన్యానికి మనుమడు. లేదు అనేది లేంది ఉంది అనేది ఎట్లా వుంటుంది?

ఏమిటి తత్వోపన్యాసం? ఈ మధ్యాన్నం ఇంకేం పనిలేక.

—చలం.

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు. Bd. High School, Rama chandrapuram. E, Godavari.

నాస్తిక మార్గం జూన్, 1979 సంచికలో చలం మరణానంతరం—— గోరా 20-11-1953 ఆర్థిక సమత వారపత్రికలో చలం "స్త్రీ" నాల్గవ ముద్రణ సందర్భంలో రాసిన సమీక్షను ప్రకటించారు. గోరా చలం 'స్త్రీ' గురించి ప్రకటించిన అభిప్రాయాలు చలానికి స్మృత్యంజలి.

ఆంధ్రదేశంలో తన రచనలద్వారా తీవ్రసంచలనాన్ని కలిగించిన శ్రీ గుడిపాటి వెంకటచలం మే 4న తిరువణ్ణామలైలో మరణించారు. అభ్యుదయ భావాలకు స్త్రీ స్వాతంత్ర్యానికి ప్రతీకగా నిలిచిన శ్రీ చలం ఆంధ్రదేశంలో ఒక భావవిప్లవానికి పునాది వేశారు. ఆయన రచనలలో "స్త్రీ" విశిష్టస్థానాన్ని కలిగివుంది.

గోరాగారికి సన్నిహితులయిన శ్రీ చలం "స్త్రీ" 4వ దఫా ప్రచురితమైనప్పుడు నాస్తిక కేంద్రంనుండి . . . .

# చలం భావాలకు ప్రతిబింబం 'స్త్రీ'

ఒకవైపు చలంగారి "స్త్రీ" చదివినవారు చెడిపోతారన్న వదంతిఉంది. రెండోవైపున 1930 నుంచి "స్త్రీ" ఇప్పటికి ఎన్నోసార్లు ప్రచురణ అయి వేల కాపీలు అమ్ముడు అవుతున్నాయి. ఏమిటి. ఈ విరుద్ధం? దీనికి సమాధానం సాధారణమైనది. ప్రవర్తనలో నీతి పెరగాలంటూ వేయినోళ్ళ ప్రజలుచాటుతూ వుంటారు. నీతివంతుడిని సమకాలికులు వెలివేస్తారు. హింసిస్తారు, సోక్రటీసు, ఏసుక్రీస్తు, మహమ్మదు, గాంధీ జీవితాలు ఇందుకు నిదర్శనం. చలంగారి విషయంలోనూ ఇంతే.

నీతులు వినడానికి బాగుంటాయి. అనుసరించడానికి త్యాగం కావాలి. త్యాగానికి ప్రజ సామాన్యంగా జంకుతారు. అందుకే ఈ విరుద్ధ స్థితి. ఈ జంకును తీర్చడమే ధీరుల ప్రబోధాల అర్థం. "చేవగలవారిని ఎదిరించమంటున్నాను, కాని బహిరంగంగా చెప్పి ఎదిరించండి. నేను"స్త్రీ"లో చెప్పింది అంతా ఇదే" అంటారు చలంగారు 160వ పేజీలో.

ఆకలిదప్పులలోనూ, రాగద్వేషాలలోనూ, శక్తి సామర్థ్యాలలోనూ సామాన్యముగా మానవులందరూ సమానమే. ప్రాచీనకాలంలో స్త్రీలూ, పురుషులూ అందరూ ఆర్థిక అవకాశాల్లోనూ' గౌరవ మర్యాదలలోనూ సమముగా ఉండేవారని చరిత్ర చెబుతోంది. కాని కొందరు స్వార్థంవలన ఎదుటివారిలోని చిన్న లోపాన్ని ఆధారం జేసుకొని వారిని అణచిపెట్టి అంతకంతకు తమ అధిక అవకాశాలను పెంచుకొంటూ వచ్చారు, ఈనాటికి అవే విపరీతపు అసమానతలుగా తయారైనాయి.

## అసమానతలు- అన్యాయాలు

దారిద్యం, అస్పృశ్యత, బానిసత్వం, జాతి అహంకారం ఇటువంటి సమస్యలు ఈ అసమానతల లోనుంచి వచ్చాయి. వాటిలో స్త్రీ, పురుష భేదం ఒకటి. ఈ సమస్యను చలంగారు తీసుకున్నారు. ఆర్థిక అవకాశాలులేక, సంసార బంధనాలలో చిక్కుకొని, భర్తకు బానిస అయి సమాజంలో సానుభూతి లేకుండా కృంగి

పోతున్న "స్త్రీ"కి కూడా శరీరం వుంది. దానికీ వ్యాయామం ఇవ్వాలి, ఆమెకి మెదడు ఉంది. దానికి జ్ఞానం ఇవ్వాలి; ఆమెకి హృదయం ఉంది, దానికి అనుభవం ఇవ్వాలి" అని గుర్తింపజేయడం ఎలాగ అనే ఆవేదనతో చలంగారు ఈ పుస్తకాన్ని వ్రాశారు.

స్త్రీ తల్లిగా గౌరవింపబడుటకంటే భార్యగా అణగ ద్రొక్క బడుటే పదింతలు హెచ్చు. స్త్రీ కూడా తనవంటి మనిషే అన్నమాట మరిచిపోయి, తన విలాసానికి, అహంకారానికి అనువగు ఆటవస్తువుగా భర్త స్త్రీని ఈనాడు వినియోగించుకుంటున్నాడు. ఈ స్థితిని ఈనాటి సంఘం 'నీతి' ఆమోదిస్తోంది. ఇట్టి అన్యాయపు "నీతిని బోధించేవారిని తిట్టడానికీ, స్త్రీ పురుష ఆకర్షణ ప్రభావాన్ని అద్వితీయంగా పొగడడానికీ క్రొత్త మాటలు, గొప్ప మాటలూ నేర్చుకొనలేక పోతినే అనే చింత"తో (పేజీ 12) చలంగారు తాను సత్యమని నమ్మిన గంభీర ఆవేదనను పలుపలు రీతులుగా, పలుపలు మాటలతో వెల్లువలుగా ప్రవహింపజేయుటే "స్త్రీ" రచన. ప్రధానమగు ఆవేదనకు తోడుగా రచనా నైపుణ్యంకూడా కలదు కనుక, "స్త్రీ" పుస్తకము చదువరులను ఆకర్షించి, ఆలోచింప జేస్తుంది.

## సెక్సు సంబంధాలు

స్త్రీ భార్యగా ఉన్న యదార్థ స్థితిని చిత్రించు ప్రయత్నమందు దాంపత్యంలో గల రకరకాల వివరాలను చలంగారు మాయామర్మం లేకుండా ఈ పుస్తకంలో చెప్పేశారు.

దాంపత్యాలలోగల మోహం, కామం, శృంగారం, ప్రేమ, ఈర్ష్య గురించే కాక సంభోగం, వీర్య స్తంభనము, గర్భోత్పత్తి, సంతాన నిరోధకము, గర్భస్రావం, సుఖరోగములు, నపుంసకత్వము, విడాకులు గురించి ఇంకా ప్రత్యేక వివరాలు కావాలంటే ఆయనకు వ్రాస్తే తెలుపుతానన్నారు. స్త్రీ పురుష సంబంధం విషయం కొంచెం వయస్సు వచ్చిన నాటినుండి అందరకూ సహజంగా, సామాన్యంగా తెలిసిందే అయినప్పటికీ. సమాజ మర్యాదలతో, అతి సిగ్గుతో రహస్యంగా మరుగున ఉంది.

## సుఖ సంసారం

అందుచేత సుఖరోగాలు, సంతాన నిరోధము, నపుంసకత్వం వంటి విషయాలకు సంబంధించిన వివరాలు అందరికీ తెలియక సిగ్గుపడి బాధపడుతున్నారు.

"స్త్రీ" పుస్తకంలో వీటిని తేటతెల్లంగా తెలుపుటచేత, పాతమర్యాదలబట్టి సమాజం నివ్వెర పోయినా, మొత్తంమీద ప్రజలకు ఇది మేలే. దాంపత్య విషయాలను రహస్యంగా ఉంచుటచేత సమాజ గౌరవానికి వచ్చు లాభంకంటే, ప్రజానీకానికి కలుగుతున్న నష్టం హెచ్చని మానసిక శాస్త్రజ్ఞులు, వైద్యులు, సంఘ సంస్కర్తలు ఇటీవల గుర్తిస్తూ ఉన్నారు. ఇట్టి లోపాన్ని తీర్చి "స్త్రీ" పుస్తకం ఆంధ్రదేశానికి మహోపకారం చేస్తున్నది. దాంపత్య విషయాలను గురించి తాము కొన్ని వివరాలు తెలుసు కోవాలని ఆత్రుతపడుతున్నా, సూటిగా అడిగి తెలుసుకోవడానికి సిగ్గుపడుతున్న వారు "స్త్రీ" పుస్తకాన్ని చదవడంచేత తమ కోరికను నెరవేర్చుకోగలరు.

## పురుషులకి చెలగాటం స్త్రీకి ప్రాణసంకటం

"స్త్రీ" పుస్తకంలో శృంగారం, మోహం గురించి వివరాలు ఉండటంచేత అవి చదివేటప్పుడు, యువతీ యువకులు కొందరు కామోద్రేకం చెందవచ్చును. వివాహ సంబంధాలను విచ్ఛిన్నపరచుకొనుటకు ఉద్దేశించవచ్చును. కాని "స్త్రీ" పుస్తకం శృంగార కావ్యంకాదు. యువకుల చెలగాటాలు స్త్రీకి ఎలా ప్రాణసంకటమో నిరూపించు ఆవేదన రూపమే ఈ పుస్తకం.

ఈ పుస్తకం చదివేటప్పుడు మొదటి ప్రకరణాలు చక్కిలిగింత పెట్టినప్పటికీ, చివరకు వెళ్లేసరికి యువతీ యువకులకు ఒక గంభీరమైన బాధ్యత గోచరిస్తుంది. అందుకనే "ఇలాంటి పుస్తకం నా చిన్నతనంలో నాకు దొరికితే, నా జీవితాన్ని ఇప్పటికన్న ఎన్నో రెట్లు పవిత్రవంతమూ, సార్థకమూ చేసుకో గలిగేవాణ్ణి" అంటూ చలంగారు తన గురించి తాను "మొదటిమాట"లో చెప్పుకున్నారు. ఇతర యువతీ యువకులు కూడా ఈ పుస్తకాన్ని చదివి అటువంటి ప్రభావాన్ని పొందడమే గ్రంథకర్తయగు చలంగారిని గౌరవించడం.

## స్త్రీ సమస్య

చలంగారు తన ఈ పుస్తకాన్నీ, తన జీవితాన్నీ అంకితంచేసి, ఆవేదనపడుతున్న స్త్రీ సమస్యను పరిష్కరించడంలో "స్త్రీ" పుస్తకం ఒక భాగం మాత్రమే. ఇదివరలో ఎవరూ చూపలేనంత స్పష్టంగా స్త్రీ సమస్యను పైకెత్తి ఈ పుస్తకం చూపుతుంది. కాని ఆ సమస్యా పరిష్కారమార్గాలను అంత స్పష్టంగా చూపించదు.

## రహస్యంవల్ల నష్టం

"ఇంకొకరి భార్యమీద మోహం కలిగితే, ఆమె భర్త హక్కు కాదని మీకు తోస్తే, మీ అంతరాత్మలో దృఢనిశ్చయమైతే, ఆమెకు కూడా మీమీద మోహం, కలిగితే, ఇక రహస్యం ఉండకూడదు. మోహించండి. ఆ మోహానికై సంఘంగానీ, ఆమె బంధువులుగానీ, ప్రభుత్వంగానీ ఇబ్బందులు తీసుకువస్తే భరించండి.

"రహస్యపు పిరికి వ్యభిచారంవల్ల స్త్రీకిగాని, పురుషుడికిగాని, సంఘానికి గానీ ఏ మేలూ కలుగదు. రహస్యం ఉన్నప్పుడే వ్యభిచారం అనే పేరు. అప్పుడే దుర్నీతి. (పేజీలు 160, 161) సంఘ క్షోభ రహస్యకార్యాలవలన కలుగుతుంది గాని బహిరంగమైన స్వేచ్ఛవలన ఎన్నడూ కలుగదు. కలిగితే అది చాలా ఆరోగ్య వంతమైన బాధ. (పేజీ 192)

"శరీరాన్ని తృప్తిపరిచే జ్ఞానమూ, నేర్పూ బోధించేందుకు పాఠశాలలూ ఉండాలి. ప్రతి యూనివర్సిటీలోనూ లెక్చరర్లు ఉండాలి. సెక్సుఛైర్ (Sex chair) అని ఒక శాఖ వినియోగించాలి. ప్రతీ ఊరులోనూ ఈ విషయమైన క్రొత్తవీ, ప్రాచీనమైనవీ పుస్తకాలూ, గ్రంథాలయాలు ఉండాలి, (పేజీలు 198, 199)

"పూర్వపు పెళ్ళినుండి తప్పించుకోవాలంటే మహమ్మదీయమతం తీసుకోవడం చాలా సుఖమైన మార్గమూ." [పేజీ 267]

తాము పైకి లేవనెత్తిన స్త్రీ సమస్యా పరిష్కారానికిగాను ఈ పుస్తకంలో ఇచ్చిన ఇటువంటి సూచనలు ఎండ తీక్షణానికి అరచేతితో అడ్డుపెట్టుకోబోవు ప్రయత్నంవరకే. సమస్యను విరివిగాగానీ, స్థిరంగాగానీ ఇవి పరిష్కరించవు.

## " తీగలాగితే.... ...."

స్త్రీల సమస్య ఆర్థిక సమస్య, విద్యాసమస్యలతో కూడా చిక్కుబడి ఉందని చలంగారికి తెలుసును. [పేజీ 85] ఈ సమస్యలు పురుషులకు కూడా ఉన్నాయి. కాని గర్భధారణ స్త్రీయొక్క ప్రత్యేక సమస్య. ఒకే పనివలన స్త్రీకి, పురుషునికి వేరు వేరు ఫలితాలు వస్తాయి. సంభోగం వలన పురుషునికి ఆనందం అయితే, స్త్రీకి గర్భధారణ ద్వారా క్రొత్త బాధ్యతలు కూడా ఏర్పడతాయి. ఈ తేడాను ఆధా

రం చేసుకొని ఏర్పరచిన దాంపత్యనీతులలో పురుషునకు స్వేచ్ఛ, స్త్రీకి లోకభయం సంభవించాయి. స్త్రీయొక్క ఆర్థిక, విద్యాసమస్యలు పురుషులతోపాటు పరిష్కరింప బడ్డా, ఆమె గర్భధారణకు సంబంధించిన ప్రస్తుతపు నియమాలు వెంటనే మార్చ వలసి ఉంది. అందుచేత చలంగారి సలహా కోరుతూ వచ్చే ఉత్తరాలలో మూడు వంతులు గర్భస్రావానికి మందో, మార్గమో చూపమని డైరెక్టుగానో, ఇండైరెక్టు గానో, సూటిగానో, మర్మగర్భంగానో అడిగేవి. [పేజీ 19]

## సాంఘిక విలువలు మారాలి

ఇట్లు ఉమ్మడి విషయాలతోను, ప్రత్యేక విషయాలతోను, స్త్రీ సమస్య చిక్కుబడి ఉన్నప్పటికీ. దానిని పరిష్కరించవలెనంటే పరిష్కరించుటకు పూను కోవలసిందే. పరిష్కార ప్రయత్నం ఏ విషయంతో ప్రారంభించాలి అనికూడా దీర్ఘాలోచన అనవసరం. ఏ విషయంతో ప్రారంభించినా, సంఘజీవితం అంతా ఒక ముడి కనుక. ఇతర విషయాలు కూడా ఏదో వరసలో వస్తాయి. అందుచేత స్త్రీ సమస్యా పరిష్కారానికి పూనుకోవడమే కావాలి.

## చలం బాధ్యత

ఈ పనికి చలంగారే దారితీయాలి. పాతిక సంవత్సరాలబట్టి స్త్రీ సమస్యను సమగ్రంగా పరిశీలించారు. స్త్రీల సమస్యా సందర్భంలో ప్రజల విశ్వాసాన్ని చూరగొన్నారు. చలంగారికి అనుభవం, శక్తిసామర్థ్యాలూ ఉన్నాయి. అందుచేత స్త్రీ సమస్యా పరిష్కారానికి వారు నడుం కట్టవలసి ఉంది.

కాని 1952లో 'స్త్రీ'కి నాల్గవసారి పీఠిక వ్రాస్తూ "ఇదే నేను వ్రాసే చివరి మాటేమో, ఇంక నేను వ్రాయనేమో అని 'చివరికినాడు'లో అన్నారు. (పేజీ 19] అలాగ ఆయన ఊరుకోరాదు. ఊరుకొనుటచేత ప్రమాదం వస్తుంది, 'స్త్రీ' చదివి, చాలామంది ఆవేశం పెరిగి, మార్గంలేక భగ్నజీవులు అవవచ్చు.

అందుచేత "వేలువేలు స్త్రీలు తిరగబడితేనేగాని ఈ సంఘం కళ్ళు తెరచి స్వతంత్రం అయిన స్త్రీని గౌరవించడం నేర్చుకోదు." [పేజీ 85] అని గ్రంధ గర్భంలో వ్రాసిన దానివి "తిరుగుబాటు అధర్మం, తిరుగుబాటు అవసరం లేక

పోవడం "[పేజీ 19) అని పీఠికలో వ్రాసిన దానిని సమన్వయపరచు ఆచరణీయ మగు మార్గాన్ని సూచిస్తూ చలంగారు ఇంకొక గ్రంథం వ్రాయవలెను. ఆ రెండో గ్రంథం వచ్చేవరకు స్త్రీ సమస్యాదృష్టితో 'స్త్రీ' అసంపూర్ణం.

'పుస్తకప్రపంచం' డిసెంబరు 1965 సంచికలో రాజమన్నారు చలంపై రాసిన ప్రత్యేక వ్యాసం వచ్చింది. చలం ఒక అపూర్వ వ్యక్తిఅనీ, అతని భావాలు, సిద్ధాంతాలు, ఆశయాలు, నమ్మకాలు పూర్తిగా నిష్పాక్షికంగా ఎవరూ అర్థం చేసుకొనకపోవడం వలన అతను అందరిచే దూషణకు పాలైనాడనీ, స్త్రీని పూర్తిగా అర్థంచేసుకున్నవాడు చలమనీ, చలం రచనలకు అవినీతి దోషం ఆపాదించే వారంతా అన్యాయవాదులనీ చలం విషయంలో ఆయన జీవితం రచనలూ వేరుకావు అంటూ నిర్ధారించారు.

# సాహిత్యంలో అచల స్థానం గడించుకొన్న "చలం"

'చలం' అంటేచాలు. గుడిపాటి వెంకటచలం అని పూర్తిగా వ్యవహరించడం అనవసరం. చలం వంటి అపూర్వవ్యక్తికి వంశం, గోత్రం, నామం- వీటితో పనిలేదు.

చలం ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో ఒక యుగపురుషుడు. అతను చూపించిన క్రొత్త మార్గం ఈనాడు ఒక రాజమార్గమైంది.

చలాన్ని నేను మొదట కలుసుకొన్నది 1931లో. అప్పుడతను బెజవాడలో ట్రెయినింగ్ స్కూలుకు హెడ్‌మాస్టరు. పారుపల్లి సుబ్బారావుగారింట్లో ప్రథమ సందర్శనం. 1930లో బళ్ళారి రాఘవ ప్రదర్శించిన నా 'తప్పెవరిది' నాటకం చలంగారికి అంతగా నచ్చలేదు. కారణం ఊహించాను, అందులో ఇతివృత్తం ఇది- భీమారావు వయసు చెల్లిన సబ్‌రిజిస్ట్రారు. ఒక్క కొడుకుని కని భార్య చని పోయింది. కొడుకు పెరిగి పెద్దవాడై కాలేజీలో చదువు కొంటున్నాడు. భీమారావు

మేనకోడలు జానకి, కొడుకు రాము ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. కానీ, భీమారావు కామవాంఛచేత వారిద్దరికి వివాహం చెయ్యడానికి బదులు జానకిని తానే పెండ్లాడుతాడు. సర్వదా అనుమానపిశాచం ఆయన్ని పట్టింది, రాముని హాస్టల్‌లో ఉంచాడు, ఒకరోజు ఇంటికి వచ్చినప్పుడు జానకి, రామూ సరసా లాడుకుంటూ ఆనందంగా ఉండడంచూచి ఉగ్రుడై కొడుకుని తిట్టి పంపుతాడు. క్రమేణ భీమారావు అనుమానం ఎక్కువై పుత్రద్వేషం కలుగుతుంది.

ఈ పరిస్థితుల్లో జానకి గత్యంతరం తోచక ఆత్మహత్య చేసుకుంటుంది. చలంగారికి ఇదంతా అసహజంగా, సంఘనియమానుసారంగా ఉండి, వారి దృష్టిలో నీరసంగా కనబడి ఉంటుంది. 'తప్పెవరిది' కన్న నా 'దెయ్యాల లంక' వారికి నచ్చింది. నా అభిప్రాయంకూడా అదే.

చలంగారంటే నాకు అమితమైనగౌరవం. వారు రచించిన ప్రతి గ్రంథం ప్రకటింపబడ్డది నేను చదివాను; కథలు, నవలలు, నాటకాలు, లేఖలు, వ్యాసాలు.

వారితో పరిచయం, స్నేహం, వృద్ధికావడానికి నా వృత్తి, ఉద్యోగం, నివాసం ఆటంకపరిచాయి, అయినా పరస్పర గౌరవాభిమానాలు నేటివరకూ చిరస్థాయిగా ఉండిపోయాయి. రమణాశ్రమంలోనుంచి రవీంద్రనాథ ఠాగూరు గీతాంజలికి చేసిన అనువాదానికి ఉపోద్ఘాతము వ్రాయమని నన్నుకోరారు. నాకు అర్హతలేదని వ్రాయలేదు. వారిమీద నాకున్న గౌరవం, భక్తి గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు రచించిన'చలం జీవితం సాహిత్యం' అనే గ్రంథానికి పరిచయ వాక్యాలువ్రాసి వెల్లడిచేశాను,

చలం భాషణకేగాక దూషణకుకూడా పాత్రైనాడు. అందుకు కారణం అతని భావాలు, సిద్ధాంతాలు, ఆశయాలు, నమ్మకాలు పూర్తిగా నిష్పక్షికంగా అర్థం చేసుకోకపోవడమే.

చలానికి నీతిలేదు; అతనొక విలాస పురుషుడు; కామోద్రేకమే అతని రచనలో ప్రధానగుణం- ఇటువంటి అపనిందకు చలం ఏమాత్రమూ పాత్రుడు కాడు. ఆలోచనలేని కూపస్థమండూక సమానులకు సమకాలిక సంఘ నియమాలే పరమ ధర్మం. దానికి విరుద్ధమైన వర్తన నీచమైనది. నీతిబాహ్యం, చలం దృష్టివేరు. మానవప్రకృతికి సహజమైన ధర్మమే నిజమైన ధర్మం, సంఘ నియమాల్ని అతిక్రమించడం అవినీతికాదు.

స్త్రీని పూర్తిగా అర్థంచేసుకున్నాడు చలం. సత్యం భయం లేకుండా చెప్పేవాడు. చలం స్త్రీని హీనంగా చిత్రించాడని కొందరి ఆక్షేపణ. అది పొరపాటు. స్త్రీకి చలం ఇచ్చిన ఉన్నతస్థానం ఇంకే రచయిత ఇవ్వలేదనవచ్చు.

స్త్రీ ప్రేమైక జీవి. ఆ ప్రేమలో కామం ఉంది; వాత్సల్యం ఉంది. స్త్రీ తాను ప్రేమించిన పురుషునకు తన శరీరమేకాదు; సర్వస్వమూ అర్పిస్తుంది. అటువంటి అర్పణే స్త్రీకి పరమార్థం, అటువంటి అర్పణలోనే స్త్రీకి పరమానందం. అయితే అట్టి అర్పణలు గ్రహించడానికి పురుషునకు అర్హత ఉండాలి. స్త్రీ పురుషుని బానిస కాదు; భోగసాధనంకాదు. "స్త్రీ శరీరం తనదికదా, తనకు చిక్కిందికదా అని పురుషుడు నలిపి పాడుచెయ్యకూడదు", అని అంటాడు చలం.

భార్య పతివ్రత కావడానికి భర్తమీద చాలా భారం ఉంది. భార్యను అర్థం చేసుకొని, భార్య సౌఖ్యంకోసం తన సౌఖ్యంకూడా త్యజించి, భార్యను శరీరంతో, హృదయంతో. మనస్సుతో పూజించే భర్తకు భార్య సర్వమూ అర్పించి ధన్యురాలవుతుంది. ఆమెయే పతివ్రత. భార్యా భర్తల సంబంధం కృత్రిమమైనది కాదు. సహజమైనది. శాస్త్రసమ్మతంగా వివాహం కాకపోయినా స్త్రీ పురుషులు భార్యా భర్తలుగా ఉండవచ్చును దైవసాక్షిగా. "దైవమిచ్చిన భార్య" చలం నవలల్లో ఒకటి. ఇట్టిభావాలతో చలం రచనలకు అవినీతిదోషం ఆపాదించేవారు అన్యాయ వాదులు.

'శశిరేఖ' 'అమీనా' 'మైదానం', వంటి కథలు వ్రాసిన చలం భగవాన్ రమణ మహర్షి ఆశ్రమంలో శిష్యుడై ఆధ్యాత్మిక వచనాల్ని వ్రాయడం కొందరికి ఆశ్చర్యంగా ఉండవచ్చును. అట్టివారు రక్తికి, భక్తికి, ముక్తికి ఉన్న సామీప్యం గ్రహించనివారు. భోగి సులభంగా యోగికాగలడు, కామిగాక మోక్షగామి కాడు. పురుషార్థాల్లో కామం తర్వాత మోక్షం, "శృంగారమూ, ఆధ్యాత్మిక మార్గమూ వేరుకావు. మొదటిమార్గ పర్యవసానమే రెండోది" అని చలమే అన్నాడు.

అనేక కవులకు జీవితంవేరు, రచనవేరు, చలానికి అలాకాదు. ఆయన జీవితం వేరు, రచనలు వేరుకావు.

చలాన్ని ఇంగ్లీషు రచయితల్లో కొందరికి పోలుస్తారు. ముఖ్యంగా డి. హెచ్. లారెన్సుతో, కొన్నిఛాయలు సమానంగా కనబడవచ్చును. కాని "కేసరి కేసరి కేసరి" అన్నట్లు చలం చలానికే సరి.

— పా. వేం. రాజమన్నారు

చలం మృతిగురించి నారీలోకం. అంతగా పట్టించుకోలేదనే విమర్శకి విరుగుడుగా రెండే రెండు వ్యాసాలు వనతాజ్యోతి మాసపత్రిక జూన్, సెప్టెంబరు 1979 సంచికలలో వచ్చాయి. శ్రీమతి టి. కృష్ణాబాయి— యీ వ్యవస్థలో కొద్ది మంది వ్యక్తులు వికాసం పొందినంతమాత్రాన, సమాజం మొత్తంలో మార్పు రావడం సాధ్యంకాదని చలం గుర్తించకపోవడం విచారకరం అంటున్నారు.

# మన చలం

తెలుగు పాఠకలోకానికి చిర పరిచితుడు చలం. అతన్ని అర్థం చేసుకున్న వాళ్ళు తక్కువ, అపార్ధం చేసుకున్నవాళ్ళు ఎక్కువ! ఆదరించినవాళ్ళు తక్కువ, నిరసించినవాళ్ళెక్కువ!! ఆమోదించినవాళ్ళు తక్కువ, ఆడిపోసుకున్నవాళ్ళెక్కువ!, అయినా చలాన్ని హరించి ఆరాధించేవాళ్ళు తెలుగుదేశంలో అన్నిమూలలా ఉన్నారు. ఆయన వ్యతిరేకులు చలంమీద కట్టుకథలల్లారు. నీలాపనిందలు వేశారు, విషప్రచారం చేశారు, అయినా చెక్కుచెదరలేదు చలం. నిబ్బరంగా నిలిచాడు, నిజాయితీతో నడిచాడు, తనకు తోచింది రాశాడు, రాసింది చేశాడు. కలాన్ని కత్తిగావాడిన మొదటి మేటి తెలుగు రచయిత చలం. అందుకే అతనిగురించి వాదోపవాదాలు, చర్చలు తెలుగు సాహితీరంగంలో నిరంతరం చెలరేగుతూనే ఉన్నాయి.

ఎవరీచలం? అరవై ఏళ్ళక్రితం కలంపట్టి, ముప్పయి ఏళ్ళ క్రితం అరుణా చలం వెళ్ళి, మొన్న మొన్ననే కన్నుమూసిన తెలుగు కథకుడు, నవలాకారుడు విమర్శకుడు, తాత్వికుడు. అన్నిటికన్నా ముఖ్యంగా స్త్రీ స్వాతంత్ర్యంకోసం, విముక్తికోసం కంకణం కట్టుకున్న చలంగురించి మనం తెలుసుకోకపోవడం, ఆతన్ని చదువుకోకపోవడం ఒక రకంగా నేరం అవుతుంది.

చలం రచనలన్నీ ఒకఎత్తు, స్త్రీ గురించి ఆలోచనలు, బాధలు అన్నీ రంగరించి రాసిన "స్త్రీ" పుస్తకం ఒక్కటీ ఒక ఎత్తు "స్త్రీ" రచనా కాలం 1925.

1920 ప్రాంతాల్లో తెలుగు దేశంలో బాల్య వివాహాలు ముమ్మరంగా జరుగుతుండేవి. వీరేశలింగం లాంటి సంఘ సంస్కర్తలు ఎంత కృషిచేసినా వితంతు వివాహాలు ఇంకా జరగని రోజులవి, స్త్రీకి అడుగడుగునా కట్టుబాట్లు, అడ్డంకులు, స్త్రీని తోటి మనిషిగా గుర్తించడమేలేదు.ఆర్థిక స్వాతంత్ర్యం అసలే లేదు, అలాంటి రోజుల్లో, మిగిలిన అందరిలాగే కాలప్రవాహంలో పడి కొట్టుకుపోలేదు చలం. తన సొంత చెల్లెలు శోభనం గదిలో పడిన బాధలు, కాపురం చేస్తూ భర్తతో పడిన అవస్థలు చూసి మండిపడేవాడు. తన చెల్లెలిలాగే ఎందరో అభాగినులు బాధ పడుతున్నారని గ్రహించి "స్త్రీకి కావలసింది తనమీద, తన జీవితంమీద, తన శరీరంమీద, తన మనసుమీద, తన హృదయంమీద సంపూర్ణాధికారం" అన్నాడు. ఆయన రాసిన కథలు, వ్యాసాలు. నాటకాలు అన్నీకూడా మురికి కూపాల్లాటి జీవితాలనుంచి స్త్రీ పొందవలసిన ఆరోగ్యం గురించి, స్త్రీ స్వేచ్ఛ పట్ల ఆవేదనను, తపనను ప్రతిబింబిస్తాయి.

చలం స్వేచ్ఛా జీవి. ఆనాటి సమాజపు కట్టుబాట్లను, ఆచారాలను ధిక్కరించి తిరగబడ్డాడు. అలాగే స్త్రీలను కూడా తిరగబడమని చెప్పాడు.

స్త్రీని దేవతగా ఆరాధించడమో. కాలుకిందవేసి తొక్కడమో నాటి మనుధర్మ రీత్యా జరిగింది. ఆకాలం మారిందనీ, స్త్రీ బానిసగా కాక, ఆధునికంగా వైజ్ఞానికంగా పెరగాలని చలం ఘోషించాడు. అంతేకాదు, ఆధునిక స్త్రీ హోదాలకు, షోకులకు బానిస కాకూడదనీ నిజమైన స్వేచ్ఛా సంస్కారాలతో మానసికంగా కూడా ఆరోగ్యంగా పెరగాలనీ చలం కోరిక. వంటింటికి, పడకటింటికి మాత్రమే స్త్రీ పరిమితమై ఉండకూడదనీ అన్ని జీవన రంగాల్లోనూ సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా పాల్గొనాలని ప్రబోధించాడు.

ఆడవాళ్ళని కాపురాల్లోంచి లేచిపొమ్మన్నాడనీ, యువతీ యువకులకు స్వేచ్ఛా ప్రణయం నూరిపోశాడనీ. సంఘంలో అరాచకాన్ని రెచ్చగొట్టాడనీ చలాన్ని నిందిస్తారు. కాని వివాహ వ్యవస్థలోని కుళ్ళుని తూర్పారపట్టాడాయన.

ఆస్తులుపోతాయని మేనరికాలు చేయడం, ముక్కూ మొగం తెలియని వారిని తల్లి దండ్రులకోసమో, కట్నంకోసమో పెళ్ళిచేసుకోవడం, మనసులు కలవకపోయినా గర్భాదానపు గదుల్లో బలవంతంగా కాపురాలు చేయడం లాంటి పాపాలన్నిటికీ కారణ "భూత" మైన వివాహ వ్యవస్థపై తిరుగుబాటు చేశాడు చలం.

ఆనాటి సామాజిక పరిస్థితుల్లో ఇంటా బయటా ఆడదానికి జరుగుతున్న అన్యాయంచూసి చలించి, ద్రవించిన చలం తిరుగుబాటు తప్ప గత్యంతరం లేదని గట్టిగా నమ్మాడు. "నాకు సంఘంమీద కోపం, వ్యక్తులమీద ఇష్టం" అన్నాడు చలం. కాని ఈ కుళ్ళు వ్యవస్థని కూకటివేళ్ళతో పెకలించి కొత్త వ్యవస్థని నిర్మించుకోవాలి. అలాంటి సంఘంలో మాత్రమే ఆడా, మగ అందరికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభ్యమవుతాయి. అంతేగాని యీ వ్యవస్థలో కొద్దిమంది వ్యక్తులు వికాసం పొందినంత మాత్రాన, సమాజం మొత్తంలో మార్పు రావడం సాధ్యం కాదని చలం గుర్తించకపోవడం విచారకరం.

అయినా, 1930 నాటికే "స్త్రీకి కూడా శరీరం ఉంది; దానికి వ్యాయామం ఇవ్వాలి ఆమెకు మెదడుంది; దానికి విజ్ఞానం ఇవ్వాలి, ఆమెకు హృదయం ఉంది; దానికి అనుభవం యివ్వాలి," అని రాసి, చెప్పి, ఆచరించిన మహానుభావుడు చలానికి ఆఖరి జోహారు చేద్దాం.

— టి. కృష్ణాబాయి

శ్రీమతి ఆచంట శారదాదేవి చలం పోవడాన్ని ఒక స్నేహితుని మరణంగా స్వీకరించి పైకి చెప్పుకోలేని మూగబాధ అనుభవించినట్లు యీ వ్యాసంలో రాసుకున్నారు. ఆయన తమకు చిన్ననాటి స్నేహితులు అనేదృష్టితో రాసిన యీ వ్యాసం చలం స్మృతికి ఒకచిన్న ఉపహారం!

## స్నేహితుడు చలం

చలంగారు పోయారంటే ఏదో ఒక మహా రచయిత వెళ్ళిపోయాడని బాధ కలుగలేదు. ఆయనను ఎప్పుడూ నేను ఆ దృష్టితో చూడలేదు. ఒక దగ్గర స్నేహి

తుడు వెళ్ళిపోయాడని మాత్రం రెండు మూడు రోజులు మనసులో ఒకటే మాగ
బాధగా ఉంది.

చలంగారి రచనలు నేను ఏదీ చదవలేదని కాదు. చాలా చిన్నప్పుడే ఆయన "దైవమిచ్చిన భార్య" చదివాను. ఆ తరువాత ఆయన వ్రాసిన ప్రతిదీ చదివాను. కొన్ని చాలా బాగున్నాయను కున్నాను. కొన్ని కొన్నింటిని గురించి ఏమీ అనుకో లేను. కొన్ని రచనలలో ఆయన సునిశితమైన వ్యంగ్యానికి. హాస్యధోరణికి విరగ బడి నవ్వు కున్నాను. పక్క వాళ్ళకి కూడా చూపించి, వినిపించి, మరీ మరీ నవ్వు కున్నాను. "యశోదా గీతాలు" చదువు తున్నప్పుడు చాలా సార్లు మనసు ఆర్ద్రమైతే ఎవరికీ చెప్పకుండా మౌనంగా లోలోపలే ఆనందించాను. అయినా ఆయన గొప్పరచయిత అనే దృష్టితో ఎప్పుడూ చూడలేదు. ఆయన నాకు చిన్ననాటి స్నేహితుడు. ఎప్పుడూ అలానే ఉన్నారు. అదే మా సన్నిహితత్వం.

చలంగారి కుటుంబమూ, మా కుటుంబమూ చిన్ననాటినుంచి సన్నిహితంగా ఉండేవి. చలంగారి "సౌరిస్" మా ఫామిలీడాక్టర్. చలంగారి "రంగనాయకమ్మ" మా అమ్మగారికి ఆప్తమిత్రురాలు. చలంగారి పిల్లలూ మేమూ కలిసి ఒకే కాన్వెంట్‌లో చదువుకున్నాము.

అప్పట్లో చలంగారు బెజవాడలో మా ఇంటికి దగ్గరగా చిన్న బజారులో ఉండేవారు. అక్కడి నుంచి సౌరీస్, వసంత్, అందరూ మా ఇంటికి వచ్చేవారు. మేమంతా కలిసి మా కారులో కాన్వెంట్‌కి వెళ్ళేవాళ్ళం. స్కూలుకు టైము అయ్యే దాకా మా తోటలో రాచ ఉసిరికాయలు రాల్చుకుని తింటూ ఉండేవాళ్ళం. పళ్ళు పులిసేదాకా! కారులో కూడా-నే నిక్కడకూర్చోను. నువ్వక్కడ కూర్చో-అంటూ పోటీపడి, పేచీపడి స్కూలు చేరేదాకా ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ సర్దుకుంటూ ఉండేవాళ్ళం.

కొన్నాళ్ళకి ఆ కాన్వెంట్ చదువు చలంగారి పిల్లలకు నచ్చలేదు, మాకూ నచ్చలేదు. అందరం హాయిగా మానేశాం. ఇంట్లోనే కూర్చుని ఎవరి ఇష్టం వచ్చి నట్లు వాళ్ళు, ఎవరికి తోచినది వాళ్ళు చదువుకున్నాం.

ఆ తరువాత చలంగారు మా యింటి వెనకాలకే కాపురం వచ్చారు. అప్పటి నుంచి మా రెండుకుటుంబాలూ మరింత సన్నిహితంగా ఉండేవి. అప్పట్లో చలం

గారు ఉన్నయింటికి దాసు వారి యిల్లని పేరు. ఆ ఇంట్లోనే క్రింద డాక్టరు రంగనాయకమ్మగారి హాస్పిటల్, మేడమీద కాపురం. ఆమేడకు ముందరవైపు పెద్ద వరండా. చలంగారి పిల్లలు, ఇంకా యింటికి వచ్చేవాళ్ళు పోయేవాళ్ళు, అందరూ 24 గంటలూ అక్కడే మకాం. మా యింటికి వెనకాలవేపు పెద్దడాబా, అరుగులు, వరండా ఉండేవి. రాత్రింబగళ్ళు అక్కడే ఉండే వాళ్ళం. అంచేత రోజంతా చలంగారి యింట్లో ఏంజరుగుతోందో మాకు కనిపిస్తూ ఉండేది. మేం ఏం చేస్తున్నామో వాళ్ళకు కనిపిస్తూ ఉండేది.

సాయంత్రం పూట చలంగారు, ఆయన పిల్లలూ, నేనూ అందరం బందరు కాలవ ఒడ్డుకు షికారు వెళ్ళే వాళ్ళం. అప్పుడు లారీల రద్దీలేదు. ప్రశాంతంగా ఉండేది, హాయిగా మాట్లాడుకుంటూ వెళ్ళి వచ్చేవాళ్ళం. మా ఇంటి వెనకగేటు, వాళ్ళింటి ముందరగేటు ఎదురెదురుగా ఉండేవి. నడిచి వచ్చాక అక్కడ విడిపోతూ ఉండేవాళ్ళం. రోజూలోపలికి వెళ్ళేముందు చలంగారు నవ్వుతూ "నీకేం తోచనప్పుడల్లా మా ఇంటికి వచ్చేస్తూ ఉండాలి, ఏం'" అంటూ ఉండేవారు. నేనూ నవ్వుతూ తలూపేదాన్ని.

కె.సి.దే పాటలు, న్యూథియేటర్స్ సినిమాలు, బెంగాలీ సంగీతం మా కందరికీ ప్రియంగా ఉండేవి. వసంత్ బెంగాలీ పాటలుపాడేవాడు. ఆ రోజుల్లో అందరం బెంగాలీ నేర్చుకోవాలి అనుకుంటూ ఉండేవాళ్ళం, గతం ఎక్కడికీ పోదు. మనసులోనే మెదులుతూ ఉంటుంది.

చలంగారు తిరువణ్ణామలై వెళ్ళారు. నేను తిరుపతి వచ్చాను. నా మొదటి కథల పుస్తకం "పగడాలు" అచ్చయినప్పుడు ఆయనకు పంపాను, ఆయన వెంటనే నా కథలు మెచ్చుకుంటూ ఉత్తరం రాశారు. "నీ కథలు మాయింట్లో అందరికీ నచ్చాయంటే, అవి ఇంక ఎంత బాగున్నాయో చెప్పక్కరలేదు" అంటూ రాశారు. అయితే ఆ పుస్తకంలో అచ్చయిన పీఠికలు మాత్రం ఆయనకి నచ్చలేదు. "ఇంత మంచి కథలకి ఈ పీఠిక లెందుకూ?" అంటూ ఎగతాళి చేస్తూ రాశారు. అప్పుడు కాని తెలియలేదు నాకు. పుస్తకానికి పీఠిక అనవసరమని.

"నీ కథలు తెలుగు వాళ్ళకినచ్చవు." అంటూ జోస్యంచెప్పారు, ఆ జోస్యం ఫలించింది. అయితే చలంగారికి, ఒక స్నేహితుడికి నచ్చాయనే తృప్తి మాత్రం మిగిలి ఉంది.

చివరిదాకా చలంగారికి విజయవాడ అన్నా, తెలుగువాళ్ళన్నా విసుగు పోలే దనుకుంటాను. ఎప్పుడైనా విజయవాడ నుంచి ఉత్తరం రాస్తే. "ఆ బెజవాడ ముఱు క్కాలవలు అలాగే వున్నాయా? ఎలా భరిస్తున్నావూ?" అంటూ ఇదే పలకరింపు.

చలంగారితో ఉత్తరాలు రాయటానికి పోటీపడి ఎవరూ గెలవలేరు. ఇవ్వాళ మనం ఉత్తరం రాస్తే మూడోరోజుకు తప్పకుండా జవాబు వచ్చేస్తుంది. ఆయన ఏ రోజు ఉత్తరాలు ఆ రోజే జవాబు రాయాలని నియమంపెట్టుకొని అది అక్షరాలా పాటించా రనుకుంటాను. చివరకు ఆయనతో పోటీలో నేనే ఓడిపోయాను.

చలం మహా రచయిత కావచ్చు. అంతకన్నా మంచి స్నేహితుడు, మధుర మైన వ్యక్తి. జాలిగుండె కలవాడు.

ఒకసారి నాకు వ్రాశాడు- "నిన్ను ఈ మధ్య చూసినవాళ్ళు నువ్వెప్పుడూ దిగులుగా కనిపిస్తావంటున్నారు. అమ్మా! జీవితం నీతో క్రూరంగా ఆడుకున్నదా? ఏమిటి నీ బాధ?" అంటూ. ఆ ఆప్యాయత మరచి పోలేనిది.

—ఆచంట శారదాదేవి

చలంమీది వ్యతిరేకతా భావం నవ్వులలో కూడా ఎలా పల్లవించి కుసు మిస్తోందో సూచించడానికి జ్యేష్ఠ (బసవరాజు) రేపు పత్రికలనుంచి వారి వారి రాత లను పేర్కొనడం జరిగింది. చలాన్ని అతని రీతుల్ని భావాలను వ్యతిరేకిస్తున్న జ్యేష్ఠ వాదనలకు, ప్రమాణాలు చూపకుండా 'రేపు', వారు చేసిన నిర్ణయాలకూ స్త్రీ పుస్తకానికి చలం రాసిన పీఠికల్లోనే జవాబు వుంది. 1925లో రాసినప్పటికీ నేటికీ శాస్త్రవిజ్ఞానం సెక్సు పరంగా చాలా మారింది. ఇవన్నీ ఒక ఎత్తూ, ఇటువంటి పుస్తకాన్ని 1925లో సాహసించి రాసి జయించుకు రావడం ఒక ఎత్తూను. 'స్త్రీ' పుస్తకానికి చలం రాసిన ముగింపుతో సహా పరిశీలిస్తే- చలానికి స్త్రీ గురించి యేమీ తెలియదు అనేవారు తెలుసుకోవలసింది ఎంతోవుంది. హావలాక్ ఎల్లిస్, బెర్ట్రండ్ రసెల్ ప్రభావాలు చలంపై బాగా వున్నాయి. లైంగిక విజ్ఞానానికి సంబంధించిన అంశాలను వేరుగా, చలం భావ పరంపరను ఆయన ఆదర్శాలు ఆవేశాలను వేరుగా చూడాలి. అంకితం, మొదటిమాట (1925) మళ్ళీ ఈనాడు (2. 12. 40), మూడోమాట (27. 7. 45), చివరికీనాడు (20. 9. 52), ఇంకో

సారి మళ్ళీతప్పలేదు (31. 12. 59) వీటిని వరసగా చదివితే చలం మనో వైశాల్యం, అతని కృషి, సిన్సియారిటీ ఎలాంటి వారికైనా అర్థం అవుతాయనే ఆశ.

## అంకితం

నాకు
ఒక్క నిమిషం విశ్రాంతి నివ్వక,
మహా ప్రణయమారుత వేగం మీదనో.
అగాధ వియోగ భారం కిందనో
చీల్చి, నలిపి
ఊపిరాడనీక
నా జీవితాన్ని పాలించే
స్త్రీ లోకానికి
నివేదితము

## మొదటి మాట

స్త్రీకికూడా శరీరం వుంది; దానికి వ్యాయామము యివ్వాలి. ఆమెకి మెదడు వుంది; దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకి హృదయం వుంది; దానికి అనుభవం యివ్వాలి-అనే సంగతి గుర్తించని యీ దేశానికి, నేను రాసే యీ సంగతులు అర్థమవుతాయా? పాశ్చాత్యనాగరికతా వ్యామోహంలోపడి, వొళ్ళు తెలీక, నోటికి వచ్చినట్లు కూసిన కూత లనుకుంటారని తెలుసు. కాని ఇట్లాంటిపుస్తకం నా చిన్నతనంలో దొరికితే, నా జీవితాన్ని యిప్పటికన్న యెన్నోరెట్లు పవిత్రవంతమూ, సార్థకమూ చేసుకోగలిగేవాణ్ణి. నావంటివారు యీ నూతన యుగంలో వున్నారేమో!

## మళ్ళీ ఈనాడు

మొదటి ముద్రణ చివర "ఈనాటికి యీమార్గం, ఈ పద్ధతులు నాకు మంచివని తోస్తున్నాయి. తప్పుకావచ్చు" అని వ్రాసి, కాలం గడిచినకొద్దీ నా

అభిప్రాయాలు మారవచ్చునని సూచించాను, నా ఉద్దేశాలూ, ఆచారాలు మారితే, చూసి సంతోషించాలని చాలామంది చాలా ఏళ్ళనించి కాచుకొని వున్నారు. నాలో (Interest) "ఇన్‌టరెస్టు" వల్లకాదు. నా పద్ధతుల్ని అనుకరించి చెడిపోతున్నారని (బాగుపడుతున్నారని) అనుకునే యువకుల్ని నిరుత్సాహపరచి, తమవంటి నిర్జీవపు తుక్కుకింద మురగబెట్టాలనే ఆశవల్ల, యువకులే భవిష్యత్తుకు ఆధారాలని కబుర్లే గాని, పెద్దవాళ్ళకి చిన్నవాళ్ళు తమకన్నా బాగుపడతారంటే. చాలా యీర్ష్య. అందువల్లనే లోకానికి మహోపకారం చేసినవాళ్ళు, జవసత్వాలు ఉన్నవాళ్ళందరూ పెద్దవాళ్ళకి తిరగబడ్డవారే! తల్లిదండ్రులమాట వినే కుర్రవాడికి గతులు లేవు, గురువులమాట వినేవాళ్ళకి అంతకన్నా!

ఆనాడు పెద్దవాళ్ళమీద తిరుగుబాటు చేసిన యువకులు పెద్దవారై చిన్నవారికి నీతులు బోధించే అధికారాలుచేసి, అణగతొక్కడం చూస్తున్నాను. తమకి చిన్నప్పుడే పెళ్ళిళ్ళు చేశారని తమ తల్లిదండ్రుల్ని తిడుతో తమ పిల్లలకి చిన్నప్పుడే బలవంతంగా పెళ్ళిళ్ళు చేసే తల్లిదండ్రుల్ని చూస్తున్నాను, నాతోచేరి నాకథలూ, అభిప్రాయాలూ మెచ్చుకుని, తమ స్వంత స్వతంత్రంమీద చాలా అభిలాష చూపి గంతులు వేసి, పెళ్ళిళ్ళు చేసుకునీ, ఉద్యోగాలు సంపాయించుకునీ, యిళ్ళు కట్టుకుని చప్పుడుకాకుండా మాయమైన వాళ్ళని ఎరుగుదును. స్వతంత్ర దేవత కలకత్తా కాళికన్నా భయంకరమైనది. నిరంతరమూ సుఖ నైవేద్యాన్నీ అశ్రు అభిషేకాన్నీ కోరుతుంది. ఆమెను చివరిదాకా ఆరాధించగల జవసత్వాలున్నవాళ్ళు అరుదు. చాలామంది తమ ప్రత్యేక కష్టాల్లోంచి తప్పించుకునే స్వతంత్రాన్నే గాని, జీవితంలో ఆ దేవతను భరించలేరు.

మొదటి ముద్రణ చివర ఆ పైవాక్యం 2-12-30న వ్రాశాను. ఈనాడు 2-12-1940 న పదేళ్ళ అనుభవంతో, 'స్త్రీ' ని మళ్ళీ చదివి, నా అభిప్రాయాలు ఎక్కడ మార్చుకోవలసిన అవసరముందో చూశాను. ఈ పదిహేనేళ్ళలో ('స్త్రీ' వ్రాసింది 1925లో) చాలాదూరం ప్రయాణం చేశాను. (లోపల— బైటకాదు) ఏళ్ళలోకాక మనసుల్లో ఎదిగేవాళ్ళకి యీ ఆయాస ప్రయాణాలు తప్పవు.

అప్పటికన్న ఇప్పుడు నా బాధ్యత హెచ్చింది. ఇట్లాంటి రోజు వస్తుందేమో ననే చాలా యేళ్ళనుంచి నా భయం. ఎవరూ ఇష్టపడక, వెలివేసి, వదిలి వేసిననాడు స్వేచ్ఛాజీవి, ఏమి వ్రాస్తున్నాను, ఏమి చేస్తున్నాను అనే సంకోచం ఉండదు,

ఆకాలంలో నేను, నేను బ్రతకటం ఇష్టంలేని ప్రజలమీద దండెత్తి Self-assert చేసుకోవడమే ప్రధానంగా వుండేది. ప్రజలకి ఎంతకోపం తెప్పిస్తే నాకు అంత సంతోషం. నన్నెదిరించేవాళ్ళని అదరకొట్టడానికి ఎంత తీవ్రమైన మాటలూ శక్తి హీనంగా తోచేవి. అందువల్లనే ఆనాటి నా పుస్తకాలనిండా, అతి శయోక్తులూ One side Statements, ద్వేషంతో కూడిన తిట్లూ, అనవసర శృంగారమూ ఉండేవి. ఈనాడు ముఖాలతో, కంఠాలతో. ఉత్తరాలతో. మౌనంతో. నిశ్శబ్దంతో వ్రాయడానికి, అడగడానికివీలులేని పరిస్థితుల లోంచి. ఆతృతగా నన్నుప్రశ్నిస్తున్న వారున్నారనీ, నా మాటను విలవగా గ్రహించేవారు వొస్తున్నారనీ తెలీగానే కాళ్ళకి బంధాలు పడ్డాయి, నిర్విచారపు స్వేచ్ఛా ప్రయాణం ముగిసింది. అజాగ్రత్తగా ఏంవ్రాసి, ఏంమాట్లాడి, ఏం వ్రాయక, ఏంమాట్లాడక, Mislead చేస్తానో అని భయం.

నేను గర్విష్టినని. మాట్లాడననీ (Sincere) సిన్సియర్ గా (Complain) కంప్లెయిను చేసే వారికి (మాట్లాడడానికి యితరులు నా దగ్గరికి రాకుండా చెయ్యటానికి Scandals చెప్పే ప్రియమిత్రులకి కాదు) చెపుతున్నాను. ఎందుకు మాట్లాడనంటే, నిజం మాట్టాడనేమో ననే భయంవల్ల (నా అబద్ధం నాకు హానిచేస్తే భయం లేదు. ఇతరులకి హాని చేస్తుందని భయం.) తమకి తామే యోచించుకునేట్టు వారిని నా మౌనం నాకు, స్వల్పభాషణ వల్ల నేను చెయ్యగలిగితే వారికి ఎక్కువ ఉపయోగం వుంటుందనే నమ్మకంచేత- ఇదే సరైన మార్గమని గట్టిగా చెప్పడానికి నాకు అధికారం లేదని గుర్తించడంవల్ల ప్రజలమీద, వారి స్వంత అభిప్రాయాలమీదా. వారి స్వేచ్ఛమీదా నాకు గౌరవం ఉండటంచేత-ప్రతివారి మార్గమూ. సత్యమనే విశ్వాసం చేత, మార్గం కొంత కొంత సూచనలకే గానీ, యావత్తు నాకుగాక, ఇంకెవరికీ సరిగా సరిపోదు అని తెలీటం వల్ల-ప్రజలకు మొత్తంమీద యీ మార్గం మచిందని వ్రాయడమున్నా. ప్రత్యేకం ఒకరితో ఇది నీకు మంచిదని చెప్పడమున్నాఁరెండూ వేరే సంగతులు. వొచ్చిన కర్మమేమిటంటే, నాకు సంఘం మీద కోపం. వ్యక్తుల మీద యిష్టం. సంఘం (నాతో కలుపుకుని) నాకన్నా, చాలామందికన్నా బుద్ధిహీనమైనది, వ్యక్తులు నాకన్నా గొప్పవారూ లేరు. నాకన్న హీనులూ లేరు.

'స్త్రీ' అంతా జాగ్రత్తగా చదివాను. ఆచ్చు పొరపాట్లు తప్ప మార్చవలసిన మాట ఒకటీ కనబడలేదు-నీతి బోధించే వారిని తిట్టడానికి స్త్రీ పురుష ఆకర్షణ ప్రభావాన్ని అద్వితీయంగా పొగడడానికి, కొత్తమాటలు, గొప్పమాటలూ నేర్చుకోకపోతినే అనే చింతతప్ప.

మతాన్ని గురించీ, నీతిని గురించీ నా భావాలు విశాలం చేసుకున్నాను. కాని మతమూ, నీతీ, వేదాంతమూ మాట్లాడే మనుషుల్ని ఏ మాత్రమూ నమ్మవొద్దనీ, వాళ్ళ దగ్గర మతమూ, నీతి ఏ మాత్రమూ లేవని హెచ్చరిస్తున్నాను. స్వేచ్ఛని కావాలనే మనుషుల్ని పుస్తకాల్ని వొప్పుకోని వాళ్ళందరూ దుర్మార్గులు. కానిసలు, దొంగలు - సందేహ మేమాత్రమూ లేదు.

నా పుస్తకాలు (ముఖ్యం 'స్త్రీ') చదివి చెడిపోయిన వారున్నారని చాలామంది ఉద్దేశంలాగు కనబడుతోంది. చెడిపోవడమంటే ఏమిటి?- అనేమాట అటుంచి, ఆ చెడిపోయినవాళ్ళు ఒక్కరు నా కంట పడలేదు. ప్రస్తుతం ఏ మోహమూ, ఆకర్షణా లేకుండా అలవాటుప్రకారం నిష్కామ కర్మచేసే యీ సంసారులకన్న చెడిపోవడమనేది యెట్లా సంభవమో ఎంత యోచించినా నా మనసుకు అందటం లేదు. ప్రత్యేకించి యీ పుణ్యలోకంలో నా వొక్కడిదే పాపిష్టి మనసు కావచ్చు. అట్లా నా పుస్తకాలు చదివి చెడిపోయిన వాళ్ళే వుంటే ఎంత బాగుపడ్డారో!

ప్రపంచమంతా యిట్లా తమ కళ్ళముందు యిదివరకు మారదని అనుకున్న దానికన్నా చాలా ఎక్కువగా మారిపోతోవుంటే, దేశాలకి దేశాలు కొట్టుకుపోతుంటే యింకా పసుపు పారాణిలకోసం, అంటుతప్పాలమీద మెతుకులకోసం, సిగ్గుబిడియాల కోసం, గింజుకులాడే ముసలి అత్తల్నీ, శీల అశ్లీలాలకోసం తెలుగు కథకుల్నీ, బడి టీచర్లనీ, పత్రికా విమర్శకుల్ని చూసి నవ్వొస్తుంది, దిగులేస్తుంది.

పత్రిక కొనే ప్రతి మనిషీ వీరనుకునే అవినీతి కథలకోసమే కొంటున్నాడు. తెలుగువాళ్ళలో చదువు వొచ్చిన వాళ్ళంతా అవినీతివంతులులాగే వున్నారు. ఈ విమర్శకులు మాత్రం ఆ కథల్నే అరుసార్లు చదివి, అవినీతి కథలని పత్రికలలో వ్రాయడం యింకా మానలేదు. ఏం చేస్తాం? ఈ మ్యూజియము వస్తువులు పదేళ్ళలో మరీ అపురూపమైపోతాయి. చూసి నవ్వేందుకు ఎవరూ ఉండరేమో అనే దిగులుతో, ఇంకా పదేళ్ళపాటు మా ఆహ్లాదంకోసం బతకమని దీవిద్దాము.

'సెక్సు' అంటే జీవితపు సూత్రం. పిల్లల దగ్గర్నుంచి ముసలివాళ్ళయిందాకా, అందర్నీ, వాళ్ళకి తెలిసినా తెలియకపోయినా ప్రోత్సహించి పాలిస్తోంది. తమలో ఆ ప్రోద్బలం లేదని, అక్కర్లేదని. యెంత వంచనచేసుకునీ లాభంలేదు. జీవితం లేదు, మేము బతకటమే లేదు, బతుకు ముఖ్యంకాదు-అనుకుంటే ఎంతలాభమో Sex ప్రోద్బలం లేదనుకుంటే అంతే అర్థం. ఈ ఆకర్షణ వుందని నిష్కపటంగా అంగీకరించి .దాని నించి సౌఖ్యాన్ని సాధించిన వాళ్ళు ధన్యులు. అంత వున్నతమైన సాధన, అపూర్వానందం, ఇంక యేమీలేదు. దొంగనీతులకు, కీర్తులకూ పోయి ఆత్మ వంచకులైనంత మాత్రాన ఆ శక్తి వొదిలేదీకాదు. నిర్భాగ్యుల్నీ, నిస్సారుల్నీ, నిరర్థకుల్ని చేసి మరీ వొదులుతుంది.

బెజవాడ,
2-12-40. వెంకటుచలం.

## మూడో మాట

స్త్రీ పురుషానుభవం అమూల్యమని శృంగారపు విలువల్లో నమ్మి, తమ జీవితాన్నేగాక తక్కిన తమ సంబంధమైన జీవితాల్ని సుఖప్రదం చెయ్యాలనే దీక్ష వున్న వారికోసమే వ్రాశాను 'స్త్రీ', ఈ నా స్వేచ్ఛాబోధని అర్థం చేసుకోని, తప్పు అర్థంచేసుకునే ప్రజలకి వివాహ సంబంధం చాలా అవసరం. సంఘ నియమాల్ని నీతి నిబంధనల్ని చాటుగా, స్వార్థంగా, గిల్టీగా, apologetic గా కాక, సంఘం మీద అభిమానంవల్ల, మనసుమీద ప్రేమవల్ల ఎదిరించగల ధీరులు అవసరం. నా వ్రాతల్లో, సంఘం మీద ద్వేషమంతా సంఘంచూపే అజ్ఞానంలో, క్రౌర్యంలో, నలిగే మనుషులమీది ప్రేమ.

ఈ ఫిల్ములలో కథలలో, యువకుల వీరాలాపాల్లో వినబడే "వెధవ సంఘం, సంఘం మనబోటివాళ్ళకి లెఖ్ఖా! సంఘం మూర్ఖం" అనేమాటలు అర్థంలేనివే కావు, దుర్మార్గమైన మాటలు, ఆ సంఘం దయలేనిది ఆధారంలేనిది, ఒక్క నిమిషం నిలువలేని మనుషులే యీ మాటలనేది.

అమలులోవున్న కట్టుబాట్లకి యెదురు తిరగగల అవసరమూ, సామర్థ్యమూ వున్న మనుషులు ఏ కాలంలోనైనా కొద్దిమందే వుంటారు. తన తిరుగుబాటువల్ల

తనకిగాని, ఇతరులకిగాని మేలు జరగాలంటే తనుకోరే స్వేచ్ఛని అందరికీ అంగీక రించాలి. తన స్వంతవారిమీద తన అధికారాన్ని వొదులుకోవాలి. తన తిరుగుబాటు వల్ల వొచ్చే కష్టాల్ని గర్వంతో యెదుర్కోవాలి.

ఈ ప్రచారంవల్ల ప్రతి హృదయంలోనూ కొద్దో గొప్పో మార్పు కలిగి తీరుతుందనీ, కొత్తకోణం నించి చూడడం తెలుసుకుంటారనీ, మౌనంవల్లా, మూర్ఖంవల్లా, అజ్ఞానంవల్లా తాము యితరులకు, అసహాయులకు, బలహీనులకు చేసే అన్యాయం వ్యక్తమౌతుందనీ ఆశ. క్రమంగా ప్రజ కొత్తకాంతికి కళ్ళు తెరవ గలదని విశ్వాసం.

నాగరికత హెచ్చినకొద్దీ, పనులూ, ధ్యాసలూ, ఆశలూ యెక్కువైనకొద్దీ మనుషులుగా గుర్తించుకోవడం తగ్గిపోతోంది. "ఇది నా స్త్రీ" అనే భావంపోయి, ప్రక్కలో సుఖాన్నిచ్చే శరీరంగాకూడా దృష్టిపోయి, ఉత్తవొస్తువ, ఒక ఐడియా, యింకే దిక్కులేని ఒక జీవం అయిపోతోంది స్త్రీ. స్త్రీకి పురుషుడూ అంతే. తనకి తిండినీ నగలనూ, మర్యాదనూ యిచ్చే ఒక సాధనం- అంతే.

స్త్రీగా భార్యకి పురుషుడూ, పురుషుడుగా భర్తకి స్త్రీ, ఏమీ ఇవ్వలేక పోతు న్నారు. ఒకరి శరీరంమీదనైనా రెండోవారికి ధ్యాసేపోయింది. ఉత్త సిగ్గూ అస హ్యం, ఆవిధంగా తలుచుకుంటే ముఖ్యంగా విద్యా, మతమూ తెచ్చిపెట్టాయి. యిట్లాంటి దౌర్భాగ్యస్థితిని, సౌఖ్యమివ్వడానికి ధనమూ ఆస్తీ ముఖ్యమనుకున్నంత కాలమూ యింక ఏ విలువలకి స్థలముండదు, మనుషుల మనసుల్లో. తనను సృష్టిం చిన మన్నుతోటీ, తన కన్ను తెరచిన కాంతితోటి సంబంధానికి క్రమంగా దూర మౌతున్నాడు మానవుడు. ధనం లేనివాడు ఎందుకూ కొరగానివాడు, సుఖ మనుభ వించేవాడు పాపాత్ముడు ఔతున్నాడు ప్రజల దృష్టిలో.

ఏ కొత్తపద్ధతులు, ముఖ్యం సంసారం విషయమై మాట్లాడినా సరే పెద్దలు "లోకం ఎట్లా సాగుతుంది" అంటారు. "ఎవరూ పిల్లల్ని కనకపోతే లోకమెట్లా నండీ" అంటారు. ఆ ప్రశ్నకింక సమాధానం లేనట్టూ, ఆ లోకసంగ్రహభారం తమ భుజాలమీద మోస్తున్నట్టూ, "ఏం లోకంలోమనుషులు లేకపోతేనేం?" అంటే ఆ జవాబుని ఒక లెక్కలోకి తీసుకోకుండా తుడిచెయ్యడానికి ఏమాత్రమూ సంకో చించరు. ఎట్లాగో వచ్చాము ఇక్కడికి, రాకుండా వుండ లేక పోయినాము. కనుక

ఎట్లా సుఖపడాలో యోచిద్దాము. సుఖపడలేమా, ముందువాళ్ళకన్నా బాధలులేకుండా వాళ్ళని ఆపుచేద్దాం. "పుడితే ఈ సమస్యలుగాని పుట్టకుండానే వుంటే?" అంటు న్నాము, జన్మనిచ్చే శక్తిని ఆధీనంలోకి తెచ్చుకుని.

"ఎవరూ పేదతనంతో బాధపడకుండా చేస్తాను" అని సోషలిస్టు అంటే "సుఖపడడానికి వొచ్చామా ప్రపంచంలోకి!" అంటాడు మతం కిందికి మాటతో.

Men would rather die than think అంటాడు Betrand Russel. లోకం,సంసారం: ఆస్తీ, ఈనీతిపద్ధతీ.ఇవన్నీ శాశ్వతమైనవిషయాల్లాగు చూస్తారు- ప్రస్తుతం అమలులో ఉన్న విషయాలమల్లే కాకుండా. ఇంత వ్రాస్తున్నానేగాని కమ్యూనిజం వంటి గొప్పమార్పు వొచ్చి వరదమల్లే యీ చెత్తనంతా పూడ్చేసిందాకా యీ మనుషులు ఎట్లానూ కదలరు. ఎన్ని ఇట్లాంటి వ్యాసాలు వ్రాసినా, ఏ యుద్ధాలో, ఉద్యమాలో, కమ్యునిజాలో కదలించవలసిందే గడ్డ కట్టిన యీ సంఘాల్ని. ఇట్లాంటి వ్రాతలన్నీ అట్లాంటి గొప్ప మార్పులు రావ డానికి సోపానాలు. కమ్యునిజం వొచ్చి యీ గృహాలనే గూళ్ళని విధ్వంసంచేసి, యీ పూరగాయల గూళ్ళనీ, దేవుడి గదుల్నీ, వొంటిళ్ళనీ కూలతోసి Commor messesనీ, పిల్లలకి గొప్ప ఆట మందిరాల్నీ, విద్యాలయాల్నీ స్థాపించిందాకా ఒకళ్ళకొకళ్ళు పెనవేసుకొని ఒకరి రక్తాన్ని ఒకరు తాగుతో బతికే యీ భార్యా, భర్తా, పిల్లా, అత్తా, ముత్తవా, వితంతువా ఒకర్నొకరు హింసించు కోడం మానుతారా? తెల్లారిలేస్తే పప్పు, పిడకలు, మళ్ళు, చీదరలు, అలుకులు, అధికారాలు, మూలుగులు, ముడుకులు- ఇవన్నీ వొదిలి సూర్యోదయాన్ని చూసి నవ్వే మనో వ్యవధి, సంతోషం, ఉత్సాహం- ఎప్పుడు కలుగుతుంది మానవులకి!

ఈ దరిద్రపు చచ్చుబతుకుల్లో, ఒక సంసారంలోనే ఒకరిమీద ఒకరు అధికారాలు చలాయించు కుంటో, పూరికే ఇతరులది ఎట్లాగో తమదిగా ఇంట్లో పడేసుకుంటో, దాన్ని ఒక్కొక్కరే మళ్ళీ దాచుకుంటో, ఏడుస్తో తిట్టుకుంటో బతకడంలో ఉండే బాధ, నీచత్వం, ఇంకా దూరంగానన్నా రాలేదు మనుషుల మనసుకి.

బెజవాడ, }
27-7-45. }

వెంకటచలం

# చివరకీనాడు

"People would rather die- than not think"- Chalam.

మిమ్మల్ని చూడగా, చివరకి త్వరలో ఈశ్వరుడిలో కూడా నమ్మేట్టున్నారు అన్నారు ఓ మిత్రులు, కొత్తగా నేనీ వూరు వొచ్చిన రోజుల్లో, నన్ను కలుసుకోవాలని చాలా దూరంనుంచి నన్ను వెతుక్కుంటో వచ్చి.

ఈశ్వరుడు ఉన్నట్టు రూఢిగా తెలిస్తే నమ్మనా? అంతవరకు ఈశ్వరుడు లేనట్టూ రూఢిలేదు మరి; ఉంటే నమ్మడానికి నాకేం అభ్యంతరం? నా కళ్ళఎదుట సత్యమని నిలచిందాన్ని, ఎంత నష్టాని కోర్చి అయినాసరే, నమ్మి ఆచరించడమే నా నిశ్చయం: ఆ సత్యమనేది రూపాలు మారుతో వుంటే, ఇదివరకు నమ్మిన దానికి విరుద్ధమనిపించేది. ఈనాడు సత్యమని తెలిస్తే, దాన్ని నమ్మడానికే అభ్యంతరం లేదు. అందువల్లనే ఈ పుస్తకంలోనూ, తక్కినచోట్లా ఎప్పుడూ రాస్తున్నాను: ఏనాటికేది సత్యమని తోస్తే అది నమ్మడానికి ఎదురుచూస్తోండాలని, ఆ విధమైన Open- mindedness ఉండాలని.

చిత్రం, నా కథలకన్న, తక్కిన అన్ని పుస్తకాలకన్న ఈపుస్తకంఎక్కువ అమ్ముడుపోయింది. ఇరవై ఏళ్ళపైగా కొంటూనే వున్నారు; ఈ పుస్తకం చదివి నాకు వచ్చే ఉత్తరాలు ఈనాటికీ ఆగిపోలేదు, ఇంత సీరియస్‌గానూ, విరుద్ధంగానూ రాసిన పుస్తకాన్ని ఇంత ఆప్యాయంగా ప్రజలు చదివి నాకు ఉత్తరాలు రాస్తున్నారంటే, తెలుగు ప్రజల మేధాశక్తిమీద, జ్ఞానతృష్ణమీద ఎంతో గౌరవం కలగవొచ్చు, కాని నాకు వొచ్చే వుత్తరాలలో మూడు వొంతులు గర్భస్రావానికి మందో మార్గమో చూపమని డైరెక్టుగానో, సూటిగానో, నర్మ గర్భంగానో నన్ను అడిగేవి.

ఈనాడు మళ్ళీ ఓ ముందుమాట రాయాల్సి వచ్చింది. ఇదేనేను రాసే చివరి మాటేమో; ఇంక నేను రాయనేమో, నన్ను రాయనీయరేమో; నేను రాయకపోతే మునిగిపోయిందేమీ లేదు. ఈనాడు, చివరిసారి నేనేం నమ్ముతున్నానో, నేనెరగని మిత్రులెవరన్నావుంటే వారికి అచ్చుద్వారా వినిపిద్దామని- ఒకరున్నాసరే-లేరా?

పోసేండి. నాకు నేను రాసుకుంటున్నాను, నా దృక్పథం మారినప్పుడు ఎట్లా మారిందో ఈ పుస్తకంలో రాయడం నాధర్మం.

శిక్షణ ఆదర్శం అది అవసరం కాకపోవడం: అట్లానే ప్రభుత్వపు ఆదర్శం జైళ్ళు, కోర్టులూ అవసరం కాకపోవడం, వైద్యపు ఆదర్శం మందు అవసరం కాకపోవడం. స్త్రీ తాను కోల్పోయిన గౌరవ స్థానాన్ని తిరిగి పొందేందుకు ముఖ్య సాధనం తిరగబాటు. "తిరగబడి, నలిగి, తన జీవితం అర్పిస్తేనేగాని, పోయిన తన ఆత్మను తాను తిరిగి పొందలేదు" అని రాశాను.

తిరగబాటు ఆదర్శం తిరగబాటు అవసరం లేకపోవడం. టాగూరు అన్నట్టు తుఫాను ఆదర్శం శాంతి. ఈనాడు నేను సంపాదించుకున్న కొత్తజ్ఞానంతో (అజ్ఞానంతో అనండి, ఇబ్బందిలేదు. మనం జ్ఞానమనుకునే దానికన్న అజ్ఞానం ఎక్కువ జ్ఞానం) నవీన యువతీ యువకుల ఆశయాల్నీ, వాళ్ళ జీవితపద్ధతుల్నీ, చూస్తున్నకొద్దీ తిరగబాట్ల ఫలితాల్ని గమనించినకొద్దీ నే నీనాడు తెలుసుకున్న దేమిటంటే, తిరగబాటు పర్యవసానం ఇంకో తిరగబాటు అవసరం కావడమేనని.

ఓసారి ఓ అమ్మాయి వచ్చింది మా దగ్గరికి. ఇంట్లో తనని కష్టపెడుతున్నారనీ, స్వతంత్రమార్గం చూపమనీ అడిగింది. ఆమెను వెతుక్కుంటూ తండ్రి వొచ్చాడు. తండ్రీ కూతురూ ముఖాముఖిగా మాట్లాడుకున్నారు, రాజీ షరతు లేమిటంటే—

కుంకంబొట్టుబదులు వాదుబొట్టు పెట్టుకోనివ్వాలనీ, పాతకడియాల బదులు పాంజేవులు చేయించాలనీ.

ఆమె బానిసత్వమంతా యీ రెంటికీ స్వేచ్ఛ లేకపోవడమే. పెద్ద స్వతంత్ర యుద్ధాలలో కూడా ప్రత్యేక వ్యక్తుల ఆశయాలిట్లానే వుంటాయి.

ప్రత్యేకమైన హక్కుల కోసం తిరగబాటు చెయ్యడంవల్ల హక్కులు రావచ్చును కాని, ఆ హక్కులను పొందడంవల్ల సౌఖ్యంరాదు. అధికారం వల్ల కలుగుతున్న ఇరుకులోంచి ఆత్మవికాసం కోసం, అభివృద్ధికోసం, తిరగబాటు చెయ్యడం వొక్కటే హర్షణీయం. అప్పుడు స్వతంత్రత కోసం తను చేసే త్యాగాలుకూడా పుష్పాలుగా మారతాయి.

తనకి రావలసిన హక్కులకన్న, తను నెరవేర్చవలసిన బాధ్యతల పైన దృష్టి నిలపాలి. స్త్రీ బైటవున్న పరిస్థితులకన్న, తన చుట్టూవున్న వాతావరణం నించి కన్న స్వతంత్రమూ, శాంతీ హృదయంలోపల పలికినప్పుడే స్థిరంగా నిలుస్తాయి అవి. అత్త అధికారంనుంచి భర్త ఆధీనం నుంచి తప్పించుకుంటున్న నవీన స్త్రీ షోకులకీ, సంఘగౌరవానికీ, fashionsకీ, బానిస ఔతుంది. ఒక పురుషుడి నీడ కిందనుంచుని (ఆ పురుషుడికి బానిస ఐతేనేంగాక) లోకాన్ని ధిక్కరించగలిగే యిల్లాలు ఈనాడు సంఘగౌరవం పేర, విద్య పేర, ఉద్యోగం పేర, fashion పేర వెయ్యిమందికి దాస్యం చేస్తోంది. నవీన స్త్రీకి తనచుట్టూ స్త్రీ లందరూ అత్తలైనారు.

"తెల్లారిలేస్తే పిడకలు,మళ్ళు,అధికారాలు,అలుకులు ఇవన్నీవొదిలి, సూర్యోదయాన్ని చూసి నవ్వే మనోవ్యవధి, సంతోషం, ఉత్సాహం-ఎప్పుడు కలుగుతుంది మానవులకి!" అని అడిగాను wistfulగా,

తిరగబాటు వల్ల పిడకల్నీ, అధికారాన్నీ తప్పించు కోవచ్చు. అట్లా తప్పించుకున్నవారు ఆ స్వతంత్రాన్ని యితరుల స్వతంత్రానికి అడ్డుపడి అధికారాన్ని చలాయించడానికో, లేక తమదేహాన్ని latest fashion ప్రకారం అలంకరించుకోడానికేగాని, సూర్యోదయాన్ని చూసి హర్షించడానికి వినియోగించడంలేదు. ఇదివరకు అరుగుమీద కూర్చుని కూరలూ పచ్చళ్ళూ మాట్లాడే యిల్లాళ్లు ఈనాడు latest cinema scandals చర్చించడానికీ, తమ మిత్రుల శీలాన్ని పరీక్షించడానికీ సంభాషిస్తున్నారు.

సూర్యోదయాన్ని చూసి ఆనందించడం నేర్చుకోలేదుగాని, పిల్లలనించీ, పువ్వులనించి, ఆవుల్నించి, అతిథుల్నించి, ముద్దులనించీ, ఇతరుల ఆకలి తీర్చడం నించీ వొచ్చే శాంతినీ, ఉత్సాహాన్నీ పోగొట్టు కున్నారు.

జీవితం అనే Phenomena దేనికీ సంబంధంలేని వుత్త accident అనే దృష్టి ఎక్కువకావడంచేత, జీవితం అర్థవిహీనమై, ఇంత అసంతుష్టిని పుట్టిస్తోంది. ఈనాడు ఎవరైనాసరే , మనిషిలో యీ పై మనస్సేకాక, దానివెనుక అపారమైన జ్ఞానం మరుగుపడి వుందని వొప్పుకొనివారు లేరు. సత్యాన్వేషణ అంటే చివరి అర్థం తన లోపలి యీ సత్యానికి అన్వేషించడమన్నమాట. కొద్దో గొప్పో ఆవిధమైన దృష్టివొస్తే తప్ప ఏ సమస్యా తీరదు.

ఈ స్త్రీ పురుష సంబంధం ఎంత ముఖ్యమైనా, ప్రపంచంలో ఉన్న అనేక సంబంధాలలో సమస్యలలో ఇది వొకటి. ఏ ఒక్క సమస్య పూర్తిగా తీరినా తక్కినవన్నీ తీరినట్టే. ఎందుకంటే సమస్య అనేది బైటగాక, మనిషి మనసులో వుందిగనుక. ఇట్లా అనడంవల్ల నేనీ పుస్తకంలో ఏ వొక్కమాటా మార్చవలసిన పనిలేదు. అవన్నీ స్త్రీ నేర్చుకోవలసిన విషయాలే. కాని ఆ స్వేచ్ఛాయత్నంలో అసలు సంస్కారం ఎక్కడ జరగాలో అది మరచిపోకూడదు. నేను వ్రాసిన పుస్తకంలో తమకి ఉపయోగపడే వాక్యాలనే సంపూర్ణసత్యమని ఏరుకునే పొరబాటు చెయ్యకూడదు.

ఈ ప్రపంచ మహావృక్షంలో మనిషి ఒక ఆకు. ఆకు తాను విడికాదనీ, తన జీవనం, తన అందం, ఎండలో ఆడే సంతోషం, అన్నిటికీ మూలం చెట్టువేరు లోంచివొచ్చి తనని నింపే జీవన రసమని తెలుసుకున్న కొద్దీ, ఆ ఆకుకి వర్చస్సు, పుష్టి, సంతుష్టి. తనకీ, సృష్టిలో ప్రతిదానికీ, జంతువుకీ, చెట్టుకీ, సూర్యోదయానికీ బైట కనపడే సంబంధంకాక అసలు వీటన్నిటి ఉత్పత్తిలో వుండే సంబంధాన్ని తెలుసుకున్న కొద్దీ జీవితానికి అర్థమూ, అందమూ, సార్థకతా వ్యక్తమౌతాయి. ఈ పైపొరలలోంచి, ఈ తేలిక స్నేహాలలోంచి, ఎంతవరకు ఉపయోగం అనే దృష్టిలోంచి, స్వార్థమైన సంబంధాలలోంచి మనస్సు తప్పుకుని లోతైన బాంధవ్యానికి దగ్గరైనకొద్దీ, అందరిమధ్యా, అన్నిటిమధ్యా సమానంగా ఏకంచేస్తో విజృంభించే సృష్టిలీలని తెలుసుకున్నకొద్దీ కళ్ళు కొత్తకాంతికీ, సామరస్యాలకీ తెరుచుకుంటాయి.

పైపైన చూసినకొద్దీ సృష్టిలో ప్రతిదానికీ ఒకదానినుంచి ఇంకోదానికి భిన్నత్వం ఎక్కువగా కనపడుతుంది. లోతుగా చూడగలిగినకొద్దీ భిన్నంచెయ్యడానికి వీలులేని ఏకత్వం తోస్తుంది. ఆ ఏకత్వమే ఈశ్వరుడు. ఆ సత్యానికి దగ్గిరైనకొద్దీ భర్త ఆజ్ఞాపించడమూ వుండదు; స్త్రీ ధిక్కరించడమూ వుండదు.

అరుణాచలం,
20-9-62

చలం.

# ఇంకోసారి మళ్ళీ తప్పలేదు

పూర్వం చాలా ఏళ్ళు ఈ పుస్తకాన్ని అచ్చువేసే ధైర్యం ఎవరికీ లేక పోయింది. అచ్చయినాక చదవనీలేదు. అధికారమున్నవారు తమకి లోబడినవార్ని ప్రతిష్ఠనీ, నీతినీ కూడా ఆయుధాలుగా వుపయోగించారు. ఆ తరంవారు నామ రూపాలులేకుండా అణగారిపోయినారు. దేశ స్వాతంత్ర్యంతోబాటు అనేక సంస్కారాలు జరిగాయి. తత్ఫలితంగా స్త్రీల చేతుల్లోకి అధికారాలు కూడా దిగాయి. ఈనాడు కాగితాలపైన వున్న సంస్కారాలూ, విద్యాధికులమనుకొనే స్త్రీలు చలాయిస్తున్న స్వతంత్రాలూ చూస్తే ఈ పుస్తకం old fashioned గా కనబడుతోంది. ఈ పుస్తకంలో వాంఛించిన స్వేచ్ఛకి చాలా బాధ్యతలూ నియమాలున్నాయి. ఏ బాధ్యతలూ, నియమాలూలేని స్వతంత్రాన్ని దోచుకుంటోంది పురోగమించిన స్త్రీ.

ఇంటిదగ్గిర స్వేచ్ఛలేని డాక్టరుగారు ఒకరు అన్నారు, పూర్వం- "స్త్రీకి మనదేశంలో స్వేచ్ఛ లేదంటారు ...."

మనదేశంలో అనలేదు నేను. ఏ దేశంలోనూ లేదన్నాను.

"కాని చూడండి, అసలు ఇంటిదగ్గర ఆమెదే అధికారం"

అవును, మీ ఇంట్లో అంతే, ఇంటిదగ్గిరేం, బైటకూడా మీమీద ఆమెదే అధికారం, ఆమెకి బైట మీసు అందినంతవరకు,

"అంతేకాదు. స్వతంత్రం రాగానే, వెంటనే స్త్రీకి వోటునుదేశం యిచ్చింది."

వోటు వుండడం స్వేచ్ఛా చిహ్నం. కాని ఆ వోటును ఇష్టప్రకారం ఉపయోగించే స్వతంత్రం వుందా స్త్రీకి? పురుషుడికి వుందా? మీకు వుందా?

ప్రస్తుతం దేశంలో ప్రభుత్వపు కాయితాలలో స్త్రీకి సంపూర్ణ స్వతంత్రం వుంది. అంతవరకే.

కోర్టు కెక్కడానికి ప్రతి మనిషికీ స్వతంత్రం వుంది. కాని బీదవాడికి డబ్బు లేదు. నిష్పక్షపాతంగా తీర్పు చెప్పే స్వతంత్రం న్యాయాధికారికి త్వరగాపోతోంది.

ఆస్తినంతా లాగేస్తో, ఆస్తి హక్కును స్త్రీకి ఇచ్చి ఏంలాభం? బతుకే జాని సత్వంచేసి, భర్తనించి స్వేచ్ఛనిచ్చి ఏం లాభం?

ఒక భర్తనించి పారిపోయి, పదిమంది విటులచేత తన్నులుతినే స్త్రీకి ఏం స్వతంత్రం?

స్వేచ్ఛ రెండు విధాలు; లోపలిది, బైటది,

లోపలి స్వేచ్ఛ వున్నవాడికి బైటిస్వేచ్ఛతో పనిలేదు. అతనికి అంతా స్వేచ్ఛ. బైట స్వేచ్ఛ కావాలంటే ముఖ్యమైన అవసరాల్లో ఒకటి డబ్బు. లోపలి స్వేచ్ఛ లేకుండా, తన ఆశలతో, చీకట్లతో కోర్కెలతో గొలుసులు కట్టుకొన్న మనిషిని బైట స్వతంత్రం యింకా బానిసని చేస్తుంది. అట్లాగే యీనాటి స్త్రీ. పూర్వకాలపు స్త్రీ యెంత యిరుకైనా ఓ నీతికీ, తననుకున్న ధర్మానికీ,భర్తా, బంధువులూ, సంఘం- వీటికి బానిస. ఈనాటి స్త్రీ తనకి తనే బానిస. అంటే ప్రతిదానికీ బానిసే. ఆమెకి వొచ్చిన స్వతంత్రం మళ్ళా తన కాపరంనించే, ఆ గుంటలోంచి లేచి 'నేను' అనే అహంకారాన్ని పెంచుకుని, ఆ individuality నిలబెట్టుకునేందుకు, అవినీతికీ. success కీ, డబ్బుకీ, అధికారాలకీ, అన్నిటికన్న fashion, మర్యాద అనే రూపాల సంఘానికీ భరించలేని బానిస అయింది.

ఈ నూతన పరిస్థితుల్ని గమనించి వాటి ఆధారంగా బాగుపడదామని బయలుదేరిన స్త్రీలలో కొంచెంమంది, రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా ఉన్నత స్థానాల్ని అలంకరించారు. ఇంకా కొంతమంది రేడియో, సినీమా, యుద్ధ భూములలో తెగబడి, ఆ సమరంలో చాలా అవస్తలూ, నష్టాలూపడి, ఆత్మలూ, దేహాలూ అమ్ముకొని, ఏ అదృష్టంవల్లనో ఆ శిఖరాలకు చేరుకున్నారు. కాని బయలుదేరిన వెయ్యిమందిలో ఓ పదిమందన్నా కృతార్థులు కాలేదు. తక్కినవారికి అప్పుడే అనుమానం కలుగుతోంది, ఈ స్వేచ్ఛ Worthwhile ఏనా అని.

వంద ఏళ్ళక్రిందట బ్రిటిష ప్రభుత్వం ఉద్యోగాలకి తలుపు తెరిచినప్పుడు, పురుషుల జీవితపరిస్థితులలో కలిగిన మార్పు ఈనాడు స్త్రీలలో జరుగుతోంది. సంసార రక్షణ వొదిలి బైటికి పోగలిగిన పరిస్థితులూ, సామర్థ్యాలూ, ఇంకా కలగని స్త్రీలు తమ గూళ్ళలోంచి తొంగి చూస్తున్నారు, ఎప్పుడు ఎగిరి పోదామా అని. తమని బంధించిన గొలుసులు తుప్పుపట్టి ఊడిపోతున్నాయని గ్రహించారు.

స్వేచ్ఛతో వొచ్చిన బాధ్యతలూ, సమస్యలూ, జీవితాల్ని పిండి చేస్తున్నాయి. ఎక్కడా శాంతీ సుఖం లేకుండా వున్నాయి. Public Life పురుషుడి స్వభావానికి సహజం. రానీ రాకపోనీ. అతనికి అంతకన్న గతిలేదు. కానీ స్త్రీ స్వభావానికి విరుద్ధం. పురుషుడి అధికారంనుంచి తప్పించుకుని, పదవులకీ, డబ్బుకీ, బానిస అయింది స్త్రీ. ఎంత ఇరుకైనా ఆ పెళ్ళే నయమేమో అనే ఆలోచన వస్తోంది. కాని పెళ్ళికి వీరు వాంఛించేభర్త దొరకడు. ఏదో వోభర్తతో తృప్తిపడలేరు. భర్తని భార్యా, భార్యనిభర్తా, తమసాంఘిక ఆశలకు ఉపయోగించుకుంటున్నారు. కాని అప్పుడే కొందరు పురుషులుకూడా స్త్రీపైన తమకు పూర్వకాలపుఅధికారాలు లేందే, పెళ్ళి అట్టే ఆకర్షనీయం కాదనుకుంటున్నారు.

అదిగాక పెళ్ళి అనే కట్టుబాటూ, పిల్లలనే బాధ్యత, లేకండానే కాపరానికి స్త్రీలు దొరుకుతో వుండడంవల్ల పురుషుడికి పెళ్ళిఅవసరమూ కనపట్టం లేదు. ఆ విధంగా యింకా స్త్రీ మార్కెట్టులో చవకగానే వుండిపోయింది.

Fashion and Good name రెండే పరిపాలిస్తున్నాయి సంఘాన్ని. నీతి అనేది ఏ కోశానా influence చెయ్యటం లేదు. ఏదో ఓలాగు ఓ పురుషుణ్ణి పెళ్ళి అంటో చేసుకుని, ప్రతిష్ఠ అనే ఆయుధంతో అతన్ని పరిపాలనలో వుంచుకుంటోంది స్త్రీ.

పూర్వం స్త్రీ పురుషుల్ని ఒక వివాహబంధంలోవుంచిన ధర్మాలూ ఆదర్శాలూ, ఆకర్షణలూ, అనేక కారణాలవల్ల ఈకాలంలో లేకుండా పోయినాయి. ఇప్పుడు పెళ్ళి ఒక Career.

"ఏంచేస్తాం. ఏదో ఒక ఉద్యోగం చెయ్యాలి. ఓ ఉద్యోగమే దొరకాలిగాని" అని పురుషుడు అనుకున్నట్టే, స్త్రీకూడా-

"ఏం చేస్తాం. పెళ్ళిచేసుకోడమే బావుంటుంది. ఓ పురుషుడు దొరకాలే గాని" అంటోంది.

వివాహానికి వుండే పాతధర్మాలు పోయినాయి, కొత్తధర్మాలు రాలేదు.

ఉత్త స్వేచ్ఛవల్ల యేం ప్రయోజనం, ఆ స్వేచ్ఛవల్ల సుఖమూ, శాంతీ, ఆత్మవైశాల్యమూ కలగంది?

ఈ కొత్త స్వతంత్రం ఎంత భారమైనా పురుషుడి అధికారానికి లొంగివుండే పాతరకపు సంసారానికి స్త్రీ తిరిగి వెళ్ళడమనేది వుత్తమాట. పెళ్ళిచేసుకోడాలే తక్కువౌతాయి. ఇంక తలెత్తకుండా భర్తే దైవమని అతనికి వంటచేస్తో, తనని చూడకపోతే ఏడుస్తో, ఓమూల వంటింటో స్త్రీ పడివుండే పరిస్థితులు మ్యూజియంలో తప్ప కనపడవు. పెళ్ళి అంటే; అది సహకారసంస్థ అవుతుంది. పురుషుడు తన ఇష్టంవొచ్చినట్లు పిల్లలుకనేదానిగా చూడటానికి స్త్రీ యింక వొప్పుకోదు. రాజకీయ స్వతంత్రంతో యింతమార్పు స్త్రీ జీవితంలో కలగబోతోంది, యింకా కలగలేదుగాని.

ఈ మార్పువల్ల స్త్రీ పురుషులకి సుఖం కలుగుతుందా, ఎక్కువ అశాంతి కలుగుతుందా అనేది సర్వసాధారణంగా సంఘంలో ధర్మమూ నీతీ పరిపాలిస్తాయా, లేక ధనమూ, దొంగమర్యాదలే చలాయిస్తాయా అనేదానిపైన ఆధారపడివుంటుంది.

"స్త్రీని బైటికి రానిస్తామా?"

"స్వాతంత్రాన్నిచ్చినా హిందూ స్త్రీ సీతా, దమయంతుల పంథాని అనుగమిస్తుంది."

ఇట్లాంటి అరపులు తక్కువై పోయినాయి. ఈనాడు స్త్రీలను చూసి ఆ మాటలనడానికే సిగ్గుపడుతున్నారు.

సావిత్రి, చంద్రమతి, అనసూయ. వాళ్ళు బహిరంగ సభలు వేదికలనించి పతితలై యెక్కడా ఆశ్రయంలేక, ఇంక గతిలేదని యెంత అసహ్యంగా వున్నా, ఆలిండియో రేడియో వనితా విహారాల ప్రోగ్రాముల్లోకి పోయినారు,

కనక యికముందు కాపరాలు పేరుకుమాత్రం యేర్పడి, లోపల ఏ విషయమూ అనేది లేకండా, లోకంలో రొష్టుపడకండా, ఓ కప్పుకింద అప్పుడప్పుడు దంపతులు నిద్రపోయే స్థలాలకింద వుండవొచ్చు, ఇప్పుడే చూస్తున్నాం నలుగురిలో—

"My darling wife"

"My reverend husband"

అని పిలుచుకుంటో, ఇంటో తిట్టుకునే నాగరికపు జంటల్ని,

కాక ఈశ్వరుడే ఈ దేశాన్నీ, లోకాన్నీ ఆశీర్వదిస్తే,

హృదయాలు ఐక్యం కావడంవల్ల, యెవరూ యే హక్కుల్నీ, యే అధికారాన్నీ కోరనవసరంలేని, స్వార్థరహితమైన స్నేహమే ముఖ్యమై ప్రేమాలయాలు కాకుండా తయారు కావొచ్చు సంసారాలు.

అసలు ముందు స్త్రీ తనకి స్వతంత్రం కావాలనడం పారతంత్ర్యపు బాధలు పడలేదు గనక, గతిలేక దాంట్లోంచి తప్పించుకోవాలని పెనుగులాడుతుంది, ఆకాస్త పెనుగులాటకే పురుషుడు భయపడి horn బిగించాడు. తత్ఫలితంగా, అసలు బంధనాల్ని తెగతెంచుకుని బైటపడుతోంది. కాని పాపం స్వతంత్ర దేవత ఆమెని సుఖంగా తన బానిసని చేసుకుంది. గతిలేక యుద్ధంలోకి దిగిందేకాని, అమెకీస్వేచ్ఛ యేమీ స్వభావికం కాదు. తన భారాన్నీ బాధ్యతల్నీ తీసుకుని, దయగా చూసే పురుషుడికి, తనను అర్పించుకోడానికి యెప్పుడూ ఆమె స్వభావం సుముఖమే.

అన్ని దిక్కులా, అన్ని వ్యవహారాలలోను, ఏ నీతినీ పాటించక సంసారాలలో మాత్రం ధర్మం రాజ్యం చెయ్యాలని ఆశించడం అవివేకం. పురుషుడు తన లోకవ్యవహారాలలో యెప్పుడు ధర్మాన్ని వదిలాడో, అప్పుడే తన సంసారం యెడల ధర్మాన్ని వొదిలాడు. వొదిలి భార్య మాత్రం స్త్రీ ధర్మాన్ని పరిపాలించాలని ఆశించాడు. సాగలేదు, స్త్రీ ఎదురు తిరిగింది, భార్యాభర్తలు త్వరత్వరగా వారి ధర్మాల్ని మరుస్తో, తమ పిల్లల్ని మాత్రం ధర్మం తప్పితే శిక్షించేవారు. కాని అదృష్ట వశాత్తూ పెద్దలు వారి ధర్మాలేవో పూర్తిగా మరచిపోయినారు. కనక పిల్లలకి కూడా ఎట్లాగైనా ధనం సంపాయించే మార్గమే ధర్మ మార్గమని ఆదర్శంగా చూపుతున్నారు.

వ్యక్తిధర్మం సంఘధర్మం పోయి ప్రభుత్వధర్మం వొక్కటే మిగిలిపోయింది, వ్యక్తులకీ, సంఘాలకీ, తాము స్వయంగా ఆలోచించుకుని నిర్ణయించుకునే శక్తిపోయింది. మతంపట్ల అనుకున్నవన్నీ ఎగిరిపోయినాయి. చిన్నపిల్లలు పెళ్ళిళ్ళు వీల్లేదని ప్రభుత్వమంటే, నరకానికి పోతామనే భయాలు అడ్డురాలేదు, మనువూ, వేదాలు నోరు మూసుకున్నారు. ఆడపిల్లలకి కూడా ఆస్తి పంచడం న్యాయమని ప్రభుత్వం చెప్పాల్సివొచ్చింది. ఇదివరకు మూర్ఖమో, చాదస్తమో, ఒక నీతికి, ధర్మానికీ మతానికీ పట్టువుండేది. ఈనాడు తమకి ఏ ఆచారాలు నీతులు వుండాలో చెప్పమనీ, న్యాయచట్టాలు చెయ్యమనీ ప్రభుత్వాన్ని అడుగుతున్నారు.

తమ బతుకుల్ని నడపవలసిన నీతి సూత్రాల్ని మరిచి. అందుకే బతుకింత నిస్సార మయింది. ఇదివరకు భర్తను వొదిలి స్త్రీ యింకొక పురుషుడితో వుంటే, దాన్ని వ్యభిచారమన్నారు. ఈనాడు ప్రభుత్వం కోర్టుద్వారా యింకొకసారి పెళ్ళిచేసు కోవచ్చు ననగానే, ఆస్త్రీ పతివ్రత అయిపోయింది. డబ్బూ, పేరూ సంపాయించిన స్త్రీలు వారి సంసార జీవితం యెట్లావున్నా సంఘంలో యోగ్యులైనారు. పురుషుడు యెందరు స్త్రీలను పెళ్ళిచేసుకోవాలో, అతని ధర్మం ప్రభుత్వం చెపుతోంది అతనికి. ప్రస్తుతం రాజకీయాలూ, ధనం తప్ప యింకేం మిగలలేదు మానవుడి ప్రయత్నా నికీ, ఘనతకీ.

నీతీ, ధర్మమూ, ఆచారమూకూడా నేషనలైజ్ అయిపోయినాయి.

మీరు చూస్తో వుండగా, ప్రభుత్వం మీ కులాల్ని కలిపేసింది; అస్పృ శ్యులకి సలాములు చేయించింది; మీ ఆడపిల్లల పెళ్ళివయసు నిర్ణయించింది. స్త్రీలకి ఆస్తిహక్కుల్నీ, ఉద్యోగాల్నిచ్చింది, భర్తలనుంచి పూర్ణ స్వాతంత్ర్యాన్ని చ్చింది. ఎవరూ కుయ్యిమనలేదు.

నన్ను బహిష్కరించిన మీరు, ప్రభుత్వాన్ని బహిష్కరిస్తే మిమ్మల్నిచూసి ఎంత గర్వపడుదును?

ఎంత వెన్నెముక లేకుండాపోయింది మీ ధర్మం?

అరుణాచలం, }<br>31-12-56. } చలం

'స్త్రీ' పుస్తకానికి ముగింపులో చలం రాసినది—

## శృంగారం

శృంగారానికీ, ప్రేమకీ, ఇంత ప్రాముఖ్యం యిచ్చి ముగింపు వ్రాస్తున్నా నంటే, ఏం ఆధారం లేకండానే, వృత్తిగా వ్రాసే మాటలు కావు అవి. ప్రజలు సౌఖ్యాలకై ప్రయత్నాలు చేస్తారో, వాళ్ళ జీవితాల్లో వేటిని చూచుకొని మనుషులు సంతుష్టి పడుతున్నారో, గరవపడుతున్నారో- వాటిని కాద్దోగాపో్వ నేనూ అనుభ

వించి యెరిగినవి. డబ్బు, అధికారం, పదవి, కీర్తి, గొప్ప శీలం, మతం, ధ్యానం, కుటుంబం, Struggle and adventure, ఏ సందేహం, సంకోచం లేకుండా చాలా సిన్సియర్‌గా చెపుతున్నాను. శృంగారానికి సరిపొయ్యే అనుభవం ఎక్కడా దొరకదని. ప్రేమా? ప్రేమ దొరకడం చాలా కష్టం, దొరికినా అది ఒక అగ్ని, అదివొక తపస్సు. ఈ శిఖరాన్ని అందుకోగలిగిందాకా నరాల్ని గుంజి, నలిపి వ్యధపెడుతుంది; కాని దొరికిందా ప్రేమ గొప్పవరం, అంత బాధలోనూ, గొప్ప వీణారవం వినబడుతోనే వుంటుంది.

ఈ ప్రేమకన్న గొప్పది ఆధ్యాత్మికానుభవం అంటారు. ఆధ్యాత్మికానుభవం అంటే మతం, పూజలు, వేదాంతం ఇవేమీకావు. ఈ సన్యాసులూ, వేదాంతులూ, బైరాగులూ, ఎవరూ ఎరగని అమృతం అది. ప్రేమానుభవంకన్న గొప్పదనిపిస్తుంది. అది దొరికితే! కాని ఎవరికి దొరుకుతుంది? ఎట్లా దొరుకుతుంది? ఇంకేం చాతగాక ఆ ప్రయత్నమేదో చేస్తున్నాము, చేస్తున్నాము అది దొరకబోతుందని వెర్రిఆశలు, ఆత్మవంచనలు, పరవంచనలూ తప్పితే! ఆ నిజమైన ఆధ్యాత్మికానుభవమంటే తనని, తన ఆత్మో, ఏదో తను అనేదాన్ని ఈ విశ్వచైతన్యంతో ఏకం చెయ్యగలగడం - విశ్వగానంతో తన కంఠాన్ని మేళవించడం-తను తానని మరిచిపోయే చివరి ఐక్యాన్ని పొందడం-లోకంలోని ఆనందాన్నంతా తనదిగా అనుభవించడం -అది అందనప్పుడు అట్లా తనని మరిచి ఐక్యమయ్యే ఆనందం యీ ప్రేమలోనూ, కొంతవరకు శృంగారంలోనూ గాక ఎక్కడా దొరకదు,

ఇట్లా రెండోవారిలో ఐక్యంకావడం పురుషుడికన్న స్త్రీకి సులభం, అది ఆమె అదృష్టం. సులభంగా తన పురుషుడికి దైవత్వాన్ని ఆరోపించి అతనితో తన జీవితాన్ని ఐక్యంచెయ్యగలదు. దానినే పురస్కరించుకొని తనని నమ్మి ఆధారపడి ఆరాధించే స్త్రీని ఇంతచులకన చేసుకున్నాడు పురుషుడు. ఈ పనినే ఈశ్వరపరంగా చేసి గొప్ప భక్తులైనారు పురుషులు. ఈ ఐక్య ఆదర్శాన్నే పాతివ్రత్యమన్నారు పురాణాల్లో. ఈ ఐక్యాన్ని సాధించమన్నారు స్త్రీని. కాని నటించమనలేదు.

ఈ పెద్ద మాటలన్నీమాని వుత్తసంభోగం సంగతి యోచించినా దాంటోకన్న రెండుశరీరాలు ఎక్కువ ఐక్యమయ్యే పరిస్థితిని ఆలోచించుకోలేను.

ఆ సంభోగం మీద, రెండో వారిమీద భక్తీ గౌరవం వున్నకొద్దీ మనసులూ, అంతకన్న గొప్పశక్తులూ ఐక్యమౌతాయి, అందువల్లనే సంభోగాన్ని వుత్త అల

వాటు కార్యం క్రింద చేసుకున్న వాళ్ళంత దౌర్భాగ్యులు వుండబోరు. గొప్ప భావాలు కలలు, వాంఛలు ప్రజల్వించి సంతృప్తి నియ్యవలసిన సమయ మది. నేను వూరికే ఏదో మాటలు వ్రాస్తున్నాననుకోకండి.

ప్రేమలో, మోహంలో, శృంగారంలో, విశ్వాసం లేకపోయినా. అవి అందుకోవడం మీ చేతకాకపోయినా సంభోగం చేతనవుతుందిగా? దాంటో, దానిగొప్పలో అది యివ్వగల శాంతిలో విశ్వసించండి. సిగ్గూ, అసహ్యమూ, నీచత్వమూ మీ అంతరాంతరంగా కూడా వుండకండా తీసేసుకోండి. బతకడం అందుకోసమే: ఆ శాంతినీ, ఆనందాన్నీ పొందడమేననుకోండి, ఈ ప్రపంచంలో తక్కిన సుఖాలన్నీ చెత్త దానిముందు.

అంతేకాదు, నేనూ మీమల్లేనే యీ మోహం, స్వేచ్ఛ, యివన్నీ చాలా పాపా అని నన్ను నేను నిగ్రహించుకున్న రోజులున్నాయి. ఎప్పటికీకూడా నిగ్రహాన్నీ, మనసుచూపే నియమాన్నీ, ధర్మాన్నీ మీరడం వల్ల యే సౌఖ్యాన్నీ గొప్పగా పొందలేము. కాని ప్రేమకి, శృంగారానికి ఆటంకమయే యీ సందేహాలూ భయాలూ వుత్తవి, వాస్తవంకానివి, శక్తిహీనులు యీర్ష్యలవల్ల కల్పించినవి. పూర్వ కాలపు పరిస్థితులలో పూర్వయుగాలలో ఏర్పరిచినవి. అర్థంలేనివి. భీరులు తమ చచ్చు తనాన్ని సమర్థించుకునేందుకు, గొప్ప చేసుకునేందుకు కల్పించుకున్నవి.

యవ్వనంలోంచి పుట్టేవెలుగు మనుషులకీ, మనుసులకీ మెరుగు పెడుతున్న న్నాళ్ళు ప్రేమతో కవులూ, నాటకాలూ, సినిమాలూ కీర్తించే ఏదో abstract ప్రేమలో విశ్వాసముంచి వెతుకుతారు. మణుపు చివర ఎక్కడో దొరుకుతుందను కుంటారు. తాము అనుభవించేదే గొప్పది అనుకుంటారు. తృప్తిపడక ఇంకా వెతుకుతారు. కాని త్వరలోనే జీవితం హృదయాలమీద కొట్టే దుమ్మని తట్టు కోలేక తాను నమ్మిన కలలుకన్న ప్రేమ వుత్తమాయ అని అవహేళన ప్రారంభి స్తారు: ఎవరికో ఎప్పుడోగాని ప్రేమ అనేది తటస్థించదు. అది కలిగిన నిమిషాన, అదినిజస్వరూపంతో ప్రసన్నమైనప్పుడు ఏ కవులూ, ఏ కలలూ దానిఔన్నత్యాన్ని అందుకోనంత వెలుగులు కనపరుస్తుంది; కాలుస్తుంది. కాని ఎంత గొప్ప ఆనం దానికి, అతిమహి మలకి. ఐశ్వర్యాలకి, వెలుగులకి కళ్ళు తెరుస్తుంది!

# ముగింపు

ఈ విషయం అంతంలేనిది. నేను చెప్పదలచుకున్నది చెప్పాను. అనేక సంవత్సరాలనుంచి నన్ను కలవరపెడుతో, ప్రతి అనుభవంతోటీ ప్రతి సంవత్సరమూ మారుతూ వుండే నా వూహలను కొంతవరకు చేర్చి వ్రాశాను. కాని యివే వాస్తవమనీ యివే అనుకరింపతగినవనీ శాసించడంలేదు. ఈనాడు యివి నాకు తోచిన సత్యాలు. ముందునాటికి మారిపోవచ్చు. ఇతరులకిఇవి సత్యాలు కాకపోవచ్చు.

ఒకరికి ఉపయోగించిన పద్ధతులు తక్కిన ప్రజలందరికీ అనుకూలిస్తాయని అనుకోడమే, లోకంలో చాలా మూర్ఖానికీ, దుఃఖానికీ, బాధకీ కారణం. చాలా మంది ఈ పుస్తకం హానికరమనీ ఉన్మాదమనీ తగలపెడతారేమో! ఏ కొద్దిమందికో ఈ విధమయిన జ్ఞానం ఉపయోగించ వొచ్చు, వాళ్ళుకూడా యిదిచదివి, యెంత వరకు ఇట్లాంటి పద్ధతులు తమకి న్యాయమో, అనుష్ఠేయమో, ఆలోచించు కోవాలనే నా వూహ. అంతేగానీ ఇది ఒక సంపూర్ణమయిన System అని కాని, ఈ విధంగా లోకం మారాలనికాని, మారుతుందనిగాని నా ఆశయం కాదు.

ఈనాటికి ఈమార్గం, ఈపద్ధతులు నాకు మంచివని తోస్తున్నాయి, తప్పు కావచ్చు. కాని తప్పైనా, నామనస్సుకి తోచాయిగనుక, వీటిని అనుష్ఠిస్తే నూతన కాంతి నాకు ఇంకా కలుగుతుందనే నా నమ్మకం.

ఏ మనిషినో, పుస్తకాన్నో, ఆచారాన్నో గుడ్డిగానమ్మి పాతధర్మాలు పాత నీతివచనాలు ఏకరువు పెడుతో తిరిగే జడప్రాయులకు అభివృద్ధి సున్న. సాహసంచేసి, తమకి తోచిన తప్పు అభిప్రాయాలనైనా సాధన చేయగల వారికే అభివృద్ధి. స్వంతంగా ఆలోచించుకోవాలి. తప్పైనాసరే, అనుష్ఠించాలి సాహసంతో. బుద్ధికి అందినంతవరకూ యోచించాలి. మనకు తోచిందే మనకు సత్యం. ఎంతగొప్పవారైనా ఇతరులకి తోచింది మనకు సత్యంకాదు. అది మనకి కూడా సహజంగా తోస్తేనేకాని.

దూకేముందు చూడవలసిందేగాని, చూస్తో, ఆలోచిస్తో నుంచుంటే, అదే జడత్వం, అదే మృత్యువు.

నేనీ పుస్తకంలో చూపిన సంఘం లోపాలు, ఈ దేశస్థులలోనేకాదు, లోక మంతటా వున్నాయి. తరతరాలనుంచి పురుషుడు స్త్రీని చేస్తున్నది అన్యాయమే; ఆమె ఆత్మగౌరవాన్ని చంపాడు. స్త్రీ దాన్ని మళ్ళీ సంపాయించుకోవాలి. తనయిష్టం వచ్చినట్లు, తనకి తోచిన మార్గాన ఆమె తిరిగి తన గౌరవాన్ని పొందాలి.

అందుకు ముఖ్యసాధనం ఎదిరింపు. అన్నిటికీ, గృహానికీ, భర్తకీ పెద్దలకు, పురాతన ధర్మాలకు, బూజుపట్టిన నీతులను తన అభివృద్ధి కాటంకం కలిగించే ప్రతి సంస్థకూ తిరగబడి. నలిగి, తనజీవితం అర్పిస్తేనేగాని పోయిన తన ఆత్మను తను తిరిగి పొందలేదు. ఈ భయంలో, సిగ్గులో, బద్ధకంలో, బానిసత్వంలోంచి మేల్కొని, తన నిజమైన హక్కులను, స్వతంత్రాన్ని ధిక్కరించే లాక్కోవాలి. అప్పుడే తన ఆత్మని ధన్యంచేసుకుంటుంది, తక్కిన ప్రపంచాన్ని ఉద్ధరిస్తుంది.

ఈ పుస్తకం చదివి ప్రజలూ, సంఘాలూ చెడిపోతాయని కొందరంటారు. ప్రజల్నీ, సంఘాల్నీ పాడుచెయ్యగలిగిన శక్తిగలవాడనని నన్ను అనడం చాలా గౌరవం. కాని ఎవరూ పాడుకారని నాకుతెలుసు. నా పుస్తకం చదివినంత మాత్రాన, నా మాటల్ని నమ్మి, వినాశనంలో పడేటంత బుద్ధిహీనులు ఎక్కడా లేరని నా నమ్మకం. అంతకన్నా నా తోటి ప్రజలపైని నాకు గౌరవమూ, విశ్వాసమూవుంది.

ఏమన్నా సందేహాలు వుంటే నాకు వ్రాయండి.

రమణస్థాన్,
తిరువన్నామలై

గుడిపాటి వెంకటచలం.

# ఆనంద హారతి

హారతి అనగానే కర్పూర పరిమళం. జ్వాల ఆపైన అది ప్రసరించేవెలుగు వుంటాయి. ఎరుపు, పసుపు, అంత చిక్కదనం లేని కావి రంగుతో కూడిన నలుపు సుగంధాల్ని జిమ్మే ధూపం ఆ జ్వాల లక్షణాలు. మనం గంట వాయించి నమస్కారంచేసి హారతిచ్చి కళ్ళ కద్దుకుంటాం. పై దేశాలవారి దంతా కొవ్వొత్తుల వ్యవహారం. చలం మరణానంతరం తెలుగు దేశం అతనికి యిచ్చిన హారతిలో

అన్ని పరిమళాలూ షేడ్సు ఉన్నాయి. చలం హెడోనిస్ట్‌గా కనిపించిన వారు అతన్ని చూసి భోగి అన్నారు. తరవాత రాగి-విరాగిలావుండేచూసి "ఋషి" అయ్యాడన్నారు. రమణస్థాన్‌లో అతని చుట్టూవున్న ప్రశాంతిని గురించి ఆనంద సరసిలో బ్రహ్మానందంగా వున్నాడన్నారు. లోకానందంనుంచి బ్రహ్మానందానికి అతను వెళ్ళాడు గనుకే అతని కిచ్చిన హారతి ఆనంద హారతి. వీరులకి జయ హారతి అని యిస్తారు. శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి 'మహానుభావుడు' చలం అనే వ్యాసంలో "జయహారతి" అనదగినంత గొప్పగా చలం గురించి అతని ప్రాముఖ్యాన్ని గురించి ప్రస్తావించారు. ఆనంద హారతి అధ్యాయం చివరలో ఇదిగో యిది-

## రా. రా. జయ హారతి

ప్రమారు మూడు దశాబ్దాల పాటు తెలుగు జాతిని తట్టి, తిట్టి, ఊపి, నిద్ర లేపి, బాధించి, బోధించి, తన రచనల కొత్త కాంతితో కండ్లు చెదరగొట్టి కొత్త జ్ఞానంతో జీవితపు చీకటి కోణాలను వెలిగించి, కొత్త జీవితానంద జ్యోతులతో కాడిగట్టిన హృదయాలను ఉద్దీపింప జేసినవాడు చలం. తెలుగు జాతికొక కొత్త జీవిత దృక్పథం యిచ్చినవాడు, తెలుగు సాహిత్యానికొక కొత్త పరమార్థం కల్పించినవాడు, తెలుగు పాఠకుల కొక కొత్త చైతన్యం కలిగించినవాడు చలం. మానవుని యింద్రియాలకు సాధ్యమైన అనంత సుఖ పారవశ్యానికి తెలుగు వాని కన్నులు తెరచినవాడు, మానవుని మనస్సుకు సాధ్యమైన అపార సుందర జీవితానందానికి తెలుగు వాని హృదయాన్ని మేల్కొలిపినవాడు, పూల పరిమళాలనూ శుక్రుని కాంతినీ, గాలి మార్దవాన్ని, ప్రకృతిలోని అసంఖ్యాక సౌకుమార్యాలనూ తెలుగువాని భావుకత్వంలో మళ్ళీ ప్రవేశపెట్టినవాడు చలం. తెలుగు కవిత్వానికి కొత్త సౌందర్య స్వర్గ ద్వారాలు తెరచినవాడు, తెలుగు వచన సాహిత్యాని కున్న యిరుకు హద్దులు బద్దలుకొట్టి, తన కథలతో, నవలలతో, లేఖలతో, ప్రేమలేఖలతో దాన్ని ఆకాశమంత విశాలం చేసినవాడు చలం. ముసలితనంలో మూల్గుతున్న తెలుగు పదాలకు కొత్త జీవరక్తం యెక్కించి ఒక కొత్త వాడీ, వేడీ, ఒక కొత్త సౌరభమూ, సౌకుమార్యమూ యిచ్చినవాడు, తప్పటడుగులు వేస్తున్న తెలుగు వాక్యానికి ఒక లాఘవమూ, ఒక విలాసమూ, ఒక గడుసుదనమూ, ఒక జాణతనమూ

నేర్పినవాడు చలం. చలం గుర్తించక పోవచ్చు గానీ తెలుగు సాహిత్యంమీద చలం ప్రభావం అపారంగా ఉంది. చలమే లేకపోతే విశ్వనాథ సత్యనారాయణగారి కుళ్లు ప్యూడల్ చాతుర్వర్ణ్య భావాల దుర్గంధంతో తెలుగు సాహిత్యం ఇంకా కంపు కొడుతూ వుండేది. చలమే లేకపోతే జీవిత వాస్తవానికి దూరమైన గాంధీయిజం లాంటి యే కుహనా మానవతావాదమో తెలుగు సాహిత్యంలో రాజ్యం చేస్తుండేది. చలమే లేకపోతే తెలుగు సాహిత్యంలో సెక్సు ప్రసక్తి తేవడమే అవినీతిగా అసభ్యంగా యింకా పరిగణింపబడుతూ వుండేది. చలమే లేకపోతే సాంప్రదాయిక నీతులకు విరుద్ధంగా కథలు రాసిన కుటుంబరావు, గోపీచందూ, బుచ్చిబాబు మొదలైన వాళ్ళు సంఘనీతి పరిరక్షకభటులైన సాహిత్య స్వాములవార్ల నుండి యెన్ని బాధలు పడవలసి వచ్చేదో; ఆ బాధలన్నీ చలం ముందే పడినాడు గనుక ఆ బాధలు పడకుండానే వాళ్ళ కథలకు తెలుగుదేశంలో అనుకూల వాతావరణం యేర్పడింది. చలమే లేకపోతే తెలుగు సాహిత్యంలో స్త్రీ పురుషుల ప్రేమ బహుశా యింకా అడివి బాపిరాజు ప్రేమకథల స్థాయిలో వుండేది. చలమే లేకపోతే మన సాహిత్యంలో యింకా అనేక కుటిల నీతులూ, కూట ధర్మాలూ స్వైర విహారం చేస్తూ వుండేవి. చలమే లేకపోతే మన సాహిత్యం ఎలా ఉండేదీ ఊహించుకోలేనివాళ్ళు మన యిరుగు పొరుగు తమిళ కన్నడ సాహిత్యాలను — బహుశా ఒరియా మరాఠీ సాహిత్యాలను కూడా- పరిశీలిస్తే తెలుస్తుంది. చలమే లేకపోతే మన సాహిత్యంలో వాస్తవికవాదం యింత బలంగా వుండేదికాదు. (మన సాహిత్యం సకల కల్యాణ గుణాభిరామంగా వుందని కాదు నేనంటున్నది. మన వుత్తమ తరగతి సాహిత్యంలో వాస్తవికవాదం బలంగా వున్నదని మాత్రమే. లక్షమంది విశ్వనాథలు వచ్చినా యిక దాని పునాదులు కదిలించలేరు. అజ్ఞానపు టంధయుగంలో దేవుడూ, మతమూ, పరలోకమూ మొదలయిన విశ్వాసాలు జీవితంమీద కప్పిన మాయ ముసుగులను చీల్చి పారవేసి, గురువు, దైవం, రాజు, పురోహితుడూ, పతిదేవుడూ, భూదేవుడూ పితృదేవుడూ మొదలయిన భ్రమలన్నీ విదిలించుకొని, యేసుక్రీస్తు, భగవద్గీతలు, గాంధీమహాత్ములూ, జగద్గురువులూ మనకండ్లకు కట్టిన గంతలు బ్రద్దలుకొట్టి, జీవితాన్ని హేతుబద్ధంగా, శాస్త్రీయంగా, భ్రమరహితంగా పరిశీలించే వాస్తవిక వాదం— జీవితాన్ని దైవలీలగాకాక, కేవలం మానవ వ్యాపారంగా చూసే వాస్తవికవాదం— మనసాహిత్యంలో ప్రధాన ధోరణిగా వుంది. మన "వార"పత్రికల సాహిత్యంలో కూడా సమాజ సమస్యల చిత్రణలో వాస్తవికత ఉంటున్నది — వాటిని యెదు

ర్కోవడంలోనూ, పరిష్కరించడంలోనూ లేకపోయినా, మన సాహిత్యంలో లక్ష దుర్గుణాలు వున్నాయి.... శిల్ప సబంధమైనవీ, యితివృత్త సంబంధమైనవీ. కానీ, అన్ని దుర్గుణాలలోనూ జీవితాన్ని వాస్తవికంగా చూడగలగడం మన సాహిత్యానికి చలం యిచ్చిన వరం.)

మన సాహిత్యం మీద చలం ప్రభావం యెంత దృఢంగా ఉంది అంటే చలం మన ఆలోచనా ధోరణిలో ఒక విడదీయరాని భాగమైనాడు: మనరక్తంలో జీర్ణమైనాడు: మన సంస్కారంలో ఒక సంస్కారమైనాడు. అంటే తెలుగుదేశం చలంను యెప్పుడూ తృణీకరించలేదన్నమాట. మరి చలంకు జరిగిన అన్యాయం యెక్కడుందంటే సాహిత్య పీఠాలమీద కూర్చున్న సనాతన స్వాములవార్లు చలంను సగౌరవంగా గుర్తించక పోవడంలో ఉంది. చలంను గురించి ఒక సమగ్ర సాహిత్య పరిశీలనగానీ, ఒక సంపూర్ణ సిద్ధాంత పరిశీలనగానీ రాకపోవడమే చలంకు జరిగిన అన్యాయం.

ఆ అన్యాయాన్ని సవరించడానికే కొంతమేరకు యిప్పుడీ ప్రయత్నం!



తిరువణ్ణామలైలో చలం 'రమణస్థాన్'

ఆశాజనిత పవనోద్భూత
మనో తరంగ పరంపర శమిస్తేనే కాని
నిర్మల తేజో మండిత చిదాకాశం
మనో పారా వారంపై
ప్రతిఫలించదు.

తన్వీ,
మనో నేత్రాన్ని
తెరు!

# 6

# అరుణా 'చలం' పై

## అరుణ తార

'ఎర్ర శాలువ కప్పుకొని మా యింటి కొచ్చిందొక రివాల్వర్' అన్నాడు శ్రీ శ్రీ.

చలం ఎర్ర శాలువ కప్పుకోలేదు. అతను రివాల్వర్ అవునో కాదో కాని, శ్రీ శ్రీ మహాప్రస్థానానికి "యోగ్యతాపత్రం" యిచ్చినందుకు అతనికి రెడ్ శాల్యూట్ యివ్వాలి. చలం పోయాకకూడా గజం బద్దతో అతన్ని కొలిచీ, సిద్ధాంతాల తూకప్పు రాళ్ళతో అతన్ని తూచీ, ఎక్కడ విప్లవకారుడని అంటారో అని బెదురుతూ, ఫరవాలేదు, "రెబెల్" అనిమాత్రం వొప్పుకోడానికి సంజాయిషీలు పేర్చుకుంటూ, మనసు విప్పి మాట్లాడాలేని మార్క్సిస్టులంతా "రెడ్‌శాల్యూట్" కాదుగదా చలా

నికి ఎర్రశాలువా కప్పడానికికూడా సాహసించలేదు. వీరికంటే సంప్రదాయ వాదులే నయం, అతని ఆత్మశాంతికై ప్రార్థనలన్నా చేశారు. విప్లవాలొచ్చి ఆశించే వ్యవస్థ వచ్చేదాకా స్త్రీ సమస్యల్ని వాయిదా వేయలేకపోయాడు చలం - అదీ అతను చేసిన "పాపం". బానిసలకు బానిసై సర్వేసర్వత్రా హీనంగా నిమ్నజాతులకంటే. హరిజనులకంటే, యింకా ఎవరికంటేకూడా నీచంగా నిస్సహాయంగా బతుకుతున్న స్త్రీల గురించి అతను గొంతుక చించుకుని నరాలు తెంపుకుని రక్తంలో కలంముంచి సంఘాన్ని పొడిచి, సిరాపాశంతో దాన్ని బంధించి వుక్కిరి బిక్కిరిచేసి వదిలాక కూడా, ఒక అర్థశతాబ్ది ఒంటిరెక్కతో 'సతుల్ హితుల్ పోతేపోనీ, కష్టాల్ నష్టాల్ వస్తేరానీ' అంటూ లెక్కచేయక వీరుడై పోరాడాకకూడా, మమ్మల్ని ఫాలోఅయి మా కళ్ళజోళ్ళు ధరించి, మా థీరీల్ను మెళ్ళోవేసుకొని, మాజార్గన్ బట్టీ పట్టి, మా జాతర్లలో నువ్వెందుకు పులివేషం వెయ్యలేదని చలాన్ని తర్కించి, తిరస్కరించడం చరిత్రకు ద్రోహం చేయడమే తప్ప మరొకటికాదు, కాజాలదు.

"నే నేదో చేశాను, నా పని అయిపోయింది. నన్నే చేయమంటారే యింకా - మీరెందుకు ఆమిగిలిన పని చేయకూడదూ?" అని చలం అంటే—జవాబు చెప్పడానికి ఎవరిదగ్గరా యేమీలేదు. "నన్ను ఎస్కేపిస్ట్ అన్నవారినే, ఎస్కేపు దేన్నుంచి అని వారినే అడగండి" అన్నాడు సూటిగా చలం.

ఇండియాలోని కమ్యూనిస్ట్ పార్టీలన్నిటికీ ప్రజలతో కమిట్మెంటూ, ఏపాలసీ లేదనివారి రాజకీయాలే నగ్నంగా చాటిచెబుతున్నాయి. వామపక్ష రాజకీయపార్టీలను ఏ సిద్ధాంతమూ కట్టివుంచలేక పోతోంది. ప్రజలు వారి వెనుక లేరు. ప్రజలకు వారిపై విశ్వాసం పోయింది, నిజానికి ఏ పాలసీ లేని వీరికి— అబ్బూరి, చలం యిటువంటివారు పోయినపుడు మాత్రం ఆ పాలసీ ఏదో గుర్తుకువచ్చి పచ్చి వెలక్కాయ గొంతుక్కి అడ్డం పడినట్లు అవుతుంది. గురజాడ అప్పారావు సైతం ఓ పుంజీడు కథలు, ఓ గొప్పనాటకం, కాసిన్ని కవితలూ రాసిపోయినాడు గనుక బతికి పోయినాడుకాని, ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం గారికి 1909లో ఒక చరిత్రాత్మక లేఖలో వ్రాసినట్లు-

"నేను నమ్ముతున్నదేమిటంటే, ప్రస్తుత సాంఘిక శాసనాలు ఈ కామవిషయమై ఎవరికీ అందుబాటులో లేనంత కఠినంగా వున్నాయి, కనకనే నేరాలు మితి మీరిపోయినాయి. మనలో వాస్తవం వొప్పుకోవలిసిన కాలం వచ్చింది. ఇదంతా ఎందుకు వ్రాశానంటే నేను వ్రాయబొయ్యే నాటకం యీ సమస్యల్నిగురించి"-

అని ఆయన గనక ఆ నాటకం రాసివుంటే—(చలం అన్నట్టు—జీవితాన్ని చాలా సూక్ష్మంగా, ఆర్టిస్టిక్‌గా పరిశీలించి కొత్త వాఙ్మయానికి పునాది వేశారని నీతిని మూటగట్టుకున్న పత్రికలే పొగిడాయి. అప్పారావుగారిని; ఆయనను మెచ్చుకునేవాళ్ళలో చాలామందికి సరిగా ఆయన అన్నమాటల్నే నేనూ అన్నందుకే కోపం నామీద. నా వలెనే ఈయన దృష్టికూడా వ్యాధిగ్రస్తమేమో? సంస్కరించేప్పుడు తప్ప సాంఘిక చట్టాల్ని మీరడం నేరమన్నారు అప్పారావుగారు.) వివాహ బంధాన్ని తృణప్రాయంగా మీరేవారందరూ సంఘపూజ్యులే. సంఘానికి ముద్దుబిడ్డలు. ఇట్లా మీరే సంసారబంధంవల్ల లాభమేమిటనీ,యిట్లా మీర నవసరంలేకుండా మనుషులు దొంగలు కాకుండా సంస్కరించమన్నవాడు సాంఘిక, వాఙ్మయ; నైతిక బహిష్కారాన్ని పొందుతాడు. ఆయనా, ఆయన పద్యాలు. ఆయన నాటకం,ఆయన వంశం, అన్నీ తిట్లపాలయ్యేవి కదా?"

## కామాజిక చైతన్యం

చలం, శరత్‌కంటే, గురజాడ కంటె కూడా చాలా ముందుకు చూసి రాశాడు. అందుకు జీవితంలో రొష్టు పడ్డాడు. స్త్రీలను తిరగబడమని, సహించి వూరుకోవద్దని చెప్పినవాడు వీరేశలింగం, గురజాడ, శరత్ కూడా కాదు — చలమే! గురజాడని నెత్తిమీద పెట్టుకున్న మార్కిస్ట్ మేధావులు చలాన్ని hedonist అనీ, పలాయనవాది అనీ,అతని ఆలోచనలూ కళాసృష్టీ గీటురాళ్ళు కావనీ, ఏ సామాజిక పరిణామ క్రమంలో స్త్రీ విముక్తిసాధ్యమో గుర్తించలేదనీ, సెక్సే జీవితానికి మూలసూత్రంగా నమ్మాడనీ, సమస్యలన్నిటికీ పరిష్కారం కమ్యూనిజమని నమ్మి ఫాలో కాలేదనీ. వెక్కిరించి నిందించనేల? ఇంత నిర్మొహమాటంగానూ గురజాడనూ, శరత్‌నూ, వీరేశలింగాన్నీ విమర్శించరేమి? స్త్రీ సమస్యల జోలికి వారు వెళ్ళినా, కామ సంబంధమైన సమాజ శాసనాల మూలమట్టులను చలం కుదిపినట్లు వారు కుదపలేదు. గురజాడ ఏమంటున్నాడో వినండి— (చలం అనువాదం)

## గురజాడ దృష్టిలో స్త్రీ పురుష కామ సంబంధాలు

"వివాహ (sexual)బంధాలను ఇంతగొప్ప చెయ్యడంలో అర్థమేమిటి?సాంఘిక పరిణామంలో వివాహసంస్థయొక్క ప్రాముఖ్యతను నేను తగ్గించచూస్తున్నాననుకోకండి. గడచిన శతాబ్దంలో ప్రపంచం జ్ఞానంలో చాలా మారింది. వివేకవంతులైన మనుష్యులు పాత అభిప్రాయాల విలువను పరీక్షించడం ప్రారంభించారు. వివాహ

సంస్థ మానవాభివృద్ధికి తోడ్పడిన మాట వాస్తవమే కాని వివాహబంధం ఛేదించ- కూడదనే అభిప్రాయంవల్ల ఎన్ని చెప్పతరంగాని దారుణ కృత్యాలు తటస్థిస్తున్నాయో మరువకూడదు. అంతేకాదు ఇంగ్లీషువారిలో పెళ్ళి (సివిల్ కాంట్రాక్టు) చట్ట సంబంధమైన వొడంబడికగా వుంది. షెల్లీ జార్జి, ఇలియట్ దాన్ని తోసేసి తిరిగారు. (modern women will re write history )నవీన యుగపు స్త్రీ చరిత్రను పున ర్లిఖింప బోతోంది.

గొప్ప నవలలో ప్రేమకథ అపురూప మవుతోంది లేక ప్రాముఖ్యత లేనిస్థానా నికి వెడుతోంది. ఈ స్త్రీ పురుషుల ఆకర్షణవిషయమై వాఙ్మయం ఎందుకు అనంత మైన భేదాలతో చిత్రిస్తుంది? కామ(sexual) సంబంధమనే మాటను గమనించండి. శుద్ధ శరీర సంబంధాన్ని స్పష్టంగా చూపుతోంది. వాడిలిపోయిన యాభై ఏళ్ళ సుం దరిని యువకుడెందుకు మోహించడు? చక్కగా వికసించిన రోజా పువ్వువలె, బాగా వుడికే కూరవలె యవ్వనవంతురాలు యింద్రియాల్ని ఆకర్షిస్తుంది. పాచిన ఆహారం గాని, వాడిలిన పువ్వుగాని ఎంత అయిష్టమో ముదిరిన స్త్రీ కూడా అంతే. ముందెప్పుడో రొట్టె పాచిపోతుందనిగాని, రోజా వాడిలిపో తుందనిగాని అవి కొత్తగా. మనోహరంగా వున్నప్పుడు ఎవడన్నా అనుభవించడం మానుకుంటాడా? జీవితమూ, సౌందర్యమూ అశాశ్వతములనే వేదాంతం సరైనది కాదు. పైగా తరుణమందే అనుభవించాలనే అభిప్రాయానికి బలమైన ప్రోత్సాహ కారణమౌతుంది. పాపం అమితత్వంలోవుంది. అమితత్వం ఎక్కువకాలం ఎట్లాగూ దాగదు.

జీవితంలోనూ, వాఙ్మయంలోనూ కూడా మోహం తన ఉచిత స్థానాన్ని అధిష్టించాలి, ప్రస్తుతం దానికి అమితమైన ప్రాముఖ్యాన్నిస్తున్నారు. "కేటో" తన భార్యని ఎవరికో ఎరువిచ్చాడు. పురాణాలు చదవండి తెలుస్తుంది.

నిజంగా జరుగుతున్న సంగతుల్ని చూడాల్సి వొస్తుందని కళ్ళు మూసుకోవద్దు. డాక్టరులాగు కత్తితీసి పుండు కోసి పరీక్షించాలి. ఆశయంగా చూపించ తగినది మానవుడి ప్రేమ. క్రీస్తు బోధించిందిగాని, బోధించాడని అనుకునేదిగాని అదే. తన కవిత్వంలో షెల్లీ చాటింది ఆప్రేమే. జీవించే మతంకింద బుద్ధుడు బోధిం చింది ఆప్రేమనే. బౌద్ధమతాన్ని యేనాడు నాశనం చేసిందో ఆనాడే హిందూదేశం మతీయమైన ఆత్మహత్య చేసుకుంది.

ఈ ఆచారాలనే ఎర్రకాంతి పరిశోధనాలయం (laboratory)నుంచితొలగించి ఈ కామ సంబంధాన్ని పూర్తిగా, వివరంగా పరీక్షించాలని నాకోరిక. చరిత్రాత్మ జీవ శాస్త్రాత్మకంగా (bjologcally ) పరీక్షించి దానిని సరియైన స్థానాన్ని ఈ కామా నికి ప్రసాదించి తీరాలి.జీవితంలో యదార్థాన్ని మీరు ప్రేమిస్తున్నారు."సెన్టిమెంటు" లో యదార్థాన్ని యెందుకు ప్రేమించరు? పురుషుడి అధికారంకింద యెంత నీచమైన బానిసత్వాన్ని స్త్రీ అనుభవిస్తోందో నాకు తెలుసు. మీరు మాత్రం ఆలో చించుకోలేరా?

బీదలూ, కురూపులూ, దుర్మార్గులూ, బలహీనులూ ఐన భర్తల విషయమై ఆ భార్యలేమనుకుంటూ వుంటారో ఆలోచించుకోండి. మీ చుట్టూ కనపడే కుటుం బాలను "స్టడీ" చెయ్యండి.కురూపులూ, దుర్మార్గులూ, బలహీనులూ ఐన భార్యలో అంటారు మీరు. కానీ వారు పురుషుల బానిసలేకద. మనకన్నా ఆడవాళ్ళు ఎక్కువ పవిత్రతత చూపాలని విధిస్తున్నాము. దానివల్లనే యింత వ్యత్యాసం కలుగుతోంది. నిర్మలులు కాని పురుషులందరినీ మీరుద్వేషిస్తారనుకోండి పనిబట్టి. ఇంక మీరు ద్వేషించని స్నేహితులు ఎంతమంది మిగులుతారు? స్త్రీకి సాధ్యమయిన దానికన్నా ఎక్కువప్రజ్ఞను పురుషుడు కోరుతున్నాడుగనుక స్త్రీ భాధలు పడుతోంది. తనమనసు తీరేట్టు. స్త్రీ తనని పూజించడంలేదని పురుషుడు దుఃఖభాజనుడైనాడు. "జెలసీ" అంటే ఏమిటి? భర్త అందంగా లేడు, భార్య అతని రూపాన్ని యెట్లా మెచ్చుకుం టుంది? అందంగావున్న పరపురుషుని యెడల అనురాగాన్ని ఆపుకోలేదు. కానీ అట్లాంటిది మహాపాతకమంటారు మీరు. ఎంత దుస్సాధ్యం? భర్త చవట అయినా భార్యమాత్రం ఆయన మేథాశక్తుల్ని మెచ్చుకునే తీరాలి. ఇట్లా ఎంత వరకన్నా ఎన్నివిషయాల్లోనో వూహించుకోవచ్చు యీ అగచాట్లు.

జపానులో గెయిషా పద్ధతి సంగతి వినేవుంటారు మీరు. కామ విషయమైన నీతి జపానులో చాలా తక్కువ. కానీ వారి జాతీయతకిగాని, మతజీవనానికి గాని యే లోటూరాలేదు. ఆశ్చర్యం యేమిటంటే, ఆ దేశంలోనే ముఖ్యంగా గొప్పరాజ కీయ ఆదర్శాలున్నాయి.

సెన్టిమెంటు అవతలపెట్టి ఈ కామ విషయమై నా అభిప్రాయం యిదీ.సంఘం వల్ల విధింపబడిన చట్టాలు వున్నాయి. వాటిని మన్నించడం మన విధి. కామ వ్యవ హారాన్ని శాంతంగా నడిపించేందుకు అవి వుండవల్సిందే.

ర్యర్ధమే సాగించుకున్నాడు. - తన జీవితానికి ముఖ్యసూత్రం అర్ధంకాని అశాంతి అని తనే రాసుకున్నాడు ....చలం రచనలూ జీవితమూ అని రెండు గదులేవి లేవు... తన రచనలు ప్రజా సంస్కారణంకోసం కాదు, ఆత్మ సంస్కారణంకోసమే నని తనే అన్నాడు—' ఈ అభిప్రాయంతో కె. వి. రమణారెడ్డి ఏకీభవించ లేదు. 'ఇది పొసగని మాట తను అనే పదార్ధమేదీ తనీగా లోకంలో వుండదు. ఉన్నట్టని పిస్తుందేగాని ఉండలేదు. అతను కుటుంబజీవి, సంఘజీవి, నిర్దిష్ట దేశకాల పరిస్థితుల్లో మాత్రమే ఉండగల పదార్థం. భౌతికంగానూ, బౌద్ధికంగానూ అంతే.

నే నెవరు?తెలుసుకోమని రమణ భగవాన్ అడిగినట్లు గానే, అలాకాక మరో రకంగా కె. వి. ఆర్ 'తాను అనే పదార్ధమేదీ తనీగా లోకంలో ఉండదు. ఉన్నట్టనిపిస్తుందేగాని ఉండలేదు' అని చెప్పడంలో భగవాన్ గేలంలో చిక్కుకున్న చలం ఏ అద్వైతపు టంచుల వరకూ వెళ్ళారో అందాకా యీ మాట కూడా వెళ్ళింది.నే ననేది లేకపోయిన స్థితిమనస్సు అహంతను అణచిపెట్టేస్థితి. మనస్సు అణగారితే అంతా ప్రశాంతే. ఉన్నది లేకపోతే అంతా ఉన్నది అంటారు దీన్నే. మార్క్సిస్టులు యిక్కడ దాకావచ్చి మరో అడుగు ముందుకు వేస్తే శంకరుని అద్వైతంలోపడి శాస్త్రీయంగా మిగలకుండా పోతారనే జ్ఞానంతో బుద్ధి మార్గాన్ని ఆశ్రయిస్తారు. చలం బుద్ధిమార్గాన్ని భగవాన్ పాదాల చెంత విసర్జించాడు. మార్క్సిస్టులు అద్వైతపు అంచులదాకా రాకతప్పదు. అయితే అహం వదులుకోలేరు గనుక బుద్ధి మార్గాన్ని ఆశ్రయించి వ్యాఖ్యానిస్తారు. చలాన్ని అర్ధంచేసుకోవడానికి ఈ మార్గం సరిపడదు. అయితే తిరస్కరించడానికి మాత్రం పనికి వస్తుంది.

'చలానిది స్వానుభవ పూర్వకమైన తత్వమే గాని, అనుభవాత్ పూర్వమే నిర్ధారితమైన తత్వంకాదు'అని కె.వి.ఆర్ అన్నారు. ఇదిచలం తనమీదతాను తిరగబడ్డాడని చెప్పిన దానికి ఉత్తర వాదనే. 'చలంది తన స్వభావానికి సరిపడిన సొంత మతమే' నని తీర్మానించారు. స్త్రీ సంరక్షణ సంకల్పం చలంలో స్త్రీ స్వేచ్ఛాయజ్ఞంగా మారింది. ఇంకా తన వ్యాసంలో—'వీరేశలింగం వితంతు స్త్రీని వ్యాపార వస్తువుగా తప్ప మానవిగా చూడలేదు. రఘుపతి వెంకటరత్నం స్త్రీని ఒక భావంగా గౌరవించాడు తప్ప దగ్గరకు తీయలేదు. సంస్కరణోద్యమం, ఫలితాలలో మాత్రం స్త్రీ హృదయాన్ని తాకలేదు. చలం దాన్ని చేజిక్కించుకున్నాడు.' యింతవరకూ కె. వి. ఆర్. ఆ చారిత్రక దశను చక్కగా గుర్తించారు. కాని

చలం నిర్వహించిన చారిత్రక కర్తవ్యం అంచనా కట్టడంలోనే ఎవరి విభేదాలు వారి కున్నాయి. ఏ రచయితా ఏ సంస్కర్తా ఏ మహానుభావుడూ సాహసించి అందివ్వలేని అభయహస్తాన్ని కరుణతో ప్రేమతో 'స్త్రీ'కి అందించి ఆమె చుట్టూవున్న ముళ్ళకంచెలను తన రచనలనే గండ్రగొడ్డళ్ళతో ఛేదించ సాగాడు. చలం 'మేన్ అండ్ వుమన్' ఆంగ్లవ్యాసం చదివినవారికి స్త్రీ తరపున వకాల్తా తీసుకుని అతను చేసిన వాదనలో, ప్రదర్శించిన విషయాల్లో సమాజం సిగ్గుతో తల వాల్చుకో వలసిన నిప్పుకణికల్లాంటి నిజాలు కన్పిస్తాయి. ఈ వ్యవస్థలో పెళ్ళి, తద్వారా ఏర్పడే నిర్బంధ దాంపత్యం, స్త్రీ పరాధీనత, పురుషుడి దుర్మార్గం, చివరికి స్త్రీ దాస్యానికి కినిసి చలం ఒక ఉటోపియాను కల్పన చేశాడు. చలం కల్పించిన ఉటోపియాలోని ఆదర్శ స్త్రీ పురుష సంబంధాలు ఈ క్రింది నియమావళికి కట్టుబడి వుండాలి.

## చలం ఉటోపియా

ఒకటి—స్త్రీకి యిష్టంలేనిదే పురుషుడు బలవంతం చేయరాదు.

రెండు—పురుషునికి యిష్టంలేని స్త్రీ ఆ పురుషుని బలవంతం చేయరాదు.

మూడు—ఒకసారి ఒక స్త్రీని అనుభవించినవాడు ఆ సంగతి ఆమె లేనపుడు ఎక్కడా బహిర్గతం చేయరాదు.

నాలుగు—ఒక స్త్రీ ఒకసారి ఒక పురుషుని అనుభవించినపుడు దాన్ని ఆసరాగా చేసుకుని ఆ స్త్రీని ఆ పురుషుడు ఎప్పుడూ బలవంతం చేయరాదు.

అయిదు—ఒక స్త్రీ తో అనుభవం పొందినపుడు ఒక పురుషుడు అంతకు ముందు తను అనుభవించిన స్త్రీ సంగతిని తన ప్రియురాలితో వివరంగా చెప్పాలి.

ఆరు—ఎట్టి పరిస్థితిలోనూ, తనకు వివాహమైన సంగతిని పురుషుడు కాని, స్త్రీ కాని దాచిపెట్టి, మరొక స్త్రీని గాని, పురుషుని గాని అనుభవించరాదు.

ఏడు—ప్రియురాలి దగ్గర ప్రియుడు కాని, ప్రియుని దగ్గర ప్రియురాలు కాని ఏ పరిస్థితులలోనూ బలవంతంగా కాని, ఐచ్ఛికంగా కానీ డబ్బు స్వీకరించరాదు. అబద్ధం చెప్పరాదు.

ఈ ఉటోపియాను 'ఫ్రీ లవ్ సొసైటీ' అన్నారు. చలం తలపెట్టిన స్త్రీ స్వేచ్ఛా యజ్ఞానికి ఈ నియమావళి ఒక ప్రాతిపదిక. ఇది ఎప్పుడూ ఆచరణ లోకి రాలేదని కూడా అంటారు.

చలంగారు తలపెట్టిన స్త్రీ స్వేచ్ఛా యజ్ఞంలో భాగంగా—యిలావుంటే స్త్రీ పురుష సంబంధాలు బావుంటాయని 'ఫ్రీ థింకర్స్ సొసైటీ' లా ఏర్పడి సుమారు ఇరవైమంది చర్చలు జరిపేవారు. ఆ చర్చలు మచ్చుకి- ప్లేటానిక్ లవ్ స్త్రీ పురుషుల మధ్య సాధ్యం కాదని ఆ మాటను వెక్కిరింతగా వాడుతూ వుంటారు. ఎందుకని సాధ్యంకాదు అనేవాడు చలం. ఇది నాది అనుకునే Posessive Ins – tinct ఒకటే. అదే పరమావధా జీవితానికి? రొమాంటిక్‌గా వుండటం జీవితానికి ఎక్కువ ఉత్సాహాన్నిస్తుంది, ఫలానా ఆవిడ ఆరాధిస్తున్నది అనే భావన మంచి ఉద్దీపనాన్ని కలిగిస్తుంది మగవాడిలో. ఒమర్ ఖయ్యాం ముసలివాడు- సాకీ పడుచు పిల్ల. రుబాయీలు వచ్చాయి. ఇది పరస్పరారాధన, మ్యూచువల్ వర్‌షిప్ కాదా - ఇలాంటివే జరిగేవి ఫ్రీలవ్ సొసైటీలో చర్చలు. గాలి బాలసుందరరావుగారు, గోరా శాస్త్రిగారు, పెద్దిభోట్ల చలపతిగారు ఖాసా సుబ్బారావుగారుసభ్యులుగావ్యవహరించిన రెండవ ఫ్రీ లవ్ సొసైటీకి మద్రాస్ రాజధాని అయితే మొదటి ఫ్రీ లవ్ సొసైటీకి గుంటూరు కేంద్రం అని చెబుతారు.

ఆచరణలో అన్ని సిద్ధాంతాలు దిగజారి కలుషితం అయినట్టే ఈ ఉటోపియాకూడా చిల్లి జావకారి పోయింది, ఈ సొసైటీలో ఇద్దరు ముగ్గురు స్త్రీలు కూడా వుండేవారు. వారంతా చలాన్ని అపారంగా అభిమానించి ఆరాధనాభావంతో చూచే వారు. ఈ స్త్రీ స్వేచ్ఛా యజ్ఞానికి లెనిన్ తిరస్కరించిన గ్లాస్ ఆఫ్ వాటర్ థియరీకి ఏమీ పోలిక లేదు. అయితే యీ రెండు థియరీల్లోనూ Possesive instinctని స్త్రీ నాది అనే భావాన్ని తిరస్కరించడం మటుకు వుంది. ఆ రోజుల్లో కమ్యూనిస్టు మేధావులు చలం Ante theisis to society అని ఆశ పడ్డారు. దాని కోసం చలం నుంచి Synthesis వస్తుందని ఎదురు చూశారు. కాని చలం వారు అనుకున్నట్లుగా కాలేదు. 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అని చలం అద్వైతాన్ని పట్టుకు కూచున్నాడు. ఆయనలో అటు అద్వైత్య మార్గము వుంది, యిటు భక్తి మార్గమూ వుంది. వైష్ణవ మధురభక్తి సంప్రదాయాల్నికూడా ఆయన ఆకళింపుచేసుకున్నాడు. ఇంతతాత్విక పునాది వున్న చలం గతితార్కికభౌతికవాదాన్ని కాని మార్క్సిజాన్ని కాని ఆశ్రయించడం అసంభవం.

'పెళ్ళిలేని వ్యవస్థ ఒకటి కావాలి. భర్తల్లేని వ్యవస్థలో ప్రేమికులు, భార్య ల్లేని వ్యవసలో ప్రేయసులు, దాంపత్యం లేని వ్యవస్థలో శృంగారం—యిదిచలం కల'-అంటున్నారు కె.వి.ఆర్. పెళ్లి-మోసం పెళ్ళి-కపటం, పెళ్ళి-దగా, పెళ్లి-వంచన, పెళ్లి-నిర్బంధం వ్యభిచారం అని చలం గొంతెత్తి అరిచాడు. పెళ్లిలోని దుర్గంధాన్ని భరిస్తూ తిట్టుకుంటూ కొట్టుకుంటూ యిష్టంలేని కాపురాలు చేసేకన్నా తేచిపోయి కొన్నాళ్ళయినా అమృతం చవిచూస్తూ అద్భుతమైన ప్రేమా, శృంగారాను భవాల్ని పొంది ఆ పైన ఏమయితేనేం? అది చాలదా అనే వరకూ వెళ్ళాడు. అయితే యీ అద్భుత ప్రణయాన్ని, అసాధారణ శృంగారానుభవాన్ని, దోసెళ్ళతో ప్రేమా మృతాన్ని గ్రోలడాన్నీ అందరూ కోరుకుంటారా? ఇరుకు గదుల్లో మురికి మనసు లతో ఏదో పాపం చేస్తున్నట్లు పది నిమిషాలు కుతి తీర్చుకునే సంసారులకు, మర్యా దస్థులకు దివ్యానుభవాలు, అమృతాభిషేకాలు, ప్రేయసుల చేలాంచలముల కొన గాలుల విసవిసలు ఎందుకు? స్త్రీ వ్యక్తిత్వానికి ఆమె అభిజాత్యానికి అవమానకరం కాని సెక్స్ సంబంధాలను చలం అవలోకించగలిగాడు.

జడమైన జీవితాల్లోకి చైతన్యవంతమైన శృంగారాన్ని ఆహ్వానించాడు చలం. అతని ఫ్రీ లవ్ సొసైటీ 'మేనిఫెస్టో' అందుకు నిదర్శనం. సమసమాజం ఏర్పడ్డాక అందరి భౌతిక అవసరాలు తీరాక, కొన్నాళ్ళు యథాస్థితినే కొనసాగిం చాక- అప్పుడు స్త్రీ సమస్యలను చక్కబరుస్తామనే కమ్యూనిస్టుల ఉటోపియాను నమ్మి-సర్వం పార్టీ శరణం గచ్ఛామి- అని వూరుకోవాలా? ఆకలి బాధని హర్షించిన కమ్యూనిస్టులు శృంగార బాధల్ని చూసి బూర్జువా బాధలని వెక్కిరిస్తారు. కమ్యూ నిస్ట్ సమాజం ఏర్పడిన తరువాత స్త్రీ సమస్యలనేవి వుండవు. అన్నీ వాటంతటవే సర్దుకుపోయి శ్రీ వైకుంఠంలా వుంటుందని నమ్మి పార్టీ చెప్పినట్లు నాయకులు చెప్పినట్లు నడుచుకో నుంటారు. స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ పురుష సెక్స్ సంబంధాల విష యంలో కమ్యూనిస్టులు కూడా బధిరాంధులు. ఆర్థిక సమస్యను సరిచేస్తే స్త్రీ పురుష సమానత్వం సిద్ధిస్తుందని వారు భావిస్తారు. అన్ని సమస్యలకూ అది చరమ పరిష్కారం, చింతామణి వంటి దివ్యౌషధం, అని నమ్మమంటారు. చలం విప్లకారుడా రెబెలా అని మార్క్సిస్ట్ పండితులు వాదించుకోవడం చూస్తే ఫలానా కవి నియోగా వైదీకా అని పూర్వం మనవారు వాదించుకోవడం గుర్తుకు వస్తుంది. తమ ఆధిక్య తను, తెలివినీ, ఆడంబరాన్నీ ప్రదర్శించుకోవడానికి మాత్రమే యీ శబ్దతుల్య మైన చర్చ.

"మొనోగమీ"లోని లోపాలను చలం చూపినంత బలంగా మరే తెలుగు రచయితా చూపలేదు. అని కె.వి.ఆర్. ఒప్పుకుంటూ రొమాంటిక్ భావావేశంతో ఇంత బరితెగించిన భావ కవీలేడు, అని కితాబిచ్చారు. దుఃఖిత స్త్రీల పట్ల 'నైట్ ఎర్రాంట్ లా 'సర్ గలహాడ్'లా చలం అయాడన్నారుకాని కమ్యూనిస్టులుకాని, మరెవరూ కాని ఎందుకు కాలేక పోయారు? చలం సర్ గలహాడ్ అయితే డాన్ క్విగ్జోటు అయే అవకాశం కమ్యూనిస్టులకు మిగిలిపోయి వుందే?

—'వంటి రచనలతో చలం సాహిత్య వృక్షాన్ని ఒక వూపు వూపాడు. అది వూపుగాదు సుడిగాడ్పే. ఎక్కడి జీర్ణపత్రాలక్కడ రాలిపోయాయి. ఎక్కడి పుచ్చు అక్కడ వూడిపోయింది.-' అని సాహిత్య పరంగా చలం కృషిని కె. వి. ఆర్. గుర్తించి ప్రస్తుతించారు.



'గిడుగు వ్యావహారికం నవ్యసాహిత్య పరిషత్తుపండిత కవిపరిధిలో మడిగట్టుకు కూర్చుని, జంకుతూ కొంకుతూ అభినవ గ్రాంధికమౌతున్నప్పుడు చలం వచ్చి దాన్ని యీ కొత్త చెరసాలనుంచి విడిపించాడు. నురుగులు కక్కుకుంటూ వంపులుతిరుగుతూవన్నెలూ వగలూచూపుతూ అది'పాండిత్యం' వంటింటినుంచి బయటపడి'పరుగోపరుగో' అన్నకుంచే లైంది, అన్నారు తమ వ్యాసంలో. ఇది. చాలదా? తక్కువ కృషా? చలం విప్లవ వీరుడనే బిరుదాన్ని పొందడానికి అయోగ్యుడని చెప్పడానికి మార్క్సిస్టు మేధావులకింత తహతహ ఏల? ఏదో వంకన కండెమ్ చేసి తమ సైద్ధాంతిక ఆధిక్యతను ప్రదర్శించుకోవాలనే సినికల్ వాంఛతప్ప- మానసిక ఔన్నత్యం కొరవడిన వారికి సైద్ధాంతిక ఔన్నత్యచ్ఛాయలే గతి.

చివరలో చలం కృషిని సమీక్షిస్తూ కె. వి. ఆర్:

"చలం 'విప్లవమే' తెచ్చాడా, తిరుగుబాటే చేశాడా అంటే- !నేను చెప్పే దాంట్లో అంత విప్లవకరమైందేమీలేదు" అని తానే జవాబిచ్చుకుంటున్నాడు. మొత్తానికి, బలమైన భావ పరివర్తన కలిగించాడు. ఐతే అది వికటరూపం ధరించి, 'కౌంటర్-ప్రొడక్టివ్' గా పరిణమించింది. తాను కోరింది 'వ్యక్తి స్వేచ్ఛ'ను. కోరినపద్ధతి సమాజంమీద తిరుగుబాటు, ముఖ్యంగా భూస్వామిక యుగం వేసిన కుక్కమూతి పిందెల్ని చలం కత్తివాటితో దూసివేశాడు. యూరపియన్ రినేజాన్సు సమయంలో లాగా, "అంతరాత్మ' ప్రకటన, సామాజిక పురోగమనంలో ఒక కొత్తయుగానికి ఆహ్వానం, అయితే చలం మనసారా కోరుకుంది పారిశ్రామిక యుగానికంటె చాలా వెనకటి సమాజాన్ని: స్త్రీ పురుషులు చీకుచింతా లేకుండా చెయ్యిచెయ్యీ పట్టుకుని వాగుల వంక పొలాల వంక పరుగెత్తి, పోయీ పోయీ 'ప్రకృతి' ఒడిలో క్రీడిస్తారు, సుఖిస్తారు. ఆస్తి, దురాశ ఆడంబరం, వుండవు. సమాజ శాసనాలుండవు. సమాజం పేరున శాసనాలుండవు. వ్యవస్థీకృతమైన చదువు సంధ్యలుండవు. అదిమత్వం-అకృతిమతవం-సరళత్వం-సౌఖ్యం-సంతృప్తి -ఇదెక్కడి లోకం, ఎప్పటి లోకం?"

చలం విప్లవకారుడు ఎంతమాత్రం కాదనీ, ఆయన కోరుతున్నది పారిశ్రామిక యుగానికంటె చాలా వెనకటి సమాజాన్ని- అంటే Back to Nature సిద్ధాంతాన్ని అని నిర్ధారించారు. ఇది కూడా ఉటోపియా కాదుగాని,దాన్ని అందుకోవడం అనేది వెనక్కు వెళ్ళడం క్రింద భావించారు. భౌతిక అవసరాల పరిధిలో అన్న మాట యిది. మానసిక అవసరాలమాట వారిముందు ఎత్తితే బూర్జువా అనిపించుకోవలసి వస్తుంది.

కమ్యూనిజాన్ని ఒక మతస్థాయికి, మార్క్సిజాన్ని ఒక మూఢనమ్మకం స్థాయికి ఇండియాలో మన మేథావులు ఎలా దిగజారుస్తున్నారో తలుచుకుంటే, వీరి పిడివాదం ముందు ఆత్మవిమర్శముందు మార్క్స్, లెనిన్, మావో ఎవ్వరూ కూడా నిలబడజాలరు. ఈ ఆయుధాన్ని వారు తమకు గిట్టనివారిపై ప్రయోగించి (Purge) వెళ్ళగొట్టడం చరిత్రకు తెలుసు! చలం ఒక లెక్కా?

## చలంలో దశవారీ పరిణామం

విశాలాంధ్ర దిన పత్రికలో 27-5-79, 3-6-79 ఆదివారం సంచికలలో "తిరుగుబాటు నుండి మార్క్సిక వాదానికి చలం భావ పరిణామం—ఒక పరిశీలన" అనే వ్యాసాన్ని శ్రీ ఏటుకూరు బలరామమూర్తి రాసి తమ అంచనాలను ప్రక

టించారు. 'ఆయనను సుమారు 25 సంవత్సరాలు మరిచిపోయిన ఆంధ్రదేశం 1979 మే నెలలో ఒక్క సారిగా అశ్రుతర్పణ కావించింది' అన్నారు. కావాలని ఆంధ్ర దేశాన్ని ఆయన మరచి పోయాడన్నారు. ఎవరు చెప్పినా వినకుండా 1950 వ సంవత్సరం ఆరంభంలో బెజవాడ వదలి అరుణాచలం వెళ్ళిపోయిన చలం రమణాశ్రమం చేరాక చేసిన రచనలు వేరు, తెలుగు దేశంలో పుట్టిపెరిగి అనేక బాధలుపడి స్త్రీ సమస్య లోతుల్లోకి వెళ్ళి అవన్నీ కథలూ,నవలలూ,నాటికలూ, వ్యాసాలుగా చిత్రించిన చలం వేరు అన్నారు. శ్రీ బలరామమూర్తి తమ వ్యాసంలో "మొదటి చలం 1952లోనో అంతకు ముందో చనిపోయాడు" అని చాలా కటువుగా పలికారు.

ఈ మే నెలలో భౌతికంగా అస్తమించిన చలం దాదాపు మృతప్రాయుడని వారు చాలా తొందరపాటు నిర్ణయానికి వచ్చారు.చలం సత్యాన్వేషణను ఆయన అద్వైతత్వ చింతనను, భగవాన్ శ్రీరమణ మహర్షి పాదాల చెంత అహాన్ని త్యజించి గడిపిన జీవితాన్ని మృతప్రాయంగా పరిగణించడానికి చాలా అజ్ఞానమే కారణమని చెప్పుకోవాలి. భౌతిక మార్గాన్ని అహంకారపూరితమైన జీవనాన్ని విసర్జించిన వారంతా మృతప్రాయుల క్రిందే లెక్కయితే మన దేశంలోని యోగపురుషులు, మహామునులు మహాభక్తులు, సంతసత్ పురుషులు అంతా బ్రతికుండగా మరణించినవారే నన్న మాట. పైగా చలం మారిందీ లేనిదీ చెప్పవలసింది తెలుగు పాఠకులన్నారు తెలుగు పాఠకులు అక్కడికి చాలా గొప్ప ధర్మనిర్ణేతలయినట్టు, అంతిమ నిర్ణయం చేయుగల మహానుభావులయినట్టు. ఇంతేగాక "ఏవ్యక్తి,ఎంత వాడైనా, తనను గూర్చి తాను చేసుకునే అంచనా అంతిమ నిర్ణయం కాజాలదు" అని చలాన్ని కోప్పడ్డారు. ఇంతకీ చలం— "నేను మారిపోలేదు. ఉన్నత పరిధిలోకి వెళ్ళాను" అనేమాట బలరామమూర్తి గారికి ఆగ్రహం తెప్పించింది. వారి దృష్టిలో ఆధ్యాత్మిక మార్గాన్ని అందుకుని పతనమైన చలం 'నేను ఉన్నత పరిధి లోకి వెళ్ళాను' అనడం మహా అపరాధంగా తోచి ఉండవచ్చు. మొదటి చలం, రెండవ చలం అని,ఉన్న ఒకేవ్యక్తిని రెండుగా విడదీసి ఒకరిని మరొకరికి పోటీపెట్టి ఒకరు ఆనాడే చచ్చి పోయారనీ, రెండవ వారు ఈనాడే చచ్చిపోయారనీ వాదించడం ఎంత మార్క్సిస్టు కైనా ఏమి మర్యాద?. చలం ఒక్కడే. అతనిది ఒకే ఆత్మ, అతని జీవితమంతా దశల వారీగా పరిణామం చెందినదని గ్రహిస్తేచాలు.

స్వేచ్ఛ సామాజికమా—మానసికమా అనే వివాదాన్ని బలరామమూర్తి గారు తిరగ దోడారు. మానసికం కాని స్వేచ్ఛ, సామాజికం కాని స్వేచ్ఛ అనిరెండు విడిగా

ఉన్నట్టూ అవి పరస్పరవిరుద్ధాలయినట్టూ విడదీసిపోటీపెట్టివాదించడంపెంకెతనంకాదా? మానసికమైనస్వేచ్ఛ గురించి సుఖ సంతోషాలగురించి, ఆనందాలగురించి, వ్యక్తులు ప్రయత్నాలు మానడం ఏ వ్యవస్థ లోనైనాజరిగిందా? ఆనందం,అనుభూతి,సుఖం, దుఃఖంఇవన్నీమనుష్యులు పొందిఅనుభవించడంఏకాలంలోనైనానిరోధించ గలిగారా? మనిషికి, మనిషికీ ఆకలిలో, కామంలో తేడాలు వున్నమాట నిజమే కదా! వివాహ వ్యవస్థ మాటున జరిగే, జరుగుతున్న ఘోరాలను చలం కల్పించలేదు. వ్యవస్థే కలిపించింది. వాటిని అతను ధైర్యంగా ఎదుర్కొన్నాడు. కమ్యూనిజం సర్వరోగ నివారిణి, దివ్య ఔషధం అని అతను నమ్మలేక పోయాడు. అతని ఉటోపియా వేరు.

ఈ వ్యాసంలో బలరామమూర్తిగారు నైతిక రంగంలో స్వేచ్ఛా ప్రేమను, ఆర్థిక రంగంలోని స్వేచ్ఛా వ్యాపారంతో పోల్చారు. అది భూస్వామ్య వ్యవస్థ పై పెట్టుబడిదారీ వర్గాల తిరుగు బాటుగా వచ్చింది. ఈ నైతిక రంగంలో స్వేచ్ఛా ప్రేమ సిద్ధాంతం వైవాహిక దాంపత్యంలో ప్రేమ లేకపోయినా కామం కేవలం శారీరకం కాదు. ఈ ప్రేమ లేని బంధనాలలో దీర్ఘ సామాజిక పరిణామ జనిత సహజాతాలుండటం చేత ఈ బాంధవ్యాలు ప్రేమ లేక పోయినా బల వత్తర మయిన వని అన్నారు. వీటిని బద్దలు చేస్తే అరాచకత్వం ఏర్పడి ఆదిమ సమాజం లోని ఆటవిక దశకు చేరు కుంటామని విశదం చేసారు. అయితే— ప్రేమ లేకపోయినా శారీరకమైన కామ సంబంధాలలో దీర్ఘ సామాజిక పరిణామ జనిత సహజాతాలతో కుటుంబ జీవితం గడప గలిగినవారు కోటాను కోట్ల మంది ఉండవచ్చు. ప్రేమ అక్కర్లేని వారికి స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతం అవ సరం లేని వారికి అది వర్తించదు. అందువల్ల ఏర్పడే అరాచకత్వం అనేది ప్రేమలేని జీవితం సాగించే కుటుంబ పరిధిలోని వారి ఆలోచనా ధోరణి నుంచే వస్తుంది. దీనిని మెజారిటీ పాయింటుగా చలం స్వేచ్ఛా ప్రణయ సిద్ధాం తానికి ఎదురు నిల్పడం ఆయన వాదన లోని నిజాన్ని గుడ్డిగా తిరస్కరించడానికే.

ఆకలి, కామం వీటిలోని హెచ్చు తగ్గులను పరిగణన లోకి తీసుకోన కుండా ఏక సూత్ర బద్ధం చేయడం వల్ల కలిగే విపరిణామం ద్వారా అటువంటి వ్యక్తులను వివాహ వ్యవస్థ దుర్మార్గం నుంచి కాపాడాలని చలందీక్షపట్టారు. వివాహం అక్కర్లేని వ్యవస్థ కొందరికి అవసరమైతే దానిని బలవంతంగా అందరి మీదా రుద్దడానికి సమాజానికి ఏ అధికారమైతే వుందో, అది మానసిక స్వేచ్ఛకి అడ్డు వస్తున్నది కనుక దానిని చలం తిరస్కరించాడు. అంతేగాక

ప్రేమ నెరుగని కామ సంబధాలతో ఏర్పడే కుటుంబ వ్యవస్థ లోని సంబధ బాంధవ్యాలు పరమ పవిత్రమైన వనే అంశాన్ని కూడా అయన సహేతుకంగా హేళన చేశాడు. కుటుంబ వ్యవస్థ కి, ఫ్యూడల్ వ్యవస్థకి, ఆస్తి హక్కులకి ఉండే సంబంధం చాలా బలీయమైనది కావచ్చు.చలం కుటుంబవ్యవస్థ కి,వివాహాలకీ ఎసరు పెట్టాడు. ఆ స్వేచ్ఛాప్రేమసిద్ధాంతం వ్యక్తిత్వ వికాసానికి అవసరమైన భావస్వేచ్ఛకి ఆవశ్యక మైనది. ఇది కమ్యూనిజం ఏర్పడిన తరువాత లభించే స్త్రీ, పురుష సమానత్వం వగైరాల కంటే భిన్నమైనది. స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాన్ని జీవన మార్గంగా నిర్దేశించడాన్ని, వ్యభిచారానికి ప్రోత్సాహంగా భావించడం అన్యాయం.

చలం నాయికలు తిరుగుబాటు చేసి లేచిపోయి, కష్టాల పాలయి, అంత మయినారంటే అది ఈ వ్యవస్థ లోని దౌష్ట్యానికి పండి పగలడానికి సిద్ధంగా ఉన్న దుర్మార్గానికి సిగ్నల్‌గా భావించాలి. అంతేగాని అంతా సవ్యంగా ఉంది. చలం తప్పుడు ప్రబోధాలు చేస్తున్నాడని ఆయన మీద కక్ష కట్టడం శుద్ధ అవివేకం, అనవసరమూ కూడా. అతని ఆదర్శాలు సుమార స్వప్నాలయినంత మాత్రాన అవి ఎవరి కవసరమో, ఎవరెవరికి వర్తిస్తాయో తెలుసుకొన కుండా వాటిని కేవలం వెక్కిరించే ధోరణిలో 'శ్రీ గోపీచంద్, వెంకటచలం పాత్ర' అని ఒక వ్యంగ్య రచన చేసాడు. చలం ప్రవచించిన స్వేచ్ఛాప్రణయ సిద్ధాంతం అపరి పక్వ మనస్కులకు అందరికీకాదు. గోపీచంద్‌లో చలం పట్ల వ్యతిరేకత సహజంగాతెనాలివారు కావడం వలన ఏర్పడి నట్టిది. ఆనాటి తెనాలి రచయితల్లో చలానికి సమ ఉజ్జీగా నిలబడ గలిగిన వారు ఎవరూ లేరు. ఆయన ఆధునిక భావాలను ప్రోదిచేసి సమాజంపై తిరుగుబాటుకు కథా,నవలా నాటకం అనేవి ఆయుధాలుగా మలిచాడు. చలం మీద తత్వవేత్త స్పినోజా ప్రభావం కూడా వుంది.

'Human species are born pure, they must be preserved pure- they can be preserved by fostering pure' అనే భావాలతో చలానికి ఏకీభావం వుంది.

చలానికి చక్రపాణికూడా ఏమంత గాఢ స్నేహితుడు కాదు. ఆయన బిజినెస్ మాన్, యితను రచయిత. చలం రచనల ప్రభావానికి కంగారుపడి చలానికి పోటీగా శరత్‌ను ప్రవేశపెట్టి తర్జుమాల ఫ్యాక్టరిని ఆయన స్థాపించి చలం ప్రభావాన్ని తగ్గించేయాలని చూశాడుట.

అసమర్థుని జీవయాత్రలో గోపీచంద్- 'అల్లుడు కడుపుచేసి పుట్టింటికి పంపించడం, కూతురికి పురుడుపోసి మళ్ళీ అత్తింటికి పంపిస్తే మళ్ళీ కడుపుచేసి పంపించడం-' అంటూ ఒక పేరాపేరా రాసింది చదివి చలం- యిది మానవ జీవితంపట్ల సానుభూతి,ఆదరంలేకుండా నిర్లక్ష్యంతో అంహంకారంతో రాసినట్లుంది- యింత అహంభావ స్వభావి రచయిత కావడానికి అనర్హుడని విసుక్కున్నాడట. చలంపట్ల స్త్రీ సంబంధమైన జెలసీ కూడా వున్నట్లు గోపీచంద్ గురించి తెనాలిలో అనుకునేవారట.

తెనాలిలో చలం వ్యతిరేకవర్గం ఏర్పడినప్పుడు చలం అమీతుమీ తేల్చేసెయ్యాలని పట్టుదలలకు పోయినవారిలో గోపీచంద్ ఉన్నట్లు చెబుతారు. అయనమీద తెనాలిలో ఒక జోక్ (చక్రపాణీగారిదేమో) ప్రచారంలో ఉండేదట "మేక కొనాకులు మేస్తుంది. గోపీచంద్ చివళ్ళు కొరుకుతాడు" అని.

గోపీచంద్ కూడా 'ప్రియురాలు' సినిమా తీసాక రమణాశ్రమం వెళ్ళాడట. అరవిందుని ఆశ్రమానికి కూడా వెళ్ళాడు. అరబిందో సాహిత్యం చదివాడు, మదర్ని ఆరాధించి ఆమెనుంచి అశీస్సులు పొందాడు. అటు- ఇటు దొర్లుతూ తచ్చాడుతూ తనదైనపద్ధతి లేకుండాచేసుకున్నాడు గోపీచంద్. రాడికల్‌హ్యూమనిజం వైపు- భౌతిక వాదంవైపు, మార్క్సిజం వైపుకు మొగ్గిన గోపీచంద్, పేరంటాలు, లక్ష్మమ్మ వంటి సినిమాలుకూడా తీశాడు. 'చీకటిగదులు', 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' వ్రాసిన గోపీచంద్, ప్రియురాలు లాంటి సినిమాకూడా తీసాడు. మరి ఈ కమ్యూనిస్టులు గోపీచంద్‌ని అరబిందో ఆశ్రమానికి వెళ్ళినందుకు మదర్ దగ్గర ఆశీర్వచనం పొందనందుకు ఆయన మొదటిసారి ఎప్పుడో మరణించాడు, రెండవసారి యిప్పుడు మరణించాడు అని అనలేదేమి? మార్క్సిక వాదంవైపు గోపీచంద్ పరిగెత్తలేదా? చలం పట్ల గోపీచంద్‌కు గల హేళనాత్మక దృష్టికి, తేలికభావానికి ఆయన రాసిన "వెంకటచలం పాత్ర" ఉదాహరణగా నిలుస్తుంది, ఇంకా విచిత్రం ఏమిటంటే తనదైన ఒక తాత్విక ధోరణి (అద్వైతత్వ భావన) గల చలానికి తాత్విక దృక్పథం లేదనీ. ఏమార్గానికి చెందని గోపీచంద్‌లో తాత్విక దృక్పథం ఉందని కొందరు కావాలని పొరబడుతూ వుంటారు. చలం వ్యతిరేకత నుంచి పుట్టిన గోపీచంద్ అవహేళనాత్మక రచన "వెంకటచలం పాత్ర"ను పరిశీలించి ఎవరికివారే దాని ఔచిత్యాన్ని నిర్ణయించుకోవచ్చు.

# వెంకటాచలం స్మృతి

మేం ఎక్కడికో కారుమీద వెళ్తున్నాం "మేం" అంటే అతడూ, నేనూ, అతన్ని నేను నా స్నేహితుడనుకున్నాను. కాని అతను నాకు స్నేహితుడు ఎప్పుడయ్యాడో ఎక్కడయ్యాడో జ్ఞాపకం లేదు. అసలు నాకు స్నేహితుడుకాడేమో అనికూడా భయం వేస్తూంది.

అతడు కారు డ్రయివు చేస్తున్నాడు. ఆ కారుకూడా అన్ని కార్లకిమల్లే లేదు. బ్రహ్మరథానికి మల్లే వుంది; పైన మట్టసంగా చిన్నడాబా, దాని చుట్టూ పిట్టగోడా వున్నై. ఆ పిట్టగోడనిండా పూలమొక్కలే-ఎంకరకాల పూలు. అన్నిటికంటే విశేషం ఏమిటంటే ఆ కారుకి స్టీరింగ్ వెనక భాగంలో వుంది. వెనక సీట్లో కూర్చుని అతడు డ్రయివు చేస్తున్నాడు. ఆ కార్లో పెట్రోలుకి బదులుగా రెండు పీపాల పొగని గుమ్మరించాడు.

అతను నాతో మాట్లాడకుండా ముందుకు చూస్తూ కారు పోనిస్తున్నాడు. అతని వైఖరీ, చూపులూ, ఆకారం-అన్నీ సినిమాల్లో కథానాయకుడిని ఎత్తుకుపోయే విలన్ వ్యవహారంగా వున్నయ్. నాకు భయం వేసింది. అందులో కారు శర వేగంతో వెళ్తూ వుంది. నేను అనేక సినిమాలు చూశాను. కథానాయకుల్ని ఇట్లా ఎందుకు తీసుకుపోతారో నాకు తెలుసు.

"ఏయ్, ఆపు" అన్నాను.

కాని ధ్వని గొంతులోనే వుండిపోయింది. బయటకు రాలేదు. ఇదే సినిమా అయితే ప్రేక్షకులు 'సౌండ్' అని కేక వేసేవారు.

కారు కిటికీలోనుంచి బైటకు దూకుదామని చూశాను. ఏమి చిత్రం! కారు వెనక్కు నడుస్తూ వుంది. అతను జాగ్రత్తగా శ్రద్ధగా చూస్తూ కారు వెనక్కి నడుపుతున్నాడు. అకస్మాత్తుగా అది దెయ్యం ఏమో అని నాకు అనుమానం కలిగింది. అవయవాలన్నీ పరీక్షగా చూశాను. మడమలు తిరిగిలేవు. కొంచెం ధైర్యం తెచ్చుకొని అతని భుజంమీద చెయ్యేసి చెబుదామని ప్రయత్నించాను. కాని చెయ్యి కదల్లేదు. ఇంతలో కారు వెనుక బ్రహ్మాండంగా పొగలేవటం నాకు కనిపించింది.

ఆ పొగకూడా కారుమబ్బులాగా వుండి ఆకాశం దాకా లేచింది. సీసా బిరడా తియ్యగానే సీసాలోనుంచి బయటకువచ్చి పెరిగి పెరిగి ఆకాశంఅంత అయిన దెయ్యం జ్ఞాపకం వచ్చి నాకు వొణుకు పుట్టింది. అతను మాత్రం తొణకలేదు. ముందుకు చూస్తూనే కారు బ్రుడన పక్కకి తిప్పాడు. కారు రోడ్డుదిగి కుదేస్తూ రంయిన వెళ్తూ వుంది. నేను చూస్తూ చూస్తూ వుండగానే కారు వెనక భూమి రెండు బద్దలై అగడ్త ఏర్పడింది.

"ఆపు" అన్నాను. మళ్ళీ ధ్వని రాలేదు. కాళ్ళూ చేతులూ తన్నుకున్నాను. అవయవాలు కదల్లేదు. అగడ్త దగ్గరకు వచ్చింది. నేను కళ్ళు గట్టిగా మూసుకున్నాను. కానికళ్ళముందు అగడ్త స్పష్టంగా మృత్యుగహ్వారానికి మల్లేతెరుచుకొని కనిపిస్తూనేవుంది. అతడుమాత్రం ఏమీ జరగనట్టుగానే కూర్చుని ముందుకు చూస్తూ కారు వెనక్కి నడుపుతున్నాడు;

భూమి బద్దలయినంత మోతతో కారు అగడ్తలోకి కూలింది. నేను నెమ్మదిగా లేచాను. చుట్టుపక్కల చూసేటప్పటికి అంతా అయోమయంగా వుంది. ఎక్కడుందీ తెలియలేదు. కారు చెక్కుచెదరకుండా ఆగివుంది. పిట్టగోడమీద వున్న పూలుకూడా చెక్కుచెదర్లేదు. డ్రైవరు మాత్రం దూరంగా పడివున్నాడు. నేను చూస్తుండగానే లేచివచ్చి మళ్ళీ కారులో కూర్చున్నాడు. ఆ కారుకి చక్రాల్లేవు. భూమికి గజం ఎత్తున నిలబడి వుంది.

వొచ్చి కారు ఎక్కమంటాడేమోనని భయం వేసి పారిపోవాలని ప్రయత్నించాను.. ఎటుచూసినా పూలమొక్కలే- ఆకు జొంపాలే. తీగటుయ్యాల్లే. అక్కడక్కడా కుటీరాలున్నాయి. అవి కూడా పూలతీగెలతో అల్లినవే. మధ్య ఎత్తుగా పెద్ద గాలిగోపురం వుంది. అది చంద్రమ్మ పెట్టెకి మల్లే వుంది.పిచ్చిక గూడికిమల్లే వుంది. నారదుడిశిఖకి మల్లే వుంది. దాని ముఖద్వారం కట్టడం కంటె పెద్దది. అక్కడికి వెళ్ళాను. ముఖద్వారం లోనించి లోపలికి వెళ్ళాను.

లోపల పీఠం వేసుకు కూర్చుని ఒక వ్యక్తి రాసుకుంటున్నాడు. అతడు కూడా నేను ఎక్కివచ్చిన కారుకి మల్లే భూమికి గజం యెత్తున కూర్చున్నాడు. కింద ఆధారం ఏమీ లేదు. గాలిలోనే కూర్చుని గాలిలోనే రాసుకుంటున్నాడు. ఒక్క క్షణం గారడీవాడా, కనుకట్టుమంత్రగాడా, అనిపించింది నాకు.

అతడు ఎర్రగా వున్నాడు. ఏభై సంవత్సరాల ప్రాయం వున్న కుర్రాడికి మల్లే వున్నాడు. కాపుకు మల్లే కనిపిస్తున్నా అవి కాకిపక్షులే. షర్టు వున్నట్టు కనిపిస్తున్నా అది వొట్టి శరీరమే. చెవులకు పూగుత్తులు పెట్టాడు. పెదిమలకు మందారపువ్వు రాశాడు. పైకి అంతా సంస్కర్తగా కనిపిస్తాడు. గాని వొట్టి సనాతనుడు ఛాందసుడు.

అతడు నన్ను చూడకుండా,వొంచిన తల ఎత్తకుండా ఏదో రాస్తూనే వున్నాడు. మా కారకంటె వేగంగా రాస్తున్నాడు. అతని కలంలోనుంచి ఒక్కొక్కపాత్రా పుడుతూంది. ముఖద్వారంలోనుంచి బయటకు వెళ్తావుంది. కాని నా కంటికి మాత్రం అన్ని పాత్రలూ ఒకే మాదిరిగా వున్నయ్. అదే నునుపూ, అదే ఉబుకూ, అదే వంపూ అన్నీ ఒకే రకంగా వున్నయ్. నాకు ఒక్కటే భేదం కనిపించింది. కొన్ని పాత్రలకు పుల్లిపొర రవికెలున్నయ్. కొన్నిటికి అవికూడా లేవు;

అందులో కొన్ని పాత్రలు నన్నుచూసి నాదగ్గరకు వచ్చి, నన్ను పట్టుకొని వొత్తి వొత్తిచూసి, నా చుట్టూచేరి చేతులు చేతులు కలిపి డాన్సు చెయ్యడం మొదలు పెట్టినయ్.

అవి చూసి అతడు వాటిని తన దగ్గరకు పిలిచాడు. ఏమేమో చెప్పాడు. అతని పెదిమలు కదలటం కనిపించింది. గాని మాటలు వినబడలేదు. కాని నాకు అతను తన పాత్రలకు చెప్పింది బోధపడింది.- "వాడు పనికిరాడు. వొట్టి ఆకలి వెధవ, అతని దగ్గరకు పోకండి." అని చెప్పి వుంటాడు. ఎందుకంటే తరువాత ఒక్క పాత్ర కూడా నా దగ్గరకు రాలేదు, చరచరా బయటికు వెళ్ళిపోయినై.

ఇంతలో మరొక ఆడవాళ్ళ గుంపు ఆ గోపురం ప్రవేశించింది. చిరిగిన గుడ్డల్తో రేగిన జుట్టుతో, ముడుతలు పడ్డ మొహాలతో చీదర చీదరగా వుంది ఆ గుంపు. అతని దగ్గర తయారై వెళ్ళే పాత్రలకు, అతనిదగ్గరకు వొచ్చే ఈ ఆడవాళ్ళకూ ఎంత భేదం వుంది——అంతా భేదమే.

ఆ గుంపు సరాసరి ఆ రచయిత దగ్గరకు వెళ్ళి ఏవేవో సంజ్ఞలు చేసినై. అతడు జాలిగా కరుణగా, ప్రేమగా చూశాడు. కాని వాటిగోల మరీ ఎక్కువైంది. అన్నీ పొట్టలు కొట్టుకోవటం మొదలుపెట్టినై. అతడు సహించలేక చెయ్యి పైకెత్తి

చేత్తో అరిచాడు. ఆ గుంపు చెల్లాచెదురై పారిపోయింది. కొంతమంది నన్నుచూసి ఆగారు. వాళ్ళల్లో వాళ్ళు ఏదో గుసగుసలాడుతున్నారు. రష్యావైపు చూపించు కున్నారు. నన్ను చూపిస్తూ ఏమేమో యాక్షన్లు చేశారు. నెమ్మదిగా నాచుట్టూ చేరి సంజ్ఞలతో తమ కష్టసుఖాలు చెప్పుకోవటం మొదలుపెట్టారు. వాటి భావం నాకు సరిగ్గా అర్థంకాలేదు. కాని వాళ్ళను చూస్తుంటే నాకు జాలివేసింది. మొత్తానికి వాళ్ళంతా బాధపడుతున్నారనీ, చేతైతే ఆ బాధ తీర్చాలనీ ఆపేక్ష కలిగింది.

ఇంతలో గాలిలో గజం యెత్తున కూర్చున్న రచయిత కోపంగాలేచి గాల్లోనే నుంచుని వాళ్ళతో ఏమేమో మాట్లాడాడు. అతను కోపంగా మాట్లాడుతున్నాడనీ, వాళ్ళని దూషిస్తున్నాడనీ మాత్రం నాకు తెలిసింది. అతని కోపానికి తట్టుకోలేక వాళ్ళంతా పారిపోయారు.

అతను కూర్చుని మళ్ళీ పాత్రలను సృష్టించడం మొదలుపెట్టాడు. అవే పాత్రలు-అదే రకం. వేలకు వేలు-చదలపుట్టకు మల్లే పుట్టిస్తున్నాడు.

నాకు విసుగెత్తింది. అతన్ని పలకరించకుండానే బయటకు వచ్చాను. ముఖద్వారం పక్కన నక్కివున్న ఒక స్త్రీ నన్ను చూచి పారిపోవటం మొదలు పెట్టింది. ఆమె చివరికి వొచ్చిన గుంపులోని స్త్రీయే చిరిగిన మురికి బట్టలు.....

ఏమనుకుందో, కొంచెం దూరం వెళ్ళి మళ్ళీ వెనక్కి తిరిగి వొచ్చింది. నన్ను నఖశిఖ పర్యంతం పరీక్ష చేసింది. ఆమె మొహాన పెద్దపెద్ద మచ్చలున్నాయ్. కళ్ళు పీక్కుపోయి గుంటలుపడి వికారంగా వున్నాయ్. బుగ్గలు చప్పిదవడలు.... ....కాని ఒకప్పుడు ఆమె చాలా అందంకలదని కొన్ని కొన్ని లక్షణాలవల్ల కని పిస్తూ వుంది.

"మీరు ఎవరు?" అని ప్రశ్నించాను.

"నేను వెంకటచలం పాత్రని" అని తలవొంచుకొని జవాబు చెప్పింది.

నేను వెంకటచలాన్ని ఎరుగనుగాని అతని పాత్రలను కొన్నిటిని ఎరుగు దును— 'నన్నుచూసి ఎందుకు పారిపోయావు?' అని అడిగాను.

'నాకు పురుషులంటే భయం. నిన్నుచూస్తే మరీ భయం వేసింది'

'ఎందుకు?'

'నేను లేచిపోయాను' అంది.

నాకు ఏమీ అర్థం కాలేదు. ఆమె మాట్లాడుతూ వుంటే మాటలు గాల్లోతేలి వున్నయ్. ఆమెకీ ఆమె మాటలకీ సంబంధం వున్నట్టే కనపట్టంలేదు. నేను మాట్లాడకుండానే ఆమె మళ్ళా చెప్పింది- 'సాయిబుతో లేచిపోయాను' నేను నమ్మటం లేదని 'ఏ వొట్టుపడితే ఆ వొట్టు-నేను సాయీబుతోనే లేచిపోయాను' అంది.

"మంచిపనే. అయితే...."

ఆమె నన్ను ముగించనివ్వలేదు. "భర్తను విడిచిపెట్టి సాయీబుతో లేచి పోయాను. ఆ మీరాసాయీబే నాకు దైవం ఇచ్చిన భర్త అనుకున్నాను. నా మీరా నన్ను వాడుకొని నా యవ్వనాన్ని పీల్చి, అతని జబ్బులన్నీ నాకు ఎక్కించి నన్ను విడిచిపెట్టాడు. ఇక ఇప్పుడు నేనేం చెయ్యను?" అని అడిగింది. కాని ఆమె ఎక్కువ విచారపడుతున్నట్లు కనపట్టంలేదు. 'కానీ తెచ్చాను-మిఠాయి కొన్నాను-తిన్నాను' అన్నట్లు చెప్పింది. "ఇంకేం బాగానే వుంది...."

"బాగానే వుందంటే కాదు. ఆకలి...."అని పమిటెకొద్దిగా పక్కకులాగుతూ అంటుకుపోయిన కడుపు చూపింది.

"నీకు డబ్బులేదా?"

"డబ్బు సంగతి ఎప్పుడు ఆలోచించాను? ముసలితనం వస్తుందనీ, విరూపిని అవుతాననీ ఎవ్వరు ఆలోచించారు? అసలు ఈ ఆలోచనలకు తీరికవుందా? ఆ వెన్నెల్లో, ఆ మలయమారుతంలో, ఆ మైదానంలో, ఆ గులాబీతోటలో, ఆ తీయని కమ్మని వాసనల్లో..."

నేను ఇవన్నీ వెంకటచలం పుస్తకాల్లో చదువుకున్నాను. అందుకని ఆమెని ఆ ధోరణిలో పడనివ్వకుండా ఆపి, "అయితే నన్ను ఇప్పుడు ఏం చెయ్యమంటావు?" అని అడిగాను.

"ఆకలి"

నేను కొంచెంసేపు ఆలోచించి, "వెంకటచలాన్ని అడక్కపోయావా?" అన్నాను.

"అడిగాను. కాని ఆ పిచ్చిముండ ఏం చెబుతుంది? అసలు నన్ను గుర్తుపట్టలేదు. నువ్వు నా పాత్రవు కానే కాదు పొమ్మన్నాడు. నేను జ్ఞాపకం చేసేటప్పటికి ఎంత జాలిగా, బాధగా, కరుణగా చూశాడనుకున్నారు? కాని ఏం లాభం? మీరు చూస్తున్నారుగా? అతని లోకంలో...."

"ఏమన్నాడు?"

"ఏమంటాడు? నువ్వు నా పాత్రవే కావు. నువ్వు నా పాత్రవైతే నీకు ఆకలి అయ్యేదే కాదు అన్నాడు. నాకు మండి చెడామడా తిట్టి నాకు దారి చూపించమన్నాను అతడు ఆలోచించి 'ఆత్మహత్య చేసుకోరాదూ' అన్నాడు.

నాకు అకస్మాత్తుగా అతని పాత్రలన్నీ జ్ఞాపకం వొచ్చినై. ఎక్కువ ప్రేమించటం, లేచిపోవటం, ఆత్మహత్య చేసుకోవటం-ఇదేపని.

ఆమె చెప్పింది-"నేను వొప్పుకోలేదు. పోట్లాడాను. ఆత్మహత్య అంటే నాకు భయంలేదు. కాని ఆపేక్షలేదు. ఇక అతనేం చెపుతాడు? నేను కోప్పడుతుంటే బిక్కమొహం వేసుకున్నాడు"

నేను ఒక్క నిట్టూర్పు విడిచాను? ఆమెను చూస్తున్న కొద్దీ నాకు జాలి ఎక్కువయింది. ఆమెకు బాధపడే శక్తీ, ఓపికా కూడా లేకుండా పోయినై— "మరి నన్నేం చెయ్యమంటావ్?" అని అడిగాను.

ఆమె ఒక్క అడుగు ముందుకు వేసి-"-ఆకలి...."అంది.

"ఇక్కడ నా దగ్గర ఏమి వుంది? బిస్కట్లు వున్నాయి—"

"అక్కర్లేదు. తీపి నేను తినలేను. తిని తిని మొహం మొత్తింది...."

నా దగ్గర ఇక ఏమీ లేదు. పాపకు తీసుకువెళ్తున్న చక్కెరడలు, వున్నమాట నిజమేగాని, ఆమెకు ఇవ్వటానకి సిగ్గుపడ్డాను. బాదంపప్పు, ద్రాక్షరసం, యాపిల్సు తినే ఆమెకు చక్కెరడాలు ఎలా ఇవ్వటం? కాని ఆమె చెప్పేవరకూ వూరుకోలేదు. "మా పాప చక్కెరడాలు తెమ్మంది...." అని మొదలు పెట్టాను.

"ఇంకేం? ఇవ్వండి. ఇంతకంటె ఏం కావాలి? చక్కెరడాలంటే నాకు చాలా ఇష్టం. నా మీరా టౌన్నుంచి వొస్తూ చక్కెరడాలే తెచ్చేవాడు" ఏదో అనుమానం రాగా ఒక అడుగు ముందుకు వేసి "నూనెవేనా?" అని అడిగింది,

నేను 'ఊఁ' అని మూలిగాను. "నూనె సరుకే కావాలి. నా మీరా ఎప్పుడూ నూనె సరుకే తెచ్చేవాడు" అంది.

నేను సిగ్గు పడుతూ చక్కెరడాల పొట్లం ఆమె కిచ్చాను. ఆమె ఆపేక్షగా విప్పి ఒక చక్కెరడం నోట్లో వేసుకొని కరకరా నమిలింది. ఇంతలో ఏదో జ్ఞాపకం వచ్చినట్టు తటాలున ఆగి—"పిచ్చిముండా, నువ్వు మంచిదానివిరా, అంటూ ఒక్క అడుగు ముందుకు వేసి "నాది మాతృహృదయంరా" సహాయం చేసిన వాళ్ళకు కృతజ్ఞత చూపకుండా వుండలేను," అంటూ అమాంతంగా నన్ను కావలించుకొని గట్టిగా ముద్దు పెట్టుకొని పరిగెత్తింది. ఆమె పరుగు నేను చూడలేక పోయాను. ఊగుతూ అంగలు పంగలు వేసుకుంటూ చిన్నప్పుడు కర్రలమీద నడిచే వాళ్ళుం చూడండి— అట్లా పరిగెత్తింది.

వెంటనే ఆమె మొహం మీద మచ్చలు జ్ఞాపకం వొచ్చినై. అది అంటు రోగమేమోనని భయం వేసింది. పుక్కిలించి వూద్దామని నీళ్ళకోసం వెతికాను. వెంకటచలం ప్రపంచంలో మంచినీళ్ళుకూడా పుట్టవు.

—గోపీచంద్

## చలం అహంకారా?

చలం వివాహ వ్యవస్థను సామాజికంగా, పరిణామాత్మకంగా చూడలేక పోవడం ఆయన బలహీనతగా బలరామమూర్తి గారు నిర్ణయించారు. ఇందులో మళ్ళీ "నేటి ఫ్యూడల్ వివాహ వ్యవస్థను బద్దలు చేయడానికి ఆయన చేసిన కృషి. ప్రాధాన్యతను తక్కువ అంచనా వేయలేము" అని కాంప్లిమెంట్ యిచ్చారు. బలరామమూర్తిగారి వుద్దేశం— వివాహవ్యవస్థ సామాజికంగా ఆటవిక దశ నుంచి నేటివరకు పొందిన పరిణామాన్ని, అభ్యుదయాన్ని అర్థం చేసుకోవడానికి చలం తిరస్కరించాడని కాబోలు. ఫ్యూడల్ సమాజంలో వివాహవ్యవస్థలోని లోపాలు కానీ, దోషాలు కానీ— వాటిలో యీనాటివరకూ మార్పేమీ లేదు. చలం వాటిని బద్దలు కొట్టడానికి ప్రయత్నించాడు, కనుకనే అతను అంత దొష్టు పడ్డాడు. చలం ఆలోచనలన్నీ ఆయా సమస్యలయొక్క తీవ్రతను వ్యక్తం చేసేవే. కాని అవి వాటికి పరిష్కారాలు కావు. అటువంటప్పుడు ఆ ఆలోచనలను పరిష్కారాలుగా భావించి, అనుసరించిన వారు విషాద పరిణామాలకు లోనై, ఆశాభంగం చెంది వుండవచ్చు. ఆయన్ని ప్రవక్తగా ఆరాధించిన వారిది తప్పుకానీ, ఆయన ఆలోచనలది కాదు ఆ తప్పు. చలానికి అహంకారాన్ని అంటకట్టడం న్యాయం కాదు. చలానికి తాను చెబుతున్నది వాస్తవమని గట్టిగా తెలుసు, తాను అన్యాయమని, అసహజమని, అధర్మమని గట్టిగా తెలుసుకున్నవాటినే ఆయన తన రచనలలో చెప్పాడు. ఆయన ఆత్మవిశ్వాసం గల రచయిత, దాన్ని అహంకారంగా అన్వయించడం ఘోరం. ఇక్కడొక వుదాహరణ తెచ్చారు— భార్యను నా ఆస్తి అనుకోవటంలో స్వార్థం వుంది. అది జెలసీకి మూలం. భార్య సొంత ఆస్తి కాదు అనుకొనేవారు జెలసీని అధిగమించాలి. అంటే, స్త్రీ భర్తకు ఆస్తిగా కాకుండా, ఆమె స్వేచ్ఛగా యిష్టంవచ్చిన విధంగా,యిష్టం వచ్చిన వ్యక్తితో వుంటే జెలసీ పడ రాదనుకున్న చలం భక్తులే, తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్నారన్నారు. బహుశా యీ విషయం మొక్కపాటి రామ్మూర్తికి సంబంధించినదై వుంటుంది. మొక్కపాటి రామ్మూర్తి ఆత్మహత్య చేసుకున్నాడా, హత్య చేయబడినాడా, జెలసీతో బాధపడి చావుకొని తెచ్చుకున్నాడా, అనేది యీనాటికీ మిష్టరీ. అయితే మొక్కపాటి రామ్మూర్తికి ముగ్గురు మహానుభావులు ముక్తకంఠంతో అంకితాలిచ్చి స్తుతించారు—

కృష్ణశాస్త్రి, చలం,ముద్దుకృష్ణ. వీరిలో రామ్మూర్తి విషయం, ఆ ట్రాజిడీని గురించి చెప్పగలిగినవారు కృష్ణశాస్త్రిగారొక్కరే. అయితే ఆయనకు మాటపోయింది. అస్పష్టంగా వున్న రామ్మూర్తి మృత్యురహస్యానికి చలం శిష్యరికాన్ని జోడించి. అందుకు చలం ఆలోచనలే కారణమని, దోషాన్ని ఆయనకు అంటగట్టడం భావ్యమా? కొందరు మతిస్థిమితం కోల్పోయి యోగులైనారు అని అన్నారు. ఈ ముక్కలు బహుశా సౌరిస్‌ను గురించి కావచ్చు.

## ఆచరణలో వైఫల్యాలు

స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతంలో జెలసీకి తావులేదనుకోవడం చలం మానవ స్వభావాన్ని తప్పుగా అర్థం చేసుకోవడం వలన అని బలరామమూర్తిగారు అభిప్రాయపడ్డారు. అంతేగాని, ఎంత గొప్ప సిద్ధాంతమైనా ఆచరణలో లోటుపాట్ల వలన విపరీతమైన పరిణామాలు ఏర్పడ వచ్చునని వారు చలం విషయంలో అంగీకరించ దలుచుకోలేదు. మార్క్సిజం మటుకు ఆచరణలో ఎన్ని వైరుధ్యాలతో, విపరీతాలతో భ్రష్టం కాలేదు? బౌద్ధం క్షీణించలేదా? హైందవం పతనం కాలేదా? అలాగే చలం సిద్ధాంతాలు కూడా ఆచరణ దశలో అనేక యితరేతర కారణాల వలన వైఫల్యాన్ని పొంది వుండవచ్చు. బలరామమూర్తిగారు చలం భావాల్లోని వైరుధ్యాన్ని గురించి ప్రస్తావిస్తూ— "పురుషుడు స్త్రీని దోపిడీ చేస్తున్నాడు. పురుషుని స్త్రీ ద్వేషించాలి, తిరగబడాలి—" ఇది ఒక ఆలోచన. Sex అత్యున్నతమైన బ్రహ్మానందం. దానిని అనుభవించడం గొప్ప కళ. జీవిత పరమార్థం. "పురుషుని ద్వేషించే స్త్రీ Sex నుఎలాఅనుభవించ గలదు?" అని ప్రశ్నించారు.

ఈ పేరాకు పైన— ప్రేమకు, కామానికి ఎంతో తేడా వుందని చలం చర్చించాడేకాని, మౌలికమైన యీ విషయాన్ని (జెలసీ) మాత్రం ప్రస్తావించ లేదు— అన్నారు. మొదటగా గ్రహించ వలసిన విషయం— అమెరికాలోని లేదా యితర దేశాలలోని స్త్రీ విమోచన వుద్యమం, దాని బీజాలు వేరు. చలం నిర్వ

హించిన స్త్రీ స్వేచ్ఛా యజ్ఞం పేరు. తరతరాలుగా పురుషులు చేస్తున్న దోపిడీ ఫలితాల నుంచి స్త్రీని తిరగబడి లేచిపోయి తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకో మన్నాడు. అలా నిలబెట్టుకోవడం కోసం ఆమె ఏం చెయ్యావలసి వచ్చినా జంక కూడదన్నాడు: అయితే వివాహవ్యవస్థలో వున్న దౌష్ట్యాన్ని ప్రతిఘటించడానికి పురుషాధిక్యతను ఆయన సవాలు చేశాడు. అయితే సెక్సు అత్యున్నతమైన బ్రహ్మా నందం. దానిని పొందడం ఒక గొప్ప కళ. అది జీవిత పరమార్థం అని ఆయన వుద్బోధ అంటున్నారు. పురుషుని ద్వేషించమని. లేదా లొంగిపోయి సెక్సు ఆనందాన్ని అనుభవించమని, రెండూ చెప్పినట్టు ప్రశ్నిస్తున్నారు. ఈ దోపిడీ వ్యవస్థ పోయి, స్త్రీ పురుష సమానత్వం ఏర్పడి, స్త్రీ ఆ బ్రహ్మానందాన్ని పొందాలి అని ఆయన ఆశించడంలో తప్పేమీ లేదు. స్త్రీ పురుష సంబంధాలలో రావలసిన మార్పు అత్యున్నతమైన సెక్సు ఆనందాన్ని స్త్రీ పురుషులు ఉభయులూ అనుభవించడానికి దోహదం చేస్తుంది అని దాని అర్థం. ఈ వైరుధ్యాలనేవన్నీ సమస్యలు, వాటికి పరిష్కారాలు ఏర్పడని దశలో ఆదర్శాలతో ముడిపెట్టడం వల్ల వచ్చే చిక్కులే. ఇవన్నీ చలం కల్పించినట్టు చెప్పడం అన్యాయం కాదా?

## సౌరిస్ ప్రస్తావన

ఈ వ్యాసంలో చలం ఆలోచనల వలలో చిక్కుకుని వివాహాన్ని తిర స్కరించి యోగినిగా మారిన సౌరిస్‌ను గురించిన ప్రస్తావన బలరామమూర్తిగారు తెచ్చారు. ఆమె మానసిక వ్యాధులకు గురయిన వ్యక్తిగా నిర్ధారించారు. చలం కుటుంబ జీవితంలో సౌరిస్ యోగినిగా మారడం ఒక ట్రాజెడీగా అభివర్ణించారు. ఆమె జీవితాన్ని సమగ్రంగా పరిశీలించకుండా చలం రమణాశ్రమం గురించి, ఆయన సాధన గురించి అర్థం చేసుకోనకుండా, అపరిపక్వమనస్కులై తమకు ఎలా తోస్తే అలా అదే యదార్థమైనట్లు బలరామమూర్తిగారు వ్రాయడం తొందర పాటు చర్య కాగలదు. సౌరిస్ ప్రభావమే చలాన్ని రమణాశ్రమానికి చేర్చింది అన్నారు. ఇది తప్పు. భగవాన్ రమణమహర్షి ప్రభావమే చలాన్ని, సౌరిస్‌ని, చలంగారి భార్యని మరెందరినో అక్కడికి చేర్చింది. భగవాన్ ప్రభావం చలంపై ప్రసరించకపోతే, చలం తిరువణ్ణామలై అనే ఉత్తర ఆర్కాట్ జిల్లాలోని అరుణా చలానికి తరలి వెళ్ళడమనేది సంభవించేది కాదు. చలంగారి భార్య చిట్టిరంగనాయ కమ్మగారు అందరికంటే ముందు భగవాన్ వద్దకు చేరింది. అందరం అక్కడికే

వెడదామని ఆమె కూడా అన్నది. అయితే భగవాన్ రప్పించు కొననిదే చలంగారు అక్కడకు ఎలా వెళ్ళగలడు? భగవాన్ గేలం చలాన్నే కాదు, పాల్ బ్రింటన్, సోమర్‌సెట్‌మామ్‌లను అక్కడకు రప్పించుకుంది. రంగనాయకమ్మగారు, అంటే చలం భార్యకు మతి స్థిరం తప్పిన మాట నిజమే కానీ, ఆమె చాలా కాలం అనారోగ్యంగా గడిపిన మీదట రమణస్థాన్‌లో అందరి సమక్షంలో సహజ మరణాన్ని పొందారు. అంతేగాని, ఆమె దీనంగా మరణించలేదు. చలం రెండవ కుమార్తె,నిర్మల(చే)చిన్మయానంద శిష్యురాలుఅయిందేమోకానీఆమె బొంబాయిలో -ఉద్యోగం చేసిచలం ప్రమేయం లేకుండా స్వతంత్రంగాజీవించి ఇటీవలనేవుద్యోగ విరమణ చేసి వచ్చింది. ఆమె అరవిందాశ్రమం, గోవాలో స్థిరపడవచ్చునని తెలి సింది. ఈ నిర్మల, తండ్రికి జీవితాంతమూ ఆర్థికంగా సహాయపడి, ఎటు వంటి అసౌకర్యమూ ఇబ్బందులూ లేకుండా అరుణాచలంలో రమణస్థాన్‌ను కాపాడింది. చలంగారు తన పుస్తకాలపై అన్ని హక్కులనూ యీ రెండవ కుమార్తెకే యిచ్చారు. నిజానికి అరుణాచలంలో వున్న రమణస్థాన్ ఇల్లూ వాకిలీ నిర్మలగారికి చెందినవే. చలం గారికి ఏమీలేదు.

ఈ వ్యాసంలో చలంగారి జీవితంలోని కొన్ని ముఖ్య ఘట్టాలను బలరామూర్తి గారు ప్రస్తావించి, వారి నిర్ణయాలను చాలా ,దూకుడుగా ప్రకటించారు. సౌరిస్ జీవి తం, జిల్లెళ్ళమూడి అమ్మ, ముమ్మడివరం బాలయోగి, యితర బాబాల జీవితం వంటిదికాదు. ఆమె భక్తి మార్గంలో ఆధ్యాత్మిక మార్గంలో యోగినిగా వున్న మాట నిజమే. కాని ఆమె పైవారివలె ప్రచారం కొరకు కానీ, కీర్తి కోసం గానీ, యితరేతర ప్రయోజనాల కోసం గానీ, ఏమీ చేయదు. ఇలాంటి వారందర్నీ హేళన చేసిన చలం, సెక్స్ సప్రెషన్ గురించి వ్యాఖ్యానాలు చేసిన చలం రమణ మహర్షి దగ్గరకు వచ్చేసరికి మారిపోయాడు. ఆ మార్పు యిదివరకటి అభిప్రాయాలపై తిరుగుబాటు కాదు. బుద్ధికి అతీతమైన పరిధిలో దానిని అర్థం చేసుకోవాలి అనేదే సౌరిస్‌ను గానీ, మరెవరినైనా గానీ అర్థం చేసుకొనడానికి మూలసూత్రం,

## స్త్రీకి పురుషునితో శాశ్వత వైరుధ్యం

బలరామమూర్తిగారు "ఈవ్యవస్థలో దోపిడీకి గురవుతూన్న స్త్రీ పురుష లిద్దర్నీ దృష్టిలోపెట్టుకోకుండా స్త్రీని వేరుచేసి, పురుషునిలో శాశ్వత వైరుధ్యాన్నివూహించు కున్నాడు" చలం అని అన్నారు. శాశ్వతమైన వైరుధ్యాన్ని గురించిన వుదాహరణ

లేమీ చూపలేదు. నికృష్ట స్థితికి గురై ముఖ్యంగా పురుషుడి చేతిలో నానా బాధలు పడుతున్న స్త్రీని గురించే ఆలోచించి నపుడు, దానికి బాధ్యులైన వారిపై ధ్వజ మెత్తడం, అటువంటి వారిని ద్వేషించడం—శాశ్వతమైన వైరుధ్యాన్ని సృష్టించ డం కిందకు వస్తుందా? ఆ తీవ్రత, ఆ ధర్మబద్ధమైన కోపానికి మార్క్సిస్టు అవగాహన లేకపోవడం నేరమని మందలించడం భావ్యమా? వర్గస్వభావం వర్గ తత్వం, వర్గవైరుధ్యాలు, వర్గసంఘర్షణ, వర్గపోరాటతత్వం చలానికి తెలిసి రచ నలు చేసివుంటే, ఏటుకూరి బలరామమూర్తిగారు మెచ్చుకునే వారు; చలంపై, ఎర్ర జండా కప్పేవారు పోయినపుడు. కాని చలం చేరుకున్నదే అరుణాచలం. అందు చేత ఆయనకు ఎర్రజెండా నీడలు అక్కర్లేదు. సామాజిక పరమైన స్వేచ్ఛకి, వైయక్తికమైన స్వేచ్ఛకి, వైరుధ్యాన్ని వూహించుకునే కమ్యూనిస్టు మేధావులు చలాన్ని అర్థం చేసుకోలేదు. స్వేచ్ఛ అనేది వైయక్తికం, మానసికం, భౌతికం, యింకా సామాజికం కూడా. కమ్యూనిస్టులే దీన్ని కంపార్ట్‌మెంటలైజ్ చేసి ఒకటి తమదైనట్లు, మిగతావి యితరులవైనట్లు పిడివాదాలు చేస్తూ వచ్చారు. చలం జీవి తాన్ని తాను నమ్మిన సిద్ధాంతాలకోసం బలిపెట్టడం వలన, అతనిలో హిపాక్రసీ మచ్చుకైనా లేకపోవడం వలన, అతనికి, అతని రీతులకి, అతని కుటుంబంలోని వ్యక్తుల మానసిక, భౌతిక, వైయక్తిక స్థాయికి మధ్య వుండే అంతరాల వలన ఏర్పడిన విపరిణామాలు అన్నిటికీ చలం బాధ్యుడు కాడు.

ఈ వ్యాసం చివరలో "చలం ఎగ్జిస్టెన్షియలిస్ట్" అని రామ్మూర్తిగారు తీర్మానించారు. చలంతాను అద్వైతి అని చెప్పుకున్నాడు. ఇతను ఏ విధంగా ఎగ్జిస్టె న్షియలిస్టో చెప్పలేదు.

## మార్క్సిస్టులకు అందని చలం

ప్రాచ్య, పాశ్చాత్య సిద్ధాంతాల సంఘర్షణలు భారతీయ రచయితల మనోమం డలంలో ప్రభంజనాన్ని సృష్టిస్తున్న కాలమది. చలాన్ని కేవలం మార్క్సిస్టు ధోరణిలో వెక్కిరించి అంతిమ నిర్ణయం చేసే బాధ్యత తమపై వున్నట్లు వ్రాసే వారికి చలం అందడు.

3-6-79 విశాలాంధ్ర ఆదివారం సంచికలో బలరామమూర్తిగారు చలాన్ని ఎలా చిత్తుచేశారో గమనిస్తే, వారి వ్యూహం అర్థమవుతుంది. 'స్త్రీ' రచనలో స్త్రీ సమా

నత్వం కోసం ఎలుగెత్తి అరిచిన చలం కనిపిస్తాడట. వాటి నన్నిటినీ వదిలేసి సెక్సే సర్వస్వం అనే భ్రమకులోనైన చలం "మ్యూజింగ్స్" లో కన్పిస్తాడట. "పాము మైకంలో తనగుడ్లను తనే తిన్నట్టు, రెండవచలం మొదటి చలాన్ని కబళించాడు" అనికూడ గట్టిగా అన్నారు. అప్పుడు తిరువణ్ణామలైకి వెళ్ళిన చలం ఎన్నో చలం? ఒక్కొక్క పుస్తకంలో ఒక్కొక్క చలం యీయనకు కనిపిస్తున్నాడు. చలం 'కమ్యూనిజంలో శ్రమకు విలువవుంది, అనుభవానికి విలువలేదు' అని అన్నందుకు గింజుకుంటున్నారు. సెక్సు అన్నిటికీ ప్రోద్బలం అని చలం చెప్పాడంటారేమిటి? ఫ్రాయిడ్ కదా చెప్పింది. ఫ్రాయిడియన్ థియరీలోని విపరీతాలకు చలాన్ని బాధ్యుడ్ని చేయనేల? సైకో ఎనాలిసిస్ ఓడిపస్ కాంప్లెక్స్ యిలాంటివన్నీ సాహిత్యంమీద పెత్తనం చేస్తున్న కాలంలో చలం రచనలు చేశాడు అనిగ్రహిస్తే చాలు. ఆయన, హేతువాదం పోయిన యుద్ధంతోనే ముగిసింది అన్నారు. స్త్రీ కి ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చింది. సెక్సు స్వాతంత్ర్యం లేదు అని అన్నారు. అది నిజమే కదా! "నేను ఆ విషయమై శోధిస్తున్నాను." అని అంటే వెక్కిరించనేల? నేను,నాఅనుభవం తప్ప మిగిలేది ఏమీ లేదుఅని చలం చెప్పుకున్నాడు. ఆ నేనుకూడా మిగలదని, ఆ నేనుఅనేదికూడా అంతమవడంకోసం రమణాశ్రమం వెళ్ళాడు. అది అతని జీవితంలో ఒకదశనుంచి మరొక దశకు పరిణామం. కమ్యూనిజం గురించి ఆయనకు అసమగ్రమైన, అపరిపక్వమైన అవగాహన వున్నందునకు ఆయనపై ఆగ్రహపడి లాభంలేదు.కమ్యూనిజం చాలామందిని ఇన్‌స్పైర్ చేసింది; చాలామందిని ఇన్‌స్పైర్ చెయ్యలేదు, ఆ తప్పు కమ్యూనిజానిది ఎట్లా అవదో, యీతప్పు చలానిది అట్లానే అవదు. చలం సమానత్వాన్ని స్త్రీకి మాత్రమే పరిమితం చేసి, సమాజంలోని మిగతా వర్గాల గురించి పట్టించుకోక పోవడం వలన, అది ఆయన బలహీనతగా మారి ఆయన పతనానికి కీలకమైందని బలరామమూర్తిగారు తీర్మానించారు. ఇక్కడొక విషయం చెప్పాలి. చలం భావకవిత్వయుగానికి. అభ్యుదయ కవిత్వ వుద్యమ ప్రారంభానికి సంధికాలంలో, రెండుప్రపంచ యుద్ధాలకాలంలో తన రచనలు చేశాడు. అతను భావకవుల కంటే, సంప్రదాయ కవుల కంటే, చాలామంది ఇతరేతర కవులు, రచయితల కంటే చాలా ముందుకువెళ్ళి సమాజాన్ని కుదిపే రచనలు చేశాడు. ఆయనను ఆకర్షించని విషయాలకు ఆయనను తప్పుపట్టనేల? స్త్రీ సమస్యల గురించి బాగా వ్రాసిన, లేదా వ్రాశానను కుంటున్న కమ్యూనిష్టు రచయితల కంటే చలం

బాగా వ్రాశాడు. బలరామమూర్తిగారు చలం రమణాశ్రమ జీవితాన్ని చలం పూర్వ జీవితాన్ని స్పృశిస్తూ,రెండవకుమారుడు వసంత్ అయిదారేళ్ళ వయసులో చీమలను చంపుతున్నప్పుడు, చలంగారు పుపయోగించిన"స్వేచ్ఛ" అనే పదాన్ని హేళన చేస్తూ, అది ఆ కుర్రవాడు పెద్దవాడై, తాగుబోతై, శాశ్వతంగా అదృశ్యమవడానికి కారణమైనట్లు వ్యాఖ్యానించారు. చలం జీవితం, ఆయన సిద్ధాంతాలు, ఆయన ఆలోచనలు ఎందుకూ పనికిరావని బలరామమూర్తిగారు అంతిమ నిర్ణయం చేశారు. చలం సిద్ధాంతాల దుష్ప్రభావం అందరికంటే ఎక్కువగా ఆయన కుటుంబం, పిల్లలు అనుభవించారు. ఆయనకూడ అనుభవించాడు. తిరుగుబాటు దారుడు విప్లవకారుడుగా మారక, మార్మికయోగిగా మారడం కంటే పతనం ఏమిటని ప్రశ్నిస్తున్నారు. ఈ ప్రశ్నలమధ్యలో నుంచే చలం జీవితం ప్రవహించింది. హేతువాదం అంటే రీజనబులిజమ్. గత ప్రపంచయుద్ధంతోనే ముగిసిందన్న చలాన్ని యీ ప్రశ్నలడగడమేమిటి? ఆయన కుటుంబం ఎలా బతికిందీ వారినే అడగాలి గానీ బలరామమూర్తిగారు ఎవరినీ అడక్కుండా నిర్ణయించడం భావ్యమా? తిరుగుబాటు దారుడైనా విప్లవకారుడైనా, మార్మికయోగి అయినా,సన్యాసి అయినా, ఆ ప్రభావం, కుటుంబం పైన పుండవచ్చు. కమ్యూనిజం ప్రిజమ్‌లోంచి ఎవరికేసి చూసినా, తాము తప్ప అందరూ పతనమైనట్లే కనిపిస్తారు కాబోలు. అయితే బలరామమూర్తిగారు కూడా చలం మీద యిన్ని విసుర్లు విసిరినా అతను ఎంత పతనమయ్యాడో టేపు తీసుకుని కొలిచి చెప్పినా, రచయితగా మాత్రం ఆయన స్థానం "చాలా గొప్పది, శాశ్వతమైనది, ప్రతిభావంతమైనది" అని ఒప్పుకున్నారు. భావావేశం, చిత్తశుద్ధి చలానికి వున్నాయని ఒప్పుకొన్నాడు. ఈ రెంటితో పాటు అద్భుతమైన శైలివుందని అంగీకరించారు,

## మ్యూజింగ్స్ ప్రామాణికమా?

ఇక చలం 'మ్యూజింగ్స్' రచన దగ్గరకు వస్తే — అవి ఒక విధంగా లౌడ్ థింకింగ్ చేయడం లాంటివి. అలా ఆలోచించడం మనసు పొరల్లోంచి వొలిచి సంగతులను బయట పెట్టడం-అదొక విన్యాసం. అవి అన్నీ అతను అలా చెప్పినది అతను తన జీవితంలో ఒక కొత్త మార్పును పొందే దశలో. ఇంకా స్పష్టం చేయాలంటే, వాటిలో అతని ఆందోళన, ఆవేదన, ఆలోచన అన్నీ పెనవేసుకుపోయాయి.వాటిని అధికారికంగా తీసుకునివాదించడం అంతఅవసరం

కాదేమో? రచయిత తనతో తానే కుస్తీపడుతూ వుంటాడు. ఇవి అనుమానంగాను అసంకల్పితంగాను వుండవచ్చు. ఈ'ఆత్మావలోకనం' ఒక కందుకక్రీడ. చలాన్ని అతని జీవితాన్ని వీలైనన్ని భాగాలకింద విభజించి వాటిని విడిగాను, పరస్పరాశ్రయం గాను పరిశీలించడం మంచిదని ఒక మంచిమాట అన్నారు. చలం స్వేచ్ఛాప్రేమ సిద్ధాంతాన్ని గురించి ఇది ఎక్కడైనా వుందాఅని పరామర్శిస్తూ, "తప్పో. ఒప్పో, స్త్రీ పురుషులిద్దరికీ ఒకేనైతిక ప్రమాణాన్ని వర్తింపచేయండి అని ఎలుగెత్తి చాటినవాడు చలం"అని కండిషనల్‌గా ఆ మేరకు చలం సాహిత్యం తెలుగు సాహిత్య జీవితంలో ఆరోగ్యకరమైన అంశాన్ని ప్రవేశపెట్టిందనీ, సాంస్కృతిక పరివర్తనకు తోడ్పడిందనీ, యింకా తోడ్పడుతూనే వుందని అంగీకరించారు. ఆమాత్రం చాలదా? చలం, శృంగారాన్ని ఆయుధంగా వాడుకున్నానని, అది అడ్డంపెట్టి, కసిదీరా తిట్టవలసిన వాటినన్నిటినీ తిట్టానని తనే చెప్పుకొన్నాడు. అయితే బలరామమూర్తిగారు నిర్ధారించినట్లు చలం రచనలు వివాహవ్యవస్థను ధ్వంసం చేయాలనేవి గనుక విశృంఖలతకు దోవతీసి, క్షీణసంస్కృతికి బీజాలు వేశాయా లేదా అనే విషయం పై ముందు ముందు సమాజశాస్త్ర పరిశోధకులెవరైనా విశ్లేషించి తేల్చాల్సి వుంటుంది.

## సృజన తీర్పు

'సృజన' జూన్ 79 సంచికలో విప్లవ రచయిత, కవి శ్రీ వరవరరావు చలానికి శ్రద్ధాంజలి ఘటిస్తూ,

"తనలోనే ఈ ప్రపంచముందని, ఈ ప్రపంచంలో తానున్నానని, ప్రపంచమంతా ఒక ముద్దకాదని, ఇందులో రెండు ప్రపంచాలున్నాయనీ అంతిమ పరిశీలనకి ప్రజలదైన రెండో ప్రపంచం జయిస్తుందని అటువేపుగా ప్రపంచం నడుస్తుందని చలానికి చెప్తే అభిమానం చూపుతాడు." అన్నారు. వరవరరావు చలం గురించి 'సృజన'లో రాసినదంతా ఆయన మాటల్ని ఆయనకు అప్పగించడమే. ఇందులో ఒక చక్కని సదసత్సంశయాన్ని యిలా ప్రకటించారు— "కాని ఇపుడు వాస్తున్న కొత్తదనాలకే ప్రజలు ఇంకా అలవాటు కాలేదే.... ప్రజలు గాబరాపడి చదవడం మానేస్తారని, అనుమానపడతాడు చెలం. "Man of little faith" అని ఆయన మాటల్లోనేచెప్తూ ఆయన మనుషుల మీద విశ్వాసం లేని మనిషిగా సూచించబోయాడు. అయితే మార్క్సిస్టులకి తప్ప మనుషుల మీద మరెవరికీ నమ్మకం వుండ

జాలదని అనుకోవడం ఒక మార్క్సిస్టు మూఢ నమ్మకం కాదా? అలాగే ప్రజలలో రెండు ప్రపంచాలున్నాయని వ్రాయటంలో ఏ ప్రపంచం తనదో తెలుసుకోలేని అజ్ఞానంలో చలం జీవించాడని చెప్పకుండా చెప్పడం వరవరరావు రచనలో వుంది.

వరవరరావులాంటి విప్లవ కార్యకర్త, మేధావి కూడా ఎంతసేపూ తన దృష్టిలోంచే, తన సిద్ధాంత పరమైన అవగాహన లోంచే చలాన్ని కొలవబోవటం ఈ క్రింది పేరాని బట్టి మనం గ్రహించవచ్చు. (వీరందరికీ చలాన్ని అన్ కండిషనల్‌గా ఒప్పుకోవటం ప్రమాద మనే భయం లోపల వుంది.)

"తన అనుభవాన్ని ప్రపంచానుభవంలో భాగంగా, తన యుద్ధారావాన్ని సమాజంలో తనలాగే సామరస్యం కుదరక సమరం చేస్తున్న ప్రజల పోరాటంలో భాగంగా, తన స్త్రీని స్త్రీ విమోచనోద్యమంలో, అది కూడా భాగమైన ప్రజా విమోచనోద్యమంలో అంశంగా చలం గుర్తించి, ఆ కఠినమైన సత్యాన్ని స్వీకరించి వుంటే ఈశ్వరునితో రాజీపడేవాడు కాడు. సాహిత్య సామాజిక సంచలనాన్ని సృష్టించిన నిజాయితీపరుడు చలం ఈశ్వరాశీర్వాదంతో అచలంగా ఆగిపోయేవాడు కాదు."

పై పేరాలో వరవరరావు తెచ్చిన చలంపై అభియోగానికి ఆయన మార్క్సిస్టు కాకపోవడానికి గల హేతువులను సూత్రబద్ధంగా ఇదివరకే వివరించడమైనది. చలం కమ్యూనిస్టు అయివుంటే ఈశ్వరునితో రాజీపడే వాడు కాదు అనే వాదన చలం జీవితాన్ని సాహిత్యాన్ని పరిశీలించిన వారికి హాస్యాస్పదంగా కనిపిస్తుంది. అయితే వరవరరావుది విష్‌ఫుల్ థింకింగ్ అని సరిపెట్టుకోవచ్చు. చలం ఈశ్వరాశీర్వాదాలతో ఆగిపోలేదు. ఇంకా ముందుకే వెళ్ళాడు. దానిని మనం టోటల్‌గా తిరస్కరించడం వలన చలం మనకు, మన ఆలోచనల, ఊహల, సిద్ధాంతాల పరిధిని బట్టి వేస్టయినట్టు కనబడవచ్చు. చలానికి కమ్యూనిజం కూడా అలాగే Wasteful గా కనబడి వుండవచ్చుకదా! మనం ఎంత గింజుకున్నప్పటికీ చలం వీరేశలింగం గారి చేత రఘుపతి వెంకటరత్నం నాయుడు చేత, ఇంకెవరి చేత కూడా, ఆఖరికి లీలగారి చేత కూడా నడిపింపబడలేదు. ఆయన వ్యక్తిత్వం అలాటిది.

# తిరస్కార దృష్టి

శివసాగర్ అనే విప్లవ రచయిత "రెబెల్" అని చలం గురించి రెండు పేజీల చిన్నవ్యాసం 'సృజన'లో సమర్పించారు. ఈయన వరవరరావు కంటే చాలా దూకుడు. చలం మీద జడ్జిమెంట్ యివ్వాలనే తహ తహ కూడా చాలా ఎక్కువ. చలాన్ని యీయన సామాజికాభివృద్ధి సూత్రాలప్రకారం కొలవదల్చుకున్నాడు. ఆయన పాత్రలు "విముక్తి చెందవు. వికసించవు" అన్నాడు. ఇంతా నయం-మనుషులు కారు అనలేదు! ఏ దృష్టిలో విముక్తి చెందలేదు, ఏ దృష్టిలో వికసించలేదు? మార్క్సిజం ప్రకారం అవి విముక్తి చెందనివి, వికసించనివి అని యీయన భావం. కాని కేవలం రెబెల్ కనుక, మార్క్సిస్టుగా మారకుండా కమ్యూనిస్టు విప్లవకారుడుగా రూపుదిద్దుకోకుండానే, అరవిందుడు, సావర్కార్‌ల మతంలోకి, మతంలోకి, వెళ్ళకూడని చోటికే వెళ్ళినట్లు కించిత్ తిరస్కార భావంతో చెప్పారు. చలానికి టెర్రరిస్టు లక్షణాలన్నీ వున్నట్లు, అవన్నీ యీయన గమనించినట్లు. వ్యక్తిగత ఆలోచనలు, నిర్ణయం చేయడం మహా పాపంలాగ చారిత్రక అవగాహనలేని వ్యక్తిలాగ చలంగురించి అభిప్రాయాలు ప్రకటించారు. ఇవన్నీ ఎందుకు? పాఠకులు ముఖ్యంగా మార్క్సిస్టు అవగాహన గల పాఠకులు చలం గురించి పొరబడి ఆయన మార్గాన్ని, ఆయన రచనల్ని చదివి మరోదారి పడతారేమోననే శంకతో జడ్జిమెంట్ యిచ్చేశారు. అయితే "భూస్వామ్య వ్యవస్థలోని కొన్ని సామాజిక విలువలపై సాహిత్య బాంబులు విసిరినందుకు అలాటి వారినందరినీ గౌరవించినట్లుగానే చలాన్ని కూడా గౌరవించడానికి" వీరికి అభ్యంతరాలు లేవుట. ఈయన కూడా బలరామమూర్తిగారి లాగానే, స్త్రీలో సెక్సు జీవిత మూలసూత్రంగా ఎంచుకున్నాడని చలం మీద ఒకరాయి విసిరాడు. ఇంతకీ సమస్యలన్నిటికీ పరిష్కారం కమ్యూనిజం అనే నమ్మకంవైపు ప్రయాణించకుండా బిహేవియరల్ సైకాలజీలోకి పోయాడన్నారు. మరొక జడ్జిమెంటు కూడా యిచ్చారు, "ఒక వ్యక్తి వాదిగానే స్త్రీ గురించి తపన చెందాడు గనుక ఆయన స్త్రీకి స్వేచ్ఛ లభించలేదు." ఆయన స్త్రీ అనడంలో వెక్కిరింత లేదా? 'ఆయనకూ స్వేచ్ఛ లభించలేదు' అనికూడా అన్నారు. ఈ స్వేచ్ఛ ఏమిటో, ఎవరికి లభిస్తుందో ఎవరికి లభించదో శివసాగర్ కొలిచి తూచి చెప్పగలిగినట్లు!

"మార్క్సిస్టులు కొన్ని సామాజిక నియమాలకు వ్యతిరేకంగా పోరాడు తారు. కొన్ని సామాజిక నియమాలను ఆహ్వానిస్తారు- చలం అన్ని సామాజిక నియమాలనూ వ్యతిరేకించాడు" సమాజంలో మార్క్సిస్టు కానివారి కంటే మార్క్సిస్టులు ఎంత గొప్పవారో శివసాగర్ చాలా ఆత్మవిశ్వాసంతో, అహం కారంతో వ్యక్తీకరిస్తున్నాడు. చలం తన అహంకారాన్ని చంపుకోవడం కాదు- లేకుండా చేసుకోవడానికి- చాలా ఏళ్ళు సాధన చేశాడు. వీరు ఏమీ సాధించకుండా అందరినీ విమర్శించి, అందరినీ హేళన చేసి, అందర్నీ పనికిరాని వారిగా చిత్రించి తామొక్కరే ఈనాధ్యతను తమ భుజస్కంధాలమీద స్వీకరించినట్లు ఎంత గర్వంగా మాట్లాడుతున్నారో? ఇక్కడ తమ పరిజ్ఞానం చాలదన్నట్లు విమానం నడిపే ఉదాహరణను తెచ్చి- ఏంగిల్స్ ఏమన్నాడో మసందర్భ్నే చూడమంటు న్నారు. ఇక్కడ రావిశాస్త్రిగారు ఏదో ఒక సందర్భంలో చెప్పిన శివలింగం ఉదా హరణ గుర్తుకు వస్తున్నది. అది రాయటానికి వీల్లేనిది. అయితే "చలం స్త్రీని ఉరితాళ్ళతో బిగించిన సమాజానికి షాక్ ట్రీట్‌మెంట్ యిచ్చాడు. ఆనాడు అది అవసరమే. కదిలించకుండా ఆలోచనలు కదలవు. ఆనాటి చారిత్రిక పరిస్థితుల్లో ఆ షాక్ లేకపోతే ఈనాడు ఆలోచనలు ఇంత ముందుకు పోయి వుండేవికావేమో" అని ఆయన సాధించిన ప్రయోజనాన్ని కూడా సందేహాస్పదంగా చూశారు. ఇంతేకాదు, "సాహిత్యంలో చలం ఆలోచనలూ. కళాసృష్టీ. గీటురాళ్ళు కాక పోయినా నిస్సందేహంగా మైలు రాళ్ళు". ఈ గీటురాళ్ళేమిటో, మైలురాళ్ళే మిటో, రాళ్ళెత్తిన కూలీలకే తెలియాలి. ఎందుకలా దొంక తిరుగుడుగా చలం మీద విసుర్లు విసరటం? బహుశా మార్క్సిస్టులకు బతికివున్న వారిపైనే సెంటి మెంట్లు వుండవు. చనిపోయినివారిపై అసలే వుండవు. వారికి వారి మార్క్సిజం మీద ఎంత గౌరవముందో తెలియదుకానీ, ఎవరిమీదా ప్రేమాభిమానాలు, గౌరవమూ శుద్ధ పూజ్యం.

## విరసం జోహార్లు

ఈ సంచిక 43వ పేజీ నుంచి 68వ పేజీ వరకు చలం సంస్కరణకి కేటాయించింది. ఇందులో "జడ సమాజానికి చలం షాక్ ట్రీట్‌మెంట్" అనే శీర్షికలో చలం గురించి శ్రీశ్రీ అభిప్రాయాలను ప్రకటించారు. చలం భావజాలం అని శ్రీ కె. వి. రమణారెడ్డి సుదీర్ఘమైన వ్యాసాన్ని ప్రకటించారు

ఇది చలం ప్రత్యేక సంచిక కాదు గానీ చలం సంస్మరణకు వయోగించిన పేజీల్లో చలానికి జోహార్లు సమర్పిస్తూ విరసం తీర్మానం చేసింది. ఆ తీర్మానం పూర్తి పాఠం :—

"స్త్రీ విముక్తి గురించి, పిల్లల భవిష్యత్తు గురించి, విద్య గురించి, తీవ్ర మైన తపన చెంది, తన నిజాయితీతో కూడిన ఆరాటాన్నే అగ్నిసదృశమైన రచనలుగా వెలువరించిన చలం తన ఎనభై అయిదవ ఏట మొన్న రమణస్థాన్ లో మరణించారు. సమాజంలోని రుగ్మతల కన్నింటికీ, అందులోనే భాగమైన స్త్రీ దాస్యానికి శాస్త్రీయమైన దృక్పథంతో పరిష్కారాలు వెతుకలేక పోయినా ఫ్యూడల్ విలువలతో కుళ్ళిపోయిన తెలుగు సాహిత్యంలోకి సమానత్వం, స్వేచ్ఛ లాంటి బూర్జువాభావాల నైనా ప్రవేశపెట్టి ఆలోచింప చేసినవాడు, సంచలనం సృష్టించినవాడు చలం. చలం రెండవ దశయైన రమణాశ్రమ జీవితం ఆయన వ్యక్తికే సంబం ధించింది. అధునిక తెలుగు సాహిత్యంపై గానీ, యువతరంపైగానీ, ఏమీ ప్రభా వం లేదు. చలం రెవల్యూషనరి కాకపోవచ్చు, కాని రెబెల్. ఆయన సాహిత్యం లోని, జీవితంలోని తిరుగుబాటు తత్వాన్ని చారిత్రక దృష్టితో విరసం విశ్లేషించి తెలుగు ఆధునిక సాహిత్యానికి ఆయన అనుకూలమైన దోహదాన్ని గుర్తిస్తుంది.

తన కమిట్‌మెంట్ మనం ఏకీభవించేదైనా కానిదైనా దానికోసం జీవితాంతం నిలిచి ఆయనే అన్నట్లు అంతర్ బాహిర యుద్ధారావమే సాహిత్యంగా నిండు జీవి తాన్ని గడిపిన చలం నుంచి నేర్చుకోవాల్సింది నిర్భయమూ, నికార్సయిన నిజాయితీ.

చలం మరణం పట్ల విరసం. వరంగల్ తన ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేస్తోంది"

## చలానికి యవ్వన పరిణతి లేదా?

శ్రీ. కె. వి, రమణారెడ్డి 'చలం భావజాలం' అనే వ్యాసంలో చలం మీద మరో అభియోగాన్ని తెచ్చారు.

"యవ్వనవనం అనేది, చలం చలామణి చేసిన ఒక మాట- ఇంగ్లీషులో Adolescence. ఇది వయస్సుదే కాక మనస్థితికి గూడ వర్తించేది, నూనూగు మీసాలు, ఆశా ఆకాశపుష్పాలు, అసాధ్య ఆదర్శాలు, వెర్రిమోజులు, ఆశానిరాశల

వుయ్యాలతోపులు, ఇలాంటి వెన్నోయీ దశకు సూచనలు. మెత్తానికి, మనస్సును చిలికి 'సహజాతాలను' (Instincts) అట్టడుగు నుంచి పైకి బయటకి తీసే పరిస్థితి ప్రతి మనిషి అనుభవం లోనిదే. అయితే దీన్ని దాటుకుని అనేకులు యవ్వనానికీ పరిణతికీ చేరుకుంటారు. నూటికి ఒకరో యిద్దరో అక్కడే ఆగి, దాన్ని శాశ్వతం చేసుకుంటారు. చలం అలాంటి వ్యక్తి." చలం పరిణత దశకి చేరుకోలేదనీ అతను యవ్వన ప్రారంభ దశలోని అనుభవాల దగ్గరే ఆగిపోయిన వ్యక్తిగా రమణారెడ్డి కొత్త సూత్రాన్ని బయటకు లాగారు. చలం రచనలు Adolescence నుంచి అపరిపక్వ భావస్థితినుంచి బాల్యదశకు పునాదులుగాను, స్వానుభవశకలాలు గాను, అనుభవం తొడిమపట్టు వీడని వూహలు గాను రమణారెడ్డికి కనిపించాయి. కాల్పనిక వాదయుగంలో పుట్టినందున చలం సమకాలిక సామాజిక వాస్తవంతో తీవ్రంగా స్పర్థించడం ఆశ్చర్యకరం కాదన్నారు. చలం అక్షరాలా పితృశిక్షణ క్రింద పుట్టిపెరిగిన వాడు కాదు. పితృశిక్షని తీవ్రంగా వ్యతిరేకించిన బాలుడు. ఇంకా ముందుకు వెళ్ళి చలంది అత్యాశ, ఆశ తీరనప్పుడు అసంతృప్తి అందుకే 'నా బుద్ధి చంచలం' అని చలం సరిపెట్టుకున్నాడు, అన్నారు. నోబుల్‌శావేజ్‌లా జీవించగోరిన చలం, భావపరంగా పారిశ్రామిక విప్లవానికంటే ఎంత క్రిందటి సరళ, సుందర జీవితాన్ని వరించాడన్నారు. పేదరికమైనా సంతోషం, సంతృప్తి వుంటే స్వర్గభాగ్యమేనని చలం తత్వం. ఇది సామాజిక పురోగతికి తీవ్రమైన హాని కల్పించిన సనాతన సంతృప్తి దృక్పథం అన్నారు. సంతృప్తికి సనాతన మేమిటి? చలం మార్గాన్ని వివరిస్తూ— "కాల్పనికవాదం బూర్జువా వ్యవస్థ అవతరణకు వట్టి నిరసన మాత్రమే కాదు. ఆదిమకాలానికి ప్రకృతి ఒడిలోకి, పారిపోదామనే వైఖరి ఒక వంక. వ్యక్తి విశిష్టతను విపరీత స్థాయికి పెంచి సామాజిక బాధ్యతా రాహిత్యంగా ముదిరినవైఖరి మరొక వంక —యిలా ఎన్నోపాయలు."

అంటే చలాన్ని బూర్జువా వ్యవస్థను కూడ నిరసించి, ఆదిమ కాలానికీ ప్రకృతి ఒడిలోకి పారిపోదామనుకున్న వ్యక్తిగా గుర్తించి, అతనికి సామాజిక బాధత్యలు గిట్టవని రమణారెడ్డి తేల్చిచెప్పారు. ఈ కాల్పనిక వాద దృక్పథం, పలాయనవాద దృక్పథం, బూర్జువా సమాజం పట్ల నిరసన యివన్నీమాటల గారడీయే గాని చలం ప్రస్తుతం వేటిలోనూ యిమడడు. అతన్ని కొన్ని సూత్రాల ద్వారా, కొన్ని సిద్ధాంతాల ద్వారా కొలవడం మార్క్సిస్టుల బలహీనతగా మనం గుర్తించి

క్షమించాలి. చలాన్ని తిరస్కరించడానికి యివి వుపయోగపడుతాయి గాని, చలాన్ని అర్థం చేసుకోవడానికి యివిపనికిరావు.

## అదుపు తప్పిన మహోందోళన

చలం సాగించిన స్త్రీ పరమైన ఆందోళనను భావ విప్లవ ప్రారంభంలో తప్పనిఅనిబద్ధమైన, అదుపు తప్పిన మహోందోళనగా కె. వి. ఆర్. చిత్రించారు. ఈ పేరా చూస్తే—

"భర్తల నిరంకుశత్వానికి సొంత ఆస్తి హక్కు మూలమైనప్పుడు, ఆర్థికంగా స్త్రీకి ఆస్తి హక్కు కలగనంతవరకు తన కాలిమీద తను నిలవడం అసంభవం.విద్య, హోదా, అధికారం, స్త్రీని ముందుకీ పైకీ తీసుకు రావచ్చు గాని స్త్రీ జాతిపరాధీనతను అంతమొందించడానికి ఆర్థిక పునాదిని పూర్తిగా మార్చే విప్లవమొక్కటే ప్రాతిపదిక. విప్లవానంతర కాలంలో,అంటే ఆర్థిక పునాది మారిన తర్వాత గూడా, ఇంకా చాలా కాలం తర్వాతనే ఈ 'మొనాగమీ' క్రమేపీ కృశించి, యువతీ యువకులు తమ హృదయాల్ని భావాలనుబట్టి కూడి వుండగలిగినంత కాలం కూడివుండి, విడిపోవలసినప్పుడు విడిపోయే స్వేచ్ఛ సాధ్యమౌతుంది. ఇంతటి సుదూర విషయం మార్క్సిస్టు మహోపాధ్యాయుల విషయంలోనైనా ఊహా చిత్రమే గాని దృశ్యం కాదు. కాబట్టి ఈ అంశంలో చలాన్ని అతిగా లోపమెన్నడం సబబు కాదు, జీవితం ద్వారాసాహిత్యం ద్వారా స్త్రీ విషయంలో చలం కలిగించిన సంచలనం, భావ విప్లవ ప్రారంభంలో తప్పని అనిబద్ధమైన, అదుపు తప్పిన మహాందోళ" ....

చలానికి కొన్ని ప్యాసు మార్కులు యిచ్చారు కె.వి.ఆర్. విప్లవం తర్వాత ఏర్పడే సమాజంలో కూడా స్త్రీల పరిస్థితి ఆర్థికంగా బాగుపడుతుంది గాని, వివాహ వ్యవస్థకు భిన్నమైన ఆదర్శ స్త్రీ పురుష సంబంధాల అవతరణ సుదూరస్వప్నమేనని కె.వి.ఆర్.అంగీకరించారు.చలం అంతదాకా ఓపిక పట్టలేకపోవడంమార్క్సిస్టులుక్షమించలేకపోయినాచరిత్ర క్షమిస్తుంది.చలంలెనిన్ ఉటంకించినగ్లాస్ఆఫ్‌వాటర్ థియరీకి దగ్గరగా ఎప్పుడూ రాలేదు. కాని, కె.వి.ఆర్ "దాహమైనప్పుడు గ్లాసెడు నీళ్ళు గటగటా తాగి, దాహం తీరాక ఆ గ్లాసుని గిరాటుకొట్టవద్దు. ఉద్దేశం ఏదైనా చలంచేసింది యిలాంటిదే" అని ఒక పెద్ద అభాండాన్ని అయన నెత్తిమీద వేశాడు.

## చలాన్ని నిరాకరించడానికి ఎత్తులు

చలం బిడ్డల శిక్షణ గురించి చెప్పిన దానిని,చేసిన దానిని ఆయన వ్యక్తిగత జీవితంలోని ఫలితాలను బేరీజువేసి, పిల్లల పెంపకంపట్ల ఆయన అభిప్రాయాలను తిరస్కరించడానికి అవకాశమైతే వుందిగాని, ఆ ఆదర్శాలను అందుకోవడానికి ప్రయత్నం చేయకుండా వెక్కిరించడం మర్యాదకాదు. వ్యవస్థ మంచిదా చెడ్డదా అన్న విషయం కాదు. విద్య విషయంలో లోపభూయిష్టమైన విధానాల్ని వ్యవస్థ అనుసరిస్తున్నది. పిల్లల వ్యక్తిత్వం, వికాసం, వారికి కావలసిన స్వేచ్ఛ విషయంలో యిప్పుడున్న వ్యవస్థ లోపభూయిష్టమైనదే. దీనిపై చలం తిరుగుబాటు తీవ్రమైనది గాదా? అతని పాయింట్లు మాత్రం వెక్కిరించి తీసిపార వేయదగినవి ఎంత మాత్రం కావు. చలం మీద మార్క్సిస్టులు చేసిన దాడి అంతా వారి పద జాలంలోను, భావజాలంలోను చలం యిమడలేదనే దుగ్ధతోనే. ఈ వాక్యాలు చూస్తే "తన మనస్సులో మన్మథుడికీ, ఈశ్వరుడికీ మధ్య సాగుతూ వచ్చిన పోరాటంలో చివరికి గెలిచిందెవరు? కాబట్టి భూస్వామిక భావజాలం నుంచి చలం పూర్తిగా స్వతంత్రించాడనడం నిజంకాదు." ఈ విభజన చలానికి వర్తింపచేయడం చలం చేరుకున్న వున్నత పరిధిని అర్థంచేసుకొనడానికి నిరాకరించడం కిందికి వస్తుంది. చలం అద్వైత భావనను అంకితమైన వ్యక్తి కనుక అతనిని ఆ దృష్టితోనే పరిశీ లించాలి. మార్క్సిజమ్ పరిధిలోనికి రానివారిని ఆ పదజాలంతో ఎంత బాదినా ఏమి ప్రయోజనం? కె. వి. ఆర్ కి ఆఖరికి చలం శైలినికూడా మెచ్చుకొనడానికి స్వల్ప అభ్యంతరాలున్నట్లు కనిపిస్తుంది. 'చలం రచనా శైలి ఆధునిక రచనా శైలి అని పించుకోదు' అన్నారు. శైలి విషయానికి వస్తే గురజాడ ప్రమాణం కాదు. గురజాడ కథలు రాసేనాటికి తెలుగు వ్యవహారిక వచనం స్థిరపడలేదు. చలం శైలి గురజాడ కంటే ఎన్నో మెట్లు మిన్న. గురజాడ రచనా శైలిని కుటుంబరావే స్వీకరించా డన్నారు. కుటుంబరావు, గోపీచంద్, ధనికొండ హనుమంతరావు యింకా ఎందరో చలం శైలిని, కథన పద్ధతిని ఒరవడిగా పెట్టుకున్నారు. గురజాడ కథలు, చలం కథలను పునః పరిశీలించి బేరీజు వేస్తే చలం ముందు గురజాడ తేలి పోతాడు. గురజాడ అమ్యుడే కానీ, వచన శైలికి ఆరాధ్యుడు కాదు.

## యుగాల ప్రసక్తి

'సృజన' లో ప్రచురించిన యీ వ్యాసం చివరలో, "చలం యుగం చలం జీవితకాలం లోనే ముగిసింది" అన్నారు. అంటే, అతను తన కాలం చెల్లాక కూడా జీవితాన్ని కొనసాగించిన దురదృష్టవంతుడనా అర్థం! అసలీ యుగాల ప్రసక్తి దేనికి? పైగా, చలం భావజాలంలోని అభ్యుదయాంశను వేరు చెయ్యడం చలానికి అపచారం అనే ఫ్యూడల్ ప్రయోగాన్నివాడి చలం భావజాలంలోని అభ్యుదయాంశ సమాజం పరివర్తనకు తప్పనిసరి అని కె. వి. ఆర్ తప్పించుకుంటున్నాడు. మొత్తానికి కమ్యూనిస్టుల చేతుల్లో చలానికి ప్యాసుమార్కులు రావడం గగనకుసుమమే. వారికి నచ్చిన వారెవరూ లేరు. వారు మెచ్చిన వారెవరూ లేరు. వారి ఆత్మ విమర్శకు, వారి జార్గన్ ముందు సాక్షాత్తూ మార్క్స్, మావో, లెనిన్ దిగివచ్చినా నిలబడజాలరు.

## రంగనాయకమ్మ నివాళి

ప్రజాసాహితి మే 1979 వ సంచికలో "చలం వెళ్ళిపోయారు" అనే పేరిట సంపాదకీయం వ్రాశారు. మార్క్సిస్టు భావాలను కానీ. కమ్యూనిస్టు పుద్యమాల ప్రభావాన్ని కానీ దరిచేరనివ్వని చలం మార్క్సిస్టులకు కొరకరానికొయ్య అయ్యాడు. 'మహా ప్రస్థానా'నికి పీఠిక రాసిన తరువాత కమ్యూనిస్టులు చలాన్ని మెచ్చుకోవడం ప్రారంభించినా వారిపట్ల అతను ఆకర్షితుడు కాకపోవటం వలన చలాన్ని దూరంగా వుంచారు.అంతేకాదు, వారు చలానికి సామాజిక స్పృహ లేదని చలానికి సంఘదృష్టి, సంఘంపై గౌరవం లేదని నిందించారు. కమ్యూనిస్టు సమాజం ఏర్పడిన తరువాత అన్ని సమస్యలూ (స్త్రీ సమస్యతో సహా) అదే పరిష్కరిస్తుందన్న కొత్తరకపు మూఢ విశ్వాసాన్ని చలం ఖాతరు చేయకపోవడం కూడా వారికి ఆగ్రహం తెప్పించింది. ఈ పరిస్థితులలో 'ప్రజాసాహితి' వారు తమ సంపాదకీయంలో చలాన్ని మార్క్సిస్టు భావాల ప్రభావానికి లోనుకాకుండా దూరంగా వున్నందుకు అతనిని సమర్థించడం ఆరంభించినట్లు కనిపిస్తుంది. ఉదాహరణకు—

"చలం ప్రధానమైన రచనలు చేసిన కాలంలో(1927 నుంచీ 1936 వరకు) తెలుగు దేశంలో కమ్యూనిస్టు రాజకీయాల ప్రభావం అంతగా లేదు.సమాజం గురించి శాస్త్రీయమైన దృక్పథం కలిగించే మార్క్సిజం కార్మిక పుద్యమాల

రూపంలోగానీ సాహిత్య పుద్యమాల రూపంలోగానీ ఆనాడు అందుబాటులో లేదు" అన్నారు.

చలాన్ని ఎవరూ ఒక గాడిన కట్టివేయ లేరు. బూర్జువాదేశాల అభ్యుదయభావాలు అతడ్ని ప్రభావితం చేసాయన్నారు. ఆ మాటకు వస్తే తెలుగులో అనేక సాహిత్య ధోరణులన్నీ యించుమించుగా పాశ్చాత్యదేశాల భావపరిణామాన్నుంచి సంగ్రహించినట్టివే. ఇంతేకాక, "సమాజంలో స్త్రీ పురుష జీవిత సంబంధాల్నీ, వివాహ వ్యవస్థనీ, విద్యావిధానాన్నీ తను ఖండించిన ప్రతీ ఒక్క విషయాన్ని— ఏ సూత్రాలు నిర్దేశిస్తున్నాయో తెలుసుకోకుండా చలం సాగించిన పోరాటం ఆయన్ని ఒక రకమైన మానసిక సంక్షోభంలోకి నెట్టింది" అని నిర్ణయించారు.

కమ్యూనిస్టు విమర్శకులు సైతం ఆనాటి చారిత్రక పరిస్థితుల్ని, ఆయన రచనల స్వభావాన్ని, అందులోని అభివృద్ధికరమైన అంశాన్నీ పరిశీలించకుండా ఆయన రచనలు సరిగా చదవకుండా, నిజాయితీ లేకుండా ఆయనను, అరాచక వాది అని, విశృంఖలత్వాన్ని బోధించాడని, స్త్రీ విముక్తిని కోరడం నాటకమని వాఖ్యానించడాన్ని యీ సంపాదకీయంలో నిరసించారు. స్త్రీ పురుష సంబంధాలలో మార్పు రానంతకాలం చలం రచనలు వాటి నిజాయితీ వల్లే అవి నిలబడతాయి. ఆ తరువాత అవి చరిత్రలో భాగమై మనుతాయి. వివాహవ్యవస్థలో మార్పురాలేదు. పురుషాధిపత్యం యథాతథంగా కర్కశంగా యింకా కొనసాగుతూనే వుంది. బాలికల వివాహ సమస్య యింకా భయం కరంగానేవుంది. స్త్రీల సజీవ దహనాలు, చిత్రహింసలు, చంపడాలు, కోడండ్రిటి కాలు విపరీతంగానే వుంటున్నాయి. ఉద్యోగినులైన స్త్రీలు, అభద్రతాభావంతో కొత్త సమస్యలను ఎదుర్కోవలసి వస్తున్నది. స్త్రీని యింకా భోగవస్తువుగానే తప్ప ఒక మనిషిగా చూడటం ప్రారంభం కాలేదు. చలం ప్రారంభించిన పోరాటం ఏదో ఒకరూపంలో సాగవలసేవుంది.

చలం రచనలు యీనాటి సమాజానికి అవసరం లేనివే కావు, మరిచిపోవలసినవి అంతకంటే కావు. ఈ సందర్భంలో ప్రజాసాహితి సంపాదకీయంలోని యీ క్రింది పేరాలు గమనింప తగినవి.

"ఏ సమాజంలో అయితే-స్త్రీలు పురుషులకు దాస్యం చెయ్యరో, ఏ సమాజంలో అయితే పురుషాహంకారం సంపూర్ణంగా నశిస్తుందో, ఏ సమాజంలో అయితే స్త్రీ పురుషులు సమానులై స్నేహితులై జీవిస్తారో; ఏ సమాజంలో అయితే విద్య నిజమైన జ్ఞానాన్ని యిస్తుందో, ఏ సమాజంలో అయితే మనుషుల మధ్య కపటత్వం లేని స్నేహ సంబంధాలేర్పడతాయో ఆ సమాజానికి, ఆ సమాజ నిర్మాణానికి తోడ్పడేవిగా చలం వంటి వారి రచనలు నిలుస్తాయి.

ప్రపంచ జనాభాలో సగభాగమైన స్త్రీల శ్రేయస్సు, అభ్యుదయాన్ని చిత్తశుద్ధితో కోరిన ప్రజారచయిత, సమాజమిత్రుడు—చలం."



చలంతో రంగనాయకమ్మ

ప్రముఖ రచయిత్రి రంగనాయకమ్మ ఒక ఇంటర్వ్యూలో చలం గురించి తమ అభిప్రాయాలు చెప్తూ, "సామాజిక అభివృద్ధిని కోరే రచయితల విషయంలో కూడా (మార్క్సిస్టులు కాకపోయినా) నెగటివ్ విషయాల కన్నా చాలా అధికంగా పోజిటివ్ విషయాలు వుంటాయి. వాళ్ళలో ఎన్నో పొరపాట్లు వున్నా, వాళ్ళ

క్షమించాలి. చలాన్ని తిరస్కరించడానికి యివి వుపయోగపడుతాయి గాని, చలాన్ని అర్థం చేసుకోవడానికి యివిపనికిరావు.

## అదుపు తప్పిన మహాందోళన

చలం సాగించిన స్త్రీ పరమైన ఆందోళనను భావ విప్లవ ప్రారంభంలో తప్పనిఅనిబద్ధమైన, అదుపు తప్పిన మహాందోళనగా కె. వి. ఆర్. చిత్రించారు. ఈ పేరా చూస్తే—

"భర్తల నిరంకుశత్వానికి సొంత ఆస్తి హక్కు మూలమైనప్పుడు, ఆర్థికంగా స్త్రీకి ఆస్తి హక్కు కలగనంతవరకు తన కాలిమీద తను నిలవడం అసంభవం.విద్య, హోదా, అధికారం, స్త్రీని ముందుకీ పైకీ తీసుకు రావచ్చు గాని స్త్రీ జాతిపరాధీనతను అంతమొందించడానికి ఆర్థిక పునాదిని పూర్తిగా మార్చే విప్లవమొక్కటే ప్రాతిపదిక. విప్లవానంతర కాలంలో,అంటే ఆర్థిక పునాది మారిన తర్వాత గూడా, ఇంకా చాలా కాలం తర్వాతనే ఈ 'మొనాగమీ' క్రమేపీ కృశించి, యువతీ యువకులు తమ హృదయాల్ని భావాలనుబట్టి కూడి వుండగలిగినంత కాలం కూడివుండి, విడిపోవలసినప్పుడు విడిపోయే స్వేచ్ఛ సాధ్యమౌతుంది. ఇంతటి సుదూర విషయం మార్క్సిస్టు మహోపాధ్యాయుల విషయంలోనైనా ఊహా చిత్రమే గాని దృశ్యం కాదు. కాబట్టి ఈ అంశంలో చలాన్ని అతిగా లోపమెన్నడం సబబు కాదు, జీవితం ద్వారాసాహిత్యం ద్వారా స్త్రీ విషయంలో చలం కలిగించిన సంచలనం, భావ విప్లవ ప్రారంభంలో తప్పని అనిబద్ధమైన, అదుపు తప్పిన మహాందోళ"....

చలానికి కొన్ని ప్యాసు మార్కులు యిచ్చారు కె.వి.ఆర్. విప్లవం తర్వాత ఏర్పడే సమాజంలో కూడా స్త్రీల పరిస్థితి ఆర్థికంగా బాగుపడుతుంది గాని, వివాహ వ్యవస్థకు భిన్నమైన ఆదర్శ స్త్రీ పురుష సంబంధాల అవతరణ సుదూరస్వప్నమేనని కె.వి.ఆర్.అంగీకరించారు.చలం అంతదాకా ఓపిక పట్టలేకపోవడంమార్క్సిస్టులుక్షమించలేకపోయినాచరిత్ర క్షమిస్తుంది.చలంలెనిన్ ఉటంకించినగ్లాస్ఆఫ్వాటర్ థియరీకి దగ్గరగా ఎప్పుడూ రాలేదు. కాని, కె.వి.ఆర్ "దాహమైనప్పుడు గ్లాసెడు నీళ్ళు గటగటా తాగి, దాహం తీరాక ఆ గ్లాసుని గిరాటుకొట్టవద్దు. ఉద్దేశం ఏదైనా చలంచేసింది యిలాంటిదే" అని ఒక పెద్ద అభాండాన్ని అయన నెత్తిమీద వేశాడు-

డానికి చలం చెప్పిచేసిన తిరుగుబాటు శాస్త్రీయమైనదా కాదా అని ఆలోచించినట్లు అవుతుంది. పైగా యివన్నీ అందరికీ వర్తించేవి కూడా కావని గుర్తుంచుకోవాలి. ఒక పురుషునికి అనేక మంది స్త్రీలతో సంబంధం వున్నట్లే, ఒక స్త్రీకి అనేకమంది పురుషులతో సంబంధం వుండటం అశాస్త్రీయమేమీకాదన్నాడు చలం.అది రివోల్ట్‌లో భాగం. కాని అందరికీ అలా అవసరం అవుతుందని చెప్పినట్లు కాదు అర్థం. పైగా స్త్రీ పురుష సంబంధాలలోని పురుష దాస్యాన్ని, అనాగరికతనీ, కుళ్ళునీ, మోసాన్నీ కమ్యూనిజం వచ్చేదాకా కప్పి పెట్టుకుని కూచోవాలనడం అశాస్త్రీయం కాదా? చలం వుద్దేశపూర్వకంగా చెప్పిన విషయాన్ని రంగనాయకమ్మ తన ఇంటర్వ్యూలో చాలా స్పష్టంగా వివరించారు.

"పురుషుడు ఇద్దరేసి ముగ్గురేసి భార్యలతోటీ, వుంపుడు కత్తెలతోటీ, భోగం స్త్రీల తోటీ కులుకుతున్నా అతని భార్యల్లో ఎవరైనా పరపురుషుడి వేపు కన్నెత్తారా దాన్ని సంఘం పెద్ద నేరం చేస్తుంది కాబట్టి, స్త్రీని సెక్సు విషయాలలో కూడా స్వేచ్ఛగా వర్తింప జెయ్యాలనే పట్టుదలా, ప్రేమ సంబంధాలలోగాని,కామ సంబంధాలలో గానీ రహస్యాలూ, అసూయలూ, కపటత్వాలూ సాగుతుంటాయి కాబట్టి అలాంటి వాటికి, ఆస్కారం లేకుండా రహస్యం కాని కపటత్వం కాని, సంబంధాలేర్పరుచుకోవాలంటే స్త్రీ పురుషుల్లో ఒకరు రెండోవారి ప్రేమ సంబంధాలన్నిటినీ అంగీకరించాలనీ, ప్రేమ మార్పుల్ని అర్థం చేసుకోవాలనీ చలం ప్రతిపాదించిన కొత్త సంగతులు."

## యువతరం మనోభావాలు

చలం గురించి ఆంధ్రజ్యోతి వీక్లీలో రంగనాయకమ్మ ఇంటర్వ్యూ చదివిన ఒక పాఠకుడు(యన్.శ్రీరాం, గుంటూరు) రాసిన ఉత్తరంలో.ఆమె చలంపట్ల పక్షపాతంగా సమాధానాలిచ్చారని ఆరోపిస్తూ,ఆమె గడుసుతనాన్ని విమర్శించాడు.అతని అభిప్రాయాలు చలం పట్ల యువతరం మనోభావాలకు దర్పణంగా వుంటాయని ఆశించవచ్చు. మచ్చుకి—

"చలం రచనల్ని అర్థం చేసుకోడానికి మార్క్సిస్టు పరిజ్ఞానమే వుండాల్సిన అవసరం లేదు. మనసు నిలిపి చదివితే ఎవరికైనా అర్థమవుతుంది. ఇక్కడ అర్థం కావడం, కాకపోవడం అంటూ ఏమీ లేదు. అయన రచనల్లో పరస్పర విరుద్ధ భావా

లుంటాయి. ఒకచోట అవునన్నది, మరొకచోట కాదంటారు. మొదట కమ్యూనిజంలోనే స్త్రీ స్వేచ్ఛ వుంటుందన్నాడు. ఆ తరువాత కమ్యూనిజం మీద నమ్మకం పోయిందన్నాడు. అందులో వ్యక్తి స్వేచ్ఛ లేదన్నాడు. కమ్యూనిజం ఒక కొత్త మూఢత్వం అన్నాడు. ఇలాగ నిలకడలేని భావాలు కనిపిస్తూ వుంటాయి.

మొత్తం చలం సాహిత్య కృషి రెండు విధాలుగా కనబడుతుంది.

స్త్రీ పురుష సమానత్వ సాధనకు ఆరాటం, ఛాందస, సనాతన ఆచారాల మీద తిరుగుబాటు ఒక విధం:ఆ తరవాత పై ఆశయాలకు తిలోదకాలిచ్చి స్వేచ్ఛా ప్రియుడుగా Sex ను చీల్చి పరిశోధించడం రెండో విధం.మూఢ నమ్మకాల మీద, కులతత్వాల మీద దండెత్తిన చలం గారు చివరకు తానే ఆ మూఢ నమ్మకాలకు లొంగిపోయాడు. ఆస్తికవాది అయ్యాడు. అందుకు విచారించాల్సిన పనిలేదు. ఆయన ప్రారంభించింది స్త్రీ, పురుష సమానత్వ సాధన. దాన్ని మరిచిపోయి స్వేచ్ఛా ప్రేమకు ప్రాధాన్యత నిచ్చాడు. Sex స్వాతంత్ర్యం లేందే జీవితం లేదు అన్న అభిప్రాయానికి ప్రాధాన్యత నిచ్చాడు. దీన్ని బట్టి చలం గారి స్త్రీ జనోద్ధరణ వాదం, ఛాందస భావాల మీద తిరుగుబాటు, ఆయన చివరి పలాయన వాదంతో దెబ్బతిన్నదనిపిస్తుంది.

చలంగారు గొప్ప రచయిత. రచయితగా ఆయన స్థానం మరుపురానిది. అంతవరకు ఆయన ఆరాధ్యుడే.ఆ మేరకు ఆయన్ని అందరూ గౌరవిస్తారు. ఆయన చివరి రచనాకాలంలో స్త్రీని విడదీసి పురుషునితో శాశ్వత వైరుధ్యాన్ని బోధించాడు. అప్పుడిక స్వేచ్ఛా ప్రేమ, స్త్రీ పురుష సమానత్వానికీ తావెక్కడుంది? అంతే కాదు ఆయన సంఘం నుంచి వేరు పడిపోయాడు. ఆ విషయం ఆయనే చెప్పు కుంటాడు. "ఆంధ్రలో నాకెవ్వరు లేరు. అందుకే రమణాశ్రమానికి ప్రయాణ మయ్యాం" అని. ఒక మేరకు స్త్రీ సమానత్వం కోసం తిరుగుబాటు చేసిన చలం గార్ని మెచ్చుకోకుండా వుండనూ లేము. మరో మేరకు అనుకున్న లక్ష్యం కోసం చివరకంటా నిలవలేక పోయినందుకు చింతించకుండా వుండనూలేము." యువ తరం ఆలోచనలు నిష్కర్షగా, సూటిగా వుండడం యిందులో గమనార్హం!



తంబితో చలం

అరుణాచలంపై అరుణతార

అనే ఈ అధ్యాయాన్ని ముగించేముందు ఒక మేధావి మిత్రుని తులనాత్మక పరిశీలనను ఉటంకించడం చాలా అవసరమనిపించింది:—

# చలం, ఒక పరిశీలన

తెలుగు సాహిత్యంలో చలం ఒక ఉప్పెన. ఎడాపెడా ఎప్పుడూ వీస్తూనే వుంటాడు. అటు కూలిపోతున్న వ్యవస్థకు, ఇటు యింకా కళ్ళు తెరవని వ్యవస్థకూ మధ్య నున్న సంధి యుగమది. జీవితంలో కొత్త సంబంధాలూ కొత్తవిలువలూ తాలూనే చారిత్రక పరిస్థితులవి. అలాంటి కాలంలో పుట్టి పెరిగాడు చలం.

స్త్రీ వేదన, బానిసత్వం, బాధ చలాన్ని వూపిరాడనివ్వలేదు. స్త్రీ లోకపు బాధే తన బాధగా చేసుకున్నాడు చలం. సమాజంలో స్త్రీపై జరిగే అత్యాచారాలు, దౌష్ట్యాలు, దుర్మార్గాలు వీటికి వ్యతిరేకంగా కత్తిలాంటి కలందూసి నిబ్బరంగా నిలబడ్డాడు, స్పష్టంగా, స్వచ్ఛంగా, శ్రావ్యంగా, నీళ్ళు నమలకుండా, పంటి బిగువు గొట్టిన బావతు లాగా తను చూసింది, తనకు తోచింది బాహాటంగా, బాహం బాటగా ఎలుగెత్తి చాటాడు చలం.

చలం గొప్ప పిపాసి. విప్పారిన హృదయం, ఉరకలువేసే ఆవేశం అత నికి సహజ కవచ కుండలాలు, నిప్పులాంటి నిజాయితీ చలం సొత్తు. అతని మాటకు, చేతకు తేడాలేదు. చెప్పింది చేశాడు. చేసింది చెప్పాడు. ఆదర్శానికి, ఆచరణకు మధ్య అగాధం లేదు చలంలో. ఎందరో మేధావులు, విద్యావంతులు, రచయితలు క్షణక్షణం ఆత్మ వంచన చేసుకుంటున్నారు. ప్రలోభాలకు లొంగిపోతున్నారు. ఈ దుష్ట సమాజంలో 'సుఖం'గా బతికేస్తు న్నారు.కాని చలం అలాంటి పని చేయలేదు. సమాజానికి తల ఒగ్గలేదు. ధైర్యంగా నిలబడ్డాడు. ఏటికి ఎదురీదిన గొప్ప సాహసి చలం. అందుకే ఎందరికో ఆరాధ్యు డయాడు. అది తప్పుకాదు, వింతాకాదు.

చలంలో ముఖ్యమైన ఆకర్షణ అతని హృదయం. అతనిది నిలువెల్లా హృదయమే. కనుకనే చలం పేరు చెబితే తీవ్రమైన భావాలు కలుగుతాయి. పరిసరాలను చూసి చలించిపోయిన చలం స్త్రీ విముక్తికోసం పరితపించాడు. కాని స్త్రీ విముక్తి అనేది మొత్తం సామాజిక విముక్తిలో భాగం అనే ఆలోచన రాదు చలానికి. అతనిలో సంయమనం సున్న. స్త్రీ విముక్తి యిప్పుడే యిక్కడే జరిగిపోవాలనే తపన, తహతహ చలంలో కొట్టొచ్చినట్టు కనబడతాయి.

భావావేశంతో వుద్రూత లూగించాడు చలం. తన భావాలకు పాత్రల రూపాన్నిచ్చాడు. చలం పోరాటం సాగించాడు. దీన్ని తిరుగుబాటు అనడమే సరైనది. ఆనాటి అన్యాయాలకు, అసందర్భాలకు, రాక్షసత్వానికి, అధికారానికి ఎదురు తిరిగాడు. ఎన్ని చేసినప్పటికీ చలం కేంద్ర బిందువు వ్యక్తి, సమాజం కాదు. చలం ప్రజల మనిషి కాదు. ప్రజలతోను ప్రజల సమస్యలతోను మమేకం చెందలేదు. చలాన్ని నిజాయితీపరుడంటాం, హృదయవాది అంటాం. తిరుగుబాటుదారు అంటాం. కాని, ప్రజల మనిషి అనలేం.

చలానికి ఆరాధకులతో పాటు విరోధులకు కూడా కొదవలేదు. ముందుగా విరోధులను గురించి ముచ్చటించుకుందాం. వీళ్ళలో మూడురకాల వాళ్ళున్నారు. మొదటిరకం వాళ్ళు చలానికి ముందు తరంవాళ్ళు. మరొకరకం వాళ్ళు చలానికి సమకాలికులయినా సనాతన భావాల్లో సుస్నాతులై మడికట్టుకున్నవారు. మూడోరకం వాళ్ళు వర్గం గానివర్గం మధ్యతరగతివాళ్ళు. వీళ్ళకు చలంపట్ల వ్యతిరేకతకంటే భయమెక్కువ. చలం ప్రశ్నలు వీళ్ళకూ తడతాయి, కాని చలం సమాధానాలకు వీళ్ళు తట్టుకోలేరు. ఎందుకంటే వీళ్ళకు పాతివ్రత్యం (అంటే ఏకపక్ష బాంధవ్యం) పట్ల ఎనలేని భక్తి. పతివ్రతలను తెగ కీర్తిస్తారు. ఆకాశానికి ఎత్తుతారు. పాతివ్రత్యం, పవిత్రతా శుద్ధ కపట నాటకాలని ఎలుగెత్తి చాటిన చలాన్ని అవినీతిపరుడని, అరాచక వాదని ఆడిపోసుకున్నారు.

మార్క్సిస్టులు, మార్క్సిస్టుల మనుకునేవారు కూడా చలం ఆరాధకులుగానో విరోధులు గానో వుండడం వాస్తవం, విచిత్రం కూడా. చలం రచనలలోని వైరుధ్యం మార్క్సిస్టులకు ఇబ్బంది కలిగిస్తూందా అనిపిస్తుంది. చలం తన రచనల్లో ఎత్తుకునే సమస్య- స్త్రీ విముక్తి. అది వాస్తవమైనది, తీవ్రమైనది. కాని ఆయన ఎక్కువగా ఆయా సమస్యలకు చూపిన పరిష్కారం మాత్రం వాస్తవాతీతం. ఈ

వైరుధ్యంలో మొదటి అంశాన్ని మాత్రమే గమనించినవారు ఆరాధకులయారు. రెండవ అంశాన్ని మాత్రమే గమనించినవారు చలాన్ని ప్రజా వ్యతిరేకిగా జమకట్టారు. విప్లవానికి చాలా ముందు వచ్చే తిరుగుబాటు దారు చలం. తిరుగుబాటులో విప్లవాంశ వుండి తీరుతుంది.

ఏ రచయిత కయినాసరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకు ఒక పరిణామం వుంటాయి. సామాజిక చారిత్రక పరిణామ గమనంలో రచయిత యొక్క సాహిత్యస్థానం నిర్ణీతమవుతుందన్నాడు శ్రీశ్రీ. సాహిత్యంలో 'వస్తువు' (Content)నే మార్క్సిస్టులు ముఖ్యాంశంగా పరిగణిస్తారు. సాహిత్య వస్తువు సమాజంనుంచే పుడుతుంది గాని ఆకాశం నుంచి వూడి పడదు, రచయితల బుర్రల్లో మొలవదు. అలాగే సమాజంనుంచి పుట్టిన సాహిత్యం ఏదో ఒక మేరకు సమాజాన్ని ప్రభావితం చేస్తుంది. సమాజంలోవర్గాలు వాస్తవం. రచయితలు వర్గాల కతీతంగా వుండలేరు. అయితే రచయితపై అనేక ప్రభావాలుంటాయి గనక ఆ రచనల్లో కూడా వర్గమిశ్రమం వుండొచ్చు (వర్గసంకరమనేది వేరే సమస్య). చలం చేపట్టిన సాహిత్య వస్తువు ఏ సామాజిక పరిస్థితుల్లో పుట్టిందో చూద్దాం.

భూస్వామ్య వ్యవస్థ తాలూకు విలువలమీదా, నీతిమీదా వీరేశలింగం గారి నాటికే గౌరవం తగ్గిపోవడం మొదలయింది. గురజాడ మరికొంచెం ముందుకు పోయి ఆ విలువల్లోని పుచ్చును, డొల్లతనాన్ని నగ్నంగా బైట పెట్టాడు. అయినా మన నేలలో ఏనాటినుండో వేళ్ళూనిన ఆ విలువలు మన సమాజాన్ని చీడపురుగుల్లా పట్టుకునే వున్నాయి.

కృష్ణశాస్త్రి, నాయని, నండూరి. అబ్బూరి, దీక్షితులు, విశ్వనాథ- వీళ్ళంతా చలం సమకాలికులు. కాని వీరందరు కూడా అటు భావకవిత్వంలోనూ ఇటు పురాణ వాఙ్మయం లోనూ లీనమైపోయారు. సమాజంలో తీవ్రమైన సమస్యను దేనినీ వీరెవరూ మనసుకు పట్టించుకోలేదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ రచయిత లెవ్వరికీ సామాజిక చైతన్యం లేదు. సామాజిక వస్తువులే చేపట్టి ముందుచూపు ప్రదర్శించ గలిగింది, వీళ్ళందరిలోనూ, చలం ఒక్కడే. తన కాలంలోనే భావకవుల తరానికి, ముందుకాలంలోని అభ్యుదయకవుల తరానికి వారధిలాంటి

వాడు చలం. భావకవిత్వం లోని స్వేచ్ఛను జలపాతంలా దూకించి యువతను ఆకట్టుకున్నాడు చలం.

స్త్రీకున్న బంధనాల్లో ముఖ్యమైనది మాంగల్యం. దాన్ని తృణీకరించి మనసుకు నచ్చేచోటికి వెళ్ళే పాత్రలను సృష్టించాడు చలం. అతని పాత్రలకున్న స్వేచ్ఛ వ్యూహాత్మకమే అయినా ఆయా పాత్రలు తమ స్వేచ్ఛను ప్రకటించిన సంఘటనలు మాత్రం భౌతికమైనవి. ఊహాప్రేయసితో భావకవులు మమేకం అవుతారు. వియోగంలో ఒక రకమైన స్వేచ్ఛ, స్వచ్ఛత వున్నాయి. ఆ స్వేచ్ఛ, స్వచ్ఛత భావకవులకు ప్రాణప్రదమైనవి. కాని యీ సమాజంలో అవి ఎలా అదృశ్యమైనాయో, ఏయే శక్తులు వాటిని పొట్టన పెట్టుకున్నాయో భావకవులు గమనించలేదు. గమనించడానిక్కూడా నిరాకరించారు. భావకవులు గానం చేసిన స్వేచ్ఛ స్వచ్ఛ శరీరానికతీతమైనవి.కనక భావకవులది ఎస్కేపిజం, పిరికితనంఅనొచ్చు కూడా.

కాని చలం స్త్రీ పురుషపాత్రలు ప్రేమతత్వాన్ని స్వేచ్ఛాతత్పరతను కవితా పరంగా సుందరంగా వివరిస్తారు. కాని వారి ప్రేమలోనూ, స్వేచ్ఛలోనూ భౌతిక స్పర్శకే ప్రాధాన్యత వుంది. అందుకే భావకవుల్ని కూడా భరించిన ఛాందసులు చలాన్ని భరించలేక పోయారు. ఈ భౌతికాంశానికే దేశంలోని యువత నివాళులర్పించింది. అభ్యుదయ రచయితల ఉద్యమం విజృంభించి వాస్తవ పరిస్థితులకు వాస్తవికఅన్వయాన్ని ప్రబోధించింది.అంతవరకు వున్న సాహిత్యరంగాన్ని ఒక వుప్పెనలా వూడ్చివేసింది చలం సాహిత్యమే. చలం తాత్విక చింతనలోని అరాచకత్వాన్ని, వాస్తవిక అతీతధోరణిని బలంగా ప్రశ్నించ గలిగింది ఆనాటి వాస్తవిక భౌతికవాది గోపీచంద్ ఒక్కడే(గోపీచంద్ రాసిన 'వెంకటచలంపాత్ర').

చలాన్ని అంచనా వేసేటప్పుడు రెండు అంశాలు గుర్తు పెట్టుకోవాలి. మొదటిది కమ్యూనిస్టులకుండే వ్యక్తిగతమైన వైరుధ్యం. చలానికి కమ్యూనిస్టులకు గొప్పతేడా వుంది, మౌలికమైన పోలికావుంది. చలం లాగానే కమ్యూనిస్టులకుకూడా ఈనాటి సమాజం నీతినియమాలమీదా, సంబంధాల మీదా బొత్తిగా గౌరవంలేదు. ఇవన్నీ కృత్రిమమైనవని కమ్యూనిస్టుల ఉద్దేశ్యం. కాని కమ్యూనిస్టులకు సమాజం పట్ల బాధ్యత, సమాజాన్ని మార్చవలసిన ఆవశ్యకత, ఈ వ్యవస్థను కూకటి

వేళ్ళతో కూల్చివేయవలసిన కార్యక్రమం కూడా వున్నాయి. తన ఆదర్శాన్ని, లక్ష్యాన్ని తక్షణం అమలు జరిపే స్వేచ్ఛ చలానికుంది. అతని సాహసాన్ని కూడా మనం శంకించనక్కర్లా. కాని వ్యక్తులుగా కమ్యూనిస్టులకు ఆ సాహసం వున్నప్పటికీ స్వేచ్ఛ లేదు. ఎందుకంటే సమాజం పట్ల కమ్యూనిస్టులకున్న బాధ్యతకు వారి వ్యక్తిగత స్వేచ్ఛ లొంగివుండవలసిందే. సమాజప్రమాణాలకు అనుగుణంగా వుండే వ్యక్తిగత ప్రవర్తనకు, సమాజాన్ని పరిపూర్ణంగా మార్చే సాహసిక చర్యకు మధ్య వైరుధ్యం తప్పనిసరి. కమ్యూనిస్టులకుండే ఈ గతితార్కికవైరుధ్యం చలానికి లేదు, అందుచేతనే ఆయన ప్రవర్తన సమాజానికి భిన్నంగా ఆదర్శప్రాయంగా వుంది. ఇది ఒక ఆకర్షణ. నిజాయితీలో వున్న ఆకర్షణ యిదే. కాని సమాజాన్ని ఒదిలి సమాజాన్ని మార్చడం సాధ్యమయే విషయంకాదు. నేల విడిచి సాము చెయ్యలేం. అందుకని చలంగాని, గోరాగాని, మరే ఇతర ఆదర్శ భావవాదులుగాని కమ్యూనిస్టులను కన్సర్వేటివ్‌లుగా పరిగణిస్తారు. నిజాయితీకి వాస్తవికతకు దూరం వుండేగాని వైరుధ్యంలేదు. వైరుధ్యం వుందనుకునేవారే వ్యక్తిగత ఆస్తులు వదులు కోరేమనీ మీ ఆస్తులు వెంటనే పంచిపెట్టరేమనీ కమ్యూనిస్టులను చాలా కుర్రతనంగా వెర్రితనంగా ప్రశ్నిస్తూంటారు.

వ్యక్తిగత జీవితంలో పాత విలువలకు లొంగిపోయేవాడు, డబ్బుకు అమ్ముడు పోయేవాడు కమ్యూనిస్టుకాడు. ఈ నాటి సమాజంలో అన్ని రంగాలలో దుర్మార్గత వ్యాపించింది. ఈ దుర్మార్గతే పెట్టుబడిదారీ విధానం. దానికంటే పైమెట్టుకు పోయిన సామ్రాజ్యవాదం. అన్నిరోగలక్షణాలమీదా కమ్యూనిస్టులు పోరాడవలసి వుంది. కాని ప్రధానమైన పోరాటం దుర్మార్గత మీద జరగాలి. చలంలాంటి ఉదారవాదులు రోగాన్ని వదలి రోగలక్షణాల మీద పోరాటం సాగించారు. రోగాన్ని గుర్తించనందుకు చలాన్ని తప్పు పట్టినా రోగ లక్షణాల మీద పోరాడినందుకు చలానికి నివాళి పట్టకుండా వుండలేం. కాని చలం పోరాట పద్ధతిలో ఒక పెద్ద లోపం వుంది. అతనిది నెగెటివ్ దృక్పథం. అతను ప్రచారం చేసిన నెగెటివ్ దృక్పథం పాత సమాజంలో కుళ్ళు కడగడానికి పాక్షికంగానైనా పనికొచ్చింది.

ఆనాడు మద్దుకూరి చంద్రశేఖరరావుగారి దగ్గర్నుండి ఈనాటి రంగనాయకమ్మగారి వరకు మార్క్సిస్టు దృష్టితో చలాన్ని పరిశీలించారు. కాని వీళ్ళ పరిశీలనలో ఒక పెద్ద లోపముంది. చలం మీద దురభిమానం, అభిమానం ప్రకటించా

రేగాని సరైన మార్క్సిస్టు విమర్శ రాలేదనే ఒక రకంగా చెప్పొచ్చు. చలాన్ని తిట్టిన మార్క్సిస్టులు, పొగిడిన మార్క్సిస్టులు కూడా అతని కొటేషన్లు ఆధారంగా చూపించారు. కోడి సజ్జలు తిని సజ్జలే పెట్టినట్టు. ఇది పుత్త పాతకానితనం. చలాన్ని విమర్శించాలంటే చలం స్పిరిట్‌ని అర్థంచేసుకోవాలి. ఆనాటి సామాజిక పరిస్థితులమీద ఆకళింపు వుండాలి. మన విమర్శకుల్లో యీ రెండూ లోపించాయి.

చలానికి హిపోక్రసీకి చుక్కెదురు. నిజాయితీకి చలం పెట్టింది పేరు. చిత్త శుద్ధికి పెట్టనికోట. 1968 మేలో గుండె నెత్తురులో కలం ముంచి రాయమని చలం చెప్పాడు. చలాన్ని పొగిడేవాళ్ళుగాని తిట్టేవాళ్ళు గాని యీ పని ఎంత వరకు చేస్తున్నారో గుండెమీద చెయ్యివేసుకుని చెప్పగలరా?

జవాబుల కోసం కాకపోయినా, సమాజాన్ని బోన్లో చెరేయ్యాని అడిగిన ప్రశ్నల కోసమైనా మనం చలాన్ని చదివి తీరాలి.

సాహిత్యం ప్రజల కోసం అని ప్రజల చైతన్యాన్ని ప్రదీప్తం చేయడం కోసం వేదికలను నిర్మించుకు కూర్చున్న ప్రజాసాహిత్య రథసారథులకు చలం యింకా వివాదాస్పదమైన వ్యక్తిగా వుండటం ఆశ్చర్యమేమీ కాదు. అతని తిరుగుబాటు తత్వంలోని విప్లవాంశను గుర్తించ నిరాకరిస్తున్న నవ మేధావులు చలాన్ని మళ్ళీ మళ్ళీ చదివి ఆకళింపు చేసుకోవాలి.

— హరి

ఈ విశ్వ హోమ జ్వాలలో....
వున్నాం ఓ మూల
నీ చేతి వేలుని పట్టుకుని
నేను
పరస్పర మమకార బంధంలో
కాలానికి ప్రాధేయపడి
నుంచుని వున్నాం
ఓ క్షణం
మరుక్షణం
అనివార్యంగా జ్వాలల్లోపడి....

# 7

# అక్షరాభిషేకం

తెలుగు దినపత్రికలలో చలం అస్తమయ వార్తను పతాక శీర్షిక చేసి ప్రచురించిన ఘనత హైదరాబాదు ఎడిషన్ ఆంధ్రప్రభ దినపత్రికకు చెందుతుంది. ఆ సంపాదక వర్గ సభ్యులు చాలా శ్రమ తీసుకుని చలంపై మొదటి పేజీలో మూడు వంతులు పైగా రాసి ప్రకటించారు. సాధారణంగా దిన పత్రికలలో ఎటువంటి రచయితలు, కవులు పోయినా యింత ప్రాముఖ్యం యివ్వడం జరగదు. ఈ సంచిక ఒక్క కాపీకూడా ఎక్కడా మిగులకుండా అమ్ముడు పోయింది. ఆ పేజీలో ప్రకటించిన అంశాలను యధాతథంగా యిక్కడ పొందు పరచడమైనది.



# కామియై, మోక్షగామియైన అభినవ వేమన
# గుడిపాటి వెంకటచలం అస్తమయం

చూసింది చూసినట్లు, చేసింది చేసినట్లు, అనుభవించింది అనుభవించినట్లు నమ్మింది నమ్మినట్లు ఇంకాగొంకూ లేకుండా, నీళ్ళు నమలకుండా, వాడిగా, వేడిగా పంచబద్దలు కొట్టినట్టుగా రాసిన చలం, తనువుతో, మనసుతో, ఆత్మతో స్త్రీని ప్రేమించి, ఆరాధించి, కీర్తించిన చలం, మూఢ సంప్రదాయాల కబంధ బంధనాల నుంచి స్త్రీని విముక్తం చేయడానికి జీవితమంతా తపించిన చలం, పహానా ఆదర్శాలతో, కాపట్యంతో పుళ్ళిపోయి మడికట్టుకున్న సభ్యసమాజాన్ని తన కత్తిలాంటి కలంతో చీల్చిచెండాడిన చలం, స్త్రీలో ఈశ్వరుణ్ణి, ఈశ్వరునిలో స్త్రీని దర్శించి, వేమనలా తొలుత కామియై, పిదప జ్ఞానియై, మోక్షగామియైన చలం, తిరువణ్ణామలైలోని శ్రీ రమణాశ్రమంలో కాలధర్మం చెందారు. 84ఏండ్ల వయస్సులో ప్రకృతి ధర్మాన్ని అనుసరించి పండుటాకు వలె రాలిపోయారు.

హైదరాబాద్ మే 5 : సుప్రసిద్ధ సాహితీవేత్త శ్రీ గుడిపాటి వెంకటచలం నిన్న రాత్రి తమిళనాడులోని తిరువణ్ణామలైలో అస్తమించారు. కొద్ది సంవత్సరాలుగా ఆయన అనారోగ్యంతో బాధపడుతున్నారు. ఆయన వయస్సు 84 సంవత్సరాలు.


అరుణాచలం

కథలు, నవలలు, నాటకాలు, నాటికలు, వ్యాసాలు, గేయాలు అసంఖ్యాకంగా రచించిన 'చలం' తన రచనలన్నింటిలోనూ—మూఢాచారాల బూజు

తగిలించుకొని, మడిగట్టుకుని, సమాజాన్ని శాసించే 'పెద్ద మనుషుల'ను తూర్పార బట్టారు. ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించిన చలం స్త్రీలను ప్రేమించి వారి కోసం తపించి, వారు పురుషాహంకారానికి బలియైపోతుంటే ఆవేదన చెంది, వారిని జడస్థితి నుంచి మేల్కొల్పడానికి తిరుగుబాటుకు పురికొల్పడానికి కలం పట్టారు.

## స్వేచ్ఛా ప్రణయ సమాజం

సమాజంపై కసితో సంప్రదాయ వ్యవస్థపై దాడి చేయడానికి ఆయన ఒకప్పుడు 'స్వేచ్ఛా ప్రణయ సమాజం (ఫ్రీలవ్ సొసైటీ) స్థాపించి, శృంగారంలో తలమునకలైనారు. ఆయన జీవితం, ఆయన సాహిత్యం 'సభ్య ప్రపంచపు' ఆగ్రహానికి గురియైనాయి. ఈ శతాబ్దపు తెలుగు రచయితలలో బహుశా అంతటి తీవ్ర విమర్శలకు గురియైన వ్యక్తి మరొకరులేరు. 'కళ కళ కోసమే' అన్నట్లు, ఆయన బూతు బూతుకోసమే రాశాడని విమర్శించిన వారున్నారు. శక్తిమంతమైన భాష, స్వతంత్రమైన శైలి ఉన్నాయన్న మాటేగాని ఆయన రచనల్లో శిల్పం లేదనీ ఆయనది అసలు సాహిత్యం కాదనీ విమర్శించిన వారున్నారు. ఎవరు ఎన్ని విధాల దుమ్మెత్తిపోసినా విశ్వనాథలాగా, శ్రీశ్రీ లాగా చలం కూడా మూడు తరాల వారిని విపరీతంగా ప్రభావితం చేశారు. విశ్వాసాలలో, ఆలోచనా ధోరణిలో రచనా శిల్పంలో, భాషా విన్యాసంలో, శైలిలో.... ఒకటేమిటి.... ప్రతి విషయంలోనూ విశ్వనాథకు పూర్తిగా విరుద్ధమైన వ్యక్తి చలం. ఇద్దరూ సాహితీ ప్రక్రియలన్నింటిలోనూ పుంఖానుపుంఖంగా రచనలు చేశారు. వారి పుస్తకాలు యాభై, అరవై సంవత్సరాలుగా మళ్ళీ మళ్ళీ ముద్రితమవుతూనే ఉన్నాయి. ప్రతి తరాన్నీ ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. ఆయన అభిమానులూ, ఈయన అభిమానులూ వేదికలెక్కి ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకుంటూనే ఉన్నారు.

## సాహితీ ప్రభంజనం

చలం కథా సంపుటాలలో ముఖ్యమైనవి—'ఓ పువ్వు పూసింది.' 'హంపీ కన్యలు,' 'చలంగారి కలం,' 'స్టేషన్ పంపు.' ఆయన నవలల్లో ముఖ్యమైనవి—జీవితాదర్శం,' 'మైదానం,' 'దైవమిచ్చిన భార్య,' 'అరుణ,' 'అమీనా'. నాట

కాయి, నాటికలలో ముఖ్యమైనవి 'పురూరవ,' 'శశాంక,' 'చిత్రాంగి,' 'జయదేవ,' 'సావిత్రి,' 'భానుమతి.' ఆయన రచించిన 'బిడ్డల శిక్షణ,' 'స్త్రీ,' 'ప్రేమ లేఖలు,' 'మ్యూజింగ్స్' ప్రతి తరంలో యువతరాన్ని ఉర్రూతలూగిస్తూనే ఉన్నాయి. శ్రీశ్రీ మహాప్రస్థానానికి చలం రాసిన 'యోగ్యతాపత్రం' తెలుగు సాహిత్యంలో ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నది. 'మహాప్రస్థానం' ఒక ఎత్తు, చలం యోగ్యతాపత్రం ఒక ఎత్తు. తెలుగులో ముద్రణాయంత్రాలున్నంత కాలం చలం సాహిత్యానికి చావులేదు. ఆయన ప్రభావంనుంచి ముందు తరాలు కూడా తప్పించుకోలేవు.

## నవజీవితాదర్శం

చింతా దీక్షితులుగారి సాహచర్య ఫలితంగా నడివయస్సులో ఆకస్మికంగా చలం జీవితం మలుపు తిరిగింది. ఆయన జీవితంలో భగవాన్ ( రమణమహర్షి ) ప్రవేశించారు. అప్పటివరకు ఆయన జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని స్త్రీ ఎంత బలంగా ప్రభావితం చేసిందో, ప్రచలితం చేసిందో అంత బలంగా భగవాన్ ఆయనను ఆక్రమించుకున్నారు. అంతవరకు స్త్రీకోసం 'సభ్య' ప్రపంచాన్ని, బంధుబంధాలను కాలదన్నిన శృంగార సన్యాసి, ఆ తర్వాత భగవాన్ కోసం ఇల్లూ, వూరూ, రాష్ట్రం విడిచి తిరువణ్ణామలై ( అరుణాచలం ) వెళ్ళిపోయారు. ఆంధ్ర దేశానికి చలం పీడ విరగడయిందనుకున్నారు పెద్దమనుషులంతా. చలం మళ్ళీ వెనక్కి తిరిగిరాలేదు. రమణాశ్రమందాటి ఎక్కడికీ వెళ్ళలేదు. ఈశ్వర పరిష్వంగం దాటిపోలేదు. ఆయన జీవితం లోపలా, బైటా అంతటా ఈశ్వరుడే నిండిపోయాడు. స్త్రీని ప్రేమించినంత గాఢంగా అంతటి తపనతో ఈశ్వరుడిని ప్రేమించాడు. ఒకప్పుడు స్త్రీ స్పర్శకు పరవశించినంతగా ఈశ్వరస్పర్శకు పరవశించాడు. స్త్రీలో ఈశ్వరుడిని, ఈశ్వరునిలో స్త్రీని దర్శించాడు. సాధకుడై, జ్ఞానియై, మోక్షగామి యైనాడు.

## ఈశ్వరసాహిత్యం

రమణాశ్రమం చేరిన తర్వాత ఆయన రాసినదంతా ఈశ్వర సంబంధమైన సాహిత్యమే. 'భగవద్గీత', 'బైబిలు', రవీంద్ర గీతాంజలి.... చివరికి ఆత్మకథ 'చలం'.... అన్నీ తన ప్రత్యేక శైలిలో, గొప్ప ఆవేశంతో, ఆర్తితో రాశారు.

ఆయన స్వేచ్ఛా ప్రణయ జీవన కాలంలో ఆయన రచనలు చదివి ఎందరో స్త్రీలు ఆకర్షితులై, అన్నీ వదిలేసి ఆయన దగ్గరకు వస్తూ వుండేవారు. ఆయన రమణాశ్రమం పోయినా స్త్రీలు ఆయనను వదలలేదు. డెబ్బయ్యోయేట, ఎనబయ్యోయేట కూడా ఆయన స్త్రీలను ఆకర్షిస్తూనే వున్నారు. పతితలు, భ్రష్టులు, బాధాసర్పదష్టులు ఆయన ఆశ్రమానికి వచ్చి ఆశ్రయం పొందేవారు. అందరికీ ఆయన ఆశాకిరణంలా కనిపించేవారు. అందమైన నెమళ్ళు, రామచిలకలు, గోరింకలు స్వేచ్ఛగా విహరిస్తూ, ఆనందంతో కేరింతలు వేసే ఆయన ఆశ్రమంలో అందరూ ఆదమరచి విశ్రాంతి పొందేవారు.

అటువంటి చలం ఇంక లేడు. ఆయన భౌతిక కాయానికి రేపు సాయంత్రం తిరువణ్ణామలైలో అంత్యక్రియలు జరుగుతాయి.

## నిరవధిక ప్రేమ స్రవంతిలో....

"మొదలంటూలేని ఈ సృష్టికైన ప్రథమ చలనం శూన్యంలో స్పందించినపుడు పంచభూతాలతో పాటు అవ్యక్తంగా నేను జన్మించాను. ఈ లక్షన్నర కోటి ప్రాణులతో కలిసి, కాంతికి, శబ్దానికి, స్పర్శకి క్రమంగా స్పందించి వ్యక్తిత్వాన్ని ప్రతిష్ఠించుకున్నాను.

నిరవధికమైన ప్రేమ స్రవంతిలో స్వల్పవీచికలమైన మేము నూతన సృష్టి నిర్మాణంలో వర్షించే నక్షత్రాలమధ్య ఆ కొత్తకొత్త కాంతుల్లో ఆనందాన్ని పట్టలేక, ఉల్లాస ఉద్రేకాలతో కొన్ని యుగాలు విహరించాము.

ఆనాటినుంచి జలధుల్లో, ప్రభంజనాలలో, తీవ్రభాను దీప్తికిరణాలలో యుగయుగాలు క్రీడించి, శయనించి, నిద్రించి ఈ నేనుని నిర్ణీతం చేసుకున్నాను".

## మహిళా విమోచన సమర యోధుడు : చెన్నారెడ్డి నివాళి

శ్రీ గుడిపాటి వెంకటచలం మరణించడం తెలుగు సాహిత్యం ఒక మహా రచయితను తెలుగు జాతి మహా మనీషిని కోల్పోయిందని ముఖ్యమంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి తన సంతాప సందేశంలో అన్నారు.

"స్త్రీలకు సమాజంలో సముచిత స్థానాన్ని వారి హక్కులను వారికి సాధించడానికి నిర్విరామంగా పోరాడిన యోధుడు శ్రీ చలం. ముప్పై నలభై ఏళ్ళ క్రితం తొలుత వెలువడి నప్పుడు ఆయన రచనలు తెలుగు పాఠక లోకంలో తీవ్ర సంచలనం కలుగజేసి వారిని ఆత్మ పరిశీలన చేసుకునేట్టు చేశాయి" అని డాక్టర్ చెన్నారెడ్డి అన్నారు.



## చలం స్వగతం

నా జీవితానికి మూల సూత్రం బాధ. దాన్నే వేదన అంటాను. అందరికీ వచ్చే బాధలు నాకూ వచ్చాయి. కాని నన్ను యాతన పెట్టలేదు. ఎప్పుడూ నన్ను విడువని, జీవితమంతా దొలుచుకు తిన్నవ్యధకి అందని దానికోసం, నా దగ్గిరే నాలోపలే అందక ఎప్పుడూ నన్ను పీడిస్తో, ప్రతి అడుగునా నన్ను నిలవనీకుండా చేసే ఒక అసంతృప్తి. అదే నా అసలు వ్యధ. మొదటిలో నా తల నెప్పులు అనుకున్నాను, తరవాత అది నన్ను తృప్తి పరచని స్త్రీలు అనుకున్నాను. ఇక్కడకి వచ్చింతర్వాత అది నా కర్మం అనుకున్నాను. ఈ సృష్టి పథంలో నా జీవితం ఈ విధంగా నడవాలని నిర్ణయింపబడి ఉంది. అది అట్లా నడవవలసిందే. ఏం చేసీ దాన్నించి నన్ను తప్పించలేరు.

మొదట నేను రాత ప్రారంభించినప్పుడు నేను ఒక రచయితని అవుతానని అనుకోలేదు. ఏవో జరిగిన అన్యాయాలు విని, నా హృదయం నుండి నేను రాసినవి దొంగనీతిపరుల్లో చలనం పుట్టించడం వల్ల నాకు ప్రోత్సాహం వచ్చింది. రచయితని కావాలనేది నా ఆశల్లోనూ ఆశయాల్లోనూ ఒకటికాదు. దానివల్ల నాకేం తృప్తిలేదు. ఇది నా జీవితానికి ఒక బైప్రాడక్ట్ మాత్రమే.

ఈ జీవితానికి నాకూ ఎన్నడూ యుద్ధమే....నాకు బుద్ధి తెలిసినప్పటి నుండి ఈ లోకం ప్రతి ప్రాణికి ఏ భయమూ, ఏ బాధ, ఏ దుఃఖమూలేని క్రీడారంగమై ఉండాలని వో విశ్వాస మేర్పడ్డది. నేను చూసినకొద్దీ ఇది క్రీడారంగం కాదు కదా వ్రణరంగం 'రణరంగం', ప్రతి నిమిషమూ అన్ని విధాల దెబ్బలు తింటున్న రోగుల బాధా రంగంగా తెలిసింది. అందుకే నాకు నా బాధతోనేకాదు, ఈ లోకం లోని బాధ అంతటితోనూ, చీకటి అంతటితోనూ నా నిరంతర పోరాటం. అందుకే ఈ చరిత్ర బాధార్ణవం. ఒక శోకార్ణవం.

## ఉన్నది ఉన్నట్లే రాశాడు చలం

చలం అంటే ఏవగించుకున్నవారు ఎక్కువే. చలం రచనలు చదివిన వారూ ఎక్కువే. చలం రచనలు చదువుతేనే శీలం చెడిపోతుందని ప్రచారం చేసిన వారనేకులు.

చలం ఉన్నది ఉన్నట్టు వ్రాశాడు. ఉన్నది ఉన్నట్టు వ్రాయక, వేరే విధంగా రచనలు శిల్పీకరించాలా? శిల్పీకరించలేదు కాబట్టి చలం శైలి వాడిగా వేడిగా ఉంటుంది.

చలానికి గల స్నేహితుల బృందం చాలా చిన్నది. వాత్సల్యం, ప్రేమ కరువయిన వారు. బీడీ తాగే గృహిణులు, భర్తను వదిలి వచ్చిన పతివ్రతలు— అందరూ చలం సాన్నిహిత్యంలో సుఖం అనుభవించారు. అవే కథలు నాటికలు అయినాయి. చూసినవే వ్రాశాడు చలం. చూసి వ్రాసిన వాటినిబట్టి కొన్ని భావాలను స్థిరీకరించసాగాడు. జనం విరగబడి చదివారు, పలువురు రహస్యంగా చదివారు.

అమీనా, హంపీ కన్యలు, బ్రాహ్మణీకం, ఖర్మమిట్లా కాలింది, వగైరా వగైరా....అన్నీ నిజంగా జరిగినవే. చలం ఈ ప్రపంచాన్ని అనుకరించి వ్రాశాడు. అవాస్తవ వూహా ప్రపంచంలోకి ఎవరినీ తీసుక పోలేదు. మానవ నైజాన్ని ఆసక్తితో చిత్రీకరించాడు.

కానీ ఉన్నట్లుండి మారిపోయాడు చలం. 35 ఏళ్ళ కిందట, విద్యాశాఖలో చేస్తున్న కొలువును మానుకుని, భగవాన్ శ్రీ రమణ మహర్షి సమక్షంలో ఉండ డానికి. తిరువణ్ణామలైకి వెళ్ళిపోయాడు. మరి అక్కడ నుంచి తిరిగి రాలేదు.

తిరువణ్ణామలైలో భగవాన్ అనుగ్రహం సంపాదించానన్న తృప్తి అనుభవించాడు చలం. ఆయన పెద్దకూతురు సౌరిస్ ఆధ్యాత్మిక చింతనలో మునిగిపోయింది. శ్రీ రమణాశ్రమానికి వచ్చే భక్తులందరి అనుభవాలనూ కథలు కథలుగా వ్రాశాడు చలం. ఇదీ ఉన్నది ఉన్నట్లే వ్రాయడమే. అయితే తిరువణ్ణామలైలో వ్రాసినవన్నీ కేవలం మానవ నైజాన్ని చిత్రీకరించేవి కావు. ఇవన్నీ మానవ ఔన్నత్యాన్ని చిత్రీకరించేవి.

చలం ఇల్లు తిరువణ్ణామలైలోకల్లా చివరిది. చివరన ఉండడమే ఆయనకు హాయి. చదువుకోడానికి, వ్రాసుకోడానికి, ధ్యానంలో ఉండిపోడానికి ఆ ఇల్లు అనువైనది.

తెలుగు శైలి, తెలుగులో స్వతంత్ర భావన మెచ్చుకునేవారందరూ తిరువణ్ణామలైకి పోయి చలం ఆతిథ్యం స్వీకరించి వచ్చేవారు. చలం ఆతిథ్యం అనుభవించినవారు, అక్కడ నుంచి తిరిగి రావడానికి ఇష్టపడరు. చలంది అంత ఆప్యాయత.

మూడేళ్ళ కిందట చలం మంచాన పడ్డారు. కాళ్ళూ, కళ్ళూ లేవు. అయినా చిన్నప్పటినుంచీ బిడియం నుంచి వెలువడే ఆ రమణీయమైన చిరునవ్వు మాత్రం నిత్యం. పెంచిన కుమార్తె నర్తకి, అప్పుడప్పుడూ ఆయనను ఒక చక్రాలకుర్చీలో కూర్చోపెట్టి తిప్పేది. ఆయనకు అన్నీ హాయే! సౌరీస్ ధ్యానంలో ఉంటే హాయి. నర్తకి దగ్గరుంటే హాయి. గొప్ప హాస్య ప్రియుడు.

మూడు రోజుల క్రిందట చలం అకస్మాత్తుగా అపస్మార స్థితిలోపడ్డారు. ఈ ఉదయాత్పూర్వం మరణించారు.

చలం భావుకుడు. కలలుకనేవాడు, స్వేచ్ఛాప్రియుడు. ఏక్‌తార్‌పై పాడుకుంటూ, పక్కనే నడిచే చిన్నారితో గొంతు కలిపి పాడుకుంటూ, హాయిగా తోటల నుంచే నడిచిపోతూ పోతూ, స్వేచ్ఛా ప్రపంచంలో కాలుపెట్టాలని ఆయన ఆశ. అదే జరిగిందా?

లోకమంతా చిందులు తొక్కే కాంతి నించి
జనన మరణ తరంగాలై విరుచుకుపడే
అంతరహిత ప్రాణస్పందనం నించి
సుఖ దుఃఖ డోలికల్లో వూగే
మానవ హృదయానుభూతి నించి
పరిధులులేని అనంతాకాశ విశాలత్వం నించి
వేరై విముక్తికై రెక్కలు కొట్టుకునే
ఈ నేనెవరు?

# 8

## జాతక కథ

చలం పుట్టినపుడు వేసిన జాతక చక్రం (లగ్నం,రాశి) కొన్ని యితర వివరాలు రమణస్థాన్‌లో లభించాయి. తెల్లకాగితాలతో కుట్టిన ఒక పాత పుస్తకంలో యివి వున్నాయి. కపిలేశ్వరాలయం వద్ద ఒక వీధిలో వుత్తరపు దిక్కున మూడు పెంకుటిళ్ళలో మధ్యలో వున్న ఒక పెంకుటింట్లో జన్మించారు. ఈ వివరాలను ఒక ప్రముఖ రచయిత, జ్యోతిశ్శాస్త్ర పరిచయం విశేషంగా కల మిత్రునికి పంపగా వారు ఆయన జాతకాన్ని పరిశీలించి రాసినది 'చలం జాతకబలం' పేరిట ఒక అధ్యాయంగా యిందులో ఆసక్తిగల పాఠకుల సౌకర్యార్థం సమర్పిస్తున్నాము

చలంగారికి తన జాతకం పట్ల సహజమైన ఆసక్తి వుండేది. అప్పుడప్పుడు ఈ విషయాలు జరుక్‌శాస్త్రితోనూ, యామిజాల పద్మనాభస్వామితోనూ చర్చిస్తూ వుండేవారట. 'నాది వృశ్చిక లగ్నం, మీదీ వృశ్చిక లగ్నమేనా' అనో, గాంధీగారికి మూడుసార్లు ఏలిననాటి శని వచ్చి మూడోసారి మాత్రమే గురిచేసింది. నేను మూడోసారి కూడా ఏలిననాటి శనిని తప్పించుకున్నాను' అనో అంటూండేవారని సౌరిస్ యాధాలాపంగా అన్నారు.

చలం జాతకాన్ని యిచ్చి పరిశీలించమని ఆయన మరణానంతరం యిచ్చాక వచ్చిన 'రీడింగ్స్' యివి. జ్యోతిశ్శాస్త్ర దృక్పథం ప్రకారం ఆయన జీవితం ఎలా గడిచిందో యిందులో ఆసక్తికరంగా చర్చించడం జరిగింది.

# చలంగారి జాతక బలం

చరిత్రకారులు చరిత్ర ప్రసిద్ధి పొందిన వ్యక్తులు సాధించినది బేరీజు వేసినట్లే.

జ్యోతిష్కులు ఒక అసాధారణ వ్యక్తి జాతక చక్రం దొరికితే యిలా అతని జీవితం సాగడానికి తగ్గ గ్రహబలాన్ని పరిశీలించటం జరుగుతూ వుంటుంది. ఈ చలంగారి జాతక చక్రం నాచేత పడింది. జ్యోతిష్య శాస్త్రంలో ఒక విద్యార్థిగా దానిని పరిశీలించి మీ యెదుట పెడ్తున్నాను.ముఖ్యంగా చలంగారి వ్యక్తిత్వం అతని రచనలలో అలా ప్రతిబింబించడానికి గల కారణాలు, అతని ఆయుస్సుకు సంబంధించిన వివరాలు మీ యెదుట పెడ్తున్నాను. నాతో యేకీభవించని పెద్దలు నాకన్నా యీ విద్యలో వున్నతి సాధించారని తలుస్తాను.వాళ్ళ పరిశీలనతో చలంగారి వ్యక్తిత్వాన్ని జాతకరీత్యా మరింత వెలుగులోకి తెస్తారని ఆశిస్తాను.



పిలుపు !

అరుణాచలం నించి
అనుల్లంఘనీయం నీ యాహ్వానం !
వెనక్కి తిరిగి చూడక
పరిగెత్తాను.

## గుడిపాటి వెంకటచలం

పుట్టిన తేదీ : 19-5-1894

శ్రీ జయనామ సంవత్సర వైశాఖ శుద్ధపూర్ణిమ శనివారం

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శుక్ర రాహు | X | రవి బుధ గురు | లగ్నం | శ | X | కే | గు |
| కుజ | రాశి | | X | రవి కు | అంశ | | చం |
| X | | | X | శు బు | | | X |
| X | చంద్ర | X | శని కేతు | X | రా | X | X |

### వ్యక్తిత్వం

విశాఖ 4వ పాదంలో జననం. నక్షత్రాధిపతి గురుడు. నాలుగవ పాదం కాబట్టి తల్లికి దోషం. గణం రాక్షస. జంతువు పులి. మాట చాతుర్యం. తనపంతం నెగ్గవలెనన్న పట్టుదల. చురుకుతనం అధికారము చేయును. దైవభీతి కలిగి యుండును. లగ్నాధిపతి బుధుడు కృత్తిక నక్షత్రంలో నున్నాడు. ఇది పూర్ణాయుర్దాయము. పట్టుదల. స్త్రీ పక్షపాతం. రాబడికి మించిన ఖర్చు యిచ్చును. ఆ యింటి గురుడు కూడా బుధునితో కలియుటచేత అంతరాత్మ ప్రభావము అధికముగా నుండును. గురువు యెటువంటి అవాంతరమైన పనులు చేయనీయకుండా కనిపెట్టుచుండును.

మిధున లగ్నంలో జన్మించుట వలన సహజంగా కళాకారుడు. లగ్నాధిపతికి రవి సంబంధం వలన పట్టుదలగా వ్యవహరించును. నిశ్చితాభిప్రాయము. పెద్ద పెద్ద ఆలోచనలు కలిగి ప్రజల అభిమానము సంపాదించును. నూతన విషయమును కనిపెట్టును. సాహసం ధైర్యం కలిగియుండును. మే 19వ తేదీన జననం. సంఖ్యా జ్యోతిషము ప్రకారం చూసినా రవి వ్యక్తి. దైవబలం యెక్కువ. కవిత్వం. సంగీతమందు ఆసక్తి. 23వ యేటనుంచి యోగం. సంతాన.

కళత్ర విచారములుండును. క్రియాశూరుడు. రవి మహాదశ (1962-66)తో మంచి పేరు సంపాదించును. లగ్నాధిపతికి రవి సంపర్కం వలన అపార మేధా సంపత్తి. తనకు తోచినట్లు సంచరించుట, ఒకరిపై ఆధారపడకుండా బ్రతుకుట కలుగజేయును. స్వతంత్ర జాతకుడు.

శని నాల్గవ యింట నుండుటవలన చిన్ననాట యించుమించు 22 ఏళ్ళ వరకు, అనారోగ్యం. తల్లికి అనారోగ్యం చిక్కులు కలుగజేయును స్థిరాస్థి లేకుండా చేయును. కేతు నాల్గవయింటిలో నుండుటవలన ముఖ్యంగా 1933-40 (కేతుమహా దశలో) జీవితం వేదాంతపథంలో పడును. చంద్రుడు 6వ యింట. అప్పుల బాధలు 1966-76 పదేళ్ళు చంద్రమహాదశలో ఆలోచనలు యిహపరంతో సంబంధం లేనివై యుండును. కుజుడు 9వ యింట వుండుటవలన మనోగర్వం. ఒకోసారి భావోద్రేకం, కోపముతో మెసలుట జరుగును. శుక్రుడు పదవయింట ఉచ్ఛలో వుండుటవలన యితను అంత ఉత్తమ రచయిత కాగలిగాడు. శుక్రుడు కవి. ఇతని భాష కవిత్వం అగుటకు కారణమిదే. మిత్రులకు కొదవలేదు. శుక్రునకు రాహుల సంపర్కం వుండుటవలన మామూలుపథం దాటి సంచరించును. సంఘనీతికియెదురు తిరుగును. వేదాంతపరంగాపోయి. భావాలలోనూ, నడతలోనూ ఉదాత్తతను కలుగ జేయును. రాహు యిక్కడ గురునిలా వ్యవహరించును. రవి 12వ యింట కళ్ళ జబ్బును 1962-66 మధ్య యిచ్చును సంతానం తక్కువ, తండ్రి సుఖం అల్పే వుండును. కానీ సాహసం కలుగజేయును. ఖర్చు హెచ్చు. బుధుడు 12వ యింట ఒకో సారి తప్పులకు విచారించటం, దురుసుగా మాటాడటం కూడా చేయును. గురుడు 12 యింటవుండి అపారమైన ఖర్చు, మేధాసంపత్తిని యిచ్చును.

ఈ పై విషయాలనుబట్టి

1). రాహు కేతువుల సంబంధం ఒక విధంగా సాంఘిక నీతిని ధిక్కరించే ధైర్యంతోపాటు వేదాంతపరంగా ముందుకు తీసుకపోయినది.

2). శుక్రుని సంపర్కం వలన మంచి రచయిత, భావుకుడు, కవియైనాడు.

3). లగ్నాధిపతికి గురుని సంబంధం వుండుటవలన స్త్రీ సమస్యలను చర్చించి, స్త్రీల వున్నతికి పాటుపడ్డాడు. కానీ స్త్రీలోలుడు కాలేదు.

4). విశాఖనక్షత్రాధిపతి గురుడు—దైవభక్తిలో దింపినాడు.

5). లగ్నాధిపతితో రవి సంబంధం — సాహసం, నిశ్చితాభిప్రాయం గల వ్యక్తిత్వాన్ని ప్రసాదించినాడు.

6.) 10వ యింట శుక్ర రాహువుల సంబంధం—కళాకారునిగా నున్న ఖ్యాతి, ఉద్యోగిగా రాదు. శని 10వ స్థానాన్ని వీక్షిస్తున్నాడు. అందుకే ఉద్యోగంలో నున్నాడు. 10వ స్థానాధిపతి గురుడు. అందుకే బడి పంతులయ్యాడు. మనకు చలం రచయితే ముఖ్యం. ఇతనిని రచయితని చేసినది ఒక్క శుక్రరాహుల కలయికే కాదు. మూడవ యింటి అధిపతి గురునితో కలిసి శుక్రునింట నున్నాడు. అందుకే యితని రచనలలో శృంగారం వుంది; పూర్తి నిజంవుంది. ఉత్తేజం వుంది. సాహసం, సహవాసం, సవాలు—అన్నీ నాలుగు గ్రహాలబలం యిచ్చిన వరంయిది. అంతేకాకుండా గురుశుక్రులకు పరివర్తనయోగం వుంది. 1916లో బుధమహాదశా ప్రారంభంలోనే రచనా వ్యాసంగంతో పరిచయం యేర్పడివుండాలి, 1940-1960 శుక్రమహాదశతో సగంవరకు కవిత్వం వచ్చి, మిగతా సగం దశలో రాహు సంపర్కం వలన వేదాంతంవేపు మొగ్గు చూపిస్తూ, రవి మహాదశలో [1960-1966] కీర్తి సంపాదించి, చంద్రమహాదశలో [1966-76] పూర్తిగా వేదాంతంలో మునిగి పోయాడు.

ఇతనికి గజకేసరియోగముకూడా నున్నది. తను చెప్పినది సమర్థించుకోగల సమర్థుడు. అన్ని గ్రహాలు ఐదుయైదుయిళ్ళల్లో నున్నవి. పేరు ప్రతిష్టలకు లోటుండదు. చెయ్యి చాచకుండా బ్రతుకుతాడు గర్వంతో! జోడీగ్రహాలు రెండు యిళ్ళల్లో, ఒక యింట మూడు గ్రహాలు—ఇవి అసాధారణ వ్యక్తిత్వాన్నిచ్చాయి. ఎటొచ్చీ చంద్రుడు 6వ యింట—ప్రాపంచిక సుఖాలకు దూరం చేస్తుంది. కేతు 4వ యింట వింత నమ్మకాలను కూడా సృష్టిస్తుంది. ఇది శుక్ర—రాహు [1947-1950] నించి కొద్దిగా తాకి శుక్రకేతు [1959-60] సరికి ఒక వుప్పెనలా చుట్టుముట్టింది. తర్వాత రవిలో ఆరేళ్ళు అతను రాసింది అట్టేలేకపోయినా ఆ దశతోనే సంఘం తనని సూర్యునిలా వెలిగిన రచయితని గుర్తించింది. మళ్ళీ చంద్రమహాదశలో అతని ఆలోచనలు పూర్తిగా అధ్యాత్మిక జీవితంలోనికి మళ్ళించి అందులో ముంచేసాయి అతన్ని.

ఇక ఆయుర్దాయం విషయం చూద్దాం. విశాఖలో పుట్టాడు. సాధారణంగా మారకుడు రవి. రవి తనవాడు కాబట్టి చంపలేదు. 72 యేళ్ళ (రవి అంతం)దాటి పోయింది. చంద్రుడు ద్వితీయాధిపతిగా మారకుడు. 82వ యేట చంద్ర మహా దశను కూడా దాటేసాడు. స్వతహాగా అతను పూర్ణఆయుష్కుడు. కారణం- ఆయువు కారకుడు శని లగ్నాధిపతి యింట నుండి లగ్నాన్ని వీక్షిస్తున్నాడు. అష్ట మాధిపతి శని। శని ద్వితీయాధిపతిపై దృష్టి సారించి చంద్రమహా దశలో యెటు వంటి ప్రాణాపాయం రాకుండా చూసాడు. లగ్నాధిపతి బుధుడు ఆయుర్దాయ నక్ష త్రం కృత్తికలో వున్నాడు. చలం జీవితంలో శని 4. కుజ 5, గురు 6, రాహు 7, దశలుగా మారకులు కాలేదు. అదే అతనిని అంతకాలం బ్రతకనిచ్చింది. చలం 4-6-79వ తేదీ కుజ-శనిలో గతించాడు, కారణం? కుజుడు 2, 3, 7, 8 అధిపతి కాడు. మారకుడు చంద్రుడు కుజునియింట వృశ్చికంలో నున్నాడు. గోచారం ప్రకారం—సప్తమాధిపతి గురుడు ద్వితీయమందున్నాడు. కుజ-శని-శుక్రునిలో, శుక్రుడు శనికి సప్తమందు, కుజునకు ద్వితీయమందు వుండగా దైవ సాన్నిధ్యం పొందాడు. అష్టమ స్థానాన్ని గురువు వీక్షించడం వలన సునాయాస మరణం.

"శారద"

24-9-79



## సేకరించిన యితర విశేషాలు

జననం 19-5-1894

శ్రీ జయనామ సంవత్సర వైశాఖ శుద్ధ పూర్ణిమ శనివారం 37 25 విశాఖ **22.57** పరి 40-18 భ 6-4 శేషః 3-46 రావి 1-50 అమృత 59-11 దినం **31-59** కృత్తిక ౪ రవిః 58-23 వృశ్చిక చంద్రః 7-13 కృత్తిక ౪ బుధః 1-0 భుక్తం 52-13.

పూర్వేద్యుః స్వాతి 20.20.

(పుస్తకంలోని నోట్సులో—)

| | | |
|---|---|---|
| 19—5—1894 | | |
| 0—2— 3 | పుట్టిన తేది | 3—2—0 |
| 19—7—1897 | | 19—0—0 |
| 0—0— 19 | శని మహాదశ | 22—2—0 |
| 19—7—1916 | | |
| 0—0— 17 | బుధ మహాదశ | 17—0—0 |
| 19—7—1933 | | 39—2—0 |
| 0—0— 7 | కేతు మహాదశ | 7—0—0 |
| 19—7—1940 | | 46—2—0 |
| 0—0— 20 | శుక్ర మహాదశ | 20—0—0 |
| 19—7—1960 | | 66—2—0 |
| 0—0— 6 | రవి మహాదశ | 6—0—0 |
| 19—7—1966 | | 72—2—0 |
| 0—0— 10 | చంద్ర మహర్దశ | 10—0—0 |
| 19—7—1976 | | 82—2—0 |

ఈ లెక్కలను కూడా దాటి చలం 4-5-79 వరకూ వుండి పూర్ణాయుర్దాయం అనుభవించాడు. మాకు లభించిన నోటు పుస్తకంలో మరొకచోట యీ విధంగా 1943 చివరి వరకూ 'రీడింగ్' లభించింది. ఇదికూడా ఆసక్తికరమైన అంశాలతో

వుంది. ఈ పండితుడెవరో తెలియదు కాని పై లెక్కలు మాత్రం యామిజాల వారితో కూర్చుండగా వేసినవని తెలిసింది.

| | |
|---|---|
| 1941-2-9 | |
| 1941-4-9 | నమస్కార సమయము — శుభము |
| 1941-7-19 | చం. స్త్రీ సల్లాపము, స్త్రీ సౌఖ్యము |
| 1941-9-29 | కు. ఆక్రోశ సమయము, దుఃఖము, వ్యసనము, పాపము. |
| 1942-3-29 | రత్నపరీక్ష సమయము- ధనలాభము |
| 1942-9-9 | ఆక్రోశ సమయము- దుఃఖము |
| 1943-3-19 | కిరీటధారణ సమయము- రాజ్యప్రాప్తి- గజారోహణ సమయము |
| 1943-9-9 | శయన సమయము- అశుభము |
| 943-11-19 | కిరీటధారణ సమయము- గజారోహణము- రాజ్యప్రాప్తి |

19-11-43 తేదీ మొదలు 19-11-44 తేదీలోగా ఉద్యోగాభివృద్ధి, జీతము అభివృద్ధి, ధనలాభము జరుగును.

కిరీటధారణ, గజారోహణ, రాజ్యప్రాప్తి యివేవీ చలానికి జరగలేదు కాని, స్త్రీ సల్లాపము, స్త్రీ సౌఖ్యము అందువలన ఏర్పడిన ఫలితాలలో ఆక్రోశపడటం, దుఃఖము, వ్యసనము వలన పాపం కలిగాయనుకోవచ్చు. ఆయన తొలి కథా సంకలనం కూడా 'పాపం' కావడం విశేషం కాదా!



అరుణాచలేశ్వర ఆలయం

— తిరువణ్ణామలై